భట్టనారాయణస్య

# వేణీసంహారనాటకమ్

తెలుగు వ్యాఖ్యాన సహితము

వ్యాఖ్యాత

బేతవోలు రామబ్రహ్మం



ప్రచురణ

తెలుగు విశ్వవిద్యాలయము

కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు—500 004

1988

# ప్రకాశక విజ్ఞప్తి

ఉత్తమ సాహిత్యాన్ని పరిరక్షించుకోవడానికి తెలుగు విశ్వవిద్యాలయం వేదికగా ఏర్పడింది. బోధన–పరిశోధన-ప్రచురణాలను ప్రధాన కార్యక్షేత్రాలుగా నిర్మించుకొంది. ప్రచురణశాఖ ద్వారా ఉన్నతాభిరుచి గల పాఠకులకు ఉదాత్తసాహిత్యాన్ని అందించడం తన లక్ష్యాలలో ఒకటిగా పెట్టుకొంది. ప్రాచీన సాహిత్యసంపదను పదిలపరచుకొంటూ ఒక తరంనుంచి మరో తరానికి దానిని అందిస్తూ అజరామరంగా ఉంచడానికి చేసే ప్రయత్నాలలో ఇదీ ఒకటి. ఇందులో భాగమే వ్యాఖ్యానాల ప్రచురణ.

భారతకథ ఆధారంగా రూపొందిన సంస్కృత నాటకాలలో వేణీసంహారం సుప్రసిద్ధం. దీనినుంచి కనీసం ఒక్కటయినా శ్లోకాన్ని ఉదాహరించని ప్రామాణిక ఆలంకారికుడు లేడంటే అది అతిశయోక్తి కాదు. సంస్కృతసాహిత్యంలో ఇది పొందిన ప్రసిద్ధి ప్రశస్తి అంతటివి. దీని రచయిత భట్టనారాయణుడు క్రీ. శ. 750 ప్రాంతం వాడు. కాన్యకుబ్జం నుంచి వంగదేశానికి వలసవచ్చాడని పరిశోధకులు అంటున్నారు.

వ. సు. రాయకవి ప్రభృతులు ఈ వేణీసంహారాన్ని యథాతథంగా తెలుగులోకి అనువదించారు. అవి అప్పట్లో తెలుగునాట బహుళప్రచారం పొందాయి. చాలాచోట్ల ప్రదర్శింపబడ్డాయి.

అయితే ఇంతవరకూ దీనికి తెలుగులో సమగ్రమైన వ్యాఖ్యానం రాలేదు. ఇదే ప్రథమం. ఇంతకుముందు ముద్రారాక్షస, మృచ్ఛకటికాదులు వ్యాఖ్యలతో వెలువడ్డాయి. తెలుగు సాహిత్యాన్ని పరిపుష్టం చేసాయి. తెలుగు ప్రజల ఆదరణకు పాత్రమయ్యాయి.

అదే పంథాలో ఇప్పుడు దీనిని అందిస్తున్నాం. సాహితీప్రియులకు ప్రీతిపాత్రమవుతుందని విశ్వసిస్తున్నాం.

శ్లోకాలకు అర్థం చెప్పడంతోపాటు, ఛందస్సు, క్రియ, అలంకారం, సమాసాలు, సంధులు వివరించడం ఈ వ్యాఖ్యలోని విశేషం, నాటకపరిభాష, సంధిసూత్రానుక్రమణికలే కాకుండా ప్రాకృతపదానుక్రమణిక కూడా అనుబంధంగా చేర్చడం మరొక విశేషం. ఇవన్నీ విద్యార్థులకు బహుధా ఉపకరిస్తాయని భావిస్తున్నాం.

త్వరలోనే మరికొన్ని సంస్కృతాంధ్ర కావ్యాలను వ్యాఖ్యానాలతో మీ ముందు ఉంచడానికి తెలుగు విశ్వవిద్యాలయం సమాయత్తం అవుతోంది. సాహితీప్రియంభావుకుల ఆదరణను మరింతగా అభిలషిస్తోంది-ఆకాంక్షిస్తోంది.

హైదరాబాదు
1-9-1988

ప్రకాశకులు
తెలుగు విశ్వవిద్యాలయం

# అంకితము

ప్రాతఃస్మరణీయులు
'మధురకవి' శ్రీ రావూరి వేంకటేశ్వర్లు గారికి

రావూరి వేంకటేశ కవిరాజునకున్
గురురాజమౌళికి
అద్ధావిభవాస్పదోజ్జ్వల వధాన విరించికి
సర్వశిష్య సంభావితపాదపద్మునకు
భవ్యమనస్వికి
శాంభవీ కృపాప్లావితకాంతిలోక పరివర్తికి
అమాయిక చక్రవర్తికిన్

శ్రీకృష్ణజన్మాష్టమి
విభవ, శ్రావణము

భక్తితో
జేతవోలు రామబ్రహ్మం

# విషయ సూచిక

# వేణీసంహారము - భట్టనారాయణుడు

వాల్మీకి యేప్రాంతమువాడు? కాళిదాసుని కాలమేది? -అని యాధునిక విద్యార్థి యడిగినచో నుపాధ్యాయుడు గురికి బారెడు దూరముగా సమాధానము చెప్పి తప్పుకొనవలెనే తప్ప కచ్చితముగా ఈ పట్టణమనియు, ఈ తేదీ యనియు నిర్ధారించి చెప్పునవకాశము ఈనాటికిని లేదు.

జన్మతిథి వారాదికమైన స్వీయ సమాచారము నందించు నలవాటు మన ప్రాచీనులకు తక్కువ. అదృష్టవశమున తమ పేర్లను తెలియజేసిరి. కొందరిపట్ల అదియు సందేహాస్పదమే. దీనికంతటికిని కారణ మొకటైయుండును. నన్ను జూచియు నా ప్రాంతమును జూచియు నా కావ్యము నాదరింతురా!, అందలి గుణసంపదనుబట్టి ఆదరింతురు గాని - అన్నది మనవారి తత్త్వము. కవిభ్యః కావ్యాన్యేవ బహుమన్యామహే అని ఆనందవర్ధనుని తీర్మానము.

నిజమునకు కవి దేశకాలాది పరిధులకు అతీతుడు. అతడు రచించిన మహా కావ్యము యావత్ప్రపంచమునకును ఆస్తి. కానీ-కవీశ్వరుని జీవిత విశేషములు తెలిసినచో ఆ వెలుగులో నాతని రచనము నధ్యయనము చేయుట మరింత లాభదాయకముగా నుండునన్నది యాధునికుల మతము. ఈ దృష్టితో చూచినప్పుడు మనవారి అలవాటును అభినందింపలేము.

భట్టనారాయణుని విషయమునగూడ మనకు తెలియవచ్చు సమాచార మత్యల్పము. ఇతని పేరు భట్టనారాయణుడని, ఈతడు వేణీసంహారమును రచించెనని నిస్సంశయముగా చెప్పవచ్చును. తక్కిన విశేషము లన్నియును యథాప్రయోగంబుగా గ్రాహ్యంబులు.

ఎక్కడివాడు? :— తదిదం కవే ర్మృగరాజలక్ష్మణో భట్ట నారాయణస్య కృతిం వేణీసంహారం నామ నాటకం ప్రయోక్తుముద్యతా వయమ్ - అన్నది ప్రస్తావనలో సూత్రధారుని నోట పల్కించిన మాట. ఇంతకుమించి మరేట్టి సమాచారము నిందు లభించుట లేదు.

ఏ రాజు నాస్థానమున నేయుత్సవ సందర్భమున నాటకము తొట్టతొలిగా ప్రదర్శింపబడుచున్నదో ప్రస్తావనలో ప్రస్తావించు నాచారమున్నది. దానితో కవికాలాదికమును గ్రహించుటయు పరిపాటి. అట్టిదియు నిందు పాటింపబడలేదు. కేవలము సభ్యులను ప్రార్థించి యూరకొన్నాడు- తదత్ర కవిపరిశ్రమానురోధాద్వా ఉదాత్త కథావస్తు గౌరవాద్వా నాటకప్రదర్శన కుతూహలాద్వా భవద్భిరవధానం దీయమాన మభ్యర్థయే.

కాగా — కవేః మృగరాజలక్ష్మణో భట్టనారాయణస్య - అన్న మూడు పదము లాధారముగా విమర్శకుల యూహలు పరిపరి విధముల ప్రయాణించినవి. భట్ట శబ్దము భర్తృ పద పర్యాయమనియు, మృగరాజ బిరుదము క్షత్రియోచిత మనియు కొందరు భావింపగా; కవేః మృగరాజలక్ష్మణః అన్నది సింహ బిరుదాంకితుడైన కవి యని చెప్పుచున్నదనియు కవిసింహ యని బిరుదమేర్పడు చున్నదనియు, నిది క్షత్రియోచితమే కానవసరము లేదనియు, భట్ట శబ్దము ఉప నామముగా నుండుట బ్రాహ్మణత్వ సూచకమనియు కొందరు సంభావించిరి.

వంగదేశము నేలిన రాజవంశముల చరిత్రను చెప్పు క్షితీశవంశావళీ చరితమ్ - బంగరాజఘటక - రాజావళీ గ్రంథములలో నొక భట్టనారాయణుడు ప్రస్తావింపబడినాడట. ఈతడు కాన్యకుబ్జమునుండి వంగదేశమునకు వలసవచ్చిన బ్రాహ్మణుడు. శాండిల్య గోత్రజుడు. సేనవంశ ప్రవర్తకుడైన గౌడాధిపతి ఆదిసూరుని యాహ్వానముపై నల్గురు బ్రాహ్మణులతో ఈ భట్టనారాయణుడు వంగ దేశమునకు వచ్చెను ఏదో యజ్ఞమును చేయించెను. బహూకృతిగా నయిదుగురు నయిదూళ్లు పొందిరి. క్రమక్రమముగా భట్టనారాయణుడు అభివృద్ధిచెంది యొక రాజవంశమునకు తానే ప్రవర్తకుడయ్యెను.

వర్షమును కోరి గౌడాధిపతి యజ్ఞమును చేయ సంకల్పించెననియు, దానిని నిర్వహించుటకు వంగదేశ విద్వాంసులు తిరస్కరించిరనియు నంతటనాతడు కాన్యకుబ్జరాజును సహాయమర్థించె ననియు, నాతడు భట్టనారాయణ ప్రముఖులను పంపెననియు క్షితీశవంశావళీచరితము చెప్పుచున్నది. ఇది మరియొక కథ.

భగవంతుని ప్రసన్నుని చేసికొనుటకై ఆదిసూరుడు యజ్ఞమును సంకల్పించెనని వంగరాజఘుటిక చెప్పుచున్నది. వంగరాజ్యమునకు రానున్న యుపద్రవములను తొలగింపజేయుటకు భట్టనారాయణ ప్రభృతులు ఆహూతు లయ్యిరని మరియొక గాథ. కాన్యకుబ్జమున నేర్పడిన ధర్మపీడకు వెరచి భట్ట నారాయణాదులు అయిదుగురు వంగదేశమునకు తరలివచ్చిరనియు నిందున్నది.

గజేంద్రగడ్కర్ వంటి ప్రముఖ విమర్శకులు ఈ చివరి కారణమునే యంగీకరించియున్నారు. అప్పటికి కాన్యకుబ్జము బౌద్ధమునకు లోనయి వైదిక మతావలంబులకు బ్రదుకు కష్టమైయుండు ననియు కావుననే భట్టనారాయణాదులు వంగాదిదేశములకు వలసిపోయి యుందురనియు వీరు భావించుచున్నారు.

ఆదిసూరుని కాలము క్రీ. శ. ఏడవ శతాబ్దము. ఇదియే వేణీసంహార కర్తయగు భట్టనారాయణుని కాలమని వీరి నిర్ధారణ.

వేణీసంహార ప్రస్తావనలో ఆదిసూరుని ప్రసంగముగాని, కాన్యకుబ్జాధిపతి ప్రసక్తిగాని కన్పింపదు. అట్లే నాటకమున పరోక్షముగానైనను ధర్మపీడల పరామర్శ కానరాదు. పై కథలే నిజమగుచో నిట్టిది యసంభవము. కావున వేణీసంహార భట్టనారాయణుడును కాన్యకుబ్జభట్టనారాయణుడును విభిన్నులై యుందురని శ్రీరమాశంకర త్రిపాఠీ ప్రముఖుల యభిప్రాయము.

క్షితీశ వంశావళీ చరితాదులయందు భట్టనారాయణుడు వైదిక బ్రాహ్మణుడు గానే తప్ప కవిగా వేణీసంహార రచయితగా పేర్కొనబడకపోవుట వీరి యభిప్రాయమునకు బలము చేకూర్చుచున్నది.

ప్రస్తావనలో రాజప్రశస్తి చేయకుండుటయు, రాజులు లోకప్రియులును విద్వద్బంధువులును గుణగ్రాహులును సతతసుకృతులును కావలెనని భరత వాక్యమున నాకాంక్షించుటయు(6-46)చూడగా వేణీసంహారరచయిత రాజాశ్రయ మును కోరని స్వతంత్రుడై యుండునని తోచుచున్నది. రాజాస్థానమునందు గాక జనసామాన్యమునెదుట మున్మొదటగా తన నాటకమును ప్రదర్శింప జేయుటయు నీతని స్వతంత్ర ప్రవృత్తికి నిదర్శనము.

ఈ కవి యిందు మూడు నాందీశ్లోకములను సవదరించెను. ఇది మరియొక విలక్షణత. మొదటి రెండును విష్ణుపరములు. మూడవది శివపరము. అయినను— తథాపి భక్తిస్తరుణేందుశేఖరే యన్నట్లు ఈతని భక్తి విష్ణుపారమ్యమువట్లనే మొగ్గుచూపుచున్నది. కావ్యరచనకు భారతకథను స్వీకరించుట యొకటి భరత వాక్యమున-భవతు భగవన్ భక్తిః ద్వైతం వినా పురుషోత్తమే యనుట యొకటి దీనికి సాధకములు.

**ఎప్పటివాడు? :—** వేణీసంహార రచనాకాలమును నిర్ధారించుటకు గ్రంథస్థముగా నాధారము లేమియు లేవు. రాజప్రసక్తియే కాదు పూర్వకవి స్తుతియు నిందులేదు. కాగా నాలంకారికుల ప్రసంగములే మిగిలిన యేకైకాధారము.

మమ్మటుడు తన కావ్యప్రకాశమున నిందలి పది పండ్రెండు శ్లోకముల నాయా సందర్భముల నుదాహరించెను. ఈ మమ్మటుడు క్రీ.శ. 1100 ప్రాంతము వాడని విమర్శకుల యభిప్రాయము. అమరకోశ వ్యాఖ్యాత క్షీరస్వామియు వేణీసంహార ప్రయోగములను చూపెను. ఈతడును క్రీ. శ. పదునొకండువందల ప్రాంతమువాడే. సరస్వతీకంఠాభరణకర్త భోజరాజు, దశరూపకకర్త ధనంజయుడు వేణీసంహారమునుండి యుదాహరణము లిచ్చిరి. వీరిరువురును పదివందలు పదునొకండువందలు నడిమికాలమువారు. వీరికన్న ప్రాచీను డానంద వర్ధనుడును తన ధ్వన్యాలోకమున వేణిని ప్రస్తావించియున్నాడు. ఈతని కాలము తొమ్మిదవ శతాబ్దపుటుత్తరార్ధము.

వామనుడు తన కావ్యాలంకార సూత్రవృత్తిలో వేణియందలి "పతితం వేత్స్యసి క్షితౌ" (3-41) అనువాక్యము నుదాహరించి (వేత్సి+అసి) వ్యాకరణా నుకూలత ప్రకటించెను. ఈ వామనుడు క్రీ.శ. ఎనిమిదివందల ప్రాంతమువాడని. ఈతని కాలమునకే నాటకమిది ప్రసిద్ధికెక్కి ప్రామాణికస్థాయి బడసినదనగా కనిష్ఠపక్షము ఒక యర్ధశతాబ్దము ప్రాచీనమై యుండవలెను. రమారమి క్రీ. శ. 750 ప్రాంతముగా దీని కాలమును నిర్ధారింపవచ్చును. క్షితీశవంశావళ్యాదులందు పేర్కొనబడిన భట్టనారాయణుడే దీని రచయితయైనను కాలము విభేదింపదు.

హర్షుని యాస్థానకవి బాణునికాలము క్రీ.శ. ఏడవశతాబ్దపు పూర్వార్ధము. ఈతడు తన హర్షచరితమున సమకాలిక కవిపండితుల నెందరినో ప్రస్తావించెను. అందు భట్టనారాయణుడు లేడు. అనగా నీతడు బాణునికి తదనంతరుడనుట దృఢపడుచున్నది. మొత్తముమీద భట్టనారాయణుడు క్రీ. శ. 750 నుండి 850 నడిమికాలమువాడని నిశ్చయింపవచ్చును.

వేణి కాక మరొక గ్రంథమేదియు భట్టనారాయణుని కృతిగా నింతవరకు లభింపలేదు. సుభాషిత సంగ్రహమునందు నీతనిపేర కొన్ని శ్లోకము లుదాహరింపబడినవి. అవి వేణియందు లేవు. ఇముడుననియు కావు. బహుశః వీనిది మరియొక గ్రంథ ముండియుండనోపు. లేదా ఆ భట్టనారాయణుడు మరియొకడైన గానోపు!

నాయకుడు :— వేణీసంహారము భీమనాయకమనుట సర్వసమ్మతము. కాని కొందరు ధర్మజుడు నాయకుడన్నారు. దుర్యోధనుడను వారునుండకపోరు.

నాయికానాయకులనుబట్టియు నితివృత్తములోని ప్రధాన సంఘటననుబట్టియు కావ్యమునకు నామకరణము చేయుట సంప్రదాయము. ఇది వేణీసంహారము. అనగా జుట్టుముడుచుట యనియర్థము. [Binding up of the braided hair. N. of a well known drama by Bhatta Narayana—Monier Williams] దుర్యోధనుని తొడలు విరుగగొట్టి భీముడు ఆ రక్తమును దోసిటబట్టి తెచ్చి ద్రౌపదీ కేశపాశమును ముడిచి ప్రతిజ్ఞ చెల్లించుకొనును. ఇది భట్టనారాయణుడు కల్పించిన ప్రధాన సంఘటన. కావుననే నాటకము నీ పేరుతో వెలయించెను. దీనిని తీర్చినవాడు భీముడగుట నీతడే నాయకుడు. నాటకాంతమున మరియేమి కర్తవ్యము మిగిలియున్నదని ధర్మజుడడుగగా భీముడు — నఞ్యచ్ఛామి తావదనేన సుయోధన శోణితోక్షితేన పాణినా పాంచాల్యాః దుశ్శాసనావకృష్టం కేశహస్తమ్ — అని సమాధానము చెప్పును. ద్రౌపదిని సమీపించి తానే జుట్టు ముడివేయును. అంత వరకు ద్రౌపది జుట్టు విరబోసికొనియే యున్నది. చంచద్భుజభ్రమిత ...(1-21) అని ప్రతిజ్ఞచేసినవాడును దానిని నిర్వహించినవాడును భీముడు. ఇది ప్రధాన సంఘటనగా నాటక కథ యంతయు నడిచినది. నడిపిన నాయకుడు భీముడు.

ఈ నాటకమున ప్రతినాయకుడు నిస్సంశయముగా దుర్యోధనుడు. పరస్పర హననోద్యోగము స్పష్టము. కట్టకడపట పంచపాండవులలో దుర్యోధనుడు గదాయుద్ధమునకు భీమునే యెన్నుకొనెను. ఇదియు భీమ నాయకత్వమును స్థాపించుచున్నది.

మా యేవురిలో నెవ్వనితో నీవు ద్వంద్వయుద్ధమును చేయుదువో యెన్నుకొనుమని దుర్యోధనుని ధర్మజుడడిగినట్లు వ్యాసభారతము. ఇందు భీముడే అడుగును. ఇదియు భీమ నాయకత్వమును బలపరచును.

నాటకమున నాయకుడు ప్రత్యంకమునను కన్పించవలెననుట యొకానొక నియమము. ఇది భీముని పట్లనే నెరవేరుచున్నది. ధర్మజుడు ఆరవయంకమున మాత్రమే దర్శనమిచ్చును.

కథానాయికయైన ద్రౌపది తన భర్తలయిదుగురిలోను భీమునిమాత్రమే నాథ యనియు ఆర్యపుత్ర యనియు సంబోధించినది. ఒకేఒక్కచోట అర్జునుని ఆర్యపుత్ర యన్నది. (పు 480). ధర్మరాజును మహారాజ యనియే వ్యవహరించినది. పైగా ధర్మరాజే ద్రౌపదితో భీముడు-ప్రియస్తవ మమానుజో (6-18) అనెను. నాయికకు జరిగిన యవమానమునకు ప్రతీకారము చెల్లించినది భీముడు. మొదటినుండి చివరివరకు ద్రౌపది యంతరంగము పరిభ్రమించినది భీముని చుట్టునే (పుట-444). వీనినిబట్టి నాయికా భర్తగా భీముడే నాయకుడనుట నిశ్చయము.

చార్వాకుని మాయమాటలతో భీమపరాజయమును విశ్వసించిన ద్రౌపది ధర్మజునితో — త్వమపి క్షత్రధర్మ మనువర్తమాన ఏవ నాథస్య జీవితహరస్య అభిముఖో భవ. అథవా యత్తే రోచతే (పుట—44[illegible])—అన్నది. [నా భర్తను సంహరించిన దుర్యోధనునితో క్షత్రియోచితముగా పోరాడుము, లేదా నీయిష్టము]. ధర్మజుడు రెండవ పక్షమునకే ముచ్చటపడి చితికి సంసిద్ధుడయ్యెను. భీముడే నాయకుడనుటకును ధర్మజుడు నాయకుడు కాడనుటకును ఈ సన్నివేశమొక్కటి చాలును.

నాటకమున శృంగార వీరములలో నొక్కటి ప్రధానరసముగా నుండవలె నన్నది మరియొక నియమము. వేణీసంహారమున వీరము ప్రధానరసము. ప్రస్తావనలో సత్పక్షాః మధురగిరః – (1–6) ఇత్యాదిగా సాగిన శరదృతుగానము దీనికి తార్కాణము. ఉత్సాహస్థాయిభావము భీమునిపట్లనేగాని యుధిష్ఠిరునిపట్ల కన్పింపదు. పైగా యుధిష్ఠిరునిపట్ల నారవయంకమున కొంత పిరికితనము కన్పించును.

దుర్యోధనునియందు నుత్సాహము ఉరకలు వేసినది. కాని యాతని స్త్రీలోలత్వము, నిశ్శంకితత్వము, అనుదాత్తప్రవృత్తి, అస్థానౌద్ధత్యము, కట్టకడపట పలాయనము చిత్తగించి హ్రదమున దాగుట, పరాజితుడగుట యన్నవి నాయకత్వ భంజకములు. ప్రతినాయకత్వ రంజకములు. కాగా నంగిరసమగు వీరమునకు నాలంబనవిభావము భీముడేయగుట నాతడే నాయకుడు.

ఈ నాటకమునందు కథను నడిపించినవాడు భీముడు. ప్రస్తావనాంతమున చండప్రచండముగా ప్రవేశించిన యీతడు ద్రౌపదినూరార్చుచు ప్రతిజ్ఞచేయుట బీజమై, సర్వ కౌరవ సంహారరూపమున కథ శాఖోపశాఖలుగా విస్తరించినది. చిట్టచివరికి ద్రౌపదితో భీముడే "స్మరతి భవతీ యన్మయోక్తమ్" అని తొట్టతొలి ప్రతినను స్మరించి నెరవేర్చుటతో ముగిసినది. కర్తవ్యనిర్వహణచణుడై భీముడే ప్రత్యక్షముగను పరోక్షముగను నాటకమునందంతటను ఆవరించి కన్పించును.

నాటకాంతమున భరతవాక్యమును పల్కినవాడు ధర్మజుడు. దీనినిబట్టి కొందరు ధర్మజుడే నాయకుడనిరి. కాని భరతవాక్యమును నాయకుడే పల్కవలెనను నియమమున్నట్లు కానరాదు. పైగా నిదియొక్కటియే నాయకత్వమును స్థాపింపజాలదు.

పరివర్తనము :— పదునెన్మిది పర్వముల మహేతిహాసమునందలి సువిశాలమగు నాధికారికేతివృత్తమును ఆరంకముల నాటకముగా సంక్షేపించుటకు భట్టనారాయణుడు పడిన శ్రమ ప్రశంసనీయము. కథను కుదించుటకని నాటకీయతను పెంచుటకని కొన్ని సంఘటనలను వెనుకముందులకు మార్చుట తప్ప భారతకథ కీతడు చేసిన పరివర్తనములు లేవు. ద్రౌపది జట్టును భీముడు ముడుచుటన్నది

ఈతని ప్రధాన కల్పనము. తక్కినవి యథామూలములే. అట్లే ప్రధాన పాత్ర లన్నియు భారతమునందలివే. దుర్యోధనుని భార్యగా భానుమతియు, పాంచాలకుడు సుందరకుడు, రుధిరప్రియ, రుధిరప్రియుడు, కంచుకి, చేటి మున్నగు నప్రధాన పాత్రలును మాత్రమే భట్టనారాయణ కల్పితములు.

ప్రథమాంకమునందు అయిదూళ్లిచ్చిన చాలునన్న సందేశముతో శ్రీకృష్ణుడు హస్తిపురికి రాయబారమేగుట సూచింపబడినది. అడిగిన యా గ్రామములు కౌరవదుర్జయముల నుగ్గడించునవగుట కవికల్పిత చమత్కారము. భారతమున సంజయురాయబారమున నయిదూళ్ల ప్రసంగము తొలి కన్పించును.

సంధి విఫలమై దుర్యోధనాదులు తన్ను బంధింపవచ్చినవేళ తప్పించుకొని ధృతరాష్ట్రాదులకు నాత్మజ్ఞానమును ప్రకాశింపజేయగోరి శ్రీకృష్ణుడు విశ్వరూపమును జూపును. కాగా నిందు — బంధింపవచ్చిన దుర్యోధనాదులనుండి తప్పించుకొనుటకే విశ్వరూపమును జూపినట్లు చిన్న మార్పు.

తృతీయాంకమున కర్ణుడు ద్రోణాచార్యుని మృతిపట్ల నిందారోపణము చేయును. అశ్వత్థామ యలిగి కత్తిదూయును. కర్ణుని చావువరకు నాయుధము పట్టనని ప్రతిజ్ఞ చేయును. కాని భారతమున నిట్టి కలహము కృపకర్ణులనడుమ ప్రారంభమై అశ్వత్థామకెక్కినట్లున్నది.

భారతమున యుధిష్ఠిరుడు సింహాసనమధిష్ఠించిన పిదప చార్వాక రాక్షసుడు ప్రవేశించును. ధర్మజనింద యాతని యభిలాష. ఇందు మునివేషధారియై చార్వాకుడు దుర్యోధనవధకన్న ముందుగనే తృషితోఽస్మిభో స్తృషితోఽస్మి = దప్పికగొంటినోయీ దప్పికగొంటిననుచు (424) ప్రవేశించి ధర్మజుని మోసగింప ప్రయత్నించును. ఈ మార్పు ధర్మజుని తత్త్వము నావిష్కరించుటకు నాటకీయతను పతాక సన్నివేశమున పెంపొందించుటకు నుపకరించినది.

పరికల్పనలు :— ప్రథమాంకమున ద్రౌపదీ భానుమతులు చేటికాసహితలై యెదురుపడిన సంఘటన కవికల్పన. ఆ సంభాషణ భీముని క్రోధాగ్నిని ప్రజ్వలింపజేసి ప్రతిజ్ఞకు దారితీసి బీజారోపణకు హేతువైనది.

ద్వితీయాంకమున భానుమతీ స్వప్నవృత్తాంతము కవికల్పన. ఇది భావి కథా సూచకము. నకులము (ముంగిస) నూరుపాములను చంపుట — భానుమతికి వచ్చిన దుఃస్వప్నము. నకుల శబ్దశ్లేష కవిచేతికి బాగుగా నందివచ్చినది. చెట్టు చాటునుండి భానుమతీచేటికల సంభాషణమును విన్న దుర్యోధనుడు నకుల శబ్దమును పాండవబోధకముగా గ్రహించి ధర్మపత్ని శీలమును శంకించును. దుర్యోధనుని నీచబుద్ధిని ప్రకటించుటకే కవి యీ స్వప్నవృత్తాంతమును కల్పించి యుండును. అట్లే రథపతాక భగ్నమగుటయు (భీమశబ్దశ్లేష 2-24) భావికథా సూచకము. ఇది పతాకాస్థానకము.

ఒకవైపు భీషణ సంగ్రామము జరుగుచుండగా దుర్యోధనుడు భానుమతితో సరసములాడుట యను నీ కవికల్పన రారాజు బాధ్యతారాహిత్యము నావిష్కరించుటకే యయినను భానుమతీ వ్రతనియమమును దుర్యోధనుడుల్లంఘించుటయు తొడలపై గూర్చుండ రమ్మనుటయు (2-23) భావికథా సూచకములు. ద్రౌపదిని నాహ్వానించిన యూరువులయ్యవి విరుగుట తథ్యము. భానుమతికి నింక నయ్యదియే యంతిమసౌఖ్యము. ఇది యీ యూరుప్రసంగమందు జాలిగొలుపు శోచ్యావస్థ.

తృతీయాంకమున రుధిరప్రియా రుధిరప్రియులను కల్పించి సంగ్రామ భీషణతను కవి చూపించగలిగెను. ద్రోణ ఘటోత్కచ జయద్రథాదుల వధను సంక్షేపింపగల్గెను. దుశ్శాసన సంహారము కాగానే హిడింబయాజ్ఞపై రాక్షసులు భీమునావేశించిరి. అప్పుడాతడు రక్తపానముచేసెను. (తేన హి స్వామినా వృకోదరేణ దుశ్శాసనస్య రుధిరం పాతుం ప్రతిజ్ఞాతమ్. తచ్చాస్మాభీ రాక్షసైరను ప్రవిశ్య పాతవ్యమితి.) ఇదియు కవికల్పన. భీముని ఉదాత్తతను సంరక్షించుట దీనివలని ప్రయోజనము.

ద్రోణాచార్యునికి జరిగిన అవమానమునకు తీవ్రముగా ప్రతిస్పందించి యశ్వత్థామ చండప్రచండముగా నేల విజృంభింపలేదు? అనుదానికి సమాధానముగా నీ కవి చేసిన చిన్నమార్పు గొప్పగా సహకరించుచున్నది. ద్రోణాచార్యుడు ఆర్జవములేని మహావీరుడని నిందారోపణచేసి కర్ణుడు వాచాలత్వమును జూపెను. దుర్యోధనుడు ఖండింపలేదు. కర్ణునిపైగల విశ్వాసములో మార్పులేదు.

సైనాపత్యమప్పటికే యాతనికి కట్టబెట్టుట యైనది. ఈ దశలో అశ్వత్థామ గురు దూషకుడైన కర్ణునిపై కత్తిదూయుటయు నాయుధము పట్టనని ప్రతిజ్ఞ చేయుటయు -అయం పాపో యావన్నిధనముపేయా దరిశరైః (3-45)- సమర్థింపబడును.

అదే సమయమునకు భీముడు దుశ్శాసనునిపై బడును. వానిని వారింపగల శక్తి దుర్యోధన రాధేయులకు లేదని తెలిసి అశ్వత్థామ ప్రతిజ్ఞాభంగమున నరకమే వచ్చిన రానిమ్మని పునశ్శస్త్రగ్రహణమునకు నుద్యుక్తుడగును (243). అప్పుడాకాశవాణి వారించును. దైవఘటన పాండవులకనుకూలముగా నిట్లున్నదని యశ్వత్థామ సవిచారముగా నిష్క్రమించును ఈ కల్పనము ద్రౌణి యార్జవమును ప్రభుభక్తిని నిరూపించుటకు సహకరించుచున్నది.

ఇట్లు భట్టనారాయణుని కల్పనలు పాత్రోన్మేషణమునకును నాటకీయతా పరిపోషణమునకును సహకరించి చరితార్థములగుచున్నవి. భారతకథాతత్త్వమునకుగాని పాత్రౌచిత్యమునకుగాని సందేశమునకుగాని యీ కల్పనలు విరోధులు కావనుట స్పష్టము.

**కృతజ్ఞతలు :—** వీరరసప్రధానమై సంస్కృత సాహిత్యమున ప్రౌఢ నాటకముగా ప్రసిద్ధిబడసి యాలంకారికుల మన్ననలు బొందిన యీ వేణీసంహారమునకు తెనుగున నింతవరకు వ్యాఖ్యానము రాకుండుట మత్పురాకృత శుభాధిక్యంబు తానెట్టిదో! వ్యాఖ్యానము పీఠిక సంతరించు పట్టున డా॥ రమాశంకర త్రిపాఠీ మహోదయుల రమాఖ్యవ్యాఖ్యానము (మోతీలాల్ బనారసీదాస్ - 1975) మార్గదర్శకముగా నుపకరించినది. వీరికి నే నెంతేని ఋణపడియున్నాను. పాఠాంతరములను నధికపాఠములను నిర్ణయించుటకు నిర్ణయ సాగరప్రతిని శరణుజొచ్చితిని.

ప్రధానముగా విద్యార్థులకును సంస్కృతానభిజ్ఞులైన సాహితీప్రియులకును నిది యుపకరింపవలెనని సంకల్పము. కావుననే సంస్కృతవిభక్తిని కారకమును కృదర్థమును కర్మణిప్రయోగమును సాధ్యమైనంతవరకు యథాతథముగా నందించి వెనువెంటనే "అనుట" యను ననుకరణముతో తెలుగునుడికారమును పొందుపరచితిని.

అపరితోషాద్విదుషామన్నారు. నా పకీర భ్రమప్రమాదము లేమేనున్నచో తెలియజేయ ప్రార్థన. కృతమెరిగి ద్వితీయముద్రణమున సవరించుకొందునని మనవి. కాగా-అలంకారనిర్ణయము పట్ల నభిప్రాయభేదము లేర్పడవచ్చును. **అది యట్టిదే!.** సౌహార్దమభ్యర్థయే.

ప్రకాశకులు తెలుగు విశ్వవిద్యాలయమువారికి మిక్కిలి కృతజ్ఞుడను. తదుపాధ్యక్షులు మా గురుదేవులు ఆచార్య శ్రీ తూమాటి దోణప్పగారిని భూయో భూయో నమామ్యహమ్.

ముఖచిత్రమునందించి గ్రంథమునకు "అట్ట"హాసము పెంపొందించి "బాప్యులరైజ్"చేసిన (శ్రీరమణులకు కృతజ్ఞతలతో) "గీతా"చార్యులు శ్రీబాపు గారికి నమస్కృతులు. దాని నందముగా "చాతుర్వర్ణ్యముగా" ముద్రించిన THE PRINTER (హైదరాబాద్) యజమానులు శ్రీ మస్తాన్‌రావుగారికి అభినందనలు.

నా కోర్కె మన్నించి "వేణీసంహారము - అలంకారికులు" అందించిన మిత్రులు డా॥ కె. డి. యస్. శాస్త్రి; "వేణీసంహారము - నాటకము" సమకూర్చిన చిరంజీవి డా॥ అంబడిపూడి నాగభూషణం - వీరిరువురిమేలు మరువ లేను.

తప్పొప్పుల పట్టికతో పనిలేకుండ నిర్దుష్టముగా తెలుగుపుస్తకమును ప్రచురింపవలెనని యొక యూశ. ఇది తొంబదియుదొమ్మిదిపాళులు నెరవేరినది. ఒందురెండు ముద్రారాక్షసములు తప్పలేదు.* అవి యర్థావగతికి నడ్డంకులు కాకపోవుట యదృష్టము. ముద్రణమువట్ల నింతటి ప్రత్యేక శ్రద్ధచూపి సహకరించిన శ్రీలక్ష్మీప్రెస్ అధినేత మిత్రుడు శ్రీ కె. శ్యాంబాబుకు అభినందనలు. రెండవ తడవ ప్రూఫు చూచుట లాంఛనప్రాయమే యగునట్లు నేర్పుజూపిన

---

పుట - 35. శ్లో. యుష్మాన్ ప్రేపతి (తప్పు); ప్రేపయతి (ఒప్పు).
పుట - 460, శ్లో. శ్రుతే నమో (తప్పు); శ్రుతేన సమో (ఒప్పు).
పుట - 464 - ఆపన్నసత్వాయాః (ఒప్పు).

కూర్పరి చిరంజీవి ఎస్. రత్తయ్యకు, మెచ్చుకోళులు. అట్లే యచటియుద్యోగులు శ్రీ చింతలపాటి శివప్రసాద్, శ్రీ కె. యన్. సత్యనారాయణ, ఆర్. యోగేశ్వర రావుల సహకారమువలన నాకు శ్రమ సగమునకు సగము తగ్గినది.

పై కొసరు :— సింహభూపాలుడు తన రసార్ణవసుధాకరమున (అడయార్-79) మన్మథావ్యాయకమగు కాంతికి లక్ష్యముగా(పుట—82) వేణీసంహారమునందలిదని యిచ్చిన శ్లోకము నిచ్చట పొందుపరచుచున్నాను. ఇది యధికపాఠము. ప్రస్తావన లోనిదనుట స్పష్టము.

ఆశీస్సుగానుండుట నాందియనిపించును. అగుచో నిందలినాంది చతుశ్శ్లోకి యనవలె కానీ ప్రథమాంకము-ఆరవ శ్లోకమని యుదాహరించుట పొసగకున్నది. అయిదవ శ్లోకము తరువాత నిది యిముడుటకు సందర్భము చాలకున్నది. భవంత ఏవ ప్రమాణమ్!

ఉత్తిష్ఠన్త్యా రతాంతే భరమురగపతౌ పాణినైకేన కృత్వా
ధృత్వా చాన్యేన వాసః శిథిలితకబరీభార మంసే వహన్త్యాః।
భూయ స్తత్కాలకాంతిద్విగుణితసురతప్రీతినా శౌరిణా వః
శయ్యా మాలింగ్య నీతం వపు రలసలసద్బాహు లక్ష్మ్యాః పునాతు॥

(వేణీసంహారే 1-6)

సెలవు

గుంటూరు
18-8-88

సుధీవిధేయుడు
బేతవోలు రామబ్రహ్మం.

# వేణీసంహారము - ఆలంకారికులు

డా॥ కె.డి యస్. శాస్త్రి, ఎం.ఏ., పిహెచ్.డి.

మహాభారతకథ నాధారముగాగొని రచింపబడిన వీరరసప్రధాననాటకములలో వేణీసంహార మగ్రగణ్యము. ప్రామాణికులైన యాలంకారికులకే ప్రామాణికు డైనవాడు ఈ మహాకవి. పద్యమో శ్లోకమో వ్రాయగలిగినంతమాత్రమున మహా కవి కాజాలడు. కావ్యప్రపంచములో కాళిదాసువంటి మహాకవులు ఇద్దరో ముగ్గురో అయిదారుగురో మాత్రమే యుందురని -యేనాస్మిన్నపి(తి)విచిత్రకవిపరంపరా వాహిని సంసారే కాళిదాసప్రభృతయో ద్విత్రాః పంచషా వా మహాకవయ ఇతి గణ్యంతే - పేర్కొనిన యానందవర్ధనుడుకూడ ప్రామాణికునిగా భట్టనారాయణుని శ్లోకములను ఉదాహరించుటచేతనే వేణీసంహార వైశిష్ట్యము వ్యక్తమగుచున్నది. ఆనందవర్ధనుడే కాక మమ్మటుడు అప్పయ్యదీక్షితులునుకూడ నీ నాటకమునుండి యుదాహరణములు స్వీకరించియున్నారు.

ధ్వన్యాలోకమున ద్వితీయోద్ద్యోతమున నోజోగుణ వ్యంజకమగు వర్ణ సంఘటనకు వేణీసంహారమందలి శ్లోకము ఉదాహరింపబడినది-

తత్ర్పకాశనపరశ్శబ్దో దీర్ఘసమాసరచనాలంకృతం వాక్యమ్. యథా :-

చంచద్భుజభ్రమితచండగదాభిఘాత<br>
సంచూర్ణితోరుయుగళస్య సుయోధనస్య।<br>
స్త్యానావబద్ధ ఘన శోణితశోణపాణి<br>
రుత్తంసయిష్యతి కచాం స్తవ దేవి భీమః॥ (1-21)

మరియు దీర్ఘసమాసములు లేకయు చిన్నచిన్న శబ్దములతోకూడ ఓజో గుణమునకు అనుకూలమైన యర్థవ్యక్తి కలుగునని పేర్కొనుచు ధ్వనికారుడు ఈ నాటకమునందలి - యో యశ్శస్త్రం బిభర్తి స్వభుజగురుమదః పాండవీనాం చమూనామ్ (3-32) అను శ్లోకమును ఉదాహరించియున్నాడు.

---

ఉపన్యాసకులు, డా॥ కె. వి. కె. సంస్కృత కళాశాల, గుంటూరు.

ఈ సందర్భమున నభినవగుప్తుడు ఈ రెండు శ్లోకములను విస్తారముగా చర్చించియున్నాడు.

తృతీయోద్ద్యోతమున గుణములకును వాని కనుకూలమైన అక్షరవిన్యాసములకును పరస్పరసంబంధమునుగూర్చి చర్చించు సందర్భమునను, గుణములు సంఘటనలు వేరువేరుగా నుండుననియు వానికి సంబంధము అవసరము లేదనియు నానందవర్ధనుడు ప్రతిపాదించిన సందర్భమును సమర్థించుచు నభినవగుప్తుడు ఓజోగుణానుకూలమైన సంఘటన లేకున్నను రౌద్రరసము వ్యక్తమై చమత్కారి యగుననుచు "యో యశ్శస్త్రం ........" అను శ్లోకమునే యుదాహరణముగా పేర్కొనెను—

అనియత సంఘటన శబ్దాశ్రయత్వే గుణానాం న కాచిత్ క్షతిః.

...........

తస్మా దన్యే గుణా అన్యా చ సంఘటనా. న చ సంఘటనాశ్రితా గుణా ఇత్యేకః దర్శనమ్.

లోచన :- న చేతి, చ శబ్దో హేతౌ. యస్మా ద్యో యశ్శస్త్ర మిత్యాదౌ నాచారుత్వం ప్రతిభాతి తస్మా దిత్యర్థః.

రసాభివ్యక్తికి సంఘటన నిమిత్తము కాదనియు ఆర్థికమైన యోజస్సు నంగీకరింపనివారి పక్షమునకూడ సర్వరససాధారణమైన ప్రసాదగుణము నంగీకరించినను దోషము లేదనియు పేర్కొనుచు నీ శ్లోకమునే యుదాహరించెను. యో యశ్శస్త్రమ్ అను శ్లోకమున పదములు వేరువేరుగా స్పష్టముగా నుండుటచే "పృథక్ పదత్వం మాధుర్యమ్" అను వామనుని లక్షణము ననుసరించి మాధుర్యము కాదా యనికూడ శంకించి ప్రసాదమే కాని మాధుర్యము కాదనియు ధ్వనికారుడు పేర్కొనెను.

యో యశ్శస్త్రం బిభర్తి ఇత్యాదౌ యద్యోజసః స్థితిర్నేష్యతే తత్ప్రసాదాఖ్య ఏవ గుణో న మాధుర్యమ్. న చాచారుత్వ మభిప్రేతరసప్రకాశనాత్.

ఈవిషయమును ద్వితీయోద్ద్యోతములోనే లోచనకారుడు వివరించెను. "అత్ర పృథగ్భూతై రేవ క్రమా ద్విమృశ్యమానై రర్థైః పదాత్పదం క్రోధః పరాం ధారా మాశ్రిత ఇత్యసమ స్తతైవ దీప్తి నిబంధనమ్".

ముఖప్రతిముఖాది పంచసంధులును రసానుకూలములుమాత్రమే యుండ వలయుననియు శాస్త్రనియమములు పాటించుటే ధ్యేయముగా సంధిసంధ్యంగ ఘటనము చేయుట తగదనియు పేర్కొనుచు ధ్వనికారుడు వేణీసంహారమున ద్వితీయాంకమునందు "విలాసము" అను ప్రతిముఖసంధ్యంగము భరత నియమములు పాటించుటకుమాత్రమే కూర్చబడినదనియు పేర్కొనెను—

........న తు కేవలయా శాస్త్రస్థితిసంపాదనేచ్ఛయా. యథా వేణీసంహారే విలాసాఖ్యస్య ప్రతిముఖసంధ్యంగస్య ప్రకృతరసనిబంధానను గుణ మపి ద్వితీయే అంకే భరతమతానుసరణ మాత్రేచ్ఛయా ఘటనమ్.

అభినవగుప్తుడు ప్రకృతము వీరరసమగుటచేత అప్రకృతమైన విలాసము అనవసరమనియే పేర్కొనెను.

ఇచట ఆనందవర్ధనుని సిద్ధాంతమునకు సమాధానము చెప్పునట్టి సాహసము కాదుగాని యొక్కటి చెప్పవచ్చును. ఇది దుర్యోధనుని యవివేకమును వ్యక్తము చేయుటకే కవి కూర్చెనని తోచును. ప్రతినాయకుని యవివేకము నాయకోత్కర్షకు పరోక్షప్రతిపాదకము. ఈ యభిప్రాయమును కవి కంచుకితోనే పలికించెను. "ఇంతటి బలవంతులు, బలవంతులే కాక కృష్ణసహాయముగల పాండవులతో యుద్ధము జరుగునప్పుడును అయోగ్యవర్తనుడై యంతఃపురసుఖమును కోరు చున్నాడే. మరియు భీష్ముడు పోయినందుకు దుఃఖింపక బాలుడైన యభిమన్యుని మృతికి సంతోషించుటయు దుర్యోధనుని యవివేకము"అని కంచుకి పేర్కొనుట యిట గమనింపదగినది. (యోఽయ ముద్యతేషు........; ఆశస్త్రగ్రహణా దకుంఠ పరశోః....2—2).

దుర్యోధనుడు తన యవివేకమును "గుప్త్యా సాక్షా న్మహానల్పః....(2.3) మొదలైన రీతిలో సమర్థింపబూనుటయు దీనిని దృఢపరచును.

కాక్వాక్షిప్త మను గుణీభూతవ్యంగ్యభేదమునకు నుదాహరణముగా "లాక్షాగృహానలవిషాన్నసభాప్రవేశైః" (1–8) అను శ్లోకమునందలి "స్వస్థా భవంతు మయి జీవతి ధార్తరాష్ట్రాః" అను పాదము నానందవర్ధను స్వీకరించెను.

ఈ సందర్భమునే వ్యాఖ్యానించుచు నభినవగుప్తుడు "మథ్నామి కౌరవ శతం సమరే న కోపాత్"(1-15) అను శ్లోకములోని "న" అను నిషేధార్థకము విధిగా కాకువుచేత గుర్తింపవలసినదని పేర్కొనెను.

గుణీభూతవ్యంగ్యభేదసంకీర్ణమునకు లక్ష్యముగా "కర్తా ద్యూతచ్ఛలానాం జతుమయశరణోద్దీపకః (5-26)" ఇత్యాదిశ్లోకమునిచ్చి యిందు ప్రతిపదమునను ప్రతివాక్యమునను ప్రతిసమాసమునను వ్యంగ్యము గోచరమగుచుండుటవలన వివరించుటలేదని యభినవగుప్తుడు పేర్కొనెను. "కర్త్రేత్యాదౌ చ ప్రతిపదం ప్రత్యవాంతరవాక్యం ప్రతిసమాసం చ వ్యంగ్య ముత్ప్రేక్షితుం శక్యమేవేతి న లిఖితమ్. పాండవా యస్య దాసా ఇతి తదీయోక్త్యనుకారః. తత్ర గుణీభూత వ్యంగ్యతాపి యోజయితుం శక్యా వాచ్యస్యైవ క్రోధోద్దీపకత్వాత్. దాసైశ్చ కృతకృత్యైః స్వామ్యవశ్యం ద్రష్టవ్య ఇత్యర్థశక్త్యనురణనరూపతాపి. ఉభయథాపి చారుత్వా దేకపక్షగ్రహే ప్రమాణాభావః."

మమ్మటుని కావ్యప్రకాశమున వేణీసంహారమునుండి పదమూడు శ్లోకములు ఉదాహరణములుగా గ్రహింపబడినవి. వానిలో నొకశ్లోకమే రెండు సందర్భము లలో నుదాహరింపబడినది. కావున పంద్రెండే గ్రహింపబడినట్లు. ఇవి నాటకము వరుసలోకాక కావ్యప్రకాశమున పేర్కొనబడిన వరుసలోనే యిచట వివరింప బడుచున్నవి.

కాకుస్వరముచే అన్యార్థబోధ వ్యంగ్యముగా భాసించుటకు తృతీయోల్లాస మున "తథాభూతాం దృష్ట్వా నృపసదసి పాంచాలతనయామ్–(1-11) అనుశ్లోకము ఉదాహరింపబడినది. రాజసభలో ఆ విధమైన(అవమానమునుపొందిన) పాంచాలీ స్థితిని చూచియు, అరణ్యమున బోయవారితో కలిసి నివసించిన మన పడిన బాధలు చూచియు, విరాటుని కొలువులో గడిపిన మన దీనస్థితిని చూచియు,బాధలు

పొందని ధర్మరాజు నేను సంధికి వ్యతిరేకించుట చూచి బాధపడుచున్నాడు కాని కౌరవులపై యీనాటికిని కోపగించడుగదా!. భీముని యీ వాక్యమున "ఈ సమయమున నా మాటలకు ఖేదపడక కౌరవుల దుశ్చేష్టలకు ఖిన్నుడు కావలె" నను భావము కాకువుచే వ్యక్తమగుచున్నది. ఇచ్చట వాచ్యసిద్ధ్యంగము అను గుణీభూతవ్యంగ్య మేల కాదని సందేహించియు తుదకు కాకువుచేత వ్యంగ్యార్థమే గ్రాహ్యమని మమ్మటుడు వివరించెను. "అత్ర తు మయి న యోగ్యః ఖేదః కురుషు తు యోగ్య ఇతి కాక్వా ప్రకాశ్యతే న చ వాచ్యసిద్ధ్యంగ మత్ర కాకు రితి గుణీభూతవ్యంగ్యత్వం శంక్యమ్."

ఈ శ్లోకమునే (తథాభూతాం దృష్ట్వా....) సప్తమోల్లాసమున న్యూనపద దోషమునకు ఉదాహరించుచు మూడవపాదమున "అస్మాభిః" అనియు, నాల్గవ పాదమున 'ఖిన్నే' అనుదానికి ముందు "ఇత్థమ్" అనియు నున్నప్పుడే కాని పూర్తియర్థము రాదని మమ్మటుడు పేర్కొనెను. "అత్రాస్మాభి రితి ఖిన్నే ఇత్యస్మాత్పూర్వ మిత్థ మితి చ".

చతుర్థోల్లాసమున రౌద్రరసమున కుదాహరణముగా "కృత మనుమతం దృష్టం వా యై రిదం గురుపాతకమ్" (3–24) ఇత్యాది శ్లోకము చూపబడినది. ఈ సందర్భమున కావ్యప్రకాశవ్యాఖ్యాత యగు ఝలకీకరవామనాచార్యుడు ఈ శ్లోకమున రౌద్రరసమును వ్యక్తము చేయగల వృత్తి లేకపోవుట కవి యశక్తతను సూచించుచున్న దనెను. "అత్ర పద్యే రౌద్రరసవ్యంజనక్షమా వృత్తి ర్నాస్తీతి కవే రశక్తి ర్బోధ్యా". ఇది నిజమునకు రసగంగాధరకర్త యభిప్రాయమునకు ననుకరణము.

పంచమోల్లాసమున కాక్వాక్షిప్తగుణీభూతవ్యంగ్యమునకు మథ్నామి కౌరవశతం సమరే న కోపాత్ (1–15) అను శ్లోకము ఉదాహరింపబడినది. భీముని ప్రతిజ్ఞానిషేధము వాచ్యముకాగా విధి వ్యంగ్యమై గుణీభూతమగుచున్న దని నిరూపించెను. "అత్ర మథ్నామ్యేవేత్యాది వ్యంగ్యం వాచ్యనిషేధసహభావేన స్థితమ్". ఈ సందర్భమును వాఖ్యానించుచు వామనాచార్యుడు "అత్ర ప్రతిజ్ఞాత కుపకుల క్షయస్య భీమసేనస్య న మథ్నామి" ఇత్యుక్తి ర్విరుద్ధేతి సజ్ఞా కాక్వా

ప్రతీయతే. తథా చ కాక్వా నఞర్థానంతరం ప్రతీయమానం "న మథ్నామీతి న" ఇత్యేవం రీత్యా ప్రకృత నఞర్థాన్వయీతి అభావరూపం మథ్నామ్యేవ ఇత్యవధారణం గమ్యతే." అని పేర్కొనెను.

సప్తమోల్లాసమున యత్తచ్ఛబ్దముల సంబంధము ప్రసిద్ధార్థ పరామర్శక మనుటకు "యత్తదూర్జిత మత్యుగ్రం క్షాత్రమ్"— (1–13) అను శ్లోక ముదాహరింపబడినది.

రౌద్రరసానుకూలము కాని యక్షరసంఘటనము రసవ్యంజకము కాదని దోషప్రకరణమున సప్తమోల్లాసమున "దేశః సోఽయ మరాతిశోణితజలై ర్యస్మిన్ హ్రదాః పూరితాః (3–33)" అను శ్లోకము ఉదాహరింపబడినది. ఇది రస ప్రతికూలసంఘటన మని వ్యాఖ్యాతయు సుదీర్ఘముగా చర్చించి నిరూపించెను.

సమాసములోని కొంతభాగము శ్లోకములోని అన్ని పదములతో నన్వయించుటకు వీలుగానున్నను అన్వయక్లిష్టతను సూచించుచు "చత్వారో వయమృత్విజః స భగవాన్ కర్మోపదేష్టా హరిః (1–25)" అను శ్లోకమున "సంగ్రామాధ్వర" అను సమాసమున సర్వత్రస్పష్టాన్వయము క్లిష్టమని మమ్మటుడు పేర్కొనెను.

సప్తమోల్లాసమున అమంగళరూపమైన యశ్లీలదోషము గుణముగా నన్వయించుటకు "నిర్వాణవైరదహనాః ప్రశమాదరీణామ్ ....(1–7)" ఇత్యాదిశ్లోకము ఉదాహరింపబడినది. దీనిలోని కౌరవులకు అమంగళము సూచించు పదములు భీముని ప్రతిజ్ఞ తీర్చుకొనుటకు అనుకూలములు. ఇట్లే సాకాంక్షత్వదోషమునకు "ప్రయత్నపరిబోధితః స్తుతిభిః(3–34)" అను శ్లోకము ఉదాహరింపబడినది. ఈ సందర్భమున కావ్యప్రకాశవ్యాఖ్యాత లందరును ఈ శ్లోకమును అక్షరాక్షరము సంశోధించిరి.

అప్రతీతము అను దోషము కొన్ని సందర్భములలో గుణమగు ననుటకు "ఆత్మారామా విహితరతయో నిర్వికల్పే సమాధౌ (1–23)" అను శ్లోక ముదాహరింపబడినది.

జగన్నాథపండితుడు రసగంగాధరము ప్రథమాననమున కావ్యప్రకాశకర్త యుదాహరించిన వేణీసంహారమందలి "కృత మనుమతమ్" (3-24) అను శ్లోకమున రౌద్రరసవ్యంజకమగు వృత్తి లేదు కావున ఆ శ్లోకము సరియైన యుదాహరణము కాదనియు నీవిధమైన శ్లోకనిర్మాణము కవి యశక్తిత్వమును చాటు ననియు పేర్కొనెను. కాని ప్రాచీనులు ఆర్థికమైన యోజోగుణము నంగీకరించియుండుటచే నిది దోషముకాదు.

అప్పయ్యదీక్షితుని చిత్రమీమాంసయందు పరంపరితరూపకమున కుదాహరణముగా "అస్త్రజ్వాలావలీఢ...." (3-7) అను శ్లోకముదాహరింపబడినది.

ఈ విధముగా ప్రసిద్ధాలంకారికు లెల్లరును వేణీసంహారమును తడవుట దీని ప్రసిద్ధికిని ప్రామాణికతకును వ్యంజకము. ఇంతటి ప్రౌఢనాటకమునకు తెనుగున నింతవరకు నొండురెండు అనువాదములు వెలసినవే తప్ప సమగ్రము ప్రామాణికము నగు వ్యాఖ్యానము వెలువడలేదు. ఈ లోటు ఇప్పటికి తీరుట ముదావహము.

—o—

# వేణీసంహారము - నాటకము

డా॥ అంబడిపూడి నాగభూషణం, ఎం.ఏ., పిహెచ్.డి.

కావ్యము దృశ్యము, శ్రవ్యము నని రెండువిధములు. దృశ్యకావ్యమునకు రూపక మనియు బేరు. వస్తువు, నాయకుడు, రసము అనువానినిబట్టి రూపకము పదివిధములు. [1]నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము వ్యాయోగము సమవాకారము వీధి అంకము ఈహామృగము. రూపకలక్షణములు సంపూర్ణముగాఁ గల్గినదగుటచేతను, ఇతరములకుఁ బ్రకృతి యనఁదగియుండుట చేతను నాటకము (రూపకమునకుఁబర్యాయముగ వ్యవహరింపఁబడుట గలదు) ప్రసిద్ధమయినది.

"భట్టనారాయణస్య కృతిం వేణీసంహారం నామ 'నాటకమ్' అని గ్రంథ కర్తయగు భట్టనారాయణుఁడే వేణీసంహారము 'నాటక' మని స్పష్టీకరించెను.

**నాటక లక్షణములు :-** ఆలంకారికులు పేర్కొన్నదానిననుసరించి నాటక లక్షణములను నిట్లు సంగ్రహింపదగును.[2]

1. నాంది, 2. భారతీవృత్తి, 3. ప్రఖ్యాతవస్తువు, 4. నాయకుఁడు దివ్యుఁడుగాని మానవుఁడుగాని ధీరోదాత్తుఁడు, 5. ప్రధానరసము శృంగారము లేదా వీరము, ఇతరరసము లప్రధానములు, 6. అంగసహితముగ పంచసంధులు, 7. సంధ్యంతరములు, 8. భూషణములు, 9. వృత్తులు, 10. లాస్యాంగములు, 11. పతాకాస్థానకములు, 12. విష్కంభకాదులగు నర్థోపక్షేపకములు, 13 నిర్వహణసంధియందు అద్భుతము, 14. త్రివర్గదము - మొ॥వి. ఇట్టి నాటకము ధర్మార్థకామములలో నేదోనొకటి యైనను ప్రతిపాదించునది గావలయును.

---

[1] నాటకం స ప్రకరణం భాణః ప్రహసనం డిమః
వ్యాయోగ సమవాకారౌ వీధ్యంకేహామృగా దశ (దశ. 1-8)

[2] రసా. 3-132-138

---

ఉపన్యాసకులు, డా॥ కె. వి. కె. సంస్కృతకళాశాల, గుంటూరు.

ఆలంకారికులు పెక్కురు లక్షణసమన్వయసందర్భమున వేణీసంహారము నుండి యుదాహరణములు చూపి యిది సలక్షణమగు నాటకముగా నిరూపించిరి. దశరూపక సాహిత్యదర్పణ శృంగారప్రకాశాదు లాధారముగా వేణియందలి యీ లక్షణములను సంగ్రహముగా నిట్లు గుర్తింపఁదగును.

## 1. నాంది :

[1]పూర్వరంగమున ప్రత్యాహారకాదు లంగము లెన్నియుఁగలవు. [2]కాని వానిలో విఘ్నోపశాంతికై నాంది తప్పక చేయవలయును. 'నందయతీతి నాందీ' యని కవులను, నటులను, సభ్యులను ఆనందింపఁజేయునదిగాన 'నాంది'.

[3]ఆశీస్సు, నమస్కారము, వస్తుసూచనము అను లక్షణములలో నొకటి గల్గియుండుట. 2. మంగళార్థకము లయిన పదము లుండుట. 3, 8, 10 లేదా 12 పదములతో నుండుట యన్నవి 'నాందీ' ప్రధానలక్షణములు. సామాన్యముగా నాటకాదులందలి మొదటిపద్యము నాంది యగును. [4]పదమనఁగా సుప్తిఙంతముగాని శ్లోకపాదముగాని, అవాంతరవాక్యముగాని కావచ్చును. కావున రెండు, మూఁడు పద్యములుగాఁగూడ నాంది నిర్వహింపఁబడవచ్చును.

---

1 యన్నాట్యవస్తునః రంగవిఘ్నోపశాన్తయే, కుశీలవాః ప్రకుర్వన్తి పూర్వరంగం స ఉచ్యతే (సా. ద. 6-284). నాటకారంభమునకు పూర్వము విఘ్నోపశాంతికై చేయు కర్మ పూర్వరంగము. రంగమునకుఁ బూర్వము - కర్మ)

2 ప్రత్యాహారకాన్యంగాన్యస్య భూయాంసి యద్యపి
తథాప్యవశ్యం కర్తవ్యా నాందీ విఘ్నోపశాన్తయే (సా. ద. 6.284)
కనుకనే నాందియొక్కటి సామాన్యముగ రూపకారంభమునఁగవులు ప్రయోగించిరి.

3 ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశాన్యతమా స్మృతా
చంద్రనామాంకితా ప్రాయో మంగలార్థ పదోజ్జ్వలా (రసా. 3.139)

4 శ్లోకపాదః పదం కేచిత్, సుప్తిఙంత మథాపరే
పరేఽవాంతరవాక్యైకస్వరూపం పద మూచిరే (నాట్యప్రదీప.)

వేణియందు మొదటి మూఁడుపద్యములు 'నాంది'. కావున శ్లోకపాదము పదముగా నీ నాటకమున నాంది ద్వాదశ పదముగా జెప్పఁబడినది.

'అంజలిః సిద్ధిం విధత్తామ్' అని మొదటి శ్లోకమునను 'అనునయః వః పుష్ణాతు' అని రెండవశ్లోకమునను, 'ధూర్జటిః యుష్మాన్ పాతు' అని మూఁడవ శ్లోకమునను నున్న యీ నాంది యాశీఃపరముగాఁ జెప్పఁబడినది. ఇట్లు కావ్యము 'నాంది'చే మంగళాది యవును.

ఇట్టియెడల వస్తునిర్దేశ మవసరముగాదు. నిషేధింపఁబడినను దుర్యోధనాదులు దర్పముచే యుద్ధమునకే సిద్ధమగుటయు (నిషిద్ధైరపి) యుధిష్ఠిరాదులకు వనప్రవాసమువలని దుఃఖమునకుఁ బిదప సుఖమును (సంభిన్నముకులః) మొదలుగా నిచట నాందిలో నాటకవస్తువును సూచింపఁబడినది.

'కరైరిన్దోః' అనుచో చంద్రప్రశస్తి (చంద్రనామాంకితా యని రసా.) పుష్పాణా మిత్యాదిగా పుష్పాదులగు మంగళార్థకపదసంయుక్త మయినది. 'వాచ్యార్థబీజరచితా శంకరాదిపదాన్వితా, సంయుక్తా చంద్రపద్మాభ్యామ్ పత్రావల్యభిధీయతే' యను లక్షణమునను సరించి వేణియందలి నాంది 'పత్రావలీ రూపమని తద్వ్యాఖ్యాత జగద్ధరుఁడు పేర్కొనెను.

## 2. భారతీవృత్తి :

నాంది యైనపిదప సూత్రధారుఁడు రంగప్రసాధనమునకై భారతీవృత్తి నాశ్రయింపవలెను. దీనిని మొత్తమును ప్రస్తావనయని వ్యవహరించుటగలదు. [1]సంస్కృతప్రచురముగా నటులచేఁ జేయఁబడు వాగ్వ్యాపారము భారతీవృత్తి. ఆంగికాభినయముకంటె వాచికాభినయమునకే యిందు ప్రాధాన్యము.

[2]ప్రరోచన ఆముఖము వీధి ప్రహసనము అని భారతీవృత్తికి నాలుగంగములు.

---

[1] భారతీ సంస్కృతప్రాయో వాగ్వ్యాపారో నటాశ్రయః.

[2] భేదైః ప్రరోచనా యుక్తై ర్వీధీప్రహసనాముఖైః (దశ. 3.5)

(క). ప్రరోచన : [1]ప్రకృతార్థమును ప్రశంసించుచు సభ్యుల చిత్తవృత్తులను నాట్యాభిముఖము చేయుట ప్రరోచన.

దేవతాస్థానాదులగు దేశమునుగాని, వసంతశరదాదియగు కాలమునుగాని ప్రశంసించుచు ప్రకృతార్థమును సూచించుట 'అచేతన' రూపమైన ప్రరోచన యగును.[2]

వేణియందు సత్పక్షా మధురగిరః (1-7) అనుచో శరదృతువర్ణనమున శ్లేషతో ధార్తరాష్ట్రుల వినాశరూపమైన కథావస్తువు సూచింపఁబడినది. [3]ఋతు వర్ణననియమమును పాటింపఁబడినట్లయినది.

[4]నాయకుఁడు కవి సభ్యులు నటులనుగూర్చిన ప్రశంస 'చేతన' రూపమైన ప్రరోచన.

[5]ధర్మ, అర్థ, రస, మోక్షోపయోగులగు చతుర్విధనాయకులలో నీ వేణియందు నాయకుఁడగు భీముడు రసోపయోగి.

ఉదాత్త ఉద్ధత, ప్రౌఢ వినీతులని కవులు నాల్గువిధములు. 'కుసుమాంజలి రపర ఇవ (1–5) అనుచో విరలానపి గుణలేశాన్ అనుటలో [6]మిక్కిలి వినయముచేఁ దన్ను దక్కువవానిగాఁ జెప్పుకొనుటచే భట్టనారాయణుఁడు 'వినీతుఁ' డగును.

---

1 ప్రరోచనా తు సా ప్రోక్తా ప్రకృతార్థప్రశంసయా
సదస్యచిత్తవృత్తీనాం సమ్ముఖీకరణం చ యత్ (రసా. 3.143)

2 రసా 3.144, 145.

3 ఋతుం కంచి దుపాదాయ భారతీవృత్తి మాశ్రయేత్ (దశ. 3.4)

4 చేతనాస్తు కవిసభ్యనటాస్స్తుతాః (రసా. 3. 145)

5 కథానాథాస్తు ధర్మార్థరసమోక్షోపయోగినః
ధర్మోపయోగిన స్తత్ర యుధిష్ఠిరనలాదయః (రసా. 3.146)

6 వినీతో వినయోత్కర్షాత్ స్వాపకర్షప్రకాశకః (రసా. 3.152)

“భవద్భి రవధానం దీయమాన మభ్యర్థయే” యని నాటకమునెడల సదస్యుల యవధాన [1]మభ్యర్థింపఁబడుటచే నిట సభ్యులు ప్రార్థనీయులు. సభ్యులే నాట్యమును బ్రార్థించినచో వారు ప్రార్థకు లగుదురు.

వాదక, గాయక, నర్తకులగు నటుల ప్రశంసయు వేణియందు పారిపార్శ్వకవచనములన గుర్తింపవచ్చును.

(చ) ఆముఖము : [2]సూత్రధారుఁడు తా నుపక్షేపింపఁబోవు కార్యమును గూర్చి నటీమారిషవిదూషకులలో నొకరితో బ్రస్తావించుట ఆముఖము. దీనిని ప్రస్తావన యనియు నందురు.

కథోద్ఘాతము, ప్రవర్తకము, ప్రయోగాతిశయము నని యాముఖమునకు మూఁడంగములు[3].

---

[1] సంప్రార్థ్యాస్సూత్రధారేణ ప్రార్థనీయా ఇతి స్మృతాః (రసా. 3.154)
యే సూత్రిణం ప్రార్థయన్తే తే సభ్యాః ప్రార్థకా స్స్మృతాః (రసా.3.155)

[2] సూత్రధారో నటీం బ్రూతే మార్షం వాథ విదూషకమ్
స్వకార్యం ప్రస్తుతాక్షేపి చిత్రోక్త్యా యత్తదాముఖం ప్రస్తావ నా వా (దశ. 3.8)

రసార్ణవసుధాకరకర్త విదూషకనటీ పారిపార్శ్వకులతో సంభాషించుచు, వీధ్యంగములుగూడఁ గలిపి చెప్పిన ప్రస్తావన యనియు, వీధ్యంగము లాముఖాంగము లన్నియు కలిపి నటీనటవిదూషకులతో సంభాషించిన స్థాపన యనియు నాముఖమును రెండుగా విభాగించెను. (రసా. 3.164 to 166) వేణియందు సూత్రధారుఁడు పారిపార్శ్వకునితో సంభాషించుట, వీధ్యంగములునుండుట ననుసరించి యీ పక్షమునను విది ప్రస్తావన యగును.

[3] త్రీణ్యాముఖాంగా న్యుచ్యన్తే కథోద్ఘాతః ప్రవర్తకః ప్రయోగాతిశయ శ్చేతి (రసా. 3.160)

1. కథోద్ఘాతము : [1]వాక్యము లేక వాక్యార్థము ననుసరించి పాత్ర ప్రవేశము. ఇట్లు కథోద్ఘాతము, వాక్యవాక్యార్థభేదముచే ద్వివిధము.

వేణిలో నిర్వాణవైరిదహనాః (1.8) అను పద్యమున 'స్వస్థాః' అనుచో ధార్తరాష్ట్రులకు స్వర్గస్థితియు, నిరుపద్రవస్థితియు నర్థములు. ఇందు రెండవ యర్థము నాధారముచేసికొని 'స్వస్థా భవన్తు మయి జీవతి ధార్తరాష్ట్రాః' అని భీముని ప్రవేశమగుటచే నిది వాక్యార్థరూప మయిన కథోద్ఘాతము.

2. వీథ్యంగాలు : ఉద్ఘాత్యకము, అవలగితము మొదలగునవి 13వీథ్యంగాలు.[2] ఉద్ఘాత్యకము : ఒకయర్థమునఁ బ్రయోగింపఁబడిన శబ్దమును వేఱొకయర్థముతో స్వీకరించుట యుద్ఘాత్యకము.

సత్పక్షా మధురగిరః (1.7) అనుచోట సూత్రధారుని వాక్యములలో ధార్తరాష్ట్రాదిశబ్దములను కౌరవాదులగునర్థముతో స్వీకరించి పారిపార్శ్వకుఁడు 'శాన్తం పాపమిత్యాదిగా భాషించుట యుద్ఘాత్యకము (దీనిని రసా కర్త అవస్యందితమున కుదాహరించెను.) ఇందు ఉద్ఘాత్యకావలగితము లాముఖాంగములుగా నాముఖాంగము లయిదుగాఁ గొందరు చెప్పిరి.[3]

ఇతరములగు వీథ్యంగము లూహింపదగును.[4]

---

1 స్వేతివృత్తసమం వాక్య మర్థం వా యత్ర సూత్రిణః
గృహీత్వా ప్రవిశేత్పాత్రం కథోద్ఘాతో ద్విధైవ సః (దశ. 3.9)

2 ఉద్ఘాత్యకావలగితే ప్రపంచత్రిగతే ఛలమ్, వాక్కేల్యధిబలే, గండ మవస్యందితనాలికే అసత్ప్రలాపవ్యాహారమృదవాని త్రయోదశ (దశ. 3.12)

3 ఉద్ఘాత్యకః కథోద్ఘాతః ప్రయోగాతిశయ స్తథా ప్రవర్తకావలగితే పంచ ప్రస్తావనాభిధాః (సా.ద. 6.291)

4 గండము. (1–7) (రసా) దీనిని శృంగారప్రకాశ యవస్యందితమున కుదాహరించినది. దశ. 3.16, 18. మొ;

**3. వస్తువు :** నాటకమున వస్తువు ప్రఖ్యాతముగావలెను. ఇతిహాసాదులయందుఁ బ్రసిద్ధమైన కథ ప్రఖ్యాతము.[1] నాటకమున వస్తువు కవికల్పితము గారాదు. నాటకమునకుఁగాని రసమునకుఁగాని యనుచితమైనది తొలగింపవలెను. లేదా మార్పుచేయవలెను. (దశ. 3.25)

భారతేతిహాసమునందు ప్రసిద్ధమగుటచే వేణీసంహారమందలి ధర్మరాజ పట్టాభిషేకవస్తువు ప్రఖ్యాతము. ఆరంభమున సూత్రధారుఁడు భారతకర్త కృష్ణద్వైపాయను వందనముచేయుట గమనింపఁదగును.

**4. నాయకుడు :** కథాశరీరమునందంతట వ్యాపించి ముఖ్యఫలమును బొందు వాఁడు నాయకుఁడు. కౌరవ వినాశనమువలన సాధింపఁబడిన రాజ్యమునకు నభిషిక్తుఁడగుటచే నిందు ఫలస్వామి ధర్మరాజు. మరికొందరి మతమున ధీరోద్ధతుడగు భీముడే నాయకుఁడు. సూచ్యముగాఁగూడ నాయకుని వధ యుండరాదు[2].

**5. రసము :** ఉత్సాహము స్థాయిగా నిందు వీరము ప్రధానరసము. శృంగారాదు లటనట నంగములయి యున్నవి. రసములు ప్రధానరసాంగములుగా నుండవలెఁగాని ఒకదానివలన వేరొకటి తిరోధాన మగునట్లు చెప్పరాదు. రసపోషణవిస్తృతితో కథావస్తువుగాని, సంధ్యంగాదులతో వస్తువిస్తరణమువలన రసమునకుఁగాని తిరోధానము గల్గకుండవలెను[3].

**6. సంధి సంధ్యంగములు :** ఇష్టార్థరచనము, వస్తువిస్తరణము, మొదలగు ప్రయోజనములకై నాటకమునందలి వస్తువు పంచసంధులు, వాని యంగములు 64 తో నిర్వహింపఁబడవలయును.

సంధి : [4]ఒక ప్రయోజనముతోఁగూడిన కథాంశముల కవాంతర ప్రయో

---

[1] ప్రఖ్యాత మితిహాసాదేః (దశ. 1.15)

[2] విష్కంభకాద్యై రపి నో వధో వాచ్యోఽధికారిణః (సా.ద. 6.320)

[3] అన్యోన్యేన తిరోధానం న కుర్యా ద్రసవస్తునోః (సా. ద. 6.320)

[4] అవాంతరార్థసంబంధ స్సన్ధి రేకాన్వయే సతి (దశ. 1.23)

జనముతో సంబంధము సంధి. ఇవి అయిదు. [1]ముఖసంధి, ప్రతిముఖసంధి, గర్భసంధి, అవమర్శసంధి, నిర్వహణసంధి.

[2]బీజ, బిందు, పతాకా, ప్రకరీ, కార్యములను నయిదర్థప్రకృతులును, [3]ఆరంభప్రయత్నప్రాప్త్యాశానియతాప్తిఫలాగమములను నవస్థలతోఁ గ్రమముగాఁ గూడి పయి సంధు లయిదు నేర్పడును.

I. ముఖసంధి : బీజారంభముల సంధి ముఖసంధి. [4]స్వల్పముగా నుద్దేశింపఁ బడి క్రమముగా బహుముఖముగా విస్తరించునది బీజము. [5]ఫలాధిక్యమునకై కుతూహల మారంభము. వేణీసంహారమున ద్రౌపది కేశములు ముడుచుటకు హేతువయిన భీముని కోపముచే సాధింపఁబడిన (యుధిష్ఠిరుని) యుత్సాహము బీజము. సంధివిఘటనము మొదలగువానిలోఁ గల యాసక్తి కార్యసాధనమునెడలఁ గుతూహలము. ఇందు ప్రథమాంకము 'ముఖసంధి'.

దీనికి 12 అంగములు.

1. ఉపక్షేపము: బీజన్యాస ఉపక్షేపః. కావ్యార్థము సిద్ధించుట కనుగుణమగు బీజమునుంచుట. 'లాక్షాగృహ' (1_8) అనుచో ద్రౌపది కేశములు ముడుచుటకు మూలమయిన కౌరవులతోడి వైరమను బీజమునుంచుట యుపక్షేపము.

---

1 ముఖప్రతిముఖే గర్భస్సావమర్శోపసంహృతిః (దశ. 1.24)

2 బీజబిందుపతాకాప్రకరీకార్యలక్షణాః
అర్థప్రకృతయః పంచ తా ఏతే పరికీర్తితాః (దశ. 1.18)

3 అవస్థాః పంచ కార్యస్య ప్రారబ్ధస్య ఫలార్థిభిః
ఆరంభయత్నప్రాప్త్యాశానియతాప్తిఫలాగమాః (దశ. 1.19)

4 స్వల్పోద్దిష్టస్తు తద్ధేతు ర్బీజం విస్తార్యనేకధా (దశ. 1–16)

5 ఔత్సుక్యమాత్రమారంభః ఫలలాభాయ భూయసే (దశ. 1.20)

2. పరికరము : తద్బాహుల్యం పరిక్రియా. పై యర్థమును విస్తరించుట. భీమస్సన్ధిం విఘటయతి (1–10) యనుచో వైరము విస్తరింపఁబడినది.

3. పరిన్యాసము : తన్నిష్పత్తిః పరిన్యాసః. కావ్యార్థము నిశ్చయింపఁబడుట. 'ఉత్తంసయిష్యతి కచాంస్తవ దేవి భీమః' (1–21) అనుచో ద్రౌపదీకేశసంయమనము నిశ్చయింపఁబడినది.

4. విలోభనము : గుణాఖ్యానం విలోభనమ్. బీజగుణములను వర్ణించుట. మన్థాయస్తార్ణవాంభః (1–22) దుందుభిధ్వనివర్ణనము విలోభనము.

5. యుక్తి : సంప్రధారణం యుక్తిః. కర్తవ్యనిశ్చయము యుక్తి. ఇంద్రప్రస్థమ్— (1-16) మొదలగు వాక్యముల శత్రుకులక్షయ మను కర్తవ్యము నిశ్చితము.

6 ప్రాప్తి : ప్రాప్తిస్సుఖాగమః. బీజాదుల వర్ణనచే సుఖమును బొందుట. 'మంథామి కౌరవశతమ్' (1-15) మున్నగు మాటలు మరలమరలఁ జెప్పుమని ద్రౌపది కోరుటలో ప్రాప్తి.

7. సమాధానము : బీజాగమ స్సమాధానమ్. బీజార్థమును పొందుట సమాధానము. "క్రోధజ్యోతి రిదం మహత్ కురువనే యౌధిష్ఠిరం జృంభతే" (1–25) అనుచో 'స్వస్థా భవన్తు' అనువప్పటి భీమునియందున్న క్రోధబీజము నాయకుఁడగు ధర్మరాజును పొందినట్లు చెప్పఁబడుటచే నిది సమాధానము.

8. విధానము : విధానం సుఖదుఃఖకృత్. సుఖదుఃఖములు కలిగినట్లు వర్ణించుట. 'భూయః పరిభవక్లాన్తిలజ్జావిధురితాననమ్' అనుచో యుద్ధము సుఖదుఃఖకరముగాఁ జెప్పుట విధానము.

9. పరిభావన : పరిభావోఽద్భుతావేశః. ఆశ్చర్యము గల్గించుట. 'కిమిదానీమేష ప్రళయ— ఇత్యాదిగా దుందుభి మ్రోతచే ద్రౌపదివిస్మయము పరిభావన.

10. ఉద్భేదము : ఉద్భేదో గూఢభేదనమ్. గూఢముగానున్న యంశమును ప్రకాశింపఁజేయుట. చత్వారో వయమృత్విజః (1–25) ధర్మరాజాదుల నిశ్చయముతో నిందు బీజార్థము ప్రకాశింపఁజేయఁబడుట నిది యుద్భేదము.

11. కరణము : కరణం ప్రకృతారంభః. బీజార్థము సఫలమగుటకుఁ దగునట్లు ఆరంభించుట. గచ్ఛామో వయ మిదానీం కురుకులక్షయాయ -యనుటలో ప్రకృతారంభము.

12. భేదము : భేదః ప్రోత్సాహనా మతా. దానికి తగిన ప్రోత్సాహము భేదము. అన్యోన్యాస్ఫాల (1–27) అను పాండవపరాక్రమవర్ణనములో క్రోధమున కనుగుణముగా ప్రోత్సాహము.

II. ప్రతిముఖసంధి : బిందుప్రయత్నముల సంధి ప్రతిముఖసంధి. [1]అవాంతరార్థములచే ప్రధానకథకు విచ్ఛేదము కలుగకుండ చేయునది బిందువు [2]తలఁచిన కార్యము ప్రాప్తింపకుండుటచే దానికై చేయు అధికయత్నము ప్రయత్నము.

బీజము లక్ష్యాలక్ష్యముగాఁజూపట్టిన నది ప్రతిముఖసంధియగును. భీష్మాదుల సంహారముచే కొంత లక్ష్యమగుచు, కర్ణాదులింకను మిగిలియుండుటచే నలక్ష్యమగుచు క్రోధబీజమిచట నుద్భిన్నావస్థలో నున్నది. సహభృత్య (2-5) దుశ్శాసనస్య (2–27) మొదలయినవానిచే నుద్భేదము వలన ప్రతిముఖసంధి. వేణిలో రెండవయంకము ప్రతిముఖసంధి.

ప్రతిముఖసంధి కంగములు 13.

1. విలాసము : రత్యర్థేచ్ఛా విలాసః. రతివిషయికమైన యిచ్ఛ. "భానుమతి యథాపూర్వం మామనామంత్ర్యైవ వాసభవనా త్ప్రాత రేవ నిష్క్రాన్తేతి వ్యాక్షిప్తం మే మనః" అనుచో దుర్యోధనుని పల్కుల విలాసము.

---

1 అవాంతరార్థవిచ్ఛేదే బిందు రచ్ఛేదకారణమ్ (దశ. 1-18)

2 ప్రయత్నస్తు తదప్రాప్తౌ వ్యాపారోऽతిత్వరాన్వితః (దశ. 1-20)

2. పరిసర్పము : దృష్టనష్టానుసర్పణం పరిసర్పః. ఒకచో దృష్టమగుచు వేఱొకచో నష్టమగుచు బీజము ననుసరించుట. 'ఆశస్త్రగ్రహణాత్ (2-2) అనుచో భీష్మవధచే బీజము దృష్టమగుచు, అభిమన్యు మరణముచే నష్టమగుచు నిది పరిసర్పము.

3. విధూనము : విధూతం స్యాదరతిః. అనిష్టముచే తిరస్కరించుట. దుస్స్వప్నదర్శనముచే దుర్యోధనున కనిష్టమును శంకించుచు భానుమతి యాతని యభిలాషను ద్రోసిపుచ్చుట విధూనము.

4. శమము : తచ్ఛమ శ్శమః. అరతి శమించుట శమము. పిదప భానుమతి సఖీవచనములచే దుర్యోధనుని గొప్పదనము నెఱిగి తాపము విడుచుట శమము.

5. నర్మము : పరిహాసవచో నర్మ. పరిహాసవాక్యము నర్మము. చేటినుండి యర్ఘ్యపాత్రను గ్రహించి భానుమతికి సమర్పించునప్పటి సంభాషణమున దుస్స్వప్నబాధను తొలగించి దేవతాపూజకు విఘ్నముగల్గించుటలోని పరిహాసము నర్మమను ప్రతిముఖాంగము.

6. నర్మద్యుతి : ధృతి స్తజ్జా ద్యుతి ర్మతా. పై పరిహాసవచనములవలనఁ బిదపఁగలుగు ధైర్యము నర్మద్యుతి. తదల మేవ మిత్యాదిగా దుర్యోధనుఁడు భానుమతిని ధైర్యపరచుట ద్యుతి.

7. ప్రగమనము : ఉత్తరా వాక్ ప్రగమనమ్. సమాధానము. 2-23 తరువాత కంచుకి 'భగ్నమ్' అనుట మొదలుగా దుర్యోధనునితో జరిపిన సంభాషణము ప్రగమనము.

8. నిరోధనము : హితరోధో నిరోధనమ్. అభీష్టమున కవరోధముగల్గుట. సుఖోపవిష్టులైన భానుమతీదుర్యోధనులకు జయద్రథమరణవార్తచే నభీష్టమున కవరోధము.

9. అనునయము : పర్యుపాస్తి రనునయః. సంతృప్తికై యత్నించుట. హతే జరతి గాంగేయే —(2-4) అని భీష్ముని వధవంటిదే అభిమన్యు వధయును అను దుర్యోధనుని సమన్వయ మనునయము.

10. పుష్పము : పుష్పం వాక్యం విశేషవత్. విశేషవాక్యము పుష్పము. భానుమతీస్వప్నవృత్తాంతవర్ణనమున దుర్యోధనుఁ డన్యార్థము నూహించుట కనువయిన వాక్యవిశేషము పుష్పము.

11. ఉపన్యాసము : ఉపన్యాసస్తు సోపాయమ్. నేర్పుగల మాటలు. నకులేన పన్నగశతవధః స్తనాంశుకాపహరణమ్ అనుచోట పొరవడిన దుర్యోధనుఁడు ఫలన్తి కాకతాలీయ మిత్యాదిగా (2-15) తలచుట యుపన్యాసము.

12. వజ్రము : వజ్రం ప్రత్యక్షనిష్ఠురమ్. పరుషవాక్యము. కంచుకి భగ్నమైనది రథకేతువుగాఁ జెప్పఁగా 'తత్కిమాకులం ప్రలపసి' ఇత్యాదిగా నిష్ఠురముగాఁ బల్కుట వజ్రము.

13. వర్ణసంహారము : వర్ణితార్థతిరస్కారో వర్ణసంహారః. (శృంగార). వర్ణితార్థమును తిరస్కరించుట వర్ణసంహారము. ప్రసన్నబ్రాహ్మణ వేదానురోధేన మొదలగు భానుమతి పల్కుల వర్ణసంహారము.

III. గర్భసంధి: [1]పతాకాప్రాప్త్యాశల సంధి గర్భసంధి. ప్రధానకథతోపాటు దాని కనుబంధముగా నడచు కథ పతాక. ఇది నియతముగాదందురు. [2]ఉపాయాపాయము లచే కార్యఫల మనిశ్చితముగానున్న ప్రాప్త్యాశ.

ప్రతిముఖసంధిలో లక్ష్యాలక్ష్యమయియున్న బీజము నన్వేషించుట గర్భసంధి.

---

[1] సానుబంధం పతాకాఖ్యమ్ (దశ. 1.13)

[2] ఉపాయాపాయశంకాభ్యాం ప్రాప్త్యాశా ప్రాప్తిసంభవః (దశ.)

అభిమన్యుఘటోత్కచాదుల వధాదులగు నపాయములుగల్గియు ద్రోణ దుశ్శాసనాదుల సంహరణముతో నాటకమునందలి 3, 4, అంకములును అయిదవ యంకమున సగమునకుఁ బైవరకును గర్భసంధిస్థాన మగుచున్నది.

గర్భసంధికంగములు 12.

1. అభూతాహరణము : అభూతాహరణం ఛద్మ. మోసము. అశ్వత్థామా హత ఇతి (3-11) అని అశ్వత్థామ చచ్చెనని (ఏనుగని పిదప) చెప్పుట లోని మోసము అభూతాహరణము.

2. మార్గము : మార్గస్తత్త్వార్థకీర్తనమ్. యథార్థమును జెప్పుట. అశ్వత్థామ యభిషిక్తుఁడుగాఁడని తెలియుటవలననే ద్రోణుఁడు కురుకులక్షయము నుపేక్షించెనని కర్ణుఁడు చెప్పిన తత్త్వము మార్గము.

3. రూపము : రూపం వితర్కవ ద్వాక్యమ్. తర్కముతోఁగూడిన వాక్యము రూపము. తేజస్వీ (3-20) అనుచో కొడుకు మృతి తెలిసిన ద్రోణుడు శస్త్రగ్రహణ సమయమున విశస్త్రుఁడగుటను గూర్చిన తర్కము రూపము.

4. ఉదాహరణము : సోత్కర్షస్స్యా దుదాహృతిః. తన్నుదాను పొగడు కొనుట. యో యశ్శస్త్రం బిభర్తి (3-32) అనుచోటి యశ్వత్థామ సోత్కర్ష యుదాహరణము.

5. క్రమము : క్రమస్సంచింత్యమానాప్తిః. తలఁచినది పొందుట. కర్ణసేనాధిపత్యముతో నశ్వత్థామకు కోపమువలన పాండవులకు విజయాప్త్యవకాశలబ్ధి క్రమము.

6. సంగ్రహము : సంగ్రహస్సామదానోక్తిః. ప్రకృతకార్యసాధనమున కుపయోగించు సామాదివాక్యములు. ప్రయత్నపరిబోధితః (3-36) అనుచో అపాండవము చేయుదునన్న అశ్వత్థామవలుకులలో సామర్థ్య సంపత్తి సంగ్రహము.

7. అనుమానము : అభ్యూహో లింగతోఽనుమానమ్ ఆయా ఆధారములను బట్టి యూహ. కర్ణదుర్యోధనుల స్థితినిబట్టి దుశ్శాసనరక్తము భీమునిచే గ్రహింపఁబడెనని యశ్వత్థామ యూహించుట యనుమానము

8. అధిబలము : అధిబలమభిసంధిః. ఇష్టజనముల కూడికనుగూర్చి చెప్పుట. 4వ అంకములో చాటుగా నభిమన్యుని చంపినట్లుగాక అందరు చూచు చుండఁగనే వృషసేనుని చంపుదునను కిరీటివచనముల నధిబలము.

9. తోటకము : సంరబ్ధం తోటకం వచః. కోపసంభ్రమముగల మాటలు. ప్రయత్నపరిబోధితః (3_34) మొదలుకొని యున్న కర్ణాశ్వత్థామల సంరబ్ధవచనములచే పాండవవిజయప్రాప్తి కనుకూలముగా సేనలో భేదము గల్గుటవలన నావాక్యము తోటకము.

10. ఉద్వేగము : ఉద్వేగోఽరికృతా భీతిః. శత్రువులవలన భయము. భీముని వలనఁ గష్టముగల్గునని దుర్యోధనుని రథమును సూతుఁడు మరలించుటలో ఉద్వేగము.

11. సంభ్రమము : శంకాత్రాసౌ చ సంభ్రమః. భయసందేహములు సంభ్రమము. భీమార్జునులు వచ్చిరని తెలిసినప్పుడు 'కిమత్ర ప్రతిపత్తవ్యమ్' అను గాంధారిపల్కుల శంకాత్రాసములచే పాండవ విజయ ప్రాప్త్యాశతోఁగూడిన యిది సంభ్రమము.

12. ఆక్షేపము : గర్భబీజసముద్భేద ఆక్షేపః. బీజార్థము ప్రకాశింపఁజేయుట. 'ఏతన్నిర్భర్త్సితవిదురవచనబీజస్య' మొదలగు సుందరకుని పల్కులలో బీజము ఫలోన్ముఖముగాఁజెప్పఁబడుట నిది యాక్షేపము.

IV. అవమర్శసంధి : ప్రకరీనియతాప్తుల సంధి యవమర్శసంధి. పతాకవలెఁగాక కథలో కొంతవఱకుమాత్రమే వ్యాపించియుండు ప్రాసంగికేతివృత్తము ప్రకరి.[1] అపాయములు తొలఁగఁగా ఫలప్రాప్తి నిశ్చయింపఁబడుట నియతాప్తి.[2]

---

[1] ప్రకరీ చ ప్రదేశభాక్ (దశ. 1-13)

[2] అపాయాభావతః ప్రాప్తిర్నియతాప్తిః సునిశ్చితా (దశ. 1-21)

క్రోధముచేఁగాని, వ్యసనముచేఁగాని గర్భసంధియందుఁ దోచిన బీజార్థమును పరామర్శించుట యవమర్శసంధి.

తీర్ణే భీష్మమహోదధౌ (6-1) 'స్వల్పావశేషే జయే' -యనుటలో భీష్మాదులగు ప్రత్యర్థులవధవలన విజయము పరామర్శింపఁబడుటచే నట నవమర్శసంధి. -వేణిలో 5వ అంకము చివరినుండి ఆరవయంకమున సగము వరకు నవమర్శసంధి.

దీని కంగములు 13.

1. అపవాదము : దోషప్రఖ్యాపవాదః. దోషమును జూపుట. 'దేవీకేశపాశస్పర్శపాతకప్రధానహేతు రుపలబ్ధః' అని పాంచాలకుని పల్కులలో దుర్యోధనునియందలి దోషము చెప్పఁబడినది.

2. సంఫేటము ; సంఫేటో రోషభాషణమ్. రోషముతోడి మాటలు సంఫేటము. 6వ అంకములో భీమదుర్యోధనుల క్రోధాధిక్షేపపరుష వాక్కలహము సంఫేటము.

3. విద్రవము : విద్రవో వధబంధాదిః. వధ బంధనము మొదలగు కష్టము విద్రవము. రాక్షసుఁడు కల్పనము చేసిన కథలో భీమునిమరణమును, అర్జునుని వెనుబాటు విద్రవము.

4. ద్రవము : ద్రవో గురుతిరస్కృతిః. గురువులను తిరస్కరించుట: జ్ఞాతిప్రీతిః (6—20) అనుచో ధర్మరాజు గురువగు బలరాముని తిరస్కరించుట ద్రవము.

5. శక్తి : విరోధశమనం శక్తిః- విరోధము నశించుట. కురుకుల మఖిలం దగ్ధ మేతద్రణాగ్రే (6—31) అనుచో శత్రుసంహారము శక్తి.

6. ద్యుతి : తర్జనోద్వేజనే ద్యుతిః. వెఱపించుట రెట్టించుట. జన్మేందోరమలే (6- 7) అనుచో దుర్యోధనుని తర్జనోద్వేజనములచే భీమునియందు ద్యుతి.

7. ప్రసంగము : గురుకీర్తనం ప్రసంగః. గురుస్తుతి ప్రసంగము. స కీచకనిషూదనః (6-18) అనుచో భీమప్రశంస ప్రసంగము.

8. ఛలనము : ఛలనం చావమాననమ్. అవమానించుట 'ఛలనము'. రిపుజయవిముఖం తే యది చేత స్తదా యత్ర తత్ర వా ప్రాణత్యాగం కురు' అను రాక్షసునిపల్కులు ఛలనము.

9. వ్యవసాయము : వ్యవసాయ స్స్వశక్త్యుక్తిః. తన శక్తిని దెల్పుట వ్యవసాయము. నూనం తేనాద్య (6—6) అనుచో ధర్మజుఁడు తన దండ శక్తిని జెప్పుట వ్యవసాయము.

10. విరోధనము : సంరబ్ధానాం విరోధనమ్. పరస్పరము ధిక్కరించుట. కృష్టా కేశేషు భార్యా (5—30) అప్రియాణి కరోత్యేష (5—31) అను తీరుగా సంరబ్ధులయిన భీమదుర్యోధనుల స్వోత్కర్ష విరోధనము.

11. ప్రరోచన : సిద్ధామంత్రణతో భావిదర్శికా స్యా త్ప్రరోచనా'. జరుగ బోవు శుభమునుగూర్చి ముందుగా ప్రశంసించుట. పూర్యంతాం సలిలేన (6—12) అనుచో ద్రౌపదీకేశసంయమనము, ధర్మజపట్టాభిషేకము నను భావ్యంశములు సిద్ధమైనట్లు చెప్పుట ప్రరోచన.

12. విచలనము : వికత్థనా విచలనమ్. తనగుణములు తానే చెప్పుకొనుట. 'సకలరిపుజయాశా' (5-27) చూర్ణితాశేషకౌరవ్యః (5-28) అనుచో భీముఁడు విజయమున కనుకూలమైన తన గుణములను వర్ణించుట విచలనము.

13. ఆదానము : ఆదానం కార్యసంగ్రహః. ఉద్దేశించినకార్యమును సంగ్రహించుట. రక్షో నాహమ్ (6—37) అనుచో ఎల్లశత్రువులసంహారము సంగ్రహింపఁబడుటయే ఆదానము.

V. నిర్వహణసంధి : కార్యఫలాగమముల సంధి నిర్వహణసంధి. [1]ఫలమును నిర్వహించు చివరి కథావయవము కార్యము. [2]ఉద్దేశించిన ఫలము సిద్ధించుట ఫలాగమము. ఆయాచోట్ల చెదురుగానున్న బీజయుక్తములయిన ముఖసంధ్యాదుల యర్థములన్నియు ప్రధానప్రయోజనమునకు తేబడినచోటు నిర్వహణసంధి.

కుమారభీమసేనో దుర్యోధనక్షతజారుణీకృతసకలశరీరః అనుచో ద్రౌపదీకేశసంయమనము మొదలగువానికి బీజములగువానినెల్ల నిట సంగ్రహించు టచే నిది నిర్వహణసంధి. ఆరవయంకమునం దుదిభాగము నిర్వహణసంధి స్థానము.

నిర్వహణసంధ్యంగములు 14.

1. సంధి : సంధిర్బీజోపగమనమ్. బీజభూతమగు విషయమును ఫలప్రాప్తి యందు చెప్పుట. 'స్మరతి భవతీ యత్తన్మయోక్తమ్ చంచద్భుజ —అని భీముఁడు బీజాంశమును ఫలప్రాప్తియందు స్మరింపఁజేయుట సంధి.

2. విబోధము : విబోధం కార్యమార్గణమ్. ప్రధానకార్యము నన్వేషించుట కి మపర మవశిష్ట మ్మన్న ధర్మజునితో భీముఁడు 'సుమహ దవశిష్టమ్ సంయమామి తావ దనేన సుయోధనశోణితోక్షితేన దుశ్శాసనావకృష్టమ్ కేశహస్త' మనుట విబోధము.

3. గ్రథనము : గ్రథనం తదుపక్షేపః. ప్రధాన కార్యమును ఉపక్షేపించుట. "భవతి, సంయమ్యతామిదానీం ధార్తరాష్ట్రకుల కాలరాత్రిర్దుశ్శాసన విలులితేయం వేణీ" యనుచో ద్రౌపదీకేశసంయమనకార్యము ఉపక్షేపింప బడుట నిది గ్రథనము.

---

[1] సమాపనం తు యత్సిద్ధ్యై తత్కార్య మితి సమ్మతః (సా.ద. 6.327)

[2] సమగ్రఫలసంపత్తిః ఫలయోగో యథోదితః (దశ. 1.21)

4. నిర్ణయము : అనుభూతాఖ్యా తు నిర్ణయః. కార్యప్రశంస నిర్ణయము. భూమౌ క్షిప్త్వా (6_39) అనుచో దుర్యోధనసంహరణమును జెప్పుటలో నిర్ణయము.

5. పరిభాష : పరిభాషా మిథో జల్పః — పరస్పర సంభాషణము. కృష్టా యేనాసి రాజ్ఞాం (6_41) మొదలుకొని క్వా సా భానుమతీ— మొదలగు భాషణము పరిభాషణము.

6. ప్రసాదము : ప్రసాదః పర్యుపాసనమ్- సంతోషపెట్టుట. దిష్ట్యా వర్ధసే రిపుకులక్షయేన - అని భీముఁడు ద్రౌపదినారాధించుటలో ప్రసాదము.

7. ఆనందము : ఆనందో వాంఛితావాప్తిః. ఇష్టసిద్ధి యానందము. 'అనుభవామి నాథస్య ప్రసాదేన— మొదలగు వాక్యములలో కేశసంయమనమువలన ద్రౌపదియందానందము.

8. సమయము : సమయో దుఃఖనిర్గమః. విచారముతొలఁగుట సమయము. కృతగురు- (6-43) అనుచో ధర్మజుని దుఃఖనాశవర్ణనము సమయము.

9. కృతి : కృతి ర్లబ్ధార్థశమనమ్. లభించినదానిని స్థిరపరచుట. వ్యాసోऽయమ్ (6_44)ఇత్యాదిగా ధర్మజుని పట్టాభిషేకమునుగూర్చి కృష్ణునిపలుకులలో నిష్టార్థము స్థిరపడుటచే కృతి.

10. భాషణము : మానాద్యాప్తిశ్చ భాషణమ్. కార్యసిద్ధిచేగల్గిన సంతోష ప్రసంగము. భగవాన్ పురాణపురుషో నారాయణస్స్వయం మంగలమాశాస్తే యని యితోऽధిక మంగళావాప్తిచే భాషణము.

11. పూర్వభావము : కార్యదృష్ట్యద్భుతప్రాప్తీ పూర్వభావోపగూహనే. ఇష్టకార్యసందర్శనము పూర్వభావము. క్రోధాంధై స్సకలమ్— (6-48) అనుచో కార్యదృష్టిచే పూర్వభావము.

12. ఉపగూహనము : ఆశ్చర్యమునుబొందుట యుపగూహనము. కథం చార్వాకేణ రక్షసా వయమేవం విప్రలబ్ధాః అని ధర్మజుఁడు భీమమరణ వృత్తాంతమును పేర్కొన్న రాక్షసుని యత్నము మోసముగాఁ దెలియుటలో నద్భుతప్రాప్తివలన నుపగూహనము.

13. కావ్యసంహారము : వరాప్తిః కావ్యసంహారమ్. కావ్యార్థసిద్ధి కావ్యసంహారము. 'కి మస్మాత్పరం సంపాదయామి' యనుచో కావ్యార్థము సిద్ధమైనట్లు చెప్పుటచే కావ్యసంహారము.

14. ప్రశస్తి : ప్రశస్తి శ్శుభాశంసనమ్. శుభమును గోరుట ప్రశస్తి. అకృపణమరుక్రాన్తమ్ అనుచో శుభాశంసనము ప్రశస్తి.

(సంధ్యంగ సమన్వయమున మతభేదములుగాననగు నవియట నట గుర్తింపఁదగును)

7. సంధ్యంతరములు : ఈ పంచసంధులకంటె వేఱుగా నింకను 21 సంధులను గొందఱు పేర్కొనిరి. [1]దశరూపక మివి సంధ్యంగములందే యంతర్భవించుననుటను సింగభూపాలుఁడు తిరస్కరించి నాటకమున నివి ప్రత్యేకముగా నుండవలెననెను. [2]సామదానభేదదండాదులగు నీ 21 సంధ్యంతరముల నాయవి వేణీసంహారమునం దాలంకారికులు గుర్తించిరి. అవి యట గమనింపఁదగు (ఉదా. వధ — రసా 3.86, భ్రాంతి. రసా. 3.90. భయము, లజ్జ శృంగార. 500 పుట మొ॥వి.)

8. (అ) భూషణములు : గుణాలంకారబహుళమగు భాషణమె భూషణము. [3]భూషణాదులగు 36 భూషణములతో కావ్యవస్తువు నలంకరింపవలెను. (శృంగార

---

[1] రసా. 3.95, 96

[2] రసా. 3.92, 93

[3] శరీరం వస్త్వలంకుర్యాత్ షట్త్రింశద్భూషణైః స్ఫుటమ్ (రసా. 3.98)

ప్రకాశ మింకనుగొన్ని పేర్కొన్నది. కాకువు వేణీ—1.7, వికత్థనము వేణీ—5—27. మొ॥) వీని నాయెడల నాలంకారికులు వేణీనుండి చూపిరి. (ఉదా. అనునయము రస. 3.119, సారూప్యము రసా. 3.123, దృష్టాంతము శృంగార 531 పుట, భ్రంశము శృంగార 535 పుట, దిష్టము: సా.ద. 6.450. అర్థాపత్తి సా.ద. 6.471, గర్హణము, అన్వేషణము సాదృశ్యములు సా.ద. లోఁ (జూడుడు)

8. (అ) **నాట్యాలంకారములు** : సాహిత్యదర్పణమున ఆక్రందము (6.484), విసర్పము (497), సాహాయ్యము (504) అభిమానము (505), ప్రవర్తకము (511) పూర్వవృత్తోక్తి (512), యుక్తి (513) అను మొదలగు నాట్యాలంకారములు వేణీనుండి ఉదాహరింపఁబడినవి. అవి యట గమనింపఁదగు.

9. **వృత్తులు** : చతుర్విధవృత్తులు నాటకమునందుఁ బ్రయోగింపవలసినవి. [1]శృంగారమున కైశికి, వీరమున సాత్త్వతి, రౌద్రభీభత్సములం దారభటి, అన్ని రసముల భారతి వానివానియంగములతో నుపయోగింపఁదగును. సాత్వత్యంగమగు ప్రవర్తకము సా.ద. 6.428. వేణినుండి యుదాహరింపఁబడినది. వీరరస ప్రధానమగు వేణియందు ఉద్ఘాత్యకము, సంఘాత్యము, సంలాపము, ప్రవర్తక మను నాల్గుసాత్వత్యంగములు నాట్యవేదము (తెలుగు) ద్వితీయభాగము పుటలు 480, 481 లో గమనింపఁదగును.

10. **లాస్యాంగములు** : [2]గేయపదాదులగు లాస్యాంగములును నాటకమునం దుపయుక్తములగును.

---

[1] శృంగారే కైశికీ వీరే సాత్వత్యారభటీ పునః
రసే రౌద్రే చ భీభత్సే వృత్తిస్సర్వత్ర భారతీ (సా.ద. 6.414)

[2] దశ 3.53

**11. పతాకాస్థానకములు :** [1]ఒక ప్రయోజనమునుద్దేశించి చెప్పినచోట నాగంతుకభావముచే వేఱొకయర్థము స్ఫురింపఁజేయుచో నది పతాకాస్థానకము. ఉపచారము, శ్లిష్టము శ్లిష్టోత్తరము తుల్యవిశేషణము నని యిది నాల్గువిధములు.

[2]వేణిలో సత్పక్షాః (1–6) అనుచో రక్త మొదలగు శబ్దములకు నెత్తుటి శరీరము మొదలుగా శ్లేషతో బీజార్థము ప్రతిపాదింపఁబడుటచే నాయకునకు శుభమును సూచించుచునిది శ్లిష్టపతాకాస్థానక మగును.

[3]దుర్యోధనుఁడు 'మమోరుదేశేషు' అన్నవెంటనే కంచుకి 'దేవ భగ్నమ్'— అనుటమొదలుగాఁ జేసిన సంభాషణములో దుర్యోధనుఁడు తనకు ఊరుభంగముగానెంచి సమాధానము చెప్పుటలో శ్లిష్టోత్తరమను పతాకాస్థానకము.

**12. అర్థోపక్షేపకములు :** రూపకములందు వస్తువు సూచ్యము అసూచ్యము అని రెండువిధములు. రసహీనమును అనుచితమునైనది సూచ్యము.[4] యుద్ధము వధ భోజనము మొదలగునవి ప్రదర్శింపరాదు. కావున నట్టివి సూచ్యములు. సూచ్యమును [5]విష్కంభము, ప్రవేశకము, చూళిక, అంకాస్యము, అంకావతారము అనునయిదు అర్థోపక్షేపకములతో సూచింపవచ్చును.

**1.** విష్కంభము : [6]జరిగినది జరుగఁబోవునది యయిన వస్తువును సంక్షేపముగా నొకటి లేక రెండు పాత్రలచే సూచించుట విష్కంభము. కేవలము

---

[1] యత్రార్థే చింతితేఽన్యస్మిం స్తల్లింగోఽన్యః ప్రయుజ్యతే
ఆగంతుకేన భావేన పతాకాస్థానకం తు తత్ (సా.ద. 6.302)

[2] సా.ద. 6.304,

[3] సా.ద. 6.305.

[4] నీరసోఽనుచిత స్తత్ర సంసూచ్యో వస్తువి స్తరః. దశ.

[5] దశ. 1.58.

[6] వృత్తవ ర్తిష్యమాణానాం కథాంశానాం నిదర్శకః
సంక్షేపార్థస్తు విష్కంభో మధ్యపాత్రప్రయోజితః (దశ. 1.59)

సంస్కృతములో మాటాడు మధ్యమపాత్రలచే కూర్పఁబడినది శుద్ధ విష్కంభము. సంస్కృత (శౌరసేనీ) ప్రాకృతములు మాటాడు మధ్యమ నీచపాత్రలతో కూర్పబడినది మిశ్రవిష్కంభము.

2. ప్రవేశకము : [1]కేవల నీచపాత్రలచే ప్రయుక్తమగుచు విష్కంభమువలె నుండునది ప్రవేశకము. ఇందు (శౌరసేనీతర) ప్రాకృతమె ప్రయోగింపఁబడును. ఇది రెండంకములనడుమ మాత్రమే ప్రయోగింపవలెను. అనఁగా మొదటియంకమున ప్రవేశకముండరాదు.

వేణిలో తృతీయాంకము మొదట, నీచపాత్రలగు రాక్షసమిథునముతో ప్రవేశకము కూర్పబడినది. ఇందు ఘటోత్కచవధాదికము జరిగిన కథయు దుశ్శాసనరుధిరపానాదులగు భవిష్యద్వృత్తాంతమును సూచింపఁబడినవి.

3. చూళిక : [2]తెరలోని పాత్రలచే కథార్థము సూచింపఁబడిన నది చూళిక. పంచమాంకములో కర్ణరహితముగా శల్యుడు రథమును శిబిరమునకుఁ గొనిపోవుట నేపథ్యమందలిపాత్రచే చెప్పఁబడినది.

[3]రంగస్థలముననున్న పాత్రలు తెరలోని పాత్రతో సంభాషించుట ఖండచూళికయను భేదముగొందరుచెప్పిరి. ఇది కేవలమంకము మొదటే ప్రయుక్తముగావలెను.

4. అంకాస్యము : పూర్వాంకము చివరిపాత్రలచేఁ దరువాతియంకపు ప్రారంభకథ సూచింపఁబడుచో నది యంకాస్యము.[4]

---

[1] ప్రవేశకోఽనుదాత్తోక్త్యా నీచపాత్రప్రయోజితః
అంకద్వయస్యాంతర్విజ్ఞేయః శేషం విష్కంభకో యథా (సా.ద. 6.313)

[2] అంతర్జవనికాసంస్థైః చూళికార్థస్య సూచనా (దశ. 1.61)

[3] రసా. 3.189.

[4] అంకాంతపాత్రైః రంకాస్యం ఛిన్నాంకస్యార్థసూచనాత్ (దశ. 1.62)

వేణిలో చతుర్థాంకము చివర దుర్యోధనుఁడు తల్లిదండ్రులను సమాశ్వాసించుట ప్రస్తావింపఁబడినచోట 'తథాప్యవశ్యం వన్దనీయా గూరూ' అన్నట్లుగనె పంచమాంకము గాంధారీధృతరాష్ట్రుల ప్రవేశముతో నట్టి కథాప్రసంగముతో నుండుట నంకాస్యము.

5. అంకావతారము : పూర్వాంకము చివరనున్న పాత్రలె యసూచితములై తరువాతియంకము మొదట ప్రవేశించి కథనడపుట యంకావతారము.[1]

'అసూచ్య' మగు వస్తువు దృశ్యము, శ్రవ్యమువని రెండు విధములు. [2]మధురోదాత్తరసనిరంతరమైనది దృశ్యము. కాగా స్వగతము ప్రకాశమునని శ్రవ్యము రెండువిధములు.

1. స్వగతము : [3]స్వగతం స్వైకవిజ్ఞేయమ్. (తానుమాత్రమె తెలియఁదగినది. ఇతరులకుఁదెలియఁగూడనిది) 6వ అంకమున పాండవనాశన లక్ష్య మితరులెఱుఁగరానిది కావున నట్టి సందర్భమున చార్వాకుని పల్కులు స్వగతములు.

2. ప్రకాశము : [4]సర్వశ్రావ్యం ప్రకాశమ్ (దశ. 1.65) అందఱకుఁ దెలియఁదగినది. ఇది ప్రసిద్ధమే.

కొందఱకు మాత్రము తెలియఁదగినది (నియతశ్రావ్యము) ప్రకాశములో భేదముగాఁ గొందఱు చెప్పిరి. [5]ఇది జనాంతికము అపవారితము అని రెండు విధములు. రంగస్థలమునందలి కొన్నిపాత్రలకు వినబడకుండునట్లుగా, ప్రేక్షకులకు తెలియునట్లు త్రిపతాకముద్రతో

---

1 అంకావతార స్త్వంకాంతే పాతోంకస్యావిభాగతః (దశ. 1 62)

2 దృశ్యస్తు మధురోదాత్తరసనిరంతరః (దశ. 1.58)

3 రసా. 3.207

4 దశ. 1.65

5 రసా. 3.206

పరస్పరముచేయు భాషణము జనాంతికము.[1] ఇతరులను బరాఙ్ముఖులను జేసి రహస్యమును జెప్పుట యపవారితము. రంగమున మరొకపాత్ర లేకుండ 'ఏమనుచున్నావు' అనుచు చెప్పకుండఁగనె వినినట్లు మాట్లాడుట 'యాకాశభాషితము'[2]. ద్వితీయాంకమున కంచుకి ఆకాశమునుజూచి 'విహంగికే—యని భానుమతిరాకనుగూర్చి యడిగి —కిం కథయసి' యనుచు భానుమతిరాక చెప్పినట్లు గ్రహించె నది యాకాశభాషితము.

**అంకము** : అసూచ్యమగువస్తు వంకములయందు విస్తరింపఁబడును. (రసా. 3–205) వస్తురసాదుల కాశ్రయమగుట (తల్లియంకమువలె) నంకమని యందురు.[3] 1. అంకమునందలి వస్తువు ఒకేరోజు జరిగినదై యుండవలయును. 2. ఒకప్రయోజనమునకు సంబంధించినది కావలెను. 3. నాయకుఁడాసన్నుఁడై యుండవలెను. 4. మూఁడు నాలుగు పాత్రలుండవలెను. అనగా నధికపాత్రలు తగదు. 5. అంకముచివర పాత్రలన్నియు నిర్గమింపఁవలెను.[4] 6. బిందుబీజములుండవలయును. 7. కాలావస్థలనుబట్టి యంకము ముగింపవలయును[5].

---

[1] త్రిపతాకాకరేణాన్యా నపవార్యాంతరా కథామ్
అన్యోన్యామంత్రణం యత్ స్యాజ్జనాన్తే తజ్జనాన్తికమ్ (దశ. 1.65)

[2] కిం బ్రవీష్యేవ మిత్యాదినా వినా పాత్రం బ్రవీతి యత్
శ్రుత్వేవానుక్త మప్యేక స్తదాకాశభాషితమ్ (దశ. 1.67)

[3] రసా. 3.203

[4] ఏకాహాచరితైకార్థ మిత్థ మాసన్ననాయకమ్।
పాత్రైస్త్రిచతురై రంకం తేషా మంత్యే తు నిర్గమః (దశ. 3.36)
పతాకాస్థానకాన్యబిందు రంతే చ బీజవత్ (దశ. 3.37)

[5] అంకచ్ఛేదశ్చ కర్తవ్యః కాలావస్థానురోధతః (రసా. 3.211)

ఇంకను రసనాయకవస్తూత్కర్షకై గర్భాంకమునుగూర్చుట[1] మొదలగు వాని నాలంకారికులు పేర్కొనిరి.

ఇట్టిలక్షణములుగల యంకములు [2]అయిదింటికి తగ్గక, పదిటికి మించక నాటకమునం దుండవలయును. వేణీసంహారము ఆరు అంకముల నాటకము.

**13. నిర్వహణసంధియం దద్భుతము :** చార్వాకరాక్షసునిచే భీమమరణ కల్పనము దానివలన ద్రౌపదీధర్మరాజుల ప్రాణత్యాగప్రయత్నాదులతో నిర్వహణసంధియం దద్భుతము కూర్పఁబడినది.

**14. త్రివర్గదము :** కౌరవుల వినాశము, ధర్మరాజు పట్టాభిషేకమువలన నీ నాటకము ధర్మోపదేశకమై త్రివర్గదము కావలయుట యను లక్షణమును సాధించినది.

వేణీసంహారమునందు నాట్యలక్షణముల నింకను విపులముగను మతభేదములతోఁగూడ నాట్యాలంకారగ్రంథములందు గమనింపఁదగును.

—o—

[1] రసా. 3.213 మొ॥వి

[2] పంచాంక మేత దవరం దశాంకం నాటకం పరమ్ దశ. 3

# వేణీసంహారనాటకమ్

## నాన్ది

నిషిద్ధైరప్యేభిర్లులిత మకరందో మధుకరైః
కరైరిందో రంతశ్ఛురిత ఇవ సంభిన్న ముకుళః।
విధత్తాం సిద్ధిం నో నయనసుభగా మస్య సదసః
ప్రకీర్ణః పుష్పాణాం హరిచరణయో రంజలి రయమ్॥

---

నిషిద్ధైరితి :— నిషిద్ధైః, అపి, ఏభిః, మధుకరైః, లులితమకరందః; ఇందోః, కరైః, అంతశ్ఛురితః, ఇవ, సంభిన్నముకుళః; హరిచరణయోః, ప్రకీర్ణః, అయమ్, పుష్పాణామ్, అంజలిః; అస్య, సదసః, నయనసుభగామ్, సిద్ధిమ్, నః, విధత్తామ్.

**అర్థము** :— నిషిద్ధైఃఅపి = నివారింపబడినవయినప్పటికిని, ఏభిః=ఈ వచ్చిపడుచున్న, మధుకరైః=తుమ్మెదలచే, లులిత=విరజిమ్మబడిన, మకరందః= పూదేనె కల్గినదియు; ఇందోః=చంద్రునియొక్క, కరైః=కిరణములతో, అంతశ్ఛురితః ఇవ=నడిమిభాగమున గ్రుచ్చబడినదో అన్నట్లు, సంభిన్న=విచ్చుకొనిన, ముకుళః=మొగ్గలు కలదియు; చంద్రకిరణముల తాకిడితో అప్పటికి పూర్తిగా వికసించిన మొగ్గలు కలదియనుట, హరిచరణయోః=విష్ణుపాదములయందు, ప్రకీర్ణః=వెదజల్లబడినదియునైన, అయమ్=ఈ, పుష్పాణామ్=పువ్వులయొక్క, అంజలిః=దోసిలి (నమస్కృతి), అస్య=ఈ (ముందున్న) సదసః=సభకు, (ప్రేక్షకులకు), నయనసుభగామ్=కన్నులపండువు సేయు, సిద్ధిమ్=సిద్ధిని— అభినయసాఫల్యమునసుట, నః=మాకు (నటులకు), విధత్తామ్=ప్రసాదించుగాక!

అపి చ

**కాళింద్యాః పులినేషు కేలికుపితా ముత్సృజ్య రాసే రసం**
**గచ్ఛంతీ మనుగచ్ఛతోఽశ్రుకలుషాం కంసద్విషో రాధికాం।**

---

సమాసములు :— లులితః మకరందః యస్మిన్ సః. సంభిన్నాః ముకులాః యస్మిన్ సః. నయనయోః సుభగా-తామ్. హరేః చరణౌ-తయోః.

సంధులు — నిషిద్ధైః+అపి, ఏభిః+లులిత, కరైః+ఇందోః+అంతః, హరిచరణయోః+అంజలిః+అయమ్-రేఫాదేశ విసర్గసంధి. అపి+ఏభిః-యణాదేశ సంధి. సః+నయన - మకరందః+మధుకరైః - ఉత్వాదేశవిసర్గ. ఛురితః+ఇవ-విసర్గలోప. అంతః+ఛురిత - శాదేశవిసర్గసంధి.

క్రియ :— డుధాఞ్ ధారణపోషణయోః, ఆత్మనే, లోట్, ప్రథమ
ధత్తామ్ - దధాతామ్ - దధతామ్

ఛందస్సు - రసై రుద్రైశ్ఛిన్నా యమనసభలాగః శిఖరిణీ

| IUU | UUU | III | IIU | UII | IU |
|---|---|---|---|---|---|
| నిషిద్ధై | రప్యేభి | ర్లులిత | మకరం | దోమధు | కరైః |
| య | మ | న | స | భ | లగ |

**అపిచేతి** :— అపిచ=మరియు—

కాలింద్యా ఇతి :— కాళింద్యాః, పులినేషు, కేలికుపితామ్, రాసే, రసమ్, ఉత్సృజ్య, గచ్ఛంతీమ్, అశ్రుకలుషామ్, రాధికామ్, అనుగచ్ఛతః, తత్పాదప్రతిమా నివేశిత పదస్య, ఉద్భూతరోమోద్గతేః, ప్రసన్నదయితాదృష్టస్య, కంసద్విషః, అక్షుణ్ణః, అనునయః, వః, పుష్ణాతు.

అర్థము :- కాళింద్యాః=యమునానదియొక్క, పులినేషు=ఇసుకతిన్నెల యందు, కేలికుపితామ్=ఆటగా అలిగినదియు-పొలయల్క వహించినదనుట, (కేళియందు కోపించినది అనికాని); రాసే=రాసక్రీడయందు, రసమ్=అనురక్తిని, ఉత్సృజ్య=విడిచి, గచ్ఛంతీమ్=పోవుచున్నదియు, అశ్రు=కన్నీటితో, కలుషామ్=

**తత్పాదప్రతిమా నివేశిత పదస్యోద్భూతరోమోద్గతే**
**రక్షుణ్ణోఽనునయః ప్రసన్నదయితా దృష్టస్య పుష్ణాతు వః॥ 2**

**అపిచ**

**దృష్టస్స్రేషు దేవ్యా కిమిదమితి భయాత్ సంభ్రమాచ్చాసురీభిః**
**శాంతాంతస్తత్త్వసారై స్సకరుణమృషిభి ర్విష్ణునా సస్మితమ్।**

---

మలినమయినదియు - ఏడ్చుచున్నదియునైన, రాధికామ్=రాధను, అనుగచ్ఛతః= వెంబడించుచున్నవాడును, తత్=రాధయొక్క, పాదప్రతిమా=అడుగుజాడల యందు, నివేశిత=ఉంచబడిన లేక వేయబడిన, పదస్య=పాదములు కలవాడును, ఉద్భూత=(అందుచే) ఉత్పన్నమయిన, రోమోద్గతేః=పులకలు కలవాడును, ప్రసన్న=అలుకవీడి ప్రసన్నురాలయిన, దయితా=ప్రేయసి రాధతో, దృష్టస్య= వీక్షింపబడినవాడును అయిన, కంసద్విషః=శ్రీకృష్ణునియొక్క, అక్షుణ్ణః=సఫల మయిన, అనునయః=వేడికోలు, వః=మనలను, పుష్ణాతు=పరిపోషించుగాక! (శార్దూలము)

సమాసములు :- కేశిషు కుపితా - తామ్. అశ్రుభిః కలుషా-తామ్. కంసస్య ద్విట్-తస్య. తస్యాః పాదౌ-తత్పాదయోః ప్రతిమాః-తత్పాదప్రతిమాసు నివేశితాని పదాని యేన సః-తస్య. రోమ్ణామ్ ఉద్గతిః-ఉద్భూతా రోమోద్గతిః యస్య సః-తస్య. ప్రసన్నా చ సా దయితా చ-ప్రసన్నదయితయా దృష్టః-తస్య.

సంధులు :- అనుగచ్ఛతః+అశ్రు, అక్షుణ్ణః+అనునయ-ఉత్త్వాదేశ విసర్గ - అనుగచ్ఛతో+అశ్రు, అక్షుణ్ణో+అనునయః - పూర్వరూప. ద్విషః+ రాధికామ్ - ఉత్త్వాదేశవిసర్గ. పదస్య+ఉద్భూత, రోమ+ఉద్గతేః—గుణసంధి. ఉద్గతేః+అక్షుణ్ణ—రేఫాదేశవిసర్గసంధి.

క్రియ :- పుష పుష్టౌ, పరస్మై, లోట్, ప్రథమ
పుష్ణాతు | పుష్ణీతాత్— పుష్ణీతామ్—పుష్ణన్తు.

**అపిచేతి :-** అపిచ=మరియు

**దృష్ట ఇతి :-** మయపురదహనే, దేవ్యా, సస్రేషు, దృష్టః, అసురీభిః

ఆకృష్యాస్త్రం సగర్వై రుపశమితవధూ సంభ్రమై ర్దైత్యవీరైః
సానందం దేవతాభి ర్మయపురదహనే ధూర్జటిః పాతు యుష్మాన్॥ 3

ఇదమ్, కిమ్, ఇతి, భయాత్, చ, సంభ్రమాత్ (దృష్టః); శాంతాంతస్తత్త్వసారైః, ఋషిభిః, సకరుణమ్ (దృష్టః), విష్ణునా, సస్మితమ్, (దృష్టః); ఉపశమితవధూసంభ్రమైః, సగర్వైః, దైత్యవీరైః, అస్త్రమ్, ఆకృష్య, (దృష్టః), దేవతాభిః, సానందమ్, (దృష్టః), ధూర్జటిః, యుష్మాన్, పాతు.

అర్థము :- మయ=మయుడను రాక్షసునిచే నిర్మితములైన, పుర=త్రిపురములను, దహనే=కాల్చు సమయమునందు, దేవ్యా=పార్వతీదేవితో, సప్రేమ=సానురాగముగా, దృష్టః=వీక్షింపబడినవాడును, అసురీభిః=రాక్షసాంగనలచేత, ఇదమ్=ఇది, కిమ్ ఇతి=ఏమీ అని, భయాత్=భయమువల్లను, చ=మరియు, సంభ్రమాత్=ఉద్వేగమువలనను, దృష్టః=తిలకింపబడినవాడును, శాంత=ఉపశమించిన, అంతస్తత్త్వ=అంతరంగ స్వభావమునునట్టి, సారైః=ధనముకలవారైన, ఋషిభిః=మునులతో, సకరుణమ్=జాలిగా, దృష్టః=అవలోకింపబడినవాడును, విష్ణునా=నారాయణునిచేత, సస్మితమ్=చిఱునవ్వుతో, దృష్టః=ఆలోకింపబడినవాడును, ఉపశమిత=శాంతిపొందింపబడిన, వధూ=స్త్రీలయొక్క, ఉద్వేగైః=సంభ్రమముకలవారును, సగర్వైః=గర్వముతోకూడినవారునైన, దైత్యవీరైః=రాక్షసవీరులతో, అస్త్రమ్=ధనుస్సు, ఆకృష్య=ఎక్కుపెట్టి, దృష్టః=చూడబడినవాడును, దేవతాభిః=దేవతలతో, సానందమ్=ఆనందముగా, దృష్టః=విలోకింపబడినవాడును అయిన, ధూర్జటిః=శివుడు, యుష్మాన్=మిమ్ము, పాతు=రక్షించుగాక!

సమాసములు :- ప్రేమ్ణా సహితం యథా భవతి తథా-సప్రేమ. శాంతం చ తత్ అంతస్తత్త్వం చ-శాంతాంతస్తత్త్వమేవ సారః యేషాం తే-తైః. కరుణేన సహితమ్. స్మితేన సహితమ్. గర్వేణ సహితైః. వధూనాం సంభ్రమః - ఉపశమితః వధూసంభ్రమః యైః తైః. దైత్యానాం వీరాః - తైః. ఆనందేన సహితం యథా భవతి తథా. మయేన నిర్మితాని పురాణి - (మధ్యమపదలోపి) - మయపురాణాం దహనమ్-తస్మిన్.

(నాంద్యంతే)

సూత్రధారః : అలమతి ప్రసంగేణ

శ్రవణాంజలి పుటపేయం, విరచితవాన్ భారతాఖ్యమమృతం యః।
తమహ మరాగ మకృష్ణం, కృష్ణద్వైపాయనం వందే॥ 4

సంధులు :— సంభ్రమాత్+చ—శ్చుత్వసంధి. ఆకృష్య+అస్త్రమ్, చ+అసురీభిః—సవర్ణదీర్ఘ. అంతః+తత్త్వ, సాస్రైః+సకరుణమ్–సాదేశవిసర్గ. సగర్వైః+ఉపశమిత, ఋషిభిః+విష్ణునా, సంభ్రమైః+దైత్య, దేవతాభిః+మయ పుర—రేఫాదేశవిసర్గ సంధులు.

క్రియ :- పా రక్షణే, పరస్మై, లోట్, ప్రథమ
పాతు | పాతాత్—పాతామ్—పాన్తు

ఛందస్సు :- మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిమునియతియుతా స్రగ్ధరా కీర్తితేయమ్.

| UUU, | UIU | UII | III | IUU | IUU | IUU |
|---|---|---|---|---|---|---|
| దృష్టస్స | ప్రేమదే | వ్యాకిమి | దమితి | భయాత్సం | భ్రమాచ్చా | సురీభిః |
| మ | ర | భ | న | య | య | య |

(నాంద్యంతే=నాంది ముగిసిన పిమ్మట)

అలమితి :- అతిప్రసంగేణ=అధిక ప్రసంగముతో, అలమ్=చాలును, అతిప్రసంగ మనవసర మనుట.

శ్లోకే :- యః, శ్రవణాంజలిపుటపేయమ్, భారతాఖ్యమ్, అమృతమ్, విరచితవాన్, తమ్, అరాగమ్, అకృష్ణమ్, కృష్ణద్వైపాయనమ్, అహమ్, వందే.

అర్థము :- యః=ఏ వ్యక్తి, శ్రవణ=చెవులు అనునట్టి, అంజలిపుట=దోసిళులతో, పేయమ్=త్రాగదగిన, భారతాఖ్యమ్=భారతమను పేరుగల, అమృతమ్=సుధను, విరచితవాన్=సంతరించెనో, తమ్=ఆ, అరాగమ్=రాగరహితుడును, అకృష్ణమ్=కల్మషరహితుడునైన, కృష్ణద్వైపాయనమ్=వ్యాసుని, అహమ్=నేను, వందే=నమస్కరించుచున్నాను.

(సమంతాదవలోక్య) తత్రభవతః పరిషదగ్రేసరాన్ విజ్ఞాప్యం నః కించిదస్తి-

కుసుమాంజలిరపర ఇవ ప్రకీర్యతే కావ్యబంధ ఏషోఽత్ర।
మధులిహ ఇవ మధుబిందూన్ విరలానపి భజత గుణలేశాన్॥ 5

---

సమాసములు :- అంజలేః పుటమ్—శ్రవణమేవ. అంజలిపుటమ్-పుటేన పేయమ్. భారతమితి ఆఖ్యా యస్య తత్. న విద్యతే రాగః యస్య సః-తమ్. న కృష్ణః-తమ్. ద్వీపమ్ అయనమ్ యస్య సః - ద్వీపాయన ఏవ ద్వైపాయనః-కృష్ణశ్చ అసౌ ద్వైపాయనశ్చ - తమ్.

క్రియ :- వదిజ్ అభివాదనస్తుత్యోః, ఆత్మనే, లట్, ఉత్తమ.
వందే—వందావహే—వందామహే

ఛందస్సు :- ఆర్యావృత్తము ఒకటి_మూడు పాదములలో పండ్రెండేసియు, రెండవ పాదమున పదునెనిమిదియు, నాల్గవ పాదమున పదునయిదును మాత్రలుండును. కందపద్యములో రెండవపాదమున ఎనిమిదవ గణమునకు బదులు ఒక గురువు (18 మాత్రలు); నాల్గవ పాదమున ఆరవ గణమునకు బదులు ఒక లఘువుంచి ఎనిమిదవ గణమునకు బదులు గురువు నిల్పినచో (15 మాత్రలు) అది ఆర్య అగును. తక్కినవి కందపద్య నియమములే.

తత్రేతి :- (సమంతాత్ అవలోక్య=అన్ని వైపులకు చూచి) తత్ర భవతః=గౌరవింపదగినవారైన, పరిషత్ అగ్రేసరాన్=సభాప్రముఖులనుద్దేశించి, విజ్ఞాప్యమ్=విన్నవింపదగినది, నః=మాకు, కించిత్ అస్తి= కొంచెము ఉన్నది.

కుసుమేతి :- ఏషః, కావ్యబంధః, అపరః, కుసుమాంజలిః, ఇవ, అత్ర, ప్రకీర్యతే, మధులిహః, మధుబిందూన్, ఇవ, విరలాన్, అపి, గుణలేశాన్, భజత.

అర్థము :- ఏషః=ఈ (ప్రదర్శింపబోవుచున్న), కావ్యబంధః=దృశ్యకావ్యము, అపరః=మరియొక, కుసుమాంజలిః ఇవ=పుష్పాంజలివలె, అత్ర= ఇచ్చట (సభయందు), ప్రకీర్యతే_వెదజల్లబడుచున్నది; మధులిహః=తుమ్మెదలు,

**తదిదం కవేర్మృగరాజ లక్ష్మణో భట్టనారాయణస్య కృతిం వేణీ సంహారం నామ నాటకం ప్రయోక్తు ముద్యతా వయమ్. తదత్ర కవి పరిశ్రమానురోధాద్వా ఉదాత్త కథావస్తు గౌరవాద్వా నవ నాటక దర్శన కుతూహలాద్వా భవద్భిరవధానం దీయమాన మభ్యర్థయే.**

---

మధుబిందూన్ ఇవ=మకరందకణములనువలె, విరలాన్ అపి=చెదురుమదురుగా నున్నప్పటికిని, గుణలేశాన్=చిన్న చిన్న గుణములను (కావ్య సౌందర్య హేతువులను), భజత=దయచేసి గ్రహింపుడు.

సమాసములు :- కుసుమానామ్ అంజలిః. కావ్యమేవ బంధః. మధు లేఢి ఇతి - మధులిట్ - తే. మధునః బిందుః - తాన్. గుణస్య లేశః - తాన్.

సంధులు :- కుసుమ+అంజలిః—సవర్ణదీర్ఘ. అంజలిః+అపరః— రేఫాదేశవిసర్గ. బంధః+ఏషః, అపరః+ఇవ, మధులిహః+ఇవ—విసర్గలోప సంధి. ఏషః+అత్ర—ఉత్వాదేశవిసర్గ. ఏషో+అత్ర—పూర్వరూపసంధి.

క్రియ :- కౄ విక్షేపే, కర్మణి, ఆత్మనే, లట్, ప్రథమ
కీర్యతే - కీర్యేతే - కీర్యన్తే

ఛందస్సు :- ఆర్యావృత్తము. యస్యాః పాదే ప్రథమే ద్వాదశమాత్రా స్తథా తృతీయేఽపి; అష్టాదశ ద్వితీయే, చతుర్థకే పంచదశ సాఽఽర్యా॥

తదిత్రి :- తత్=అందుచేత, మృగరాజలక్ష్మణః=సింహబిరుదాంచితుడును కవేః=కవియునైన - కవిసింహమనుట, భట్టనారాయణస్య=భట్టనారాయణుని యొక్క, కృతిమ్=రచనను, వేణీసంహారమ్ నామ=వేణీసంహారమను పేరుగల, ఇదమ్=ఈ, నాటకమ్=దృశ్యకావ్యమును, ప్రయోక్తుమ్=ప్రదర్శించుటకు, వయమ్=మేము, ఉద్యతాః=సన్నద్ధులమైతిమి. తత్=అందుచేత, అత్ర=ఈ ప్రదర్శనమునందు, కవి పరిశ్రమానురోధాత్=కవియొక్క పరిశ్రమపట్లగల ఆదరముతోగాని, వా=లేక, ఉదాత్త కథావస్తు గౌరవాత్=ఉదాత్తమయిన కథపట్ల

(నేపథ్యే)

భావ, త్వర్యతాం త్వర్యతామ్. ఏతే ఖల్వార్య విదురాజ్ఞయా పురుషాః సకలమేవ శైలూషజనం వ్యాహరన్తి-ప్రవర్త్యంతా మపరిహీయమాన మాతోద్య విన్యాసాదికా విధయః. ప్రవేశకాలః కిల తత్రభవతః పారాశర్య నారద తుంబురు జామదగ్న్య ప్రభృతిభి ర్మునిబృందారకై రనుగమ్యమానస్య భరతకుల హితకామ్యయా స్వయం ప్రతిపన్న దౌత్యస్య దేవకీసూనో శ్చక్రపాణే ర్మహారాజ దుర్యోధన శిబిర సన్నివేశం ప్రతి ప్రస్థాతుకామస్య - ఇతి.

---

గల గౌరవముతోగాని, వా=లేక, నవ=క్రొత్తదయిన, నాటక=నాటకముయొక్క, దర్శన=చూచుటయందలి, కుతూహలాత్=ఉత్కంఠతోగాని, భవద్భిః=మీచే (సభ్యులచే), దీయమానమ్=ఈయబడుచున్న, అవధానమ్=ఏకాగ్రతను, అభ్యర్థయే=కోరుచున్నాను - మీరు సావధానచిత్తులరై తిలకింపుడని ప్రార్థన.

(నేపథ్యే=తెరలో)

భావేతి :- భావ=ఓ విద్వాంసుడా! (భావో విద్వాన్—ఇత్యమరః), త్వర్యతామ్=త్వరపడుము, త్వర్యతామ్=త్వరపడుము. ఆర్యవిదుర=ఆదరణీయుడైన విదురునియొక్క, ఆజ్ఞయా=ఆదేశముతో, ఏతే=ఈ, పురుషాః=అధికారులు, సకలమ్ ఏవ=సమస్తమయిన, శైలూషజనమ్=నటీనటసమూహమునుద్దేశించి, వ్యాహరన్తి ఖలు=పలుకుచున్నారు సుమా! -"ఆతోద్య=నాలుగు విధములయిన వాద్యములయొక్క, విన్యాస=ప్రయోగము, ఆదికాః=మొదలుగా కలవయిన, విధయః = విధులన్నియును, అపరిహీయమానమ్ = దోషరహితమగునట్లు, ప్రవర్త్యంతామ్=నిర్వహింపబడుగాక! (తతము—వీణాదికము, ఆనద్ధము—మృదంగాదికము, సుషిరము-మురళీప్రభృతికము, కాంస్యము-తాళాదికము-అను నాలుగు కలిసి ఆతోద్యము-వాదిత్రము అనబడును. తతం వీణాదికం వాద్య మానద్ధం మురజాదికం వంశాదికం తు సుషిరం, కాంస్యం తాళాదికం ఘనం, చతుర్విధ మిదం వాద్యం వాదిత్రాతోద్యనామకమ్-ఇత్యమరః). పారాశర్య=వ్యాసుడు, నారదతుంబురు, జామదగ్న్య=పరశురాముడు, ప్రభృతిభిః=మొదలగు,

సూత్రధారః : (ఆకర్ణ్య సానందమ్) అహో ను ఖలు భో భగవతా జగత్ప్రభవ స్థితి నిరోధ ప్రభవిష్ణునా విష్ణునాద్యాను గృహీతమిదం భరతకులం సకలం చ రాజచక్ర మనయోః కురుపాండవ రాజపుత్రయో రాహవ కల్పాంతానలప్రశమ హేతునా స్వయం సంధికారిణా కంసారిణా దూతేన. తత్కి మితి పారిపార్శ్వక! నారంభ యసి కుశీలవైః సహ సంగీతకమ్.

(ప్రవిశ్య)

పారిపార్శ్వకః : భవతు. ఆరంభయామి. కం సమయ మాశ్రిత్య గీయతామ్.

---

మునిబృందారకైః=ఋషివరేణ్యులతో, అనుగమ్యమానస్య=అనుసరింపబడు చున్నవాడును, భరతకుల=భరత వంశమునకు, హితకామ్యయా=మేలుగూర్చు కోరికతో, స్వయమ్= తనకు తానుగా, ప్రతిపన్న=స్వీకరించిన, దౌత్యస్య= దూతకృత్యము కలవాడును, మహారాజ=రాజరాజయిన, దుర్యోధన=సుయోధనుని యొక్క, శిబిరసన్నివేశమ్ ప్రతి=పట కుటీరమున్న స్థానమునుద్దేశించి, ప్రస్థాతు కామస్య=పోగోరుచున్నవాడును, అయిన, తత్రభవతః=గౌరవింపదగినవాడును, దేవకీ సూనోః=దేవకీ పుత్రుడునయిన, చక్రపాణేః=శ్రీకృష్ణునియొక్క, ప్రవేశ కాలః కిల=ప్రవేశ సమయము గదా! వ్యాసాదులతో కూడి దుర్యోధన శిబిరమునకు దూతగా శ్రీకృష్ణుడు ప్రవేశించుచున్నాడనుట. ఇతి=అని. (పురుషాః వ్యాహ రన్తి తో అన్వయము).

అహో ఇతి :- ఆకర్ణ్య=విని, సానందమ్=ఆనందపడుచు) అహో ను ఖలు భోః=ఓహోహో!, అనయోః=ఈ, కురుపాండవ రాజపుత్రయోః=కౌరవ పాండవులయొక్క, ఆహవ=యుద్ధమనునట్టి, కల్పాంతానల=ప్రళయాగ్నియొక్క, ప్రశమన=శాంతికి, హేతునా=కారణమైనవాడును, స్వయమ్=తనకుతానుగా, సంధికారిణా=పొందొనర్చువాడును, కంసారిణా=కంసద్వేషియును, దూతేన= రాయబారియును, భగవతా=భగవంతుడును, జగత్=ప్రపంచముయొక్క,

**సూత్రధారః :** నన్వమమేవ తావచ్చంద్రాతప నక్షత్ర క్రౌంచ హంస కుల సప్తచ్ఛద కుముద పుండరీక కాశకుసుమ పరాగ ధవళిత గగన దిఙ్మండలం, స్వాదుజల జలాశయం శరత్సమయ మాశ్రిత్య ప్రవర్త్యతాం సంగీతకమ్. తథా హ్యస్యాం శరది—

---

ప్రభవ=పుట్టుకకు, స్థితి=ఉనికికి, నిరోధ=నాశమునకు, ప్రభవిష్ణునా=సమర్థుడు నైన, విష్ణునా=విష్ణుమూర్తిచే, అద్య=ఈనాడు, ఇదమ్=ఈ, భరతకులమ్=భరత వంశము, చ=మరియు, సకలమ్=సమస్తమయిన, రాజచక్రమ్=రాజసమూహమును, అనుగృహీతమ్=అనుగ్రహింపబడినది—దౌత్యము ఫలించి రక్షింపబడుదురనుట. తత్=అందుచేత, పారిపార్శ్వక=ఓ పారిపార్శ్వకుడా!, కుశీలవైః సహ=నేర్పరులైన నటీనటులతో కలిసి, సంగీతకమ్=ఋతుగానమును, న ఆరంభయసి కిమితి=ఇంకను ప్రారంభింపకున్నావేమి!

(ప్రవిశ్య=ప్రవేశించి)

**భవత్వితి :-** భవతు=అగుగాక! ఆరంభయామి=ప్రారంభించుచున్నాను. కమ్=ఏ, సమయమ్=ఋతువును, ఆశ్రిత్య=అవలంబించి, గీయతామ్=గానము చేయబడవలెను?

**నన్వితి :-** నను=ఓయీ! (ప్రశ్నావధారణానుజ్ఞానునయామంత్రణే నను - అని అమరము), చంద్రాతప=వెన్నెలతో, నక్షత్ర=తారలతో, క్రౌంచ=క్రౌంచ పక్షులతో, హంసకుల=అంచల గుంపుతో, సప్తచ్ఛద=ఏడాకుల అరటులయు, కుముద=కలువలయు, పుండరీక=కమలములయు, కాశకుసుమ=రెల్లుపూలయు, పరాగ=ధూళులతో; ధవళిత=పాండురములైన, గగన=ఆకాశము, దిఙ్మండలమ్=దిశాచక్రము కల్గినదియు, స్వాదు=ఆస్వాదయోగ్యమయిన, జల=నీటితో కూడిన, జలాశయమ్=సరస్సులు కల్గినదియును, అయిన, అమమ్=ఈ, శరత్సమయమ్ ఏవ=శరదృతువునే, ఆశ్రిత్య=అవలంబించి, సంగీతకమ్=ఋతుగానము, తావత్ ప్రవర్త్యతామ్=నిర్వహింపబడునుగాక!; తథాహి=అంతేకదా! అస్యామ్=ఈ, శరది=శరత్కాలమునందు—

సత్పక్షా మధురగిరః ప్రసాధితాశా మదోద్ధతారంభాః।
నిపతన్తి ధార్తరాష్ట్రాః కాలవశాన్మేదినీపృష్ఠే॥ 6

పారిపార్శ్వికః : (ససంభ్రమమ్) భావ, శాంతం పాపమ్. ప్రతిహత మమంగళమ్.

---

సత్పక్షా ఇతి :- సత్పక్షాః, మధురగిరః, ప్రసాధితాశాః, మదోద్ధతారంభాః, ధార్తరాష్ట్రాః, కాలవశాత్, మేదినీపృష్ఠే, నిపతన్తి.

అర్థము :- ధార్తరాష్ట్రాః శబ్దమునకు హంసలనియు కౌరవులనియు రెండు అర్థములు. విశేషణములన్నియు రెండింట సమన్వయించును. శరద్వర్ణన ప్రకృతము. కౌరవరూపార్థ మప్రకృతము. సత్పక్షాః=బలిష్ఠమైన రెక్కలు కలవియును (సత్పురుషులైన భీష్మాదులు సహాయకులుగా కల్గినవారును లేక మంచి సైన్యము కలవారును); మధురగిరః=వినసొంపయిన కూజితములు కలవియును (ప్రియభాషణముకలవారును), ప్రసాధిత+ఆశాః = తమచే అలంకరింపబడిన దిక్కులు కలవియును-అన్ని దిక్కులకు నెగురుచు వనుట (ప్ర+సాధిత+ఆశాః- జయింపబడిన దశదిశలు కల్గినవారును లేక కోరికలను సాధించుకొన్నవారును) మద=సంతోషముతో, ఉద్ధత=అతిశయించిన, ఆరంభాః=క్రీడారంభములు కలవియును, (గర్వముతో బెట్టిదములైన పనులు చేసిన వారును) అయిన, ధార్తరాష్ట్రాః=హంసలు (ధృతరాష్ట్ర కుమారులు), కాలవశాత్ = శరత్సమయము కారణముగా, (మృత్యువువలన), మేదినీపృష్ఠే=భూతలమునందు, నిపతన్తి= వ్రాలుచున్నవి (పడుచున్నారు). (ఆర్యావృత్తము).

సమాసములు :- సంతః పక్షాః యేషాం తే - సత్పక్షాః. మధురా గీః యేషాం తే - మధుర గిరః. ప్రసాధితాః ఆశాః యైః తే. మదేన ఉద్ధతాః- మదోద్ధతాః ఆరంభాః యేషాం తే. కాలస్య వశాత్. మేదిన్యాః పృష్ఠమ్-తస్మిన్.

సంధులు :- సత్పక్షాః+మధుర, ఆశాః+మద - విసర్గలోప. మద+ ఉద్ధత - గుణసంధి. ఉద్ధత+ఆరంభ - సవర్ణదీర్ఘ. వశాత్+మేదినీ - అనునాసికాదేశ.

భావేతి : (ససంభ్రమమ్ = సంభ్రమముతో) భావ=ఓ పండితుడా!

సూత్రధారః : (సవైలక్ష్యస్మితమ్) మారిష, శరత్సమయ వర్ణనా శంసయా హంసా ధార్తరాష్ట్రా ఇతి వ్యపదిశ్యంతే. తత్కిం శాంతం పాపం ప్రతిహతమమంగళమ్.

పారిపార్శ్వకః : న ఖలు న జానే. కింత్వమంగళాశంసయాస్య వో వచనస్య యత్ సత్యం కంపితమివ మే హృదయమ్.

సూత్రధారః : మారిష, నను సర్వమేవేదానీం ప్రతిహతమమంగళం స్వయం ప్రతిపన్న దౌత్యేన సంధికారిణా కంసారిణా. తథా హి—

---

శాంతం పాపమ్=పాపము శమించుగాక అమంగళమ్=అశుభము, ప్రతిహతమ్=ప్రతిహతమగుగాక!

మారిషేతి : (సవైలక్ష్యస్మితమ్ = సిగ్గుతో కూడిన చిరునవ్వుతో) మారిష=ఓ ఆర్యుడా! (ఆర్యస్తు మారిషః-అని అమరము), శరత్సమయ=శరదృతువును, వర్ణనా=వర్ణించునట్టి, ఆశంసయా=ఆకాంక్షతో, హంసాః=హంసలు, ధార్తరాష్ట్రాః=ధార్తరాష్ట్రములు, ఇతి=అని, వ్యపదిశ్యన్తే=చెప్పబడుచున్నవి. హంసాః అనునర్థమున ధార్తరాష్ట్రాః అంటినను. తత్=అందుచేత, శాంతం పాపమ్, ప్రతిహతమమంగళమ్-కిమ్=ఏమి? ఇందు పాపముగాని, అమంగళము గాని ఏమున్నదనుట.

నఖల్వితి : న ఖలు=లేదేమో! న జానే=నేనెరుగను. కిన్తు=కాని, వః=నీయొక్క, అస్య=ఈ, వచనస్య=మాటకు, అమంగళాశంసయా=అశుభాశంకతో, మే=నాయొక్క, హృదయమ్=అంతరంగము, కంపితమ్ ఇవ=వణికిపోయినట్లగుట, యత్=ఏదో, తత్=అది, సత్యమ్=నిక్కము.

**మారిషేతి** :- మారిష=ఓ ఆర్యుడా! నను=వినుము. స్వయమ్=తనకుతానుగా, ప్రతిపన్న=స్వీకరించిన, దౌత్యేన=దూతకృత్యముకలవాడును, సంధికారిణా=పొందొనర్చువాడును, అయిన, కంసారిణా=శ్రీకృష్ణునిచేత, ఇదానీమ్=ఇప్పుడు, అమంగళమ్=అశుభము, సర్వమ్=అంతయును, ప్రతిహతమ్ ఏవ=తొలగింపబడినదే, తథా హి=అంతేకదా!

నిర్వాణ వైరదహనాః ప్రశమాదరీణాం
నందంతు పాండుతనయాః సహ మాధవేన।
రక్తప్రసాధితభువః క్షతవిగ్రహాశ్చ
స్వస్థా భవంతు కురురాజసుతాః సభృత్యాః॥ 7

---

నిర్వాణేతి :- అరీణాం ప్రశమాత్, నిర్వాణవైరదహనాః, పాండు తనయాః, మాధవేన సహ, నందన్తు; రక్తప్రసాధితభువః, క్షతవిగ్రహాః, కురు రాజసుతాః, చ, సభృత్యాః, స్వస్థాః భవన్తు.

అర్థము :- అరీణామ్=శత్రువులయొక్క, ప్రశమాత్ వినాశమువలన, నిర్వాణ=శాంతినొందిన, వైర=శత్రుత్వమనునట్టి, దహనాః=అగ్నికలవారైన, పాండుతనయాః = ధర్మజాదులు, మాధవేన = శ్రీకృష్ణునితోసహ, నందన్తు= ఆనందింతురుగాక; రక్త=అనురాగముతో, ప్రసాధిత=సాధింపబడిన, భువః= భూమికల్గినవారును, (రక్త=నెత్తుటితో, ప్రసాధిత=అలంకరింపబడిన, భువః= భూమి కల్గినవారును), క్షత=పోగొట్టబడిన, విగ్రహాః=కలహము కల్గినవారును, (క్షత = విరుగగొట్టబడిన, విగ్రహాః = శరీరములుకలవారును), చ=మరియు, సభృత్యాః=పరిజనముతో కూడినవారును, అయిన, కురురాజసుతాః=దుర్యోధ నాదులు, స్వస్థాః=స్వస్థులు (స్వర్గస్థులు), భవన్తు=అగుదురుగాక! –స్వస్థచిత్తులు అగుదురనుట. (స్వః స్థాః).

సమాసములు :- వైరమేవ దహనః–నిర్వాణః వైరదహనః యేషామ్. పాండోః తనయాః. రక్తేన ప్రసాధితా–రక్తప్రసాధితా భూః యేషాం తే. క్షతః విగ్రహః యేషాం తే. కురూణాం రాజా–కురురాజస్య సుతాః. భృత్యైః సహితాః.

సంధులు :- విగ్రహాః+చ–శాదేశవిసర్గ. స్వస్థాః+భవన్తు–విసర్గలోప. ప్రశమాత్+అరీణామ్–జశ్త్వసంధి.

క్రియ : టు నది సమృద్ధౌ–పరస్మై, లోట్, ప్రథమ–భూ సత్తాయామ్.
నందతు/నందతాత్–నందతామ్–నందన్తు
భవతు/భవతాత్–భవతామ్–భవన్తు

(నేపథ్యే సాధిక్షేపమ్)

ఆః! దురాత్మన్, వృథా మంగళపాఠక, శైలూషాపసద!

లాక్షా గృహానల విషాన్నసభా ప్రవేశైః
ప్రాణేషు విత్తనిచయేషు చ నః ప్రహృత్య!
ఆకృష్ట పాండవ వధూ పరిధాన కేశాః
స్వస్థా భవన్తి మయి జీవతి ధార్తరాష్ట్రాః॥ 8

(సూత్రధార పారిపార్శ్వకావాకర్ణయతః)

---

ఛందస్సు :- ఉక్తా వసంతతిలకా తభజా జగౌ గః—వసంతతిలక
నిర్వాణ—వైరిద—హనాః ప్ర—శమాద—రీణామ్
U U I — U I I — I U I — I U I — UU
త — భ — జ — జ — గగ

(నేపథ్యే=తెరలో, సాధిక్షేపమ్=నిందాతిరస్కారపూర్వకముగా)

**ఆ ఇతి** :— ఆః దురాత్మన్ = ఓరీ దుష్టుడా! వృథా మంగళపాఠక= వ్యర్థస్తుతిపాఠకా! శైలూషాపశద=నటాధమా!

**లాక్షేతి** :— లాక్షాగృహానల విషాన్నసభాప్రవేశైః, నః, ప్రాణేషు, చ, విత్తనిచయేషు, చ, ప్రహృత్య, ఆకృష్టపాండవవధూపరిధానకేశాః, ధార్తరాష్ట్రాః, మయి, జీవతి, స్వస్థాః, భవన్తి ఆకృష్య....కేశాన్ అని పాఠాంతరము.

**అర్థము** :— "స్వస్థా భవన్తు కురురాజసుతాః" అను మాటతో ఎవడో కౌరవులకు శుభాకాంక్షలు పలుకుచున్నాడు అని భావించిన భీమసేనుడు నేపథ్యము నుండి గర్జించుచున్నాడు. లాక్షాగృహ=లక్కయింట, అనల=చిచ్చుపెట్టుట, విషాన్న=విషము కలిపిన భోజనము పెట్టుట, సభాప్రవేశైః=కపటద్యూతమాడుట —వీనితో, నః=మమ్ము, ప్రాణేషు=ప్రాణములయందును, చ=మరియు, విత్తనిచయేషు=ధనసమూహమందును, ప్రహృత్య=దెబ్బతీసి, మా ధన ప్రాణములను నష్టపరచియనుట, ఆకృష్ట=తెమల్చిన, పాండవవధూ=ద్రౌపదియొక్క, పరిధాన=వస్త్రము, కేశాః=శిరోజములును కల్గినవారై, ద్రౌపదీ వస్త్రశిరోజములను పట్టి

పారిపార్శ్వకః : భావ, కుత ఏతత్!

సూత్రధారః : (పృష్ఠతో విలోక్య) అయే ఏష ఖలు వాసుదేవ గమనా త్కురుసంధాన మమృష్యమాణః పృథు లలాట తట ఘటిత వికట భ్రుకుటినా దృష్టిపాతేన పిబన్నివ నః సర్వాన్ సహదేవేనానుగమ్యమానః

---

యీడ్చినవారై అనుట, ధార్తరాష్ట్రాః=కౌరవులు, మయి=నేను, జీవతి=జీవించి యుండగా, స్వస్థాః=స్వస్థచిత్తులు, భవన్తి=అగుదురా? కానేకారని కాకుధ్వని. (వసంతతిలక). (....కేశాన్=ద్రౌపదీ వస్త్ర కేశములను, ఆకృష్య=లాగి)

**సమాసములు** :— లాక్షయా రచితం గృహమ్—లాక్షాగృహే అనలః, విషేణ సంపృక్తమన్నమ్. సభాయాం ప్రవేశః. లాక్షాగృహానలశ్చ విషాన్నంచ సభాప్రవేశశ్చ—తైః. విత్తస్య నిచయః—తేషు. పరిధానం చ కేశాశ్చ. పాండవానాం వధూః, పాండవవధ్వాః పరిధానకేశాః_ఆకృష్టాః పాండవ వధూ పరిధాన కేశాః యైః తే.

క్రియ :- భూ సత్తాయామ్, పరస్మై, లట్, ప్రథమ
భవతి—భవతః—భవన్తి.

(సూత్రధార పారిపార్శ్వకులు, ఆకర్ణయతః=వినుటనభినయింతురు)

**భావేతి** :- భావ=ఓ విద్వాంసుడా! ఏతత్=ఈః వినబడుచున్నమాట, కుతః=ఎటనుండి?

**అయే ఇతి** :- (పృష్ఠతః=వెనుకవైపునకు, విలోక్య=చూచి), అయే= ఓయీ! వాసుదేవ గమనాత్ = శ్రీకృష్ణుని సంధియానమువల్లనగు, కురు సంధానమ్ = కౌరవులతోడి పొత్తును, అమృష్యమాణః=అంగీకరింపనివాడును, పృథు=విశాలమయిన, లలాట తట=ఫాలభాగమున, ఘటిత=కూర్చబడిన, వికట= భయంకరమైన, భృకుటినా = బొమముడితోకూడిన, దృష్టిపాతేన=దృష్టిప్రసారముతో, నః=మనలను, సర్వాన్=అందరిని, పిబన్ఇవ=త్రాగివేయుచున్నవాడువలె, సహదేవేన=సహదేవునితో, అనుగమ్యమానః=అనుసరింపబడుచున్న

క్రుద్ధో భీమసేన ఇత ఏవాభివర్తతే. తన్నయుక్తమస్య పురతః స్థాతుమ్. తదితి ఆవామన్యత్ర గచ్ఛావః.
(ఇతి నిష్క్రాంతౌ)

-: ఇతి ప్రస్తావనా :-

---

వాడును, క్రుద్ధః = క్రోధావిష్టుడును అయిన, ఏషః = ఈ (హస్తనిర్దేశముతో చూపుట), భీమసేనః=భీముడు, ఇతఃఏవ=ఇటువైపునకే, అభివర్తతే ఖలు=వచ్చుచున్నాడు సుమా! తత్=అందుచేత, అస్య=ఈతనియొక్క, పురతః=ఎదుట, స్థాతుమ్ = నిల్చుట, న యుక్తమ్ = తగదు. తత్=అందుచేత, ఆవామ్=మనమిరువురమును, ఇతః=ఇటనుండి, అన్యత్ర=వేరొకచోటికి, గచ్ఛావః=పోవుదము. (ఇతి=అని, నిష్క్రాంతౌ=ఇరువురును నిష్క్రమించిరి).

—: ఇది ప్రస్తావన :—

# ప్రథమాఙ్కః

(తతః ప్రవిశతి సహదేవేనానుగమ్యమానః క్రుద్ధో భీమసేనః)

భీమసేనః : ఆః దురాత్మన్. వృథా మంగళపాఠక, శైలూషాపశద, (లాక్షాగృహానల - ఇత్యాది పునః పఠతి).

సహదేవః : (సానునయమ్) ఆర్య మర్షయ మర్షయ. అనుమతమేవ నో భరతపుత్రస్యాస్య వచనమ్. పశ్య-(నిర్వాణ వైర దహనా - ఇతి పఠిత్వా అన్యథా అభినయతి)

భీమసేనః : (సోపాలమ్భమ్) న ఖలు న ఖల్వమంగళాని చింతయితుమర్హాన్తి భవంతః కౌరవాణామ్. సంధేయాస్తే భ్రాతరో యుష్మాకమ్.

---

(తతః=అటుపైని, సహదేవేన=సహదేవునితో, అనుగమ్యమానః=అనుసరింపబడుచున్నవాడై, క్రుద్ధః=క్రోధావిష్టుడైన, భీమసేనః=భీమసేనుడు, ప్రవిశతి=ప్రవేశించును.)

**ఆ ఇతి** :- ఆః దురాత్మన్=ఓరీ దురాత్ముడా!, వృథా మంగళపాఠక=వ్యర్థస్తుతిపాఠకా! శైలూషాపశద=నటాధమా! (లాక్షాగృహానల.. ఈ శ్లోకమును మరల పఠించును).

**ఆర్యేతి** :- (సానునయమ్=బతిమాలుకొనుచు), ఆర్య=మాన్యుడా! (కర్తవ్య మాచరన్ కామ మకర్తవ్య మనాచరన్, తిష్ఠతి ప్రకృతాచారే స తు "ఆర్య" ఇతి స్మృతః), మర్షయ మర్షయ=మన్నింపుము మన్నింపుము. అస్య=ఈ, భరతపుత్రస్య=నటునియొక్క, వచనమ్=మాట, నః=మనకు, అనుమతమ్ ఏవ=అంగీకరింపదగినదే. పశ్య=చూడుము, (నిర్వాణవైరదహనాః..అను శ్లోకమును, పఠిత్వా=చదివి, అన్యథా=వేరొకవిధముగా, అభినయతి=అభినయించును, స్వస్థాః అనుమాటను స్వర్గస్థులగుదురుగాక అనునర్థము వచ్చునట్లు చదివి అభినయించుననుట).

**నఖల్వితి** :- (సోపాలంభమ్=వెక్కిరింపుగా), కౌరవాణామ్=కౌరవు

సహదేవః : (సరోషమ్) ఆర్య—

ధృతరాష్ట్రస్య తనయాన్ కృతవైరాన్ పదే పదే
రాజా న చేన్నిషేద్ధా స్యాత్కః క్షమేత తవానుజః॥ 9

భీమసేనః : (సరోషమ్) ఏవమిదమ్ అత ఏవాహ మద్యప్రభృతి భిన్నో భవద్భ్యః, పశ్య—

లకు, అమంగళాని=అశుభములను, చింతయితుమ్=ఆలోచించుటకు, (చేయుటకు కాదు), భవంతః=మీరు, నఖలు నఖలు అర్హన్తి=తగనే తగరు సుమా!, తే=ఆ, భ్రాతరః=సోదరులు—కౌరవులు, యుష్మాకమ్=మీకు, సంధేయాః=సంధి చేసికొన దగినవారు—మీ దృష్టిలో వారు సంధికి అర్హులు—అనుట.

ఆర్యేతి :- (సరోషమ్=క్రోధముతో), ఆర్య=మాన్యుడా!

ధృతరాష్ట్రస్యేతి :- రాజా, నిషేద్ధా, న, చేత్, స్యాత్; పదే, పదే, కృతవైరాన్, ధృతరాష్ట్రస్య, తనయాన్, కః, తవానుజః, క్షమేత!

అర్థము :- రాజా=ధర్మరాజు, నిషేద్ధా=వారించువాడు, న స్యాత్ చేత్=కాకున్నచో, పదే పదే=అడుగడుగునను, కృతవైరాన్=శత్రుత్వముకలవారయిన, ధృతరాష్ట్రస్య=ధృతరాష్ట్రునియొక్క, తనయాన్=పుత్రులను, తవ=నీయొక్క, అనుజః=తమ్ముడు, కః=ఎవడు, క్షమేత=క్షమించియుండును! (నీ తమ్ములలో నెవ్వడును క్షమించియుండడనుట) (అనుష్టుప్పు).

సమాసములు :- కృతం వైరం యైః తే=కృతవైరాః—తాన్.

సంధులు :- చేత్+నిషేద్ధా—అనునాశికాదేశసంధి.

క్రియ :- క్షమూష్ సహనే, ఆత్మనే, విధిలిఙ్, ప్రథమ
క్షమేత—క్షమేయాతామ్—క్షమేరన్.

ఏవమితి :- (సరోషమ్=రోషముతో) ఇదమ్=ఇది, ఏవమ్=ఇట్లే, అతఃఏవ=అందుకే, అద్యప్రభృతి=నేటినుండి, అహమ్=నేను, భవద్భ్యః=మీకంటె, భిన్నః=భిన్నుడను—వేరుగా ప్రవర్తించువాడననుట, పశ్య=చూడుము—

ప్రవృద్ధం యద్వైరం మమ ఖలు శిశోరేవ కురుభి
ర్న తత్రార్యో హేతు ర్న భవతి కిరీటీ న చ యువామ్।
జరాసంధస్యోరఃస్థల మివ విరూఢం పునరపి
క్రుధా సంధిం భీమో విఘటయతి యూయం ఘటయత॥ 10

---

ప్రవృద్ధమితి :- శిశోః, ఏవ, మమ, కురుభిః, యత్, వైరమ్, ప్రవృద్ధమ్, తత్ర, ఆర్యః, హేతుః, న, ఖలు. కిరీటీ, న. చ, యువామ్, నః జరాసంధస్య, ఉరఃస్థలమ్, ఇవ, పునః, అపి, విరూఢమ్, సంధిమ్, భీమః, క్రుధా, విఘటయతి, యూయమ్, ఘటయత.

అర్థము :- శిశోః ఏవ=బాలుడనే అయిన, మమ=నాకు—బాల్యము నుండియుననుట, మమ=నాకు, కురుభిః=కౌరవులతో, యత్=ఏ, వైరమ్= శత్రుత్వము, ప్రవృద్ధమ్=అభివృద్ధిచెందినదో, తత్ర=ఆ విషయమున, ఆర్యః= ధర్మరాజు, హేతుః=కారణము, న ఖలు=కాదు సుమా!; కిరీటీ=అర్జునుడు, న= కాదు; చ=మరియు, యువామ్=మీరిరువురు, న=కాదు; జరాసంధస్య=జరాసంధుని యొక్క, ఉరఃస్థలమ్ఇవ=వక్షఃస్థలమునువలె, పునఃఅపి=మరల, విరూఢమ్= బాగుగా దృఢపడిన, సంధిమ్=పొందును, భీమః=ఈ భీముడు, క్రుధా=కోపముతో, విఘటయతి=విడగొట్టుచున్నాడు, యూయమ్=మీరు, ఘటయత=కలుపుడు.

సంధులు — శిశోః+ఏవ, కురుభిః+న, హేతుః+న—రేఫాదేశవిసర్గ. తత్ర+ఆర్యః—సవర్ణ. ఆర్యః+హేతు, భీమః+విఘటయతి—ఉత్వాదేశవిసర్గ. జరాసంధస్య+ఉరః—గుణసంధి.

క్రియ :- భూ సత్తాయామ్, పరస్మైపద లట్, ప్రథమ
భవతి—భవతః—భవన్తి.

ఘట సంఘాతే, ణిచ్, పరస్మై, లట్, ప్రథమ;

ఘటయతి—ఘటయతః—ఘటయన్తి

లోట్—మధ్యమ.

ఘటయ/ఘటయతాత్—ఘటయతమ్—ఘటయత.

సహదేవః : (సానునయమ్) ఆర్య, ఏవ మతిసంభృత క్రోధేషు యుష్మాసు కదాచిత్ ఖిద్యతే గురుః.

భీమసేనః : కిం నామ ఖిద్యతే గురుః? గురుః ఖేదమపి జానాతి? పశ్య—

తథాభూతాం దృష్ట్వా నృపసదసి పాంచాలతనయాం
వనే వ్యాధైః సార్థం సుచిర ముషితం వల్కలధరైః।
విరాటస్యావాసే స్థిత మనుచితారంభనిభృతమ్
గురుః ఖేదం ఖిన్నే మయి భజతి నాద్యాపి కురుషు॥ 11

---

ఛందస్సు :- శిఖరిణీ—య, మ, న, స, భ, లగ.
ప్రవృద్ధం యద్వైరం మమఖ లుశిశో రేవకు రభిః
IUU UUU III IIU UII IU

ఆర్యేతి :- (సానునయమ్ = అనునయించుచు) ఆర్య=సజ్జనుడా!, ఏవమ్=ఇట్లు, యుష్మాసు=తమరు, అతిసంభృత=అత్యధికముగా వహింపబడిన, క్రోధేషు=కోపముకలవారగుచుండగా, కదాచిత్=ఒకవేళ, గురుః=అగ్రజుడు (ధర్మరాజు), ఖిద్యతే=బాధపడును!—బాధపడునేమో యనుట.

కిమితి :- గురుః=ధర్మజుడు, ఖిద్యతే నామ=బాధపడుననుట, కిమ్=ఏమి? గురుః=అగ్రజుడు, ఖేదమ్ అపి=బాధనుకూడ, జానాతి=ఎరుగునా? పశ్య=వినుము.

తథా ఇతి :- నృపసదసి, తథాభూతామ్, పాంచాలతనయామ్, దృష్ట్వా, వల్కలధరైః, వ్యాధైః, సార్థమ్, వనే, సుచిరమ్, ఉషితమ్; విరాటస్యావాసే, అనుచితారంభ నిభృతమ్, స్థితమ్, దృష్ట్వా, మయి, ఖిన్నే, అద్య, అపి, గురుః, కురుషు, ఖేదమ్, న, భజతి.

అర్థము :- నృపసదసి=రాజసభయందు, తథాభూతామ్=అట్టి దురవస్థను పొందిన, పాంచాలరాజతనయామ్=ద్రౌపదిని, దృష్ట్వా=చూచి; వల్కలధరైః=నారచీరలు కట్టుకొన్నవారమైన, అస్మాభిః=మనచేత, వ్యాధైః సార్థమ్=కిరాతకులతో

తత్సహదేవ నివర్తస్వ. ఏవం చాతిచిరప్రవృద్ధామర్షో
ద్దీపితస్య భీమస్య వచనా ద్విజ్ఞాపయ రాజానమ్.

సహదేవః : ఆర్య, కిమితి?

---

పాటు, వనే=అరణ్యమునందు, సుచిరమ్=చాలకాలము (పన్నెండు సంవత్సరములు), ఉషితమ్=నివసింపబడుట, దృష్ట్వా=చూచి; విరాటస్య=విరాటుని యొక్క, ఆవాసే=కొలువునందు, అనుచిత=అయోగ్యములైన, కార్య=పనుల యొక్క, ఆరంభ=స్వీకారముతో, నిభృతమ్=గుప్తమగునట్లు, స్థితమ్=ఉండుటను, దృష్ట్వా=చూచి; మయి=నేను, ఖిన్నే (సతి)=ఖిన్నుడనగుచుండగా, గురుః= ధర్మజుడు, అద్యాపి=ఈ నాటికయినను, కురుషు=కౌరవులపట్ల, ఖేదమ్=క్రోధ మును, న భజతి=వహించుటలేదు. గురుః ఖిన్నే మయి=ఖిన్నుడనైన నాపట్ల, ఖేదమ్ భజతి=కోపమువహించుచున్నాడు, అద్యాపి, న కురుషు=కౌరవులపట్ల కోపము వహించుటలేదు—అనియు (కొందర న్వయించిరి.) శిఖరిణీవృత్తము.

సమాసములు :- పాంచాలస్య తనయా—తామ్. ధరతీతి ధరః— వల్కలస్య ధరః—తైః. అనుచితాశ్చ తే ఆరంభాశ్చ—తైః నిభృతం యథా భవతి తథా. నృపస్య సదః—తస్మిన్.

సంధులు :— విరాటస్య+ఆవాసే, అనుచిత+ఆరంభ, న+అద్య+అపి— సవర్ణదీర్ఘ.

క్రియ :- భజ సేవాయామ్, పరస్మై, లట్, ప్రథమ
భజతి—భజతః—భజన్తి

తత్సహేతి :— తత్=అందుచేత, సహదేవ=ఓ సహదేవుడా!, నివర్తస్వ= విరమింపుము. చ=మరియు, అతిచిర=చాలాకాలమునుండి, ప్రవృద్ధ=వృద్ధి పొందిన, అమర్షా=క్రోధముతో, ఉద్దీపితస్య=ప్రేరేపితుడయిన, భీమస్య=ఈ భీముని యొక్క, వచనాత్=మాటనుబట్టి, ఏవమ్=ఈ విధముగా—చెప్పబోవునట్లు రాజానమ్=ధర్మరాజును, విజ్ఞాపయ=విన్నవించుము.

ఆర్యేతి :— ఆర్య=మాన్యుడా! కిమ్ ఇతి=ఏమని?

భీమసేనః : ఏవం విజ్ఞాపయ—

యుష్మచ్ఛాసన లంఘనాంహసి మయా మగ్నేన
నామ స్థితం
ప్రాప్తా నామ విగర్హణా స్థితిమతాం మధ్యేఽనుజానామపి।
క్రోధోల్లాసితశోణితారుణగద స్యోచ్ఛిందతః కౌరవా
నద్యైకం దివసం మమాసి న గురుర్నాహం విధేయస్తవ॥
12

(ఇత్యుద్ధతం పరిక్రామతి)

ఏవమితి :— ఏవమ్=ఈ ప్రకారముగా, విజ్ఞాపయ=విన్నవింపుము—

యుష్మదితి :— మయా, యుష్మచ్ఛాసనలంఘనాంహసి, మగ్నేన, స్థితమ్, నామ; స్థితిమతామ్, అనుజానామ్, అపి, మధ్యే, నిగర్హణా, ప్రాప్తా, నామ; క్రోధోల్లాసితశోణితారుణగదస్య, కౌరవాన్, ఉచ్ఛిందతః, మమ, (త్వమ్), అద్య, ఏకమ్, దివసమ్, గురుః, న, అసి; అహమ్, తవ, విధేయః, న, అస్మి.

అర్థము :- యుష్మత్=నీయొక్క, శాసన=ఆజ్ఞను, లంఘన=దాటుట యనునట్టి, అంహసి=పాపమునందు, మగ్నేన=మునిగినవాడనైన, మయా=నాచేత, స్థితం నామ=ఉండుటగుగాక—అట్టి పాపమున మునిగిన మునిగెదగాక యనుట. స్థితిమతామ్=మర్యాదకలిగిన, అనుజానామ్=తమ్ములయొక్క, మధ్యే అపి=నడుమ కూడ, నిగర్హణా = నింద, ప్రాప్తా నామ = పొందబడుగాక—నింద వచ్చిన రాని మ్మనుట; క్రోధ=కోపముతో, ఉల్లాసిత=పైకెత్తబడినదై, శోణిత= రక్తముతో, అరుణ=ఎరుపెక్కిన, గదస్య=గదకలవాడనై, కౌరవాన్=కౌరవులను, ఉచ్ఛిందతః=తుత్తునియలుచేయుచున్న, మమ=నాకు, అద్య=నేడు, ఏకమ్ దివసమ్=కేవలము ఈ ఒక్కరోజు, గురుః=అగ్రజుడవు, న అసి=కావు; అహమ్=నేను, తవ=నీకు, విధేయః=విధేయుడను, న అస్మి=కాను. (శార్దూల విక్రీడితము).

సమాసములు :- యుష్మాకం శాసనమ్—యుష్మచ్ఛాసనస్య ఉల్లంఘ నమ్—యుష్మచ్ఛాసనోల్లంఘనమేవ అంహః—తస్మిన్. స్థితిః యస్య సః—తేషామ్.

సహదేవః : (తమేవానుగచ్ఛన్నాత్మగతమ్) అయే కథ మార్యః పాంచాల్యాః చతుశ్శాలం ప్రతి ప్రస్థితః. భవతు, తావ దహ మత్రైవ తిష్ఠామి. (ఇతి స్థితః)

భీమసేనః : (ప్రతినివృత్యావలోక్య చ) సహదేవ, గచ్ఛ త్వం గురు మనువర్తస్వ. అహ మప్యాయుధాగారం ప్రవిశ్యాయుధ సహాయో భవామి.

---

క్రోధేన ఉల్లాసితా—శోణితేన అరుణా—క్రోధోల్లాసితా చ సా శోణితారుణా చ—క్రోధోల్లాసిత శోణితారుణా గదా యస్య సః—తస్య.

**సంధులు** :- ఉత్+ఛిందతః-శ్చుత్వసంధి. యుష్మత్+శాసనాత్—ఛాదేశ మమ+అపి, లంఘన+అంహసి, శోణిత+అరుణ, న+అహమ్—సవర్ణదీర్ఘ. మధ్యే+అనుజానామ్—పూర్వరూప. ఉత్+లాసిత—లాదేశసంధి. గదస్య+ఉచ్ఛిందతః—గుణసంధి. అద్య+ఏకమ్—వృద్ధి. గురుః+న—రేఫాదేశవిసర్గ. విధేయః+తవ—సాదేశవిసర్గ.

క్రియ :- అస భువి, పరస్మై, లట్, మధ్యమ, ఉత్తమ
అసి—స్థః—స్థ, అస్మి-స్వః-స్మః.
(ఇతి=అని, ఉద్ధతమ్=ఉద్ధతితో, పరిక్రామతి=నడచును)

**అయే ఇతి** :- (తమ్ ఏవ=ఆ భీమునే, అనుగచ్ఛన్=వెంబడించి నడచుచు, ఆత్మగతమ్=తనలో)అయే=అహో!కథమ్=ఎట్లూ! ఆర్యః=అన్నగారు, పాంచాల్యాః=ద్రౌపదియొక్క, చతుశ్శాలంప్రతి=నల్లిల్లువైపునకు, ప్రస్థితః=నడచుచున్నాడు! భవతు=కానిమ్ము. అహమ్తావత్=నేను మాత్రము, అత్రఏవ=ఇచ్చటనే, తిష్ఠామి=ఉందును. (ఇతి=అని, స్థితః=నిలుచును.)

**సహదేవ ఇతి** :- (ప్రతినివృత్య=వెనుదిరిగి, అవలోక్య చ=చూచి) సహదేవుడా! త్వమ్=నీవు, గచ్ఛ=పొమ్ము, గురుమ్=ధర్మరాజును, అనువర్తస్వ=అనుసరింపుము, అహమ్ అపి=నేనును, ఆయుధాగారమ్=ఆయుధశాలను, ప్రవిశ్య=ప్రవేశించి, ఆయుధసహాయః=సాయుధుడను, భవామి=అగుదును.

సహదేవః : ఆర్య, నేద మాయుధాగారం, పాంచాల్యాశ్చతుశ్శాల మిదమ్.

భీమసేనః: (సవితర్కం) కిం నామ నేదమాయుధాగారం పాంచాల్యాః చతుశ్శాల మిదమ్। (కించిద్విహస్య సహర్షమ్) ఆమంత్రితవ్యా మయా పాంచాలీ. (సప్రణయం సహదేవం హస్తే గృహీత్వా) వత్స, ఆగమ్యతామ్. యదార్యః కురుభిః సంధానమిచ్ఛన్నస్మాన్ పీడయతి-తద్భవానపి పశ్యతు. (ఉభౌ ప్రవేశం నాటయతః)

సహదేవః : ఆర్య, ఇద మాసన మాస్తీర్ణమ్ అత్రోపవిశ్య ప్రతిపాలయత్వార్యః కృష్ణాగమనమ్.

---

ఆర్యేతి :- ఆర్య=మాన్యుడా! ఇదమ్=ఇది, ఆయుధాగారమ్=ఆయుధశాల, న=కాదు. ఇదమ్=ఇది, పాంచాల్యాః=ద్రౌపదియొక్క, చతుశ్శాలమ్=నల్లిల్లు.

కిమితి :- (సవితర్కమ్=సాలోచనగా) కిం నామ=ఏమీ!, ఇదమ్=ఇది, న ఆయుధాగారమ్=ఆయుధశాలకాదా! ఇదమ్=ఇది, పాంచాల్యాః=ద్రోవది యొక్క, చతుశ్శాలమ్=నల్లిల్లా! (కించిత్=కొద్దిగా, విహస్య=నవ్వి) మయా=నాచేత, పాంచాలీ=ద్రౌపది, ఆమంత్రయితవ్యా=సంభాషణీయ—పలుకరింపదగినదనుట. (సప్రణయమ్=సానురాగముగా, సహదేవమ్=సహదేవుని, హస్తే గృహీత్వా=చేయందుకొని.) వత్స=బిడ్డా!, ఆగమ్యతామ్=రమ్ము, ఆర్యః=ధర్మజుడు, కురుభిః=కౌరవులతో, సంధానమ్=సంధిని, ఇచ్ఛన్=కోరుచున్నవాడై, అస్మాన్=మనలను, యత్ పీడయతి=ఏ పీడించుటకలదో, తత్=అది, భవాన్ అపి=నీవుకూడ, పశ్యతు=చూతువు. ధర్మజుని వలన మనకు ఎట్టి బాధ కలుగుచున్నదో ద్రౌపదీ సంభాషణతో నీకు తెలియగలదనుట.

(ఉభౌ=ఇరువురును, ప్రవేశం నాటయతః=ప్రవేశమభినయింతురు)

ఆర్యేతి :- ఆర్య=మాన్యుడా!, ఇదమ్=ఇదిగో ఇది, ఆస్తీర్ణమ్=విశాలమైన, ఆసనమ్=ఆసనము, అత్ర=ఇచ్చట, ఉపవిశ్య=కూర్చుండి,

భీమసేనః : (ఉపవిశ్య) వత్స, కృష్ణాగమనమిత్యనేన ఉపోద్ఘాతేన స్మృతమ్. అథ భగవాన్ కృష్ణః కేన పణేన సంధిం కర్తుం సుయోధనం ప్రతి ప్రహితః?

సహదేవః : ఆర్య, పంచభిర్గ్రామైః.

భీమసేనః : (కర్ణౌ పిధాయ) అహహ! హంత! దేవస్యాజాతశత్రో రప్యయ మీదృశ స్తేజోఽపకర్ష ఇతి యత్సత్యం కంపిత మివ మే హృదయమ్. (పరివర్త్య స్థిత్వా) తద్వత్స, న త్వయా కథితం, న మయా శ్రుతమ్.

---

కృష్ణాగమనమ్=కృష్ణాగమనమును, ఆర్యః=మాన్యుడు (నీవనుట), ప్రతిపాలయతు=ప్రతీక్షించుగాక! "కృష్ణా"=ద్రౌపది. ఆమె ఆగమనము అని ప్రకృతార్థము. కృష్ణస్య ఆగమనమ్ – దూతగానేగిన శ్రీకృష్ణుని రాకను అనియు స్ఫూర్తి.

వత్సేతి :– ఉపవిశ్య=కూర్చుండి, వత్స=బిడ్డా! "కృష్ణాగమనమ్"- ఇతి=అనునట్టి, అనేన=ఈ, ఉపోద్ఘాతేన=ఉపోద్ఘాతముతో, స్మృతమ్=జ్ఞాపకము వచ్చినది. అథ=ఇంతకును, భగవాన్=భగవంతుడైన, కృష్ణః=శ్రీకృష్ణుడు, కేన=ఏ, పణేన=మూల్యముతో, సంధిమ్=సంధిని, కర్తుమ్=చేయుటకు, సుయోధనం ప్రతి=దుర్యోధనునొద్దకు, ప్రహితః=పంపబడినాడు? [ఉపోద్ఘాత ఉదాహారః అని అమరము. ప్రకృతోపపాదకస్య దృష్టాంతాదేరిత్యన్యే అని విశేషార్థమును రామాశ్రమి చూపినది. కృష్ణాగమనమ్ అను సహదేవుని మాటను ప్రకృతోపపాదకముగా భీముడు మలచుకొనుటచే ఉపోద్ఘాతమగుచున్నది. ఉదాహారేణ కథనేనేతి యావత్-అని రమాశంకరత్రిపాఠీ.]

ఆర్యేతి :- మాన్యుడా! పంచభిః=అయిదైన, గ్రామైః=గ్రామములతో. అయిదూళ్ళు పణముగా ననుట.

అహహేతి :– (కర్ణౌ = రెండు చెవులను, పిధాయ = మూసికొని) అహహ=అహాహా! హంత=అయ్యో! దేవస్య=మహారాజయిన, అజాతశత్రోః

యత్తదూర్జిత మత్యుగ్రం క్షాత్రం తేజోఽస్య భూపతేః।
దీవ్యతాక్షై స్తదానేన నూనం తదపి హారితమ్॥ 13

(నేపథ్యే)

సమా శ్వసితు సమాశ్వసితు భట్టినీ. (సమస్ససదు సమస్ససదు భట్టిణీ)

---

అపి=అజాతశత్రునికికూడ, ఈదృశమ్=ఇటువంటి—అయిదూళ్ళతో సంధి చేసికొనుట అనునట్టి, అయమ్=ఈ, తేజోఽపకర్షః=పరాక్రమమును కొంచెపరచుకొనుట, ఇతి=అనునట్టిది, యత్=ఏది కలదో, తేన=దానితో, సత్యమ్=నిజముగా, మే=నాయొక్క, హృదయమ్=డెందము, కంపితమ్ ఇవ=కంపించినదివలె అగుచున్నది. (పరివర్త్య స్థిత్వా=మారుమోమై), తత్=అందుచేత, వత్స=తమ్ముడా!, త్వయా=నీచేత, న కథితమ్=చెప్పబడలేదు మయా=నాచేత, న శ్రుతమ్=వినబడలేదు. అట్టి మాటను నీవు చెప్పలేదు నేను వినలేదనుట.

యత్తదితి :— అస్య, భూపతేః, తత్, ఊర్జితమ్, అత్యుగ్రమ్, క్షాత్రమ్, తేజః, యత్, తత్, అపి, అక్షైః, దీవ్యతా, అనేన, తదా, నూనమ్, హారితమ్.

అర్థము :- అస్య=(అయిదూళ్ళతో సంధిని కుదుర్చుకొనుచున్న)ఈ, భూపతేః=రాజుయొక్క, తత్=ఆ, ఊర్జితమ్=బలసంపన్నమును, అత్యుగ్రమ్=ప్రచండమును అయిన, యత్=ఏ, క్షాత్రమ్=క్షత్రియోచితమైన, తేజః=ప్రతాపము కలదో, తత్ అపి=అదికూడ, అక్షైః=పాచికలతో, దీవ్యతా=క్రీడించుచున్న, అనేన=ఈతనిచే, తదా=అప్పుడే, నూనమ్=నిశ్చయముగా, హారితమ్=పోగొట్టుకొనబడినది. (పథ్యావక్త్రము.)

సంధులు — తేజః+అస్య—ఉత్వాదేశవిసర్గ — తేజో+అస్య—పూర్వరూప. అక్షైః+తత్—సాదేశవిసర్గ. దీవ్యతా+అక్షైః, తదా+అనేన—సవర్ణదీర్ఘ. తత్+అపి—జశ్త్వసంధి.

(నేపథ్యే=తెరలో)

సమాశ్వసిత్వితి :— భట్టినీ=స్వామిని, సమాశ్వసితు—సమాశ్వసితు=

సహదేవః : (నేపథ్యాభిముఖ మవలోక్యాత్మగతమ్) అయే, కథం యాజ్ఞసేనీ ముహురుపచీయమాన బాష్పపటల స్థగిత నయనా ఆర్యసమీప ముపసర్పతి. తత్కష్టతర మాపతితమ్

యద్వైద్యుతమివ జ్యోతి రార్యే క్రుద్ధేఽద్య సంభృతమ్।
తత్ప్రావృడివ కృష్ణేయం నూనం సంవర్ధయిష్యతి॥ 14

---

కోరడిల్లునుగాకూరడిల్లునుగాక! (దేవీ కృతాభిషేకాయామ్, ఇతరాసు తు భట్టినీ—అని అమరము.)

అయే ఇతి :- (నేపథ్యాభిముఖమ్=తెరవైపునకు, అవలోక్య=చూచి, ఆత్మగతమ్=తనలో) అయే కథమ్=అహో ఎట్లూ! ముహుః=మాటిమాటికి, ఉపచీయమాన=వృద్ధిపొందుచున్న, బాష్పపటల=కన్నీటిధారలతో, స్థగిత=నిండిన, నయనా=నేత్రములు కలదైన, యాజ్ఞసేనీ=ద్రౌపది, ఆర్య=భీమునియొక్క, సమీపమ్=సన్నిధిని, ఉపసర్పతి=చేరుచున్నది. తత్=అందుచేత, కష్టతరమ్=పెద్ద కష్టము, ఆపతితమ్=వచ్చిపడినది.

యద్వైద్యుతమితి :- అద్య, క్రుద్ధే, ఆర్యే, వైద్యుతమ్, ఇవ, యత్, జ్యోతిః, సంభృతమ్, తత్, ఇయమ్, కృష్ణా, ప్రావృట్, ఇవ, నూనమ్, సంవర్ధయిష్యతి.

అర్థము :- అద్య=ఇప్పుడు, క్రుద్ధే=కుపితుడైన, ఆర్యే=భీమునియందు, వైద్యుతమ్ ఇవ=మెరుపువంటి, యత్=ఏ, జ్యోతిః=తేజస్సు, సంభృతమ్=భరింపబడుచున్నదో, తత్=ఆ తేజస్సును, ఇయమ్=ఈ సమీపించుచున్న, కృష్ణా=ద్రౌపది, ప్రావృట్ ఇవ=వానకారువలె, నూనమ్=తప్పక, సంవర్ధయిష్యతి=వృద్ధిపొందించును. (పథ్యావక్త్రము.)

సంధులు :- జ్యోతిః+ఆర్యే—రేఫాదేశవిసర్గ. క్రుద్ధే+అద్య—పూర్వరూపసంధి. ప్రావృట్+ఇవ—జశ్త్వసంధి. కృష్ణా+ఇయమ్—గుణసంధి.

(తతః ప్రవిశతి యథానిర్దిష్టా ద్రౌపదీ చేటీ చ)

(ద్రౌపదీ సాస్రం నిఃశ్వసితి)

చేటీ : సమాశ్వసితు సమాశ్వసితు భట్టినీ, అపనేష్యతి తే మన్యుం నిత్యానుబద్ధకురువైరః కుమారో భీమసేనః. (సమస్ససదు సమస్ససదు భట్టిణీ. అవణఇస్సది దే మణ్ణుం ణిచ్చాణుబద్ధ కురువేరో కుమారో భీమసేణో).

ద్రౌపదీ : హంజే బుద్ధిమతికే, భవత్యేతద్యది మహారాజః ప్రతికూలో న భవేత్. (హంజే బుద్ధిమదిఏ, హోది ఏదం జఇ మహారాఓ పడిఊలో న భవే.)

---

క్రియ :- వృధు వృద్ధౌ, ప్రేరణే ణిచ్, వృద్భ్యశ్స్యసనోరితి పరస్మై. లట్, ప్రథమ

వర్ధయిష్యతి—వర్ధయిష్యతః—వర్ధయిష్యన్తి.

(తతః=అంతట, యథానిర్దిష్టా=నిర్దేశింపబడిన రీతిలో, ద్రౌపదీ=ద్రోవది, చ= మరియు, చేటీ=చెలికత్తెయు, ప్రవిశతి=ప్రవేశించును.)

(ద్రౌపదీ=ద్రోవది, సాస్రమ్=కన్నీటితో, నిశ్వసితి=నిట్టూర్చును)

సమాశ్వసిత్వితి :- భట్టినీ=స్వామిని, సమాశ్వసితు=ఊరడిల్లును గాక, నిత్యానుబద్ధకురువైరః = అనుక్షణము స్మరింపబడు కౌరవశత్రుత్వము కలవాడైన, కుమారః భీమసేనః=కుమారభీముడు, (యువరాజస్తు కుమారో భర్తృదారకః) తే=నీయొక్క, మన్యుమ్=శోకమును, అపనేష్యతి=పోగొట్టును.

హంజఇతి :- హంజే బుద్ధిమతికే=ఓసీ బుద్ధిమతికా! మహారాజః= ధర్మరాజు, ప్రతికూలః=వ్యతిరేకించువాడు, న భవేద్యది=కాకున్నచో, ఏతత్= నీవన్నది, భవేత్=అగును—హండే హంజే హలాహ్వానే నీచాం చేటీం సఖీం ప్రతి—అని అమరము.

చేటీ : (విలోక్య) ఏష కుమార స్తిష్ఠతి. తదేన ముపసర్పతు భట్టినీ (ఏసో కుమాలో చిట్ఠది. తా ణం ఉవసప్పదు భట్టిణీ)

ద్రౌపదీ : హంజే ఏవం కుర్వ ఇతి. (ఇతి పరిక్రామతః) (హంజే ఏవ్వం కరేమ్హ.)

చేటీ : (ఉపసృత్య) జయతు జయతు కుమారః (జఅదు జఅదు కుమాలో)

(భీమసేనోఽశృణ్వాన్ "యత్సత్యవ్రత" ఇతి పునః పఠతి)

చేటీ : [పరివృత్య] భట్టిని! పరికుపిత ఇవ కుమారః లక్ష్యతే. [భట్టిణీ, పరికువిదో విఅ కుమాలో లక్ఖీ అది.]

---

విలోక్యేతి :— (విలోక్య=చూచి) ఏషః=ఇతడే, కుమారః=కుమార భీమసేనుడు, తిష్ఠతి=కూర్చుండియున్నాడు. తత్=అందుచేత, భట్టినీ=స్వామిని, ఏనమ్=వీనిని, ఉపసర్పతు=సమీపించునుగాక.

హ జఇతి :— హంజే=ఓసీ!, ఏవమ్=నీవు చెప్పినట్లే, కుర్వఃఇతి= చేయుదముగాక. (ఇతి=అని, పరిక్రామతః=ఇరువురును నడతురు) (ఇతి, తత్, యత్, తావత్ మొదలగునవి కొన్నిచోట్ల వాక్యాలంకారముకొరకు ప్రయోగింప బడుచుండును.

జ యత్వితి :- (ఉపసృత్య=సమీపించి) కుమారః=కుమార భీమసేనుడు, జయతు=జయించునుగాక, జయతు=జయించునుగాక. (సమీపించునప్పుడు సేవకులు జయము జయము మహారాజ అనుట పరిపాటి. అట్టిదే ఇదియును.)

(భీమసేనః=భీమసేనుడు, అశృణ్వాన్=ఈ చేటీ వాక్యమును విననివాడై, యత్సత్యవ్రత ఇతి=యత్సత్యవ్రత అనునట్టి వెనుకటి శ్లోకమును, పునఃపఠతి= మరల చదువును).

భట్టినీతి :- (పరివృత్య = వెనుదిరిగి) భట్టిని! = ఓ స్వామినీ!

ద్రౌపదీ : హంజే! యద్యేవం తదవధీరణాప్యేషా మామాశ్వాసయతి. తదేకాంత ఉపవిష్టా భూత్వా శృణోమి తావన్నాథస్య వ్యవసితమ్. [హంజే, జఇ ఏవ్వం తా అవహీరణావి ఏసా మం ఆసాసఅది. తా ఏత్థ ఉవవిట్ఠా భవిఅ సుణోమి దావ ణాహస్స వవసిదమ్]

[ఉభే తథా కురుతః]

భీమసేనః : [సక్రోధమ్, సహదేవ మధికృత్య] కిం నామ పంచభిః గ్రామైః సంధిః?

మథ్నామి కౌరవశతం సమరే న కోపాత్
దుఃశాసనస్య రుధిరం న పిబామ్యురస్తః।

---

కుమారః=కుమారభీమసేనుడు, పరికుపిత ఇవ=కోపించినవాడువలె, లక్ష్యతే=కనిపించుచున్నాడు.

**హంజఇతి :—** హంజే=ఓసీ, ఏవమ్ యది=నీవన్నట్లే అయినచో, కోపించినవాడైయున్నచో అనుట, ఏషా=ఈ, అవధీరణా అపి=తిరస్కారము కూడ, తన రాకను గుర్తింపని అవమానమనుట, మామ్=నన్ను, ఆశ్వాసయతి=ఓదార్చును. తత్=అందుచేత, ఏకాంతే=ఏకాంతమునందు, ఉపవిష్టా భూత్వా=కూర్చుండి (భీమునికి కనిపింపకుండ నిలిచి అనుట , నాథస్య=స్వామియొక్క, వ్యవసితమ్=నిశ్చయమును, శృణోమి తావత్=వినుదునుగాక.

(ఉభే=ఇరువురును, తథా=ఆ విధముగా, కురుతః=చేయుదురు.)

**కిమితి :—** (సహదేవమ్ = సహదేవుని, అధికృత్య = ఉద్దేశించి, సక్రోధమ్=కోపముగా) పంచభిః=అయిదైన, గ్రామైః=ఊళ్లతో, సంధిః నామ కిమ్=సంధి అనగానేమి? అట్టిది అవమానకరమనుట.

**మథ్నామీతి :—** సమరే కోపాత్ కౌరవశతం న మథ్నామి?,

సంచూర్ణయామి గదయా న సుయోధనోరూ
సంధిం కరోతు భవతాం నృపతిః పణేన॥ 15

---

దుఃశాసనస్య ఉరస్తః రుధిరం న పిబామి?, సుయోధనోరూ గదయా న సంచూర్ణయామి?; భవతాం నృపతిః పణేన సంధిం కరోతు.

అర్థము :- సమరే=యుద్ధమునందు, కోపాత్=కోపముతో (వలన), కౌరవశతమ్=కౌరవులు నూర్గురను, న మథ్నామి=మథించనా?; దుఃశాసనస్య=దుఃశాసనునియొక్క, ఉరస్తః=వక్షఃస్థలమునుండి, రుధిరమ్=రక్తమును, న పిబామి?=త్రాగనా?; సుయోధనోరూ=సుయోధనుని రెండు తొడలను, గదయా=గదతో, న సంచూర్ణయామి=చిదుకగొట్టనా?; భవతామ్=మీయొక్క, నృపతిః=రాజు (ధర్మజుడు), పణేన=అయిదూళ్ల మూల్యముతో, సంధిమ్=సంధిని, కరోతు=చేయునుగాక.

సమాసములు :- కౌరవాణాం శతమ్—కౌరవశతమ్. దుఃఖేన శాసితుం యోగ్యః—దుఃశాసనః తస్య—దుఃశాసనస్య. సుష్ఠు యోధయతి ఇతి—సుయోధనః, సుయోధనస్య ఊరూ—సుయోధనోరూ. నృణాం పతిః—నృపతిః.

సంధులు :- పిబామి+ఉరస్తః—యణాదేశసంధి. ఉరః+తస్—సాదేశ విసర్గసంధి. సుయోధన+ఊరూ—గుణసంధి.

క్రియలు :- 1. మన్థ విలోడనే, పరస్మై, లట్, ఉత్తమ
మథ్నామి—మథ్నావః—మథ్నామః

2. పిబ్(పా పానే), పరస్మై, లట్, ఉత్తమ
పిబామి—పిబావః—పిబామః

3. సమ్+చూర్ణ+ఇ(ణిచ్), పరస్మై, లట్, ఉత్తమ
చూర్ణ సంకోచే ప్రేరణే చ
చూర్ణయామి—చూర్ణయావః—చూర్ణయామః

4. డు కృఞ్ కరణే, పరస్మై, లోట్, ప్రథమ
కరోతు/కురుతాత్—కురుతామ్—కుర్వన్తు.

ఛందస్సు :- వసంతతిలకావృత్తము. త—భ—జ—జ—గగ.

ద్రౌపదీ : (సహర్షమ్ – జనాంతికమ్) నాథ! అశ్రుతపూర్వం ఖలు తే ఈదృశం వచనమ్. తత్ పునఃపునస్తావత్ భణ! (ణాహ, అస్సుదపువ్వం క్ఖు దే ఏదిసం వఅణం. తా పుణోపుణో దావ భణాహి.)

(భీమసేనోఽశృణ్వన్నేవ "మథ్నామి కౌరవశతమ్" ఇతి పునః పఠతి)

సహదేవః : ఆర్య! కిం మహారాజస్య సందేశోఽవ్యుత్పన్న ఇవ గృహీతః.

భీమః : కా పునరత్ర వ్యుత్పత్తిః!

సహదేవః : ఆర్య! ఏవం గురుణా సందిష్టమ్.

---

నాథేతి :– (సహర్షమ్=సంతోషముతో, జనాంతికమ్=జనాంతికముగా) నాథ!=స్వామీ! ఈదృశమ్=ఇటువంటి, తే=నీయొక్క, వచనమ్=మాట, నీవు ఇట్లు మాట్లాడుట, అశ్రుతపూర్వంఖలు=మును విన్నది కాదుగదా!, తత్=అందుచేత, పునః పునః=మరల మరల, తావత్ భణ=పలుకుము.

(భీమసేనః=భీముడు, అశృణ్వన్ ఏవ=ఈ ద్రౌపది మాటలను వినని వాడగుచునే, "మథ్నామి" ఇతి=మథ్నామి ఇత్యాది శ్లోకమును, పునః పఠతి=మరల చదువును)

ఆర్య కిమితి :– ఆర్య!=మాన్యా!, మహారాజస్య=ధర్మజుని యొక్క, సందేశః=అయిదూళ్ల సందేశము, అవ్యుత్పన్నః ఇవ=తెలివితక్కువదివలె, గృహీతః కిమ్=అర్థమయినదా ఏమి?, ధర్మజుడు పంపిన సందేశము తెలివి తక్కువ పనిగా భాసించుచున్నదా నీకు అనుట. (వ్యుత్పత్తి=పాండిత్యము)

కాపునరితి :– అత్ర పునః=ఈ విషయమునందన్నచో [సందేశము నందు] వ్యుత్పత్తిః కా=తెలివి ఏమున్నది? [పునః వాక్యాలంకారార్థము]

ఆర్యేతి :– ఆర్య!=మాన్యుడా! గురుణా=అగ్రజునిచేత, ఏవమ్=ఇట్లు, సందిష్టమ్=సందేశము పంపబడినది.

భీమః : కస్య?

సహదేవః : సుయోధనస్య.

భీమః : కిమితి?

సహదేవః : ఇంద్రప్రస్థం వృకప్రస్థం జయంతం వారణావతమ్।
ప్రయచ్ఛ చతురో గ్రామాన్ కంచిదేకం తు
పంచమమ్॥ 16

భీమసేనః : తతః కిమ్?

---

కస్యేతి :— కస్య?=ఎవనికి?

సుయోధనస్యేతి :— సుయోధనస్య=దుర్యోధనునికి

కిమితి :— కిమితి=ఏమని?

ఇంద్రప్రస్థమితి :— ఇంద్రప్రస్థం వృకప్రస్థం జయంతం వారణావతం—చతురః గ్రామాన్ ప్రయచ్ఛ. తు కంచిత్ ఏకం పంచమం ప్రయచ్ఛ.

అర్థము :- ఇంద్రప్రస్థమ్=ఇంద్రప్రస్థము, వృకప్రస్థమ్=వృకప్రస్థము, జయంతమ్=జయంతము, వారణావతమ్=వారణావతము అనునట్టి, చతురః=నాలుగైన, గ్రామాన్=గ్రామములను, ప్రయచ్ఛ=ఇమ్ము, తు=మరియు, కంచిత్=దేనినైనను, ఏకమ్=ఒక గ్రామమును, పంచమమ్=అయిదవదానిని, ప్రయచ్ఛ=ఇమ్ము.

శబ్దములు :— ఇంద్రప్రస్థమ్—ప్రస్థౌ—ప్రస్థాన్. (అ. పుం. ద్వి) చతురః—నిత్య బహువచనాంతము పుం. ద్వి. గ్రామమ్—గ్రామౌ—గ్రామాన్ (అ. పుం. ద్వి). ఏకమ్—నిత్యైకవచనాంతము. పుం. ద్వి. పంచమమ్—పంచమౌ—పంచమాన్. (అ. పుం. ద్వి).

క్రియ :- ప్ర+యమ ఉపరమే, లోట్, పరస్మై, మధ్యమ.
యచ్ఛ/యచ్ఛతాత్—యచ్ఛతమ్—యచ్ఛత.

తత ఇతి :— తతః కిమ్?=అయిననేమి? ఇంచలి తెలివి ఏమిటనుట.

సహదేవః : తదేవమనయా ప్రతినామ గ్రామ ప్రార్థనయా పంచమస్య చాకీర్తనాత్ విషభోజన - జతుగృహదాహ - ద్యూతసభా ద్యపకారస్థా నోద్ఘాటన మేవేదం మన్యే.

భీమసేనః : (సాటోపమ్) వత్స! ఏవం కృతే కిం కృతం భవతి?

సహదేవః : ఆర్య!, ఏవం కృతే లోకే తావత్ స్వగోత్రక్షయాశంకి హృదయ మావిష్కృతం భవతి కురురాజస్య తావ దసంధేయతా చ తదైవ ప్రతిపాదితా భవతి.

---

తదేవమితి :— తత్=అందుచేత, ఏవమ్=ఇట్లు, ప్రతినామగ్రామ ప్రార్థనయా=పేరుపేరున గ్రామములను ప్రార్థించుటతో, పంచమస్య=అయిదవ గ్రామముయొక్క, అకీర్తనాత్ చ=పేరు చెప్పకపోవుటవలనను, ఇదమ్=ఇది, ఇట్లుచేయుట, విషభోజన=విషాన్నమును పెట్టుట, జతుగృహదాహ=లక్క ఇల్లు కాల్చుట, ద్యూతసభా ఆది = జూదమునాడుట మొదలయిన, అపకారస్థాన= అపకారములు జరిగిన స్థానములయొక్క, ఉద్ఘాటనమ్ ఏవ=ప్రకటనమే అని, మన్యే=భావించుచున్నాను. ఇంద్రప్రస్థ మనుటతో వెడలగొట్టుట, వృకప్రస్థ మనుటతో విషాన్నమును తినిపించుట, జయంతమనుటతో మాయాద్యూతమున నోడించుట, వారణావతమనుటతో లక్కఇంట తగులబెట్టించుట అను అపకారములు సూచింపబడుచున్నవనుట. ఇక అయిదవది నీ ఇష్టమనుటలో యుద్ధమును ఆహ్వానించిన దోషమునుకూడ నీవే దక్కించుకొమ్మనుట.

వత్సేతి :— (సాటోపమ్=అసహనముగా) వత్స!=నాయనా!, ఏవం= ఇట్లు, కృతే=దోషోద్ఘాటన చేయగా, కిం కృతమ్ భవతి=ఏమి చేసినట్లగును? లాభమేమి అనుట.

ఆర్యేతి :- ఆర్య!=మాన్యుడా!, ఏవమ్=ఇట్లు, కృతే=చేయగా, చేయుటతో, కురురాజస్య=దుర్యోధనునియొక్క, స్వగోత్రక్షయాశంకి=పాండవ వంశ నాశనమును కోరునదైన, హృదయమ్=అంతర్యము, లోకే=ప్రపంచము నందు, ఆవిష్కృతమ్=ప్రకటింపబడినది, భవతి=అగుచున్నది, తదా ఏవ=అదే

భీమసేనః : సర్వమప్యేతదనర్థకమ్. కురురాజస్య తావదసంధేయతా తథైవ ప్రతిపాదితా యదైవాస్మాభిరితో వనం గచ్ఛద్భిః సర్వైరేవ కురుకులస్య నిధనం ప్రతిజ్ఞాతమ్. లోకేఽపి చ ధార్తరాష్ట్రకులక్షయః కిం లజ్జాకరో భవతామ్ అపి చ రే మూర్ఖ!—

యుష్మాన్ హ్రేపతి క్రోధాల్లోకే శత్రుకులక్షయః।
న లజ్జయతి దారాణాం సభాయాం కేశకర్షణమ్॥ 17

---

సమయమున, కురురాజస్య=దుర్యోధనునియొక్క, అసంధేయతా చ=సంధికి అంగీకరింపని స్వభావముకూడ, ప్రతిపాదితా=లోకమున ప్రదర్శింపబడినది, భవతి=అగుచున్నది.

సర్వమేవేతి :— ఏతత్=ఈ, సర్వమ్ అపి=అంతయును, అనర్థకమ్=నిష్ప్రయోజనము, యదా ఏవ=ఎప్పుడయితే, వనమ్=వనమునుద్దేశించి, గచ్ఛద్భిః=పోవుచున్నవారమైన, అస్మాభిః సర్వైః=మన అందరిచేత, కురుకులస్య=కురువంశముయొక్క, నిధనమ్=వినాశము, ప్రతిజ్ఞాతమ్=ప్రతిజ్ఞగా స్వీకరింపబడినదో, తదా ఏవ=అప్పుడే, కురురాజస్య=దుర్యోధనునియొక్క, అసంధేయతా=సంధికి అంగీకరింపని స్వభావము, ప్రతిపాదితా=చాటబడినది. చ=మరియు, ధార్తరాష్ట్ర కులక్షయః అపి=కౌరవవంశ వినాశముకూడ, భవతామ్=మీకు, లోకే=లోకమునందు, లజ్జాకరః కిమ్=తలవంపులు తెచ్చునదా ఏమి?. అపిచ=మరియు, రే మూర్ఖ!=ఓరీ మూర్ఖుడా!—వినుమనుట

యుష్మానితి :— యుష్మాన్, హ్రేపతి, క్రోధాత్, లోకే, శత్రుకులక్షయః. న, లజ్జయతి, దారాణామ్, సభాయాం, కేశకర్షణమ్॥

అర్థము :— క్రోధాత్=కోపమువల్లనైన, శత్రుకుల క్షయః=శత్రువంశ వినాశము, యుష్మాన్=మిమ్ము, లోకే=లోకమునందు, హ్రేపతి=సిగ్గిల్లజేయును కానీ, సభాయామ్=పేరోలగమునందు, దారాణామ్=భార్యయొక్క, కేశ=క్రొమ్ముడిని పట్టి, కర్షణమ్=ఈడ్చుట, న లజ్జయతి=సిగ్గిల్లజేయకున్నది.

ద్రౌపదీ : (జనాంతికమ్) నాథ! న లజ్జన్త ఏతే త్వమపి తావత్ మా విస్మార్షీః. (ణాహ ణ లజ్జన్తి ఏదే. తుమం వి దావ మా విసుమరేహి.)

భీమసేనః : (సస్మరణమ్) వత్స! కథం చిరయతి పాంచాలీ!

సహదేవః : ఆర్య! కా ఖలు వేళా తత్రభవత్యాః ప్రాప్తాయాః. కిం తు రోషావేగవశాత్ ఆగతాప్యార్యేణ నోపలక్షితా.

---

**సమాసములు** :- శత్రూణాం కులమ్—శత్రుకులమ్, శత్రుకులస్య క్షయః — శత్రుకులక్షయః. కేశం గృహీత్వా కర్షణమ్ — కేశైః కర్షణమ్ — కేశకర్షణమ్.

**సంధులు** :- క్రోధాత్+లోకే—లాదేశసంధి.

**క్రియలు** :- హ్రీ లజ్జాయామ్+ఇ(ణిచ్-ప్రే) పరస్మై, లట్, ప్రథమ
హ్రేపతి—హ్రేపతః—హ్రేపన్తి.
లస్జీజ్ వ్రీడాయామ్ లజ్జ్+ఇ ణిచ్—ప్రే) పరస్మై, లట్, ప్రథమ
లజ్జయతి-లజ్జయతః—.జ్జయన్తి.

**నాథేతి** :- (జనాంతికముగా) నాథ!=స్వామీ!, ఏతే=వీరు, న లజ్జన్తే= సిగ్గుపడుటలేదు, త్వమ్ అపి=నీవయినను, మా విస్మార్షీః=మఱవకుమా!

**వత్సేతి** :— (తలచుకొనుచు) వత్స!=నాయనా!, పాంచాలీ=ద్రౌపది, చిరయతి కథమ్=జాగుచేయుచున్నదేల!

**ఆర్యేతి** :- ఆర్య!=మాన్యా!, ప్రాప్తాయాః=సమీపించినదైన, తత్ర భవత్యాః=మాన్యురాలైన ద్రౌపదికి, కా వేళా ఖలు=ఎంత సేపైనదోగదా! ఆమె వచ్చి చాలసేపయినదనుట, కిన్తు=కాని, ఆగతా అపి=సమీపించినదే అయినను, రోష ఆవేశ వశాత్ = కోపప్రవాహవశమున, ఆర్యేణ = మాన్యుడవైన నీచే, న ఉపలక్షితా=చూడబడలేదు.

భీమసేనః : (దృష్ట్వా సాదరమ్) దేవి! సముద్ధతామర్షై రస్మాభి రాగతాపి భవతీ నోపలక్షితా. అతో న మన్యుం కర్తు మర్హసి.

ద్రౌపదీ : నాథ! ఉదాసీనేషు యుష్మాసు మమ మన్యుర్న పునః కుపితేషు. (ణాహ, ఉదాసీణేసు తుమ్హేసు మహ మణ్ణు ణ ఉణ కువిదేసు)

భీమసేనః : యద్యేవ మపగతపరిభవ మాత్మానం సమర్థయస్వ. (హస్తే గృహీత్వా పార్శ్వే సముపవేశ్య ముఖమవ లోక్య) కిం పున రత్రభవతీ ముద్విగ్నా మివోప లక్షయామి?

---

దేవీతి :— (దృష్ట్వా=చూచి, సాదరమ్=ఆదరముతో) దేవి!=దేవీ ద్రౌపదీ!, సముద్ధత=అతిశయించిన, అమర్షైః=క్రోధము కలవారమైన, అస్మాభిః= మాచేత, ఆగతా అపి=వచ్చినదానవైనను, భవతీ=నీవు, న ఉపలక్షితా=చూడబడ వైతివి, నిన్ను గమనించలేదనుట. అతః=అందుచేత, మన్యుమ్=కోపమును, కర్తుమ్=వహించుటకు, న అర్హసి=తగవు. కోపింపవద్దనుట.

నాథేతి :— నాథ!=స్వామీ!, యుష్మాసు=మీరు, ఉదాసీనేషు=తటస్థులై యుందురేని, మమ=నాకు, మన్యుః=కోపము, పునః=అంతేకాని, కుపితేషు= కోపించినవారైయుండగా, న మన్యుః = కోపము ఉండదు. శత్రుప్రతీకార విముఖులై ఉదాసీనులుగా నుందురేని కోపింతును, ప్రతీకారవాంఛతో కౌరవులపై కుపితులైయున్నప్పుడు కోపమువహింపననుట.

యద్యేవమితి :— ఏవమ్ యది=అయినచో, అపగత=పోగొట్టబడిన, పరిభవమ్=అవమానముకలదానినిగా, ఆత్మానమ్=నిన్నునీవు, సమర్థయస్వ= భావించుకొనుము. (హస్తే గృహీత్వా=చేయిపట్టుకొని, పార్శ్వే=ప్రక్కన,

ద్రౌపదీ : నాథ! కి ముద్వేగకారణం యుష్మాసు సన్నిహితేషు!
(ణాహ కిం ఉవ్వేఅకాలణం తుమ్హేసు సణ్ణిహిదేసు.)

భీమసేనః : కిమితి నావేదయసి. (కేశా నవలోక్య) అథవా కిమావేదితేన!

జీవత్సు పాండుపుత్రేషు దూర మప్రోషితేషు చ।
పాంచాలరాజతనయా వహతే యదిమాం దశామ్। 18

---

సముపవేశ్య=కూర్చుండబెట్టుకొని, ముఖమ్=మోమును, అవలోక్య=చూచి) పునః=మరి, అత్రభవతీమ్=మాన్యమైన నిన్ను, ఉద్విగ్నామ్ ఇవ=దిగులుగొన్న దానివలె, ఉపలక్షయామి కిమ్?=చూచుచున్నానేమి?. దిగులుపడుచున్నట్లున్నది నీ ముఖము, కారణమేమి యనుట.

నాథేతి :— నాథ=స్వామీ!, యుష్మాసు=మీరు, సన్నిహితేషు=సన్నిధి నుండగా, ఉద్వేగకారణమ్=దిగులుపడుటకు హేతువు, కిమ్=ఏమి ఉండును!

కిమితీతి :- కిమ్ ఇతి=ఉద్వేగకారణమేమిటో, న ఆవేదయసి=తెలుప కున్నావు. (కేశాన్=జుట్టును, అవలోక్య=చూచి) అథవా=అయినను, ఆవేదితేన కిమ్=చెప్పబడుటతో పని ఏమి? వేరుగా చెప్ప నవసరము లేదనుట.

జీవత్స్వితి :- జీవత్సు, పాండుపుత్రేషు, దూరమ్, అప్రోషితేషు, చ, పాంచాలరాజతనయా, వహతే, యత్, ఇమామ్, దశామ్.

అన్వయము :- పాండుపుత్రేషు జీవత్సు (సత్సు) దూరమ్ అప్రోషితేషు చ, పాంచాలరాజతనయా ఇమాం దశాం యత్ వహతే (తత్ అలమ్).

అర్థము :- పాండుపుత్రేషు=పాండురాజ కుమారులు, జీవత్సు సత్సు= జీవించియుండగా, దూరమ్=దూరదేశములకు, అప్రోషితేషు చ=వెడలగొట్టబడిన వారు కాకున్నప్పటికిని,' భర్తలు బ్రతికియుండుటే కాక సమీపముననుండేయుండగా ననుట, పాంచాలరాజతనయా=పాంచాలరాజపుత్రి అయిన ద్రౌపది, ఇమామ్=ఇట్టి,

ద్రౌపదీ : హంజే! బుద్ధిమతికే! నివేదయ తావన్నాథస్య. కోఽన్యో మమ పరిభవేన ఖిద్యతే. (హంజే బుద్ధిమదిఏ, ణివేదేహి దావ ణాహస్స. కో అణ్ణో మమ పరిహవేణ ఖిజ్జఇ.)

---

దశామ్ = అవస్థను, యత్ వహతే=వహించుచున్నదనుట యేదికలదో, (తత్ అలమ్ = అదే చాలును). వేరొక ఉద్వేగకారణము అవసరము లేదనుట. ఛందస్సు—పథ్యావక్త్రము.

**విశేషములు** :— "పాంచాలరాజతనయా" అనుటలో ఆభిజాత్యము స్ఫురించును. "ఇమామ్ దశామ్" అవాచ్యమైన హీనస్థితి అనుట స్ఫూర్తి.

**సమాసములు** :- పాండోః పుత్రాః—పాండుపుత్రాః, తేషు—పాండుపుత్రేషు. న ప్రోషితాః—అప్రోషితాః. పాంచాలః ఇతిరాజా—పాంచాలరాజా, లేక, పాంచాలానాం రాజా—పాంచాలరాజస్య తనయా—పాంచాలరాజతనయా.

**శబ్దములు** :— జీవతి—జీవతోః—జీవత్సు. (త్. పుం. స), పుత్రే—పుత్రయోః—పుత్రేషు (అ. పుం. స.) దూరమ్—దూరే—దూరాన్ (అ. త్రి. ద్వి.) అప్రోషితే—అప్రోషితయోః—అప్రోషితేషు. [అ. పుం. స.] తనయా—తనయే—తనయాః [ఆ. స్త్రీ. ప్ర] యత్—యే—యాని [త్. నపుం. ప్ర] ఇమామ్—ఇమే—ఇమాః [మ్. స్త్రీ. ద్వి] దశామ్—దశే—దశాః [ఆ. స్త్రీ. ద్వి].

క్రియ : వహఙ్ ప్రాపణే, ఆత్మనే, లట్, ప్రథమ
వహతే—వహేతే—వహన్తే.

**హంజ ఇతి** :- హంజే బుద్ధిమతికే = ఓసీ బుద్ధిమతికా! నాథస్య= స్వామికి, నివేదయ తావత్=విన్నవింపుము, మమ=నాయొక్క, పరిభవేన= అవమానముతో, అన్యః = వేరొకడు, కః = ఎవడు, ఖిద్యతే = బాధపడును. అయిదుగురిలో భీముడే తన అవమానమునకు బాధపడువాడనుట.

చేటీ : యద్దేవ్యాజ్ఞాపయతి. (భీమముపసృత్య, అంజలిం బద్ధ్వా) కుమార! ఇతో౽ప్యధికతరమద్య మన్యుకారణమాసీ ద్దేవ్యాః. (జం దేవీ ఆణవేదీ, కుమాల, ఇదో వి అహి అదరం అజ్జ మణ్ణు కాలణం ఆసీ దేవీఏ.)

భీమసేనః : కిం నామాస్మా దప్యధికతరమ్? తత్కథయ కథయ.

కౌరవ్యవంశదావే౽స్మిన్ క ఏష శలభాయతే!
ముక్తవేణీం స్పృశన్నేనాం కృష్ణాం ధూమశిఖామివ॥ 19

---

యద్దేవీతి :— దేవీ = స్వామిని, యత్ ఆజ్ఞాపయతి=ఏది ఆజ్ఞాపించు చున్నదో (తదేవ కరోమి = అదే చేయుదుననుట). (భీమమ్ = భీమసేనుని, ఉపసృత్య=సమీపించి, అంజలింబద్ధ్వా=అంజలి ఘటించి), కుమార!=కుమార భీమసేనా!, ఇతః అపి=ఇంతకంటెను, ఈ హీనస్థితికంటె ననుట, అధికతరమ్= ఎక్కువదయిన, మన్యు కారణమ్=కోపకారణము, అద్య=ఈరోజు, దేవ్యాః= ద్రౌపదీదేవికి, ఆసీత్=కలిగెను.

కిం నామేతి :— కిం నామ = ఏమీ', అస్మాత్ అపి=దీనికంటెను, అధికతరమ్=ఎక్కువదా? తత్=అది, కథయ=చెప్పుము, కథయ=చెప్పుము.

కౌరవ్యేతి :— కౌరవ్యవంశదావే, అస్మిన్, కః, ఏషః, శలభాయతే, ముక్తవేణీమ్, స్పృశన్, ఏనామ్, కృష్ణామ్ ధూమశిఖామ్, ఇవ.

అన్వయము :— ముక్తవేణీమ్, ఏనామ్, కృష్ణామ్, ధూమశిఖామివ స్పృశన్, కౌరవ్యవంశదావే అస్మిన్ శలభాయతే ఏషః కః?

అర్థము :- ముక్తవేణీమ్ = అల్లుకొనని జుట్టుకలదైన, ఏనామ్=ఈ, కృష్ణామ్=ద్రౌపదిని, ధూమశిఖామ్ ఇవ=అగ్నిజ్వాలనువలె, స్పృశన్=తాకుచున్న వాడై, కౌరవ్యవంశదావే=కురువంశమునకు కార్చిచ్చుఅయిన, అస్మిన్=ఈ భీమునియందు, ఏషః=వీడు, కః=ఎవడు, శలభాయతే=మిడుత అగుచున్నాడు? ఛందస్సు—పథ్యావక్త్రము. ఉపమాలంకారము.

చేటీ : శృణోతు కుమారః అద్య ఖలు దేవీ అంబాసహితా సుభద్రాప్రముఖేన సపత్నీవర్గేణ పరివృతా ఆర్యాయా గాంధార్యాః పాదవందనం కర్తుం గతాసీత్. (సుణాదు కుమాలో. అజ్జ క్ఖు దేవీ అంబాసహిదా సుభద్దాప్పముహేణ సవత్తివగ్గేణ పరివుదా అజ్జాఏ గంధాలీఏ పాద వందణం కాదుం గదా ఆసీ.)

భీమసేనః : యుక్తమేతత్. వంద్యాః ఖలు గురవః. తతస్తతః.

---

సమాసములు :- కౌరవ్యాణాం వంశః = కౌరవ్యవంశః, కౌరవ్య వంశస్య దావః—కౌరవ్యవంశదావః, తస్మిన్ కౌరవ్యవంశదావే లేదా కౌరవ్యాః వంశాః ఇవ—కౌరవ్య వంశాః (ఉపమితం వ్యాఘ్రాదిభిస్సామాన్యాప్రయోగే) తేషాం దావః, తస్మిన్. శలభవత్ ఆచరతీతి—శలభాయతే. ముక్తా వేణీ యస్యాః సా—ముక్తవేణీ, తామ్, ముక్తవేణీమ్. ధూమస్య శిఖా—ధూమశిఖా, తామ్-ధూమ శిఖామ్.

క్రియ :- శలభ—ఆచారార్థమున క్యఙ్ ప్రత్యయము, ఆత్మనే, లట్, ప్రథమ.
శలభాయతే—శలభాయేతే—శలభాయన్తే. (నామధాతువు)

శృణోత్వితి :- కుమారః=కుమార భీమసేనుడు, శృణోతు=వినుగాక, అద్య=ఈరోజు, అంబాసహితా=కుంతీసహితయై, సుభద్రాప్రముఖేన=సుభద్ర మొదలుగాగల, సపత్నీవర్గేణ = సవతిబృందముతో, పరివృతా = కూడినదై, ఆర్యాయాః=మాన్యురాలైన, గాంధార్యాః=గాంధారియొక్క, పాదవందనమ్= పాదాభివందనమును, కర్తుమ్=చేయుటకొరకు, దేవీ=ద్రౌపది, గతా=వెళ్ళినది, ఆసీత్ ఖలు=అయినది సుమా!

యుక్తమితి :— ఏతత్=ఈ వెడలుట, యుక్తమ్=తగినది, గురవః= పెద్దలు, వంద్యాః ఖలు=మ్రొక్కదగినవారుగదా! తతః తతః?=అటుపైని ఏమి జరిగినది?

చేటీ : తతః ప్రతినివర్తమానా భానుమత్యా దేవీ దృష్టా.
(తదో పడినివుత్తమాణా భానుమదీఏ దేవీ దిట్ఠా.)

భీమసేనః : (సక్రోధమ్) ఆః శత్రోః భార్యయా దృష్టా! హన్త స్థానం క్రోధస్య దేవ్యాః. తతస్తతః.

చేటీ : తతస్తయా దేవీం ప్రేక్ష్య సఖీజన దత్తదృష్ట్యా సగర్వ మీషత్ విహస్య భణితమ్. (తదో తాఏ దేవీం పేక్ఖిఅ సహీజణ దిణ్ణ దిట్ఠిఏ సగవ్వం ఈసి విహసిఅ భణిదం.)

భీమః : న కేవలం దృష్టా ఉక్తా చ. అహో కిం కుర్మః! తత స్తతః.

---

**తత ఇతి** :- తతః=అపినుండి, ప్రతినివర్తమానా=తిరిగివచ్చుచున్నదై, దేవీ=ద్రౌపదీదేవి, భానుమత్యా=భానుమతీదేవితో (దుర్యోధనుని భార్య), దృష్టా= చూడబడినది.

**సక్రోధమితి** :- (సక్రోధమ్ = క్రోధముతో) ఆః=ఆ!, శత్రోః= శత్రువుయొక్క, భార్యయా=భార్యతో, దృష్టా!=చూడబడినదా!. హన్త=అహా, దేవ్యాః=ద్రౌపదియొక్క, క్రోధస్య=కోపమునకు, స్థానమ్=ఉచితము. దేవి కోపించుట ఉచితమే అనుట, తతస్తతః=తరువాత తరువాత?

**తతస్తయేతి** :- తతః=తరువాత, దేవీమ్=ద్రౌపదిని, ప్రేక్ష్య=చూచి, సగర్వమ్=గర్వముతో, ఈషత్=కొంచెము, విహస్య=నవ్వి, సఖీజన=చెలికత్తెల యందు, దత్త=ఉంచబడిన, దృష్ట్యా=చూపులుకలదైన, తయా=ఆ భానుమతిచే, భణితమ్=(ఇట్లు) పల్కబడినది. ఆమె పల్కినదనుట.

**న కేవలమితి** :- కేవలమ్=కేవలము, దృష్టా న=చూడబడినదేకాదు, ఉక్తా చ? = (ఆమెచే) పలుకరింపబడినది కూడనా? చూచుటేకాక పల్కినది కూడనా అనుట. అహో=అయ్యో!, కిం కుర్మః=ఏమి చేయుదుము! తతస్తతః= అటుపైనటుపైని—!

చేటీ : అయి యాజ్ఞసేని! పంచగ్రామాః ప్రార్థ్యన్తే ఇతి శ్రూయతే. తత్ కస్మాదిదానీమపి తే కేశా న సంయమ్యన్తే? (అఈ జణ్ణసేణి, పంచగామా పత్థీఅన్తి త్తి సుణీఅది. తా కీస దాణీం వి దే కేసా ణ సంజమీఅన్తి?)

భీమసేనః : సహదేవ! శ్రుతమ్?

సహదేవః : ఆర్య! కిమిహోచ్యతే! దుర్యోధనకళత్రం హి సా. పశ్య—

స్త్రీణాం హి సాహచర్యాత్ భవన్తి చేతాంసి భర్తృసదృశాని।
మధురాపి హి మూర్ఛయతే విషవిటపిసమాశ్రితా వల్లీ॥ 20

---

**అయీతి :-** అయి యాజ్ఞసేని!=ఓయాజ్ఞసేనీ!, పంచగ్రామాః=అయిదూళ్లు, ప్రార్థ్యన్తే=యాచింపబడుచున్నవి, ఇతి=అని, శ్రూయతే=వినబడుచున్నది. తత్=అందుచే, అయినప్పటికిననుట, ఇదానీమ్ అపి=ఇప్పుడుకూడ, తే=నీయొక్క, కేశాః=శిరోజములు, కస్మాత్=ఎందుచేత, న సంయమ్యన్తే=అల్లుకొనబడుటలేదు? విరబోసికొన్న జుట్టును జడగా అల్లుకొనవేల యనుట.

**సహదేవ ఇతి :-** సహదేవ =సహదేవుడా!, శ్రుతమ్?=వినబడినదా?

**ఆర్యేతి :-** ఆర్య!=మాన్యుడా!, ఇహ=ఈ విషయమును, కిమ్ ఉచ్యతే=చెప్పబడునదేమి?, ఏమి చెప్పగల ననుట. సా=ఆమె, దుర్యోధన=దుర్యోధనుని కళత్రం హి=భార్యగదా!, పశ్య=చూడుము.

**స్త్రీణామితి :-** స్త్రీణామ్, హి, సాహచర్యాత్, భవన్తి, చేతాంసి, భర్తృసదృశాని, మధురా, అపి, హి, మూర్ఛయతే, విషవిటపిసమాశ్రితా, వల్లీ.

భీమసేనః : బుద్ధిమతికే! తతో దేవ్యా కి మభిహితమ్?

---

**అన్వయము :—** స్త్రీణాం చేతాంసి సాహచర్యాత్ భర్తృసదృశాని భవన్తి హి. మధురా అపి వల్లీ, విషవిటపి సమాశ్రితా మూర్ఛయతే హి.

**అర్థము :—** స్త్రీణామ్=స్త్రీలయొక్క, చేతాంసి=మనస్సులు, సాహచర్యాత్=సహవాసమువలన, భర్తృ సదృశాని=మగల మనసులతో సమానమైనవి, భవన్తిహి=అగుచున్నవికదా!, మధురా అపి=తీయనైనదే అయినను, వల్లీ=తీగ, విషవిటపి=విషవృక్షమును, సమాశ్రితా=అల్లుకొన్నదై, మూర్ఛయతే హి=(రుచి చూచినవారిని) మూర్ఛిల్లజేయుచున్నది గదా!

**సమాసములు —** భర్తుః (చేతసా) సదృశమ్,భర్తృ సదృశమ్ తాని-భర్తృసదృశాని. విషాత్మకః విటపీ—విష విటపీ (మధ్యమపదలోపి), విష విటపినం సమాశ్రితా—విషవిటపి సమాశ్రితా.

**అలంకారము :—** స్త్రీల హృదయములు సాహచర్యము వలన భర్తృసదృశములగును అన్నది ప్రకృతవాక్యము. కాఠిన్యమును వహించుట అను ధర్మము వాచ్యము కాలేదు. సందర్భమునుబట్టి గమ్యమానమగుచున్నది. తీయని లత విషవృక్షము నాశ్రయించుటవలన విషప్రాయమగును — మూర్ఛిల్లజేయును అన్నది అప్రకృతవాక్యము. మూర్ఛిల్లజేయుట ధర్మము. ఇట్లు విభిన్న వాక్యములతో విభిన్న ధర్మములు బింబ ప్రతిబింబ భావమేర్పడునట్లు నిర్దిష్టములైనవి కావున నిది దృష్టాంతాలంకారమగును. "చేద్బింబ ప్రతిబింబత్వం దృష్టాంతః తదలంకృతిః త్వమేవ కీర్తిమాన్ రాజన్! విధురేవ హి కాన్తిమాన్॥"

**ఛందస్సు :-** ఆర్యావృత్తము.

**బుద్ధిమతికే ఇతి :—** బుద్ధిమతికా!, తతః = అప్పుడు, దేవ్యా= ద్రౌపదిచే, కిమ్ అభిహితమ్=ఏమి జవాబు చెప్పబడినది?

చేటీ : కుమార! యది పరిహీనం మమ వచనం భవేత్తదా దేవీ భణతి. (కుమాల, జఇ పరిహీణం మమ వఅణం భవే తదో దేవీ భణాది.)

భీమసేనః : కిం పున రభిహితం భవత్యా?

చేటీ : మయా ఏవం భణితం. అయి భానుమతి! యుష్మాక మముక్తేషు కేశేషు కథ మస్మాకం దేవ్యాః కేశాః సంయమ్యన్త ఇతి. (మఏ ఏవ్వం భణిదం. అఇ భాణుమది, తుహ్మాణం అముక్కేసు కేసేసు కధం అహ్మాణం దేవీఏ కేసా సంజమీఅన్తి త్తి.)

భీమసేనః : (సపరితోషమ్) సాధు బుద్ధిమతికే, సాధు. తదభిహితం యదస్మత్ పరిజనోచితమ్. (అధీర మాసనా దుత్తిష్ఠన్)

---

**కుమార ఇతి** :— కుమార!=కుమార భీమసేనా!, మమ=నాయొక్క, వచనమ్=మాట, పరిహీనమ్=పడిపోయినది, నష్టపోయినది, భవేత్ యది= అగునేని, తదా=అప్పుడు, దేవీ=స్వామిని, భణతి=పలుకును. నా మాట పడి పోయినప్పుడుగదా ద్రౌపది నోరువిప్పి పల్కునట! యనుట.

**కింపునరితి** :— భవత్యా=నీచేత, పునః=తిరిగి, కిమ్ అభిహితమ్= ఏమి చెప్పబడినది. (పునః అనునదికూడ కొండొకచో ఊతపదమే.)

**మయేతి** :— మయా=నాచేత, ఏవమ్=ఇట్లు, భణితమ్=చెప్పబడినది. అయి భానుమతీ!=ఓ భానుమతీ!, యుష్మాకమ్=నీయొక్క, కేశేషు=శిరోజములు, అముక్తేషు=విడివడకుండగా, అస్మాకమ్=మాయొక్క, దేవ్యాః=స్వామిని యొక్క, కేశాః=శిరోజములు, కథమ్=ఎట్లు, సంయమ్యన్తే?=ముడువబడును?, ఇతి=అని జవాబు చెప్పితిననుట.

**సపరితోషమితి** .— (సపరితోషమ్ = సంతోషముతో) బుద్ధిమతికా! సాధు సాధు=బాగు బాగు!, యత్=ఏదయిత్తే, అస్మత్=మాయొక్క, పరిజన=

అత్రభవతి, పాంచాలరాజ తనయే! శ్రూయతామ్.
అచిరేణైవ కాలేన—

చంచద్భుజ భ్రమిత చండ గదాభిఘాత
సంచూర్ణితోరు యుగలస్య సుయోధనస్య!
స్త్యానావనద్ధ ఘన శోణిత సిక్త పాణి
రుత్తంసయిష్యతి కచాం-స్తవ దేవి! భీమః॥ 21

---

సేవకులకు, ఉచితమ్=తగినదో, తత్=అది, అభిహితమ్=(నీచే) చెప్పబడినది. (ఆసనాత్=కూర్చున్న చోటినుండి, అధీరమ్=కొంచెము తీవిగా, ఈషత్ ధీరముగా, ఉత్తిష్ఠన్=లేచుచు), అత్ర భవతి=మాన్యమైన, పాంచాలరాజ తనయే=పాంచాల రాజకుమారీ!, శ్రూయతామ్=వినుము, అచిరేణ కాలేన ఏవ=తొందర లోనే (రేపో మాపో అనుట).—

**చంచదితి :—** చంచత్—యుగలస్య, సుయోధనస్య, స్త్యానావనద్ధ—పాణిః, ఉత్తంసయిష్యతి, కచాన్, తవ, దేవి, భీమః.

**అన్వయము :—** దేవి! చంచద్భుజ—యుగళస్య, సుయోధనస్య, స్త్యానావనద్ధ—పాణిః, భీమః, తవ కచాన్ ఉత్తంసయిష్యతి. స్త్యానావబద్ధ.... సిక్తపాణిః అని పాఠాంతరము.

**అర్థము :-** దేవి!=ఓ ద్రౌపదీ!, చంచత్=కదలాడుచున్న, భుజ=బాహువులతో, భ్రమిత=త్రిప్పబడుచున్న, చండ=భయంకరమైన, గదా=గద యొక్క, అభిఘాత=ప్రహారముతో, సంచూర్ణిత=తుత్తునియలు గావింపబడిన, ఊరు యుగలస్య=తొడల జంట కలవాడైన, సుయోధనస్య=దుర్యోధనునియొక్క, స్త్యాన=దట్టముగా, అవనద్ధ=పులుముకొనబడిన, ఘన=అధికమైన, శోణిత=రక్తముతో, రక్త=ఎఱ్ఱుపెక్కిన, పాణిః=చేదోయి కలవాడైన, భీమః=ఈ భీముడు, తవ = నీయొక్క, కచాన్ = శిరోజములను, ఉత్తంసయిష్యతి = అలంకరింప బోవుచున్నాడు. (స్త్యానావబద్ధ=నిండుగా పట్టుకొన్న, అధిక రక్తముతో, సిక్త పాణిః=తడిసిన చేదోయికలవాడు.)

ద్రౌపదీ : కిం నాథ దుష్కరం త్వయా పరికుపితేన! సర్వథా అనుగృహ్ణన్తు వ్యవసితం తే భ్రాతరః. (కిం ణాహ దుక్కరం తుప పరికువిదేణ. సవ్వహా అణుగేణ్హన్తు వదం వవసిదం దే భాదరో)

---

సమాసములు :- చంచన్తౌ భుజౌ—చంచద్భుజౌ, చంచద్భుజాభ్యామ్ భ్రమితా—చంచద్భుజభ్రమితా; చండా చ సా గదా చ—చండగదా, చంచద్భుజ భ్రమితా చ సా చండగదా చ—చంచద్భుజ భ్రమిత చండ గదా. తస్యాః అభిఘాతః—చంచద్భుజ భ్రమిత చండగదాభిఘాతః, ఊర్వోః యుగలమ్ — ఊరు యుగలమ్. చంచద్భుజ—అభిఘాతేన సంచూర్ణితమ్ ఊరుయుగళం యస్య సః—చంచద్భుజ—సంచూర్ణితోరుయుగలః—తస్య. స్త్యానం చ తత్ అవనద్ధం చ—స్త్యానావనద్ధమ్ చ తత్ శోణితమ్—స్త్యానావనద్ధ శోణితమ్, తేన రక్తౌ పాణీ యస్య సః—స్త్యానావనద్ధ—పాణిః. చేతులు కాళ్ళు మొదలయిన అవయవముల విషయమున రక్తమ్ పాణిః యస్య అని ఏకవచనములోనైన చెప్పవచ్చును. జాత్యేకవచన మగును.

సంధులు :- గదా+అభిఘాత, స్త్యాన+అవనద్ధ—సవర్ణదీర్ఘ సంధులు. సంచూర్ణిత+ఊరు—గుణసంధి. పాణిః+ఉత్తంస—రేఫాదేశవిసర్గసంధి. కచాన్+తవ—తాంస్తాన్‌సంధి.

క్రియ :- తసి అలంకారే, ణిచ్, పరస్మై, లృట్, ప్రథమ
ఉత్తంసయిష్యతి—ఉత్తంసయిష్యతః—ఉత్తంసయిష్యన్తి.

ఛందస్సు :- వసంతతిలకావృత్తము. త—భ—జ—జ—గ—గ.

కిం నాథేతి :— నాథ! = స్వామీ! పరికుపితేన = మిక్కిలి కోపించిన వాడవైన, త్వయా=నీచేత, దుష్కరమ్=కష్టసాధ్యమైనది, కిమ్=ఏది!, తే=నీ యొక్క, వ్యవసితమ్=నిశ్చయమును, భ్రాతరః=సోదరులు, సర్వథా=అన్ని విధములుగను, అనుగృహ్ణన్తు=ఆమోదింతురుగాక!

సహదేవః : అనుగృహీత మేత దస్మాభిః.

(నేపథ్యే మహాన్ కలకలః. సర్వే సవిస్మయ మాకర్ణయన్తి)

మంథాయస్తార్ణవాంభః ప్లుత కుహర చలన్మందర ధ్వాన ధీరః
కోణాఘాతేషు గర్జత్ప్రళయ ఘనఘటాన్యోన్య సంఘట్ట చండః।

---

అనుగృహీతమితి :- ఏతత్=ఈ నిశ్చయము, అస్మాభిః=మాచేత, అనుగృహీతమ్=ఆమోదింపబడినది.

నేపథ్యే ఇతి :— (నేపథ్యే=తెరవెనుక, మహాన్ కలకలః=గొప్ప కలకలము, సర్వే=అందరును, సవిస్మయమ్=ఆశ్చర్యముతో, ఆకర్ణయన్తి= వినుచుందురు.)

మంథాయస్తేతి :- మంథాయస్త-ధీరః, కోణాఘాతేషు, గర్జత్-చండః, కృష్ణా క్రోధాగ్ర దూతః, కురుకుల—వాతః, కేన, అస్మత్సింహనాదప్రతిరసిత సఖః, దుందుభిః, తాడ్యతే, అయమ్.

అన్వయము :— మంథాయస్త—ధీరః కోణాఘాతేషు గర్జత్ప్రళయ— చండః కృష్ణా క్రోధాగ్రదూతః కురుకుల—వాతః అస్మత్సింహ—సఖః అయమ్ దుందుభిః కేన తాడ్యతే?

అర్థము :- మంథ=మథించుటచేత, ఆయస్త=కల్లోలితమైన, అర్ణవ= సముద్రముయొక్క, అంభః=నీటితో, ప్లుత=నిండిన, కుహర=గుహలుకల్గి, చలత్=పరిభ్రమించుచున్న, మందర=మందరపర్వతముయొక్క, ధ్వాన=ధ్వని వలె, ధీరః=గంభీరమైనదియు, కోణాఘాతేషు=లక్ష ఢక్కలును వేయి భేరులును ఒకేసారి ప్రయోగింపబడుచుండగా, గర్జత్=ఉరుముచున్న, ప్రళయ ఘన=ప్రళయ కాల మేఘములయొక్క, ఘటా=సమూహములయొక్క, అన్యోన్య సంఘట్ట= పరస్పర సంఘర్షణమువలె, చండః=భీషణమైనదియు, కృష్ణా=ద్రౌపదియొక్క, క్రోధ=కోపముయొక్క, అగ్రదూతః=అగ్రదూతయు, కోపమును మునుముందుగా

కృష్ణా క్రోధాగ్రదూతః కురుకుల నిధనోత్పాత నిర్ఘాత వాతః
కేనాస్మత్సింహనాద ప్రతిరసితసఖో దుందుభి స్తాడ్యతేఽయమ్॥ 22

చాటునదియు ననుట, కురుకుల=కురువంశముయొక్క, నిధన=వినాశమునకు, ఉత్పాత=దుశ్శకునమైన, నిర్ఘాత వాతః=పెనుగాలి(వంటిది)యును, అస్మత్=మన యొక్క, సింహనాద=సింహనాదములయొక్క, వీరగర్జనలయొక్క అనుట, ప్రతిరసిత=ప్రతిధ్వనులకు, సఖః=మిత్రమును, సదృశ మనుట, అయిన, అయమ్=ఈ, దుందుభిః=భేరి, కేన=ఎవనిచేత, తాడ్యతే=మ్రోయింపబడుచున్నది? ఎవరా మ్రోగించునది యనుట. "ఢక్కా శతసహస్రాణి భేరీ దశశతానిచ। ఏకదా యత్ర హన్యన్తే కోణాఘాతః స ఉచ్యతే" — భరతుడు.

సమాసములు :- మంథేన ఆయస్తః—మంథాయస్తః. స చాసౌ అర్ణవశ్చ—మంథాయస్తార్ణవః, తస్య అంభః—మంథాయస్తార్ణవాంభః, తేన ప్లుతాని మంథాయస్తార్ణవాంభఃప్లుతాని, తాని చ కుహరాణి యస్య సః—మంథాయస్తార్ణవాంభః ప్లుత కుహరః; చలంశ్చాసౌ మందరశ్చ—చలన్మందరః-మంథాయస్త—కుహరశ్చ అసౌ చలన్మందరః—మంథాయస్త—మందరః. తస్య ధ్వాన ఇవ ధీరః—మంథా యస్త—ధీరః. ప్రళయకాలే విద్యమానాః ఘనాః-ప్రళయఘనాః, తేషాం ఘటాః— ప్రళయఘనఘటాః, గర్జన్త్యః ప్రళయ ఘన ఘటాః—గర్జత్ప్రళయ ఘన ఘటాః. అన్యోన్యం సంఘట్టః-అన్యోన్య సంఘట్టః. గర్జత్ప్రళయ—ఘటానామ్ అన్యోన్య సంఘట్టః—గర్జత్ప్రళయ—సంఘట్టః ఇవ చండః. కృష్ణాయాః క్రోధః—కృష్ణా క్రోధః. అగ్రే దూతః — అగ్రదూతః, కృష్ణాక్రోధస్య అగ్రదూతః — కృష్ణా క్రోధాగ్రదూతః. కురోః కులమ్—కురుకులమ్. కురుకులస్య నిధనమ్—కురుకుల నిధనమ్, తస్య ఉత్పాతః — కురుకులనిధనోత్పాతశ్చ అసౌ నిర్ఘాత వాతశ్చ. సింహస్య నాద ఇవ—సింహనాదః. అస్మాకం సింహనాదః అస్మత్ సింహనాదః తస్య ప్రతిరసితమ్—అస్మత్సింహనాద ప్రతిరసితమ్. తస్య సఖా.

**సంధులు** :- చలత్+మందర—అనునాసికాదేశసంధి. కోణ+ఆఘాత— ఘటా+అన్యోన్య, ఆయస్త+అర్ణవ+అంభః, క్రోధ+అగ్ర, కేన+అస్మత్— సవర్ణదీర్ఘములు. నిధన+ఉత్పాత—గుణసంధి. ప్రతిరసిత సఖః+దుందుభిః— ఉత్వాదేశవిసర్గసంధి. సఖి శబ్దమునకు సమాసాంతకార్యముగా టచ్(అ) చేరి

(ప్రవిశ్య సంభ్రాన్తః)

కంచుకీ : కుమార! ఏష ఖలు భగవాన్ వాసుదేవః—

(సర్వే కృతాంజలయః సముత్తిష్ఠన్తి)

భీమసేనః : (ససంభ్రమమ్) క్వాసౌ భగవాన్?

---

అదంతమైనది. దుందుభిః=తాడ్యతే—సాదేశవిసర్గసంధి. తాడ్యతే+అయమ్—పూర్వరూపసంధి.

ఛందస్సు :— స్రగ్ధరావృత్తము. "మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిమునియతియుతా స్రగ్ధరా కీర్తితేయమ్." మ-ర-భ-న-య-య-య. 1-7-7.

| మ | ర | భ | న | య | య | య |
|---|---|---|---|---|---|---|
| U U U | U I U | U I I | I I I | I U U | I U U | I U I |
| మంథాయ | స్తార్ణవాం | భః ప్లుత | కుహర | చలన్మం | దరధ్వా | నధీరః |

క్రియ :- తడిజ్ తాడనే—ఆత్మనే—లట్—ప్రథమ
తాడ్యతే—తాడ్యేతే—తాడ్యన్తే.

**అలంకారము** :- ఉత్ప్రేక్ష. ప్రకృతాప్రకృతములు రెండును ఉక్తములగుటచే నిది ఉక్తవస్తూత్ప్రేక్ష అగుచున్నది.

ప్రవిశ్యేతి :- (ప్రవిశ్య=ప్రవేశించి, సంభ్రాన్తః=కంగారుపడుచున్నవాడై)

**కుమార ఇతి** :— కుమార=కుమార భీమసేనా!, ఏషః=ఇతడు, ఈ వచ్చినవాడనుట, భగవాన్=భగవంతుడైన, వాసుదేవః ఖలు=శ్రీకృష్ణుడుగదా!

**సర్వ ఇతి** :- (కృతాంజలయః=నమస్కరించుచున్నవారై, సర్వే=అందరును, సముత్తిష్ఠన్తి=నిలుతురు)

**ససంభ్రమమితి**:- (ససంభ్రమమ్ = కంగారుగా), అసౌ = ఈ, భగవాన్=వాసుదేవుడు, క్వ?=ఎక్కడ?. దుందుభినిబట్టి, కంచుకి వాక్యమునుబట్టి

కంచుకీ : పాండవపక్షపాతామర్షితేన సుయోధనేన సంయమితు మారబ్ధః.

(సర్వే సంభ్రమం నాటయన్తి)

భీమసేనః : కిం సంయతః?

కంచుకీ : నహి నహి, సంయమితు మారబ్ధః

భీమః : కిం కృతం దేవేన?

---

శ్రీకృష్ణుడు ప్రవేశించుచున్నాడని వీరందరు భ్రమపడిరి. కానీ నిజమునకు ఏషః = ఈ, భగవాన్ వాసుదేవః = భగవంతుడైన శ్రీకృష్ణుడు—అని ఏదో చెప్పబోవుట కంచుకి అభిప్రాయము. "ఖలు" ప్రసిద్ధార్థకము.

పాండవేతి :— పాండవ పక్షపాత=(శ్రీకృష్ణుని యందలి) పాండవ పక్షపాతముతో, అమర్షితేన=కుపితుడైన, సుయోధనేన=దుర్యోధనునిచే, సంయమితుమ్=బంధించుటకు, ఆరబ్ధః=ప్రారంభింపబడినవా డయ్యెను. దుర్యోధనుడు కృష్ణుని బంధింప ప్రయత్నించెననుట.

సర్వ ఇతి :— (సర్వే = అందరును, సంభ్రమమ్=కంగారుపడుటను, నాటయన్తి=అభినయింతురు.)

కిమితి :— సంయతః=బంధింపబడినవాడు (అభూత్) కిమ్=(అయ్యెనా) ఏమి?. బంధించెనా? అనుట.

నహీతి :— నహి, నహి=లేదు లేదు, సంయమితుమ్=బంధించుటకు, ఆరబ్ధః=ప్రారంభింపబడినాడు.

కిం కృతమితి :— దేవేన=దేవుడైన శ్రీకృష్ణునిచే, కిమ్ కృతమ్=(అప్పుడు) ఏమి చేయబడినది?

కంచుకీ : తతః స మహాత్మా దర్శితవిశ్వరూప తేజస్సంపాత మూర్ఛిత మవధూయ కురుకులమ్, అస్మచ్ఛిబిర సన్నివేశ మనుప్రాప్తః, కుమార మవిలంబితం ద్రష్టు మిచ్ఛతి.

భీమసేనః : (సోపహాసమ్) కిం నామ దురాత్మా సుయోధనో భగవంతం సంయమితు మిచ్ఛతి? (ఆకాశే దత్తదృష్టిః) ఆః దురాత్మన్. కురుకులపాంసుల ఏవ మతిక్రాంత మర్యాదే త్వయి నిమిత్తమాత్రేణ పాండవక్రోధేన భవితవ్యమ్.

---

**తత ఇతి :—** తతః=అనంతరము, సః=ఆ, మహాత్మా=మహాత్ముడైన శ్రీకృష్ణుడు, దర్శిత=చూపింపబడిన, విశ్వరూప=విరాడ్రూపము యొక్క, తేజః సంపాత=కాంతిసమూహముచే, లేక, తేజస్సుతోనైన ప్రహారముతో, మూర్ఛితమ్=మూర్ఛిల్లిన, కురుకులమ్=కురువంశమును, కౌరవుల నందరినను, అవధూయ=తిరస్కరించి, అస్మత్=మా యొక్క, శిబిర సన్నివేశమ్=శిబిరస్థానమును, అనుప్రాప్తః=సమీపించినవాడై, కుమారమ్=కుమార భీమసేనుని, అవిలంబితమ్=శీఘ్రముగా, వెంటనే, ద్రష్టుమ్=చూచుటకు, ఇచ్ఛతి=కోరుచున్నాడు.

**సోపహాసమితి :-** (సోపహాసమ్=వెక్కిరింతగా), కిం నామ=ఏమీ!, దురాత్మా=దుర్మార్గుడైన, సుయోధనః=దుర్యోధనుడు, భగవంతమ్=భగవంతుడైన శ్రీకృష్ణుని, సంయమితుమ్=బంధించుటకు, ఇచ్ఛతి=కోరుచున్నాడా? బంధింప గోరునా? అనుట. (ఆకాశే=ఆకాశమునందు, దత్త దృష్టిః=చూపు నిల్పినవాడై) ఆః=ఓరీ, దురాత్మన్=దుర్మార్గుడా!, కురుకుల పాంసుల=కురువంశ పాపీ!, ఏవమ్=ఇట్లు, అతిక్రాంత మర్యాదే=మర్యాద మీరిన వాడవైన, త్వయి=నీ విషయమునందు, పాండవ క్రోధేన=పాండవ కోపముచే, నిమిత్తమాత్రేణ=నిమిత్తమాత్రముగా, భవితవ్యమ్=ఉండదగినది. దుర్యోధన వినాశముపట్ల పాండవ క్రోధము ఇక నిమిత్తమాత్రమే అనుట.

సహదేవః : ఆర్య! కిమసౌ దురాత్మా సుయోధనో వాసుదేవ మపి భగవన్తం స్వరూపేణ న జానాతి?

భీమసేనః : వత్స! మూఢః ఖల్వయం దురాత్మా కథం జానాతి! పశ్య—

ఆత్మారామా విహిత రతయో నిర్వికల్పే సమాధౌ
జ్ఞానోద్రేకా ద్విఘటిత తమోగ్రన్థయః సత్త్వనిష్ఠాః।
యం వీక్షన్తే కమపి తమసాం జ్యోతిషాం వా పరస్తాత్
తం మోహాన్ధః కథ మయ మముం వేత్తు దేవం
- పురాణమ్॥ 23

---

ఆర్యఇతి :- ఆర్య!=మాన్యుడా! అసౌ=ఈ, దురాత్మా=దుర్మార్గుడైన సుయోధనః=దుర్యోధనుడు, భగవన్తమ్=భగవంతుడైన, వాసుదేవమ్ అపి=శ్రీకృష్ణునికూడ, స్వరూపేణ=సత్యస్వరూపముతో, యథార్థముగా ననుట, న జానాతి కిమ్?=తెలిసికొనలేకపోవుచున్నాడా ఏమి?

వత్సఇతి :- వత్స!=నాయనా! అయమ్=ఈ, దురాత్మా=దుర్మార్గుడు, మూఢః ఖలు=మూఢుడు గదా!, కథం జానాతి=ఎట్లు ఎరుగును. పశ్య=చూడుము—

ఆత్మారామాఇతి :- ఆత్మారామాః, విహిత రతయః, నిర్వికల్పే, సమాధౌ, జ్ఞానోద్రేకాత్, విఘటిత తమోగ్రంథయః, సత్త్వనిష్ఠాః, యమ్, వీక్షన్తే, కమ్, అపి, తమసామ్, జ్యోతిషామ్, వా, పరస్తాత్, తమ్, మోహాంధః, కథమ్, అయమ్, అముమ్, వేత్తు, దేవమ్, పురాణమ్.

అన్వయము :- ఆత్మారామాః నిర్వికల్పే సమాధౌ విహితరతయః జ్ఞానోద్రేకాత్ విఘటిత తమోగ్రంథయః సత్త్వనిష్ఠాః తమసామ్ వా జ్యోతిషామ్(వా) పరస్తాత్ యం కమపి వీక్షన్తే తమముం పురాణం దేవం మోహాంధః అయం కథం వేత్తు!

అర్థము :- ఆత్మారామాః=ఆత్మయందు విహరించు శీలము కలవారును, నిర్వికల్పే=వికల్ప రహితమైన, సమాధౌ=నిశ్చలస్థితియందు, విహిత=విధింపబడిన, రతయః=తీవ్రమైన కోరిక కలవారును, నిర్వికల్పసమాధియందే ఎల్లప్పుడు నుండువారనుట, జ్ఞాన=తెలివియొక్క, ఉద్రేకాత్=ఆధిక్యము వలన, విఘటిత=త్రెంపబడిన, తమో గ్రంథయః=అజ్ఞానబంధనములు కలవారును, సత్త్వనిష్ఠాః=సత్త్వగుణమునందు గాఢాభినివేశము కలవారును, తమసామ్ వా=చీకటులకు గాని, జ్యోతిషామ్ వా=వెలుగులకు గాని, అజ్ఞానమునకు గాని జ్ఞానమునకు గాని అనుట, పరస్తాత్=ఆవల, కమ్ అపి=అనిర్వచనీయుడైన, యమ్=ఎవనిని, వీక్షన్తే=చూచుచున్నారో, అజ్ఞాతపురుష నిర్దేశమునందు "యం కమపి" అని చెప్పుట సంస్కృతపు నుడికారము, తమ్=అటువంటి, అనిర్వచనీయుని అనుట, అముమ్=ఈ, పురాణమ్=సనాతనుడైన, దేవమ్=పరమాత్మను, మోహాంధః=అజ్ఞానముతో గ్రుడ్డివాడైన, అయమ్=వీడు—ఈ దుర్యోధనుడు, కథమ్=ఎట్లు, వేత్తు=ఎఱుగును. తెలిసికొనలేడనుట.

సమాసములు :- ఆత్మని ఆసమన్తాత్ రమన్తే ఇతి — ఆత్మారామాః. విహితా రతిః యైః తే—విహితరతయః. జ్ఞానస్య ఉద్రేకః—జ్ఞానోద్రేకః-తస్మాత్. తమసః గ్రంథయః—తమోగ్రంథయః, విఘటితాః తమోగ్రంథయః యైః తే—విఘటిత తమోగ్రంథయః. సత్త్వే నిష్ఠా యేషాం తే—సత్త్వనిష్ఠాః. మోహేన అంధః—మోహాంధః.

సంధులు :— ఆత్మ+ఆరామాః, మోహ+అంధః—సవర్ణదీర్ఘ సంధులు. రతయః+నిర్వికల్ప, తమః+గ్రంథయః—ఉత్వ్యాదేశ విసర్గసంధులు. జ్ఞాన+ఉద్రేకాత్—గుణసంధి.

క్రియ : వి+ఈక్షజ్ దర్శనే—ఆత్మనే—లట్, ప్రథమ.
వీక్షతే—వీక్షేతే—వీక్షన్తే.
విద జ్ఞానే—పరస్మై, లోట్—ప్రథమ.
వేత్తు/విత్తాత్—విత్తామ్—విదన్తు.

ఆర్య జయన్ధర! కిమిదానీ మధ్యవస్యతి గురుః?

కంచుకీ : స్వయమేవ గత్వా మహారాజస్యాధ్యవసితం జ్ఞాస్యతి కుమారః (ఇతి నిష్క్రాన్తః)

(నేపథ్యే కలకలానంతరమ్)

భో భో ద్రుపద విరాట వృష్ణ్యంధక సహదేవ ప్రభృత యోఽస్మదక్షౌహిణీపతయః కౌరవ చమూ ప్రధాన యోధాశ్చ శృణ్వన్తు భవన్తః.

---

ఛందస్సు :— మందాక్రాంతము. "మందాక్రాంతాంబుధిరసనగైర్మో భనౌ తౌ గయుగ్మమ్." మ—భ—న—త—త—గగ; 4–6–4

| మ | - | భ | - | న | - | త | - | త | - | గగ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| U U U | - | U I I | - | I I I | - | U U I | - | U U I | - | U U |
| ఆత్మారా | - | మా విహి | - | తరత | - | యో, నిర్వి | - | కల్పే స | - | మాధౌ |

ఆర్య జయంధరేతి :— ఆర్య!=మాన్యుడా!, జయంధర!=జయంధరుడా! ఇదానీమ్=ఇప్పుడు, గురుః=అగ్రజుడు (ధర్మజుడు) కిమ్ అధ్యవస్యతి= ఏమి నిశ్చయించుచున్నాడు?

స్వయమేవేతి :— కుమారః = కుమార భీమసేనుడు, స్వయమేవ గత్వా=స్వయముగా వెళ్ళి, మహారాజస్య=ధర్మరాజుయొక్క, అధ్యవసితమ్= నిశ్చయమును, జ్ఞాస్యతి=తెలిసికొనగలడు. (ఇతి=అని, నిష్క్రాంతః - నిష్క్రమించినాడు)

నేపథ్య ఇతి:— (కలకలానంతరమ్=కలకలము తరువాత, నేపథ్యే= తెర వెనుక)

భోభో ఇతి :- భో భో=ఓయోయీ, ద్రుపద విరాట వృష్ణ్యంధక సహదేవ ప్రభృతులైన, అస్మత్=మాయొక్క, అక్షౌహిణీ పతయః=అక్షౌహిణీ

యత్సత్యవ్రత భంగ భీరు మనసా యత్నేన మందీకృతం
యద్విస్మర్తుమపీహితం శమవతా శాంతిం కులస్యేచ్ఛతా।
తత్ ద్యూతారణి సంభృతం నృపసుతా కేశాంబరాకర్షణైః
క్రోధజ్యోతిరిదం మహత్కురువనే యౌధిష్ఠిరం జృంభతే॥ 24

---

పతులారా! చ=మరియు, కౌరవ చమూ=కౌరవసేనయొక్క, ప్రధానయోధాః—ప్రముఖ వీరులారా! భవన్తః=మీరు, శృణ్వన్తు=వినుడీ!

యత్సత్యేతి :- యత్, సత్యవ్రతభంగ భీరు మనసా, యత్నేన, మందీకృతమ్, యత్, విస్మర్తుమ్, అపి, ఈహితమ్, శమవతా, శాంతిమ్, కులస్య, ఇచ్ఛతా, తత్, ద్యూతారణి సంభృతమ్, నృపసుతా కేశాంబరాకర్షణైః, క్రోధజ్యోతిః, ఇదమ్, మహత్, కురువనే, యౌధిష్ఠిరమ్, జృంభతే.

అన్వయము :- సత్యవ్రతభంగ భీరుమనసా యత్ యత్నేన మందీకృతమ్, కులస్య శాంతిమిచ్ఛతా శమవతా యద్విస్మర్తుమపి ఈహితమ్, ద్యూతారణి సంభృతమ్, తత్ యౌధిష్ఠిరమ్ క్రోధజ్యోతిః, నృపసుతా కేశాంబరాకర్షణైః మహత్ కురువనే ఇదం జృంభతే.

అర్థము :- సత్యవ్రత = ఆడితప్పని నియమముయొక్క, భంగ=విచ్ఛేదమునకు, భీరు=వెరచిన, మనసా=మనస్సు కలవాడైన ధర్మరాజుచే, యత్=ఏది—ఏ క్రోధజ్యోతి యనుట, యత్నేన=ప్రయత్నముతో, మందీకృతమ్=తగ్గింపబడినదో, కులస్య=వంశమునకు, శాంతిమ్=ప్రశాంతిని, ఇచ్ఛతా=కోరుచున్నవాడైన, శమవతా=ఇంద్రియనిగ్రహముకల ధర్మరాజుచే, యత్=ఏది, విస్మర్తుమ్ అపి=మరచిపోవుటకుకూడ, ఈహితమ్=వాంఛింపబడినదో, మరువగోరెననుట, ద్యూత=జూదమనునట్టి, అరణి=అరణియందు, సంభృతమ్=పుట్టి పెరిగినదైన, తత్=ఆ, యౌధిష్ఠిరమ్=ధర్మజునకు చెందిన, క్రోధజ్యోతిః=కోపాగ్ని, నృపసుతా=ద్రౌపదియొక్క, కేశ=శిరోజములను, అంబర=వస్త్రములను, ఆకర్షణైః=పట్టి ఈడ్చుటలచే, మహత్=వృద్ధిపొందినదై, కురువనే=కురువంశము అను నరణ్యమునందు, ఇదమ్=ఇదే, జృంభతే=విజృంభించుచున్నది.

భీమసేనః : (ఆకర్ణ్య సహర్షమ్) జృంభతాం జృంభతా మప్రతిహాత ప్రసర మార్యస్య క్రోధజ్యోతిః.

---

**విశేషములు** :— యాగాగ్నికొఱకై యజ్ఞకాష్ఠములను త్రచ్చునప్పుడు ఆధారదారువును అరణి అందురు. "నిర్మంథ్యదారుణి త్వరణిః" అని అమరము.

**సమాసములు** :— సత్యమేవ వ్రతమ్—సత్యవ్రతమ్. తస్య భంగః—సత్యవ్రతభంగః, తస్మాత్ భీరు మనః యస్య సః—సత్యవ్రత భంగ భీరు మనః, తేన. ద్యూతమేవ అరణిః—ద్యూతారణిః. ద్యూతారణౌ సంభృతమ్—ద్యూతారణి సంభృతమ్. నృపస్య సుతా—నృపసుతా. కేశాశ్చ అంబరాణి చ—కేశాంబరాణి. నృపసుతాయాః కేశాంబరాణి—నృపసుతాకేశాంబరాణి, నృపసుతాకేశాంబరాణామ్ ఆకర్షణమ్—నృప....రాకర్షణమ్, తైః. క్రోధః జ్యోతి రివ—క్రోధజ్యోతిః.

క్రియ :— జృభిజ్ గాత్ర వినామే, ఆత్మనే, లట్, ప్రథమ
జృంభతే—జృంభేతే—జృంభన్తే.

**సంధులు** :— అపి+ఈహితమ్, ద్యూత+అరణి, కేశ+అంబర+ఆకర్షణై—సవర్ణదీర్ఘ సంధులు. కులస్య+ఇచ్ఛతా—గుణసంధి. జ్యోతిః+ఇదమ్—రేఫాదేశ.

**అలంకారములు** :— శాంతికాముకుడైన ధర్మజుని కోపము సమర్థనీయాంశము. ద్రౌపదీ కేశాంబరాకర్షణములచే అది సమర్థింపబడుచున్నది కావున కావ్యలింగము. "సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనం। జితోఽసి మందకందర్ప మచ్చిత్తేఽస్తి త్రిలోచనః. ఇది ద్యూతారణి-తురువన-క్రోధాగ్ని-అను తాద్రూప్య రూపకములచే అనుప్రాణితమగుచున్నది.

**ఛందస్సు** :- శార్దూలము. మ—స—జ—స—త—త—గ. 1—12

**ఆకర్ణ్యేతి** :— (ఆకర్ణ్య=విని, సహర్షమ్=సంతోషముతో—) అప్రతిహత=అడ్డగింపరాని, ప్రసారమ్=ప్రసారముకలదై, ఆర్యస్య=ధర్మజునియొక్క, క్రోధజ్యోతిః=కోపాగ్ని, జృంభతామ్=బాగుగా విజృంభించునుగాక!

ద్రౌపదీ : నాథ! కిమిదానీ మేష ప్రళయ జలధరస్తనితమాంసలః క్షణే క్షణే సమరదుందుభిస్తాడ్యతే? (ణాహ, కిం దాణీం ఏసో పలఅ జలహార త్థణిద మంసలో క్ఖణే క్ఖణే సమర దుందుహీ తాడ్డీఅది.)

భీమసేనః : దేవి! కిమన్యత్. యజ్ఞః ప్రవర్తతే.

ద్రౌపదీ : (సవిస్మయమ్) క ఏష యజ్ఞః (కో ఏసో జణ్ణో).

భీమసేనః : రణయజ్ఞః. తథాహి—

చత్వారో వయమృత్విజః, స భగవాన్ కర్మోపదేష్టా హరిః
సంగ్రామాధ్వరదీక్షితో నరపతిః, పత్నీ గృహీతవ్రతా।

---

నాథేతి :- నాథ!=స్వామీ! ప్రళయ=ప్రళయకాలమునందలి, జలధర=మేఘములయొక్క, స్తనిత=గర్జనలవలె, మాంసలః=గంభీరమైన, ఏషః=ఈ (వినిపించుచున్న), సమరదుంధుభిః=యుద్ధభేరి, ఇదానీమ్=ఇప్పుడు, క్షణే క్షణే=ప్రతి క్షణమునందును, తాడ్యతే కిమ్=మ్రోగింపబడుచున్నదేమి?

దేవీతి :- దేవి!=ఓ ద్రౌపదీ!, అన్యత్ కిమ్=వేరొక్కటేమున్నది!, యజ్ఞః=యజ్ఞము, ప్రవర్తతే=నడచుచున్నది.

సవిస్మయమ్ ఇతి :- (సవిస్మయమ్=ఆశ్చర్యముతో) ఏషః=ఈ, యజ్ఞః=జన్నము, కః=ఏమిటి, ఏమిటా యజ్ఞ మనుట.

రణ ఇతి :- రణయజ్ఞః=రణయజ్ఞము, తథాహి=అంతేకదా!—

చత్వార ఇతి :- వయమ్ చత్వారః ఋత్విజః, సః భగవాన్ హరిః కర్మోపదేష్టా, నరపతిః సంగ్రామాధ్వర దీక్షితః, పత్నీ గృహీతవ్రతా, కౌరవ్యాః పశవః, ప్రియా పరిభవ క్లేశోపశాంతిః ఫలమ్, యశోదుందుభిః రాజన్యోప మంత్రణాయ స్ఫీతం రసతి॥

కౌరవ్యాః పశవః ప్రియాపరిభవక్లేశోపశాంతిః ఫలం
రాజన్యోపనిమన్త్రణాయ రసతి స్ఫీతం యశోదుందుభిః॥ 25

---

**అర్థము :-** వయమ్=మేము, చత్వారః=నలుగురమును, ఋత్విజః=ఋత్విక్కులము; సః=ఆ, భగవాన్=భగవంతుడు, హరిః=శ్రీకృష్ణుడు, కర్మోపదేష్టా=కర్తవ్యనిర్దేశకుడు; నరపతిః=రాజైన యుధిష్ఠిరుడు, సంగ్రామ=యుద్ధమనునట్టి, అధ్వర=యజ్ఞమునందు, దీక్షితః=దీక్షపూనినవాడు; ప్రధాన యజమానుడనుట; పత్నీ=ధర్మపత్ని ద్రౌపది, గృహీతవ్రతా=స్వీకరింపబడిన వ్రత నియమము కలది; కౌరవ్యాః=కురుపుత్రులు, దుర్యోధనాదులనుట, పశవః=యజ్ఞపశువులు; ప్రియా=ప్రేయసియొక్క, ద్రౌపదికి జరిగిన అనుట, పరిభవ=అవమానమువల్లనైన, క్లేశ=దుఃఖముయొక్క, ఉపశాంతిః=ఉపశమనము, ఫలమ్=యజ్ఞఫలము. యశోదుందుభిః=కీర్తిభేరి, రాజన్య=రాజసమూహము యొక్క, ఉపనిమంత్రణాయ=ఆహ్వానముకొరకు, స్ఫీతమ్=బిగ్గరగా, రసతి=మ్రోగుచున్నది.

**విశేషములు :-** యజ్ఞమున హోత, ఉద్గాత, అధ్వర్యుడు, బ్రహ్మ అని ఋత్విక్కులు నలుగురుందురు. భీమ—అర్జున—నకుల—సహదేవులు నలుగురనుట సరిపోవుచున్నది. ధ్వర్యతే హన్యతే ఇతి ధ్వరః=హింస. న ధ్వరః అస్మిన్ ఇతి అధ్వరః. హింసలేని కార్యము. యజ్ఞములో జగద్ధితమును కోరి చేయు పశువిశసనము హింసగా పరిగణింపబడదట. అట్లే ఈ రణయజ్ఞముకూడ పాపరహితమనుట.

**సమాసములు :-** కర్మణః ఉపదేష్టా—కర్మోపదేష్టా. సంగ్రామః ఏవ అధ్వరః—సంగ్రామాధ్వరః, సంగ్రామాధ్వరే దీక్షితః—సంగ్రామాధ్వరదీక్షితః. నరాణాం పతిః—నరపతిః. గృహీతం వ్రతం యయా సా – గృహీతవ్రతా. ప్రియాయాః పరిభవః—ప్రియాపరిభవః, ప్రియాపరిభవాత్ క్లేశః—ప్రియాపరిభవ క్లేశః, ప్రియా....క్లేశస్య ఉపశాన్తిః. రాజన్యానామ్ ఉపనిమన్త్రణమ్—రాజన్యోప నిమంత్రణమ్-తస్మై. యశో జనకః దుందుభిః-యశోదుందుభిః-యశ ఏవ దుందుభిః

సహదేవః : ఆర్య! గచ్ఛామో వయ మిదానీం గురుజనానుజ్ఞాతా విక్రమానురూప మాచరితుమ్.

భీమసేనః : వత్స! ఏతే వయముద్యతా ఏవార్యస్యానుజ్ఞామనుష్ఠాతుమ్.

---

**సంధులు :-** చత్వారః+వయమ్, దీక్షితః+నర, యశః+దుందుభిః—ఉత్వాదేశవిసర్గసంధులు. కర్మ+ఉపదేష్టా, క్లేశ+ఉపశాన్తిః, రాజన్య+ఉపనిమంత్రణ—గుణసంధులు. సంగ్రామ+అధ్వర—సవర్ణదీర్ఘసంధి. సః+భగవాన్—తదేతద్విసర్గలోపసంధి.

క్రియ :- రస శబ్దే, పరస్మై, లట్, ప్రథమ—రసతి—రసతః—రసన్తి. రససి-రసథః-రసథ, రసామి-రసావః-రసామః.

**ఛందస్సు :-** శార్దూలము—మ-స-జ-స-త-త-గ, 1-12

మ - స - జ - స - త - త - గ
UU U - I I U - I U I - I I U - U U I - UU I - U
చత్వారో - వయమృ - త్విజస్స - భగవాన్ - కర్మోప - దేష్టాహ - రిః

**అలంకారము :—** రణమునందు యజ్ఞధర్మము నారోపించుటచే "రణయజ్ఞః" తాద్రూప్యరూపకమగుచున్నది. అటుపైని రణాంగములన్నింటను యజ్ఞాంగములనన్నింటిని ఆరోపించుటయైనది. కావున ఇది సమస్త వస్తు విషయకమైన సావయవ (తాద్రూప్య) రూపకము. ప్రకృతమగు రణమునందు యజ్ఞముకన్న ఆధిక్యము కాని న్యూనత్వము కాని చెప్పబడకపోవుటచే అనుభయము.

**ఆర్యేతి :-** ఆర్య!=మాన్యుడా!, గురుజన=పెద్దలచే, అనుజ్ఞాతాః=అనుమతింపబడినవారమై, పెద్దల అనుజ్ఞను స్వీకరించి అనుట, విక్రమ=పరాక్రమమునకు, అనురూపమ్ = తగినదానిని, ఆచరితుమ్ = ఆచరించుటకు, వయమ్=మనము, ఇదానీమ్=ఇప్పుడు, గచ్ఛామః=పోవుదము.

**వత్సేతి :—** వత్స!=నాయనా! ఆర్యస్య=మాన్యుడైన ధర్మజునియొక్క,

(ఉత్థాయ) దేవి! గచ్ఛామో వయమిదానీం కురుకుల క్షయాయ.

ద్రౌపదీ : (బాష్పం ధారయన్తీ) నాథ! అసుర సమరాభిముఖస్య హరేరివ మంగళం యుష్మాకం భవతు. (ణాహ, అసుర సమరాహిముహస్స హరిణో విఅ మంగలం తుమ్హాణం హోదు.)

ఉభౌ : ప్రతిగృహీతం మంగళ వచన మస్మాభిః.

ద్రౌపదీ : అన్యచ్చ నాథ!, పునరపి యుష్మాభిః సమరా దాగత్యాహం సమాశ్వాసయితవ్యా. (అణ్ణం చ ణాహ, పుణో వి తుమ్హేహిం సమరాదో ఆఅచ్ఛిఅ అహం సమాస్సస ఇదవ్వా.)

---

ఆజ్ఞామ్=ఆనతిని, అనుష్ఠాతుమ్=ఆచరించుటకు, ఏతే=ఈ, వయమ్=మనము, ఉద్యతాః ఏవ = సంసిద్ధులమే. (ఉత్థాయ=లేచి) దేవీ!, వయమ్ = మేము, ఇదానీమ్=ఇప్పుడు, కురుకుల=కురువంశముయొక్క, క్షయాయ=వినాశముకొఱకు, గచ్ఛామః=వెడలుచున్నాము.

బాష్పమితి :— (బాష్పమ్=కన్నీటిని, ధారయన్తీ=వహించుచున్నదై) నాథ!=స్వామీ!, అసుర=రాక్షసులతో, సమర=యుద్ధమునకు, అభిముఖస్య= సన్నద్ధుడైయున్న, హరేః ఇవ = విష్ణుమూర్తికివలె, యుష్మాకమ్ = మీకు, మంగళమ్=శుభము, భవతు=అగుగాక!

ప్రతిగృహీతమితి :- మంగళవచనమ్=శుభాకాంక్ష, అస్మాభిః=మాచే, ప్రతిగృహీతమ్=స్వీకరింపబడినది.

అన్యదితి :— నాథ!=స్వామీ!, అన్యత్ చ=ఇంకొక మాట—సమరాత్= యుద్ధమునుండి, ఆగత్య=వచ్చి, యుష్మాభిః=మీచేత, పునః అపి=మరొకమారు,

భీమసేనః : నను పాంచాలరాజతనయే, కిమద్యాప్యలీకాశ్వాసనయా?

భూయః పరిభవక్లాన్తి లజ్జా విధురితాననమ్।
అనిశ్శేషిత కౌరవ్యం న పశ్యసి వృకోదరమ్॥ 26

---

అహమ్=నేను, సమాశ్వసయితవ్యా=తప్పక ఓదార్పబడదగినదానను. విజయ వార్తతో నన్ను ఓదార్పరండనుట.

నన్వితి :— నను = ఇదిగో, పాంచాలరాజ తనయే! = ఓ ద్రౌపదీ! అద్య+అపి=నేడుకూడ, అలీక=అసత్యమైన, ఆశ్వాసనయా=ఓదార్పుతో, కిమ్? (ప్రయోజనమ్) = ఏమి (ప్రయోజనము)? నిజమైన ఓదార్పునే క్రియారూపమున అందింతుననుట. "నను" అనునది అభిముఖీకరణమునకు ఉపయోగించు అవ్యయము—నన్విత్యభిముఖ్యే. విను అని కొందరు దీనిని తెనిగించిరి.

భూయ ఇతి :— పరిభవ....విధురితాననమ్, అనిశ్శేషిత కౌరవ్యమ్ వృకోదరం భూయః న పశ్యసి.

అర్థము :- పరిభవ = అవమానముయొక్క, క్లాన్తి = ఖేదముచేనైన, లజ్జా=సిగ్గుతో, విధురిత=వివర్ణమైన, ఆననమ్=ముఖముకలవాడును, అనిశ్శేషిత= నిశ్శేషము చేయబడని, కౌరవ్యమ్=కౌరవులు కలవాడును, కౌరవులను నిశ్శేషముగా చంపనివాడు ననుట, అయిన, వృకోదరమ్=భీముని, భూయః=మరొకమారు, న పశ్యసి=చూడవు. పరిభవక్షాన్తి లజ్జా అని పాఠాంతరమున్నది. పరిభవము యొక్క సహనముచేనైన సిగ్గుతో—అని అర్థము.

సమాసములు :- పరిభవస్య క్లాన్తిః—పరిభవక్లాన్తిః, పరిభవక్లాన్త్యా లజ్జా—పరిభవక్లాన్తి లజ్జా, తయా విధురితమ్ ఆననమ్ యస్య తమ్—పరిభవక్లాన్తి లజ్జా విధురితాననమ్. అనిశ్శేషితాః కౌరవ్యాః యేన సః—అనిశ్శేషిత కౌరవ్యః—తమ్. న నిశ్శేషితాః — అనిశ్శేషితాః. వృకస్యేవ ఉదరమ్ యస్య సః—వృకోదరః—తమ్—వృకోదరమ్

**సంధులు** :— విధురిత+ఆననమ్—సవర్ణదీర్ఘసంధి, వృక+ఉదరమ్—గుణసంధి.

**క్రియ** : దృశిర్ ప్రేక్షణే, పరస్మై, లట్, మధ్యమ
పశ్యసి—పశ్యథః—పశ్యథ.

**అలంకారము** :- భీమునికి గల పర్యాయపదములలో వృకోదరశబ్దము మిక్కిలి భయంకరమైనది. ఇది భీముని మాటయగుటచే దీని వాచ్యార్థము శత్రు భక్షణ సామర్థ్యరూపమైన అర్థాంతరమునందు సంక్రమించుచున్నది. కావున అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని అనవలెను. ఇట్లు వృకోదరమ్ అను ఈ విశేష్యము అభిప్రాయగర్భితమగుటచే నిందు పరికరాంకురము అలంకారమన వలెను. "సాభిప్రాయే విశేష్యేతు భవేత్పరికరాంకురః,చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవశ్చతుర్భుజః॥"

ఛందస్సు :— పథ్యావక్త్రము. ఇది అనుష్టుప్ భేదాలలో ఒకటి. దీని నియమాలు :— 1) పాదమునకు ఎనిమిది అక్షరాలుండును. 2) తొలి అక్షరము తరువాత న గణముకాని స గణముకాని ఉండరాదు. అనగా య—మ—త—ర—జ—భ లలో ఏదో ఒకటి ఉండవలెను. ఇట్లనుటచే రెండవ లేక మూడవ అక్షరము తప్పక గురువు కావలెననుట సిద్ధించుచున్నది. 3) సమ పాదములలో తొలి అక్షరము తరువాత ర గణముకూడ ఉండరాదని ఒక సంప్రదాయము కలదు. 4) నాలుగవ అక్షరము తరువాత (అబ్ధేః—సరిద్భర్తుః) య గణము ఉండవలెను. 5) ఎనిమిదవ అక్షరము గురులఘువులలో ఏదయినను కావచ్చును. దీనిలో ప్రతి పాదమును నాలుగు స్థానములుగా విభజింపవచ్చును. ఒకటవ అక్షరము—ప్రథమస్థానము. రెండు మూడు నాలుగు అక్షరములతో ఏర్పడు గణము—ద్వితీయస్థానము. అయిదు ఆరు ఏడు అక్షరములతో ఏర్పడు గణము తృతీయస్థానము. ఎనిమిదవ అక్షరము—చతుర్థస్థానము. ఇవన్నియు అనుష్టుప్పు లక్షణములు. వీనినన్నింటిని పాటించుచు (యుజోః) సమపాదములలో (2—4) మూడవస్థానమున య గణమునకు బదులు జ గణమును ఉంచినచో అది పథ్యావక్త్రమగును. "వక్త్రం నాద్యాన్నసౌ స్యాతామబ్ధేర్యోఽనుష్టుభి ఖ్యాతమ్—యుజోర్జేన సరిద్భర్తుః పథ్యావక్త్రం ప్రకీర్తితమ్॥" (వృత్త—2—21, 22)

ద్రౌపదీ : నాథ! మా ఖలు మా ఖలు యాజ్ఞసేనీపరిభవోద్దీపితకోపానలా అనపేక్షితశరీరాః సంచరిష్యథ. యతోఽప్రమత్త సంచరణీయాని రిపుబలాని శ్రూయన్తే.
(ణాహ, మా క్ఖు మా క్ఖు జణ్ణసేణీ పరిహావుద్దీవిదకోవాణలా అణవేక్ఖిద సరీరా సంచరిస్సధ. జదో అప్పమత్త సంచరణిజ్జాఇం రిఉబలాఇం సుణీఅన్తి.)

---

గు(1)- భ(2) - య(3) - ల(4)
U - U I I - I U U - I
1. భూ - యః పరి - భవక్లా - న్తి

(1)గు - భ(2) - జ(3) - గు(4)
U - U I I - I U I - U
2. ల - జ్జా విధు - రితాన - నమ్

(1)- (2) - (3) - (4)
I - U U I - I U U - U
3. అ - నిశ్శేషి - తకౌర - వ్యమ్
ల - త - య - గు

(1)- (2) - (3) - (4)
I - U I I - I U I - U
4. న - పశ్యసి - వృకోద - రమ్
ల - భ - జ - గు

నాథేతి :— నాథ=స్వామీ యాజ్ఞసేనీ=(ఈ) ద్రౌపదియొక్క, పరిభవ=అవమానముతో, ఉద్దీపిత=ప్రజ్వలింపజేయబడిన, కోపానలాః=కోపాగ్నికలవారై, అందుచే, అనపేక్షిత=లక్ష్యపెట్టబడని, శరీరాః=తనువులు కలవారై, మా ఖలు మా ఖలు సంచరిష్యథ=సంచరింపవద్దు—సంచరింపవద్దు. యతః=ఎందువలన ననగా, రిపుబలాని = శత్రుసైన్యములు, అప్రమత్త సంచరణీయాని = ఏమరుపాటుతో సంచరింపదగినవికావు అని, శ్రూయన్తే=వినబడుచున్నవి. జాగరూకులై వంచరింపవలె ననుట.

భీమసేనః : అయి సుక్షత్రియే!—

అన్యోన్యాస్ఫాలభిన్న ద్విప రుధిర వసా మాంస
మస్తిష్కపంకే
మగ్నానాం స్యందనానా ముపరి కృతపదన్యాస
విక్రాంత పత్తౌ।

---

**అయీతి :-** అయి సుక్షత్రియే!=ఓ రాచబిడ్డా!.

**అన్యోన్యేతి :-** అన్యోన్యాస్ఫాల—పంకే, మగ్నానామ్, స్యందనానామ్, ఉపరి, కృత పదన్యాస విక్రాంత పత్తౌ, స్ఫీతాసృక్—కబంధే, సంగ్రామైకార్ణ వాంతఃపయసి, విచరితుమ్, పండితాః, పాండుపుత్రాః.

అర్థము — అన్యోన్య+ఆస్ఫాల=పరస్పరసంఘట్టనముతో, భిన్న=చీల్చబడిన, ద్విప=ఏనుగులయొక్క, రుధిర=రక్తము, వసా=క్రొవ్వు, మాంస=పలలము, మస్తిష్క=మెదడులతోనైన, పంకే=రొంపిలో, మగ్నానామ్=కూరుకుపోయిన, స్యందనానామ్=రథములయొక్క, ఉపరి=పైని, రథములమీద ననుట, కృత=చేయబడిన, పదన్యాస=పాదవిన్యాసముతో, విక్రాంత=పరాక్రమించిన, పత్తౌ=కాల్బలము కలదియును, స్ఫీత=సమృద్ధమైన, అసృక్=రక్తముయొక్క, పాన=త్రాగుటరూపమైన, గోష్ఠీ=సభయందు, రక్తపానగోష్ఠియందనుట, రసత్=అరచుచున్న, అశివ=అమంగళములైన, శివా=నక్కలయొక్క, తూర్య=బాకాలతో, ఊళలు తూర్యధ్వనులనుట, నృత్యత్=చిందులుద్రొక్కుచున్న, కబంధే=మొండెములు కలదియును అయిన, సంగ్రామ=యుద్ధము అనునట్టి, ఏక=ప్రధానమైన, అర్ణవ=సముద్రముయొక్క, అంతః=లోతట్టుననున్న, పయసి=నీటిలో, సముద్రజల మధ్యమున ననుట, విచరితుమ్=విశేషముగా సంచరించుటకు, పాండుపుత్రాః=పాండురాజ కుమారులు, పండితాః=నేర్పరులు. భీషణ సంగ్రామమున విచ్చలవిడిగా తిరుగుటకు మేము సమర్థులమనుట.

సమాసములు :- అన్యోన్య మాస్ఫాలః—అన్యోన్యాస్ఫాలః. తేన భిన్నాః=అన్యోన్యాస్ఫాలభిన్నాశ్చ తే ద్విపాః—అన్యోన్యాస్ఫాలభిన్నద్విపాః, రుధిరంచ వసాచ మాంసంచ మస్తిష్కంచ—రుధిరవసామాంసమస్తిష్కాణి.

స్ఫీతాసృక్పానగోష్ఠీరసదశివ శివాతూర్య నృత్యత్కబంధే
సంగ్రామైకార్ణవాంతఃపయసి విచరితుం పండితాః పాండుపుత్రాః॥ 27

(ఇతి నిష్క్రాంతాః సర్వే)

-: ఇతి ప్రథమోఽఙ్కః :-

---

అన్యోన్యా ...ద్విపానాం రుధిర—మస్తిష్కాణి—అన్యోన్యాస్ఫాల .. మస్తిష్కాణి. తేషాం పంకః, తస్మిన్. కృతః పదన్యాసః యేన సః—కృత పదన్యాసః చ అసౌ విక్రాంతశ్చ—కృతపదన్యాసవిక్రాంతః పత్తిః యస్మిన్ సంగ్రామే సః—కృత.... పత్తిః, తస్మిన్. స్ఫీతం చ తదసృక్ చ—స్ఫీతాసృక్. స్ఫీతాసృజః పానగోష్ఠీషు రసన్త్యశ్చ తాః అశివాశ్చ తాః శివాః—స్ఫీతాసృక్....శివాః, తా ఏవ తూర్యాణి-స్ఫీతాసృక్—తూర్యాణి. తైః నృత్యన్తః కబంధాః యస్మిన్ సః—స్ఫీతాసృక్—కబంధః, తస్మిన్. ఏకశ్చాసౌ అర్ణవశ్చ—ఏకార్ణవః, సంగ్రామ ఏవ ఏకార్ణవః, తస్య అంతః పయః, తస్మిన్. పాండోః పుత్రాః—పాండుపుత్రాః.

**సంధులు :-** అన్యోన్య+ఆస్ఫాల, స్ఫీత+అసృక్, ఏక+అర్ణవ+అంతః—సవర్ణదీర్ఘ. సంగ్రామ+ఏక—వృద్ధిసంధి.

**అలంకారము :—** మాంసమస్తిష్క పంకము, శివాతూర్యము, సంగ్రామార్ణవము—ఇట్లు ఇవి అనుభయ తాద్రూప్యరూపకమగుచున్నది. కూర్పుతో రౌద్రభీభత్సములకు వ్యంజకమైన ఓజోగుణమున్నది.

ఛందస్సు :- స్రగ్ధరావృత్తము. మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిమునియతి యుతా స్రగ్ధరా కీర్తితేయమ్. మ—ర—భ—న—య—య—య

మ - ర - భ - న - య - య - య
U U U - U I U - U I I - I I I - I U U - I U U - I U U
సంగ్రామై - కార్ణవాం - తః పయ - సి విచ - రితుం పం - డితాః పాం - డు పుత్రాః

ఇతీతి:- (ఇతి=అని, సర్వే=అందరును, నిష్క్రాంతాః=నిష్క్రమింతురు)

—: ఇది ప్రథమాంకము :—

# ద్వి తీ యా ఙ్కః

(తతః ప్రవిశతి కంచుకీ)

కంచుకీ : ఆదిష్టోఽస్మి మహారాజ దుర్యోధనేన – "వినయంధర! సత్వరం గచ్ఛ త్వమ్. అన్విష్యతాం దేవీ భానుమతీ. అపి నివృత్తా అంబాయాః పాదవందన సమయాన్న వేతి. యతస్తాం విలోక్య నిహతాభిమన్యవో రాధేయ జయద్రథ ప్రభృతయోఽస్మత్సేనాపతయః సమరభూమిం గత్వా సభాజయితవ్యా" ఇతి. తన్మయా ద్రుతతరం గంతవ్యమ్. అహో! ప్రభవిష్ణుతా మహారాజస్య యన్మమ జరసాభిభూతస్య మర్యాదా మాత్రమే వావరోధ వ్యాపారః. అథవా కిమితి జరాముపాలభేయ, యతః సర్వాంతఃపురచారిణా మయమేవ వ్యావహారికో వేషశ్చేష్టా చ. తథాహి—

---

తత ఇతి :- (తతః=అటుపిమ్మట, కంచుకీ=కంచుకి—ద్వారపాలకుడనువాడు, ప్రవిశతి=ప్రవేశించును)

ఆదిష్టోఽస్మీతి :— మహారాజ=మహారాజయిన, దుర్యోధనేన=సుయోధనునిచే, ఆదిష్టః=ఆదేశింపబడినవాడను, అస్మి=అయితిని—"వినయంధర!=ఓ వినయంధరుడా!, త్వమ్=నీవు, సత్వరమ్=వేగముగా, గచ్ఛ=వెడలుము, దేవీ=పట్టమహిషి అయిన, భానుమతీ=భానుమతీదేవి, అన్విష్యతామ్=(నీచే) అన్వేషింపబడునుగాక. అంబాయాః = తల్లి యొక్క (గాంధారియొక్క), పాద వందన సమయాత్ = పాదములకు నమస్కరించుట అను ఆచారమునుండి, ఆచారమును నిర్వర్తించి యనుట, అపి నివృత్తా = తిరిగి వచ్చినదా?, (అపి అనునది వాక్యారంభమునందున్నచో ప్రశ్నార్థకమగును.) న వా=రాలేదా?, ఇతి= అనునది, అన్వేషింపబడునుగాక. యతః=ఎందువల్లననగా, తామ్=ఆమెను,

నోచ్చైః సత్యపి చక్షుషీక్షితమలం శ్రుత్వాపి నాకర్ణితం
శక్తేనా ప్యధికార ఇత్యధికృతా యష్టిః సమాలంబితా।

---

విలోక్య=చూచి, నిహత=చంపబడిన, అభిమన్యవః=అభిమన్యుడు కలవారైన, అభిమన్యుని సంహరించిన వారనుట, రాధేయ=కర్ణుడు, జయద్రథ=జయద్రథుడు, ప్రభృతయః=మొదలైన, అస్మత్=మనయొక్క, సేనాపతయః=సేనానులు, సమర భూమిమ్=యుద్ధభూమిని గూర్చి, గత్వా=వెళ్ళి, సమరాంగణమునకేగి అనుట, సభాజయితవ్యాః=సంభావింపదగినవారు. కర్ణాదులను నేను తప్పక సత్కరింపవలె ననుట, ఇతి=అని ఆదిష్టోఽస్మి. తత్=అందువలన, మయా=నాచేత, ద్రుత తరమ్=మిక్కిలి వేగముగా, గంతవ్యమ్=పోబడవలెను, త్వరగా పోవలెననుట. మహారాజస్య=దుర్యోధనునియొక్క, ప్రభవిష్ణుతా=ప్రభావశాలిత్వము, అహో=అబ్బో!, ఆశ్చర్యజనకమనుట. యత్=ఏలనగా, జరసా=ముసలితనముతో, అభి భూతస్య=ఆవరింపబడినవాడనైన, మమ=నాయొక్క, అవరోధవ్యాపారః= అంతఃపుర సంచారము, అవరోధనివాసః అని పాఠాంతరము, మార్యాదామాత్రమ్ ఏవ=కేవలము ఒక ఆచారమే. అథవా=అయినను, జరామ్=ముసలితనమును, కిమ్ ఇతి=ఏమని, ఉపాలభేయ=నిందించుకొందును! సహజసిద్ధమైన నా ముసలి తనమును నేను నిందించుకొనవలసిన అవసరము లేదనుట. యతః=ఎందువలన నగా, సర్వాంతఃపురచారిణామ్ = అంతఃపురమునందు (సేవకులుగా) తిరుగు వారందరికిని, వృద్ధులకే కాదు యువకులకు ననుట. వ్యావహారికః=వ్యవహారాను కూలమైన, వేషః=వేషము, చేష్టా చ=చేష్టయును, అయమ్ ఏవ=ఇదే, ఈ ముసలి తనమే అనుట. తథా హి=అంతేకదా!

నోచ్చైరితి :— చక్షుషి సత్యపి ఉచ్చైః అలం న ఈక్షితమ్ (భవతి); శ్రుత్వా అపి నాకర్ణితమ్ (భవతి) శక్తేనాపి అధికారః ఇతి అధికృతా యష్టిః సమాలంబితా; సర్వత్ర స్ఖలితేషు దత్తమనసా మయోద్ధతం న యాతమ్; సేవాంధీ కృత జీవితస్య మే జరసా యత్ కృతం (తత్) కిం నామ?

అర్థము :— చక్షుషి=కన్ను, సతి అపి=ఉన్నప్పటికిని, ఉచ్చైః=పైకి, అలమ్=కావలసినంతగా, న ఈక్షితమ్ భవతి=చూడరాదు, శ్రుత్వా అపి=విని

సర్వత్ర స్ఖలితేషు దత్తమనసా యాతం మయా నోద్ధతం
సేవాంధీకృతజీవితస్య జరసా కిం నామ యన్మే కృతమ్॥ 1

నప్పటికిని, న ఆకర్ణితమ్ భవతి=విన్నదికాదు. అంతఃపురమునందలి రాజదంపతుల సంభాషణాదికమును విన్నప్పటికిని విననట్లే ఉండవలెను అనుట. శక్తేన అపి= ఓపిక కలవాడనే అయినను, మయా=నాచేత, అధికారః ఇతి = ఆచారము అని అధికృతా=అంగీకరింపబడిన, యష్టిః=వేత్రదండము, సమాలంబితా=పట్టుకొనబడినది; అవసరము లేకపోయినను ఆచారమాత్రముగా ఊతకఱ్ఱను పట్టుకొంట తప్పదనుట, సర్వత్ర=అన్నింటను, స్ఖలితేషు=జారుపాటులయందు, దత్తమనసా= మనస్సు పెట్టినవాడనైన, మయా=నాచేత, ఉద్ధతమ్=దూకుడుగా, న యాతమ్ (భవతి)=నడువబడదు, ఎచ్చట ఏ దోషము వచ్చునో అను శంకతో సర్వదా సావధానచిత్తుడనైన నేను ఉద్ధతముగా ఎప్పుడును ప్రవర్తించ ననుట, అంధీకృత=నిష్ప్రయోజనముగావింపబడిన, జీవితస్య=బ్రతుకుకలవాడనైన, మే=నాకు, జరసా=ఈ ముసలితనముతో, యత్=ఏది, కృతమ్=చేయబడినదో, తత్=అది, కిం నామ=ఏమున్నది?. ముసలితనము నాకు ప్రత్యేకముగా చేసిన అపకారము ఏమియు లేదనుట. కావున కిమితి జరాముపాలభేయ అని సమన్వయము.

సమాసములు :— దత్తం మనః యస్య సః—దత్తమనాః, తేన దత్తమనసా. సేవయా అంధీకృతమ్ — జీవితం యస్య సః—సేవాంధీకృత జీవితః—తస్య.

సంధులు :— న+ఉచ్చైః, న+ఉద్ధతమ్—గుణసంధులు. సతి+అపి, అపి+అధికార, ఇతి+అధికృతా—యణాదేశసంధులు. చక్షుషి+ఈక్షితమ్, శ్రుత్వా+అపి, న+ఆకర్ణితమ్, శక్తేన+అపి, సేవా+అంధీకృత—సవర్ణదీర్ఘసంధులు. అధికారః+ఇతి—విసర్గలోపసంధి. యత్+మే—అనునాసికాదేశసంధి.

ఛందస్సు :— శార్దూలము. మ—స—జ—స—త—త—గ. 1—12

**అలంకారము** :— కన్నులుండియు కాంచుటకు వీలు లేదు. చెవులుండియును వినుటకు వీలులేదు. ఓపికయున్నప్పటికిని చేగఱ్ఱ విడిచి వేగముగా

(పరిక్రమ్య, దృష్ట్వా, ఆకాశే) విహంగికే అపి శ్వశ్రూజన పాద వందనం కృత్వా ప్రతినివృత్తా భానుమతీ? (కర్ణందత్త్వా) కిం కథయసి—ఆర్య! ఏషా భానుమతీదేవీ పత్యుః సమర విజయాశంసయా నిర్వర్తిత గురు దేవ పాదవ దనా అద్య ప్రభృత్యారబ్ధనియమా బాలోద్యానే తిష్ఠతీతి. తద్భద్రే గచ్ఛ త్వమాత్మవ్యాపారాయ. యావదహమప్యత్రస్థాం దేవీం మహారాజస్య నివేదయామి. (ఇతి పరిక్రమ్య) సాధు పతివ్రతే! సాధు! స్త్రీభావేఽపి వర్తమానా వరం భవతీ న పునర్మహారాజః, యోఽయముద్యతేషు బలవత్సు అథవా కింబలవత్సు వాసుదేవ సహాయేషు పాండుపుత్త్రేష్వద్యాపి అంతఃపురవిహార మనుభవతి. (విచింత్య) ఇదమపరమయథాతథం స్వామినశ్చేష్టితమ్. కుతః—

---

సడువరాదు. ఇట్లు కారణమున్నప్పటికిని కార్యానుత్పత్తి చమత్కారావహ మగుటచే విశేషోక్తి అగుచున్నది. "కార్యాజనిర్విశేషోక్తి స్సతి పుష్కలకారణే, హృది స్నేహక్షయో నాభూత్ స్మరదీపే జ్వలత్యపి."

పరిక్రమ్యేతి :— పరిక్రమ్య=రెండడుగులు వేసి, దృష్ట్వా=చూచి, ఆకాశే=ఆకాశమునందు, రంగముపై కనిపించని వేరొక వ్యక్తితో ఆకాశ భాషితము చేయుచున్నాడనుట. ఏమనుచున్నావు? ఓహో! ఇట్లనుచున్నావా? ఇత్యాదిగా ఇది సాగును. దశరూపకమునందు "కింబ్రవీషీత్యేవమిత్యాది వినా పాత్రం బ్రవీతియత్! ఉక్త్వానుక్తమప్యర్థం తత్స్యాదాకాశభాషితమ్"॥ అని చెప్పబడినది. విహంగికే!=ఓ విహంగికా! శ్వశ్రూజన=అత్తలయొక్క, పాద=పాదములకు, వందనమ్=నమస్కృతిని, కృత్వా=చేసి భానుమతీ=భానుమతీదేవి, అపి ప్రతినివృత్తా = తిరిగివచ్చినదా? (కర్ణం దత్త్వా=చెవియొగ్గి) కిం కథయసి=ఏమనుచున్నావు? — "ఆర్య = ఓ మాన్యుడా!, ఏషా = ఈ, దేవీ=పట్టపుమహిషియైన, భానుమతీ=భానుమతీదేవి, పత్యుః=భర్తయొక్క, సమర=యుద్ధమునందలిదైన, విజయ=జయముయొక్క, ఆశంసయా=ఆకాంక్షతో, నిర్వర్తిత=పూర్తికావింప

ఆశస్త్రగ్రహణాదకుంఠపరశోస్తస్యాపి జేతా మునేః
తాపాయాస్య న పాండుసూనుభిరయం భీష్మః శరైః శాయితః।

---

బడిన, గురు=పెద్దలయొక్కయు, దేవ=దేవతలయొక్కయు, పాదవందనా= పాదములకు మొక్కుటకలదై, గురువుల పాదములకు, దేవతల పాదములకు మ్రొక్కినదై అనుట, అద్యప్రభృతి=నేటినుండి, ఆరబ్ధ=ప్రారంభింపబడిన, నియమా = వ్రతముకలదై, బాలోద్యానే = లేఁదోటలో—నూతనోద్యానవనము నందనుట, తిష్ఠతి=ఉన్నది, ఇతి!=అనియా! (కాకు స్వరము) తత్=అయినచో భద్రే!=కల్యాణీ!, త్వమ్=నీవు ఆత్మ వ్యాపారాయ=నీ పని కొఱకు, గచ్ఛ= పొమ్ము. నీ పని చూసికొమ్మనుట. యావత్=ఇంతలో, అహమపి=నేనుకూడ, అత్రస్థామ్=ఇచ్చటనున్న, దేవీమ్=ద్రౌపదిని, మహారాజస్య=దుర్యోధనునికి, నివేదయామి=విన్నవింతును. (ఇతి=అని, పరిక్రమ్య=కొంత నడచి) పతివ్రతే!= ఓ సాధ్వీ!, సాధు సాధు=లెస్స లెస్స!, స్త్రీభావే=స్త్రీత్వమునందు, వర్తమానా అపి=ఉన్నదానవే అయినను, ఆడుదాన వయినప్పటికి ననుట, భవతీ=నీవు, వరమ్=మేలు, మహారాజః పునః=దుర్యోధనుడన్నచో, న వరమ్=మేలైనవాడు కాము. బలవత్సు=బలవంతులైన, అథవా=పోనీ, కిం బలవత్సు వా=బలహీనులై నప్పటికిని, వాసుదేవ సహాయేషు=శ్రీకృష్ణుడు సహాయముగా కలవారైన, పాండు పుత్రేషు=పాండవులు, ఉద్యతేషు=ఎత్తివచ్చినవారగుచుండగా, అద్య అపి= ఇప్పుడుకూడ, ఈ యుద్ధసమయమునందుకూడ ననుట, అంతఃపుర విహారమ్= అంతఃపుర విహారమును, యః=ఎవడు, అనుభవతి=అనుభవించుచున్నాడో, సః=అట్టివాడైన, అయమ్=ఈ, మహారాజః=దుర్యోధనుడు న వరమ్ అని సమన్వయము. (విచింత్య=బాగుగా ఆలోచించి) ఇదమ్=ఇది, స్వామినః= దుర్యోధనునియొక్క, అపరమ్=మరొక, అయథాతథమ్=అనుచితమైన, చేష్టితమ్= పని, కుతః=ఎందువల్లననగా—

**ఆశస్త్రేతి** :- ఆశస్త్రగ్రహణాదకుంఠపరశోః తస్య మునేః అపి జేతా అయం భీష్మః పాండుసూనుభిః శరైః శాయితః (ఇత్యేతత్) అస్య తాపాయ న; ప్రౌఢానేకధనుర్ధరారివిజయశ్రాంతస్య, ఏకాకినః, చ, అరాతిలూనధనుషః, బాలస్య అభిమన్యోః వధాత్ అయమ్ ప్రీతః (అస్తి).

ప్రౌఢానేక ధనుర్ధరారి విజయ శ్రాంతస్య చైకాకినో
బాలస్యాయమరాతిలూన ధనుషః ప్రీతోఽభిమన్యోర్వధాత్॥ 2

---

అర్థము :- ఆశస్త్రగ్రహణాత్=ఆయుధమును చేపట్టినది మొదలుకొని, అకుంఠ=మొక్కవోని, పరశోః=కుఠారము కలవాడైన, తస్య=ఆ, ప్రసిద్ధుడైన అనుట; మునేః అపి=పరశురామునియొక్కయును, జేతా=విజేత యయిన, పరశురామునికూడ జయించినవాడనుట, అయమ్=మన ఈ, భీష్మః=భీష్ముడు, పాండుసూనుభిః=పాండవులచేత, శరైః=బాణములతో, శాయితః=పడగొట్టబడినాడు, (ఇతి ఏతత్=అనునీ విషయము) అస్య=ఈతనికి, దుర్యోధనునికనుట, తాపాయ=దుఃఖము కొఱకు, న=అగుటలేదు, దుఃఖమును కల్గించుటలేదనుట, ప్రౌఢ=ప్రౌఢలైనట్టియు, ధనుర్విద్యా ప్రౌఢులనియు, ప్రౌఢవయస్కులనియు భావము, అనేక=పలువురైనట్టియు, ధనుర్ధర=ధానుష్కులైనట్టియు, అరి=శత్రువులను (యొక్క) విజయేన = జయించుటతో, శ్రాంతస్య = అలసిపోయినవాడును, ఏకాకినః=ఒంటరివాడును, చ=మరియు, అరాతి=శత్రువుచే, లూన=విఱుగగొట్టబడిన, ధనుషః=విల్లుకలవాడును, బాలస్య=పిన్నవాడును అయిన, అభిమన్యోః=అభిమన్యునియొక్క, వధాత్=సంహారము వలన, అభిమన్యుని సంహరించుటవల్లననుట, అయమ్=ఈతడు-దుర్యోధనుడు, ప్రీతః=సంతుష్టుడు, అస్తి=అగుచున్నాడని క్రియాన్వయము.

సమాసములు :- శస్త్రస్య గ్రహణం-శస్త్రగ్రహణమ్, తస్మాత్-శస్త్రగ్రహణాత్. శస్త్రగ్రహణాత్ ఆరభ్య-ఆశస్త్ర గ్రహణాత్. "ఆఙీషదర్థేఽభివ్యాప్తౌ సీమార్థే ధాతు యోగజే" (3-3-239) అని ఆఙ్ నకు నాలుగు అర్థములు. "తేన సహేత్యభివ్యాప్తిః" (దానితో కలిపి=అభివ్యాప్తి) తేన వినా ఇతి సీమా=మర్యాదా (దానితో కలుపుకొనక దానివఱకు=మర్యాద) ఈ రెండర్థములందును ఆఙ్ అనునది పంచమ్యంతముతో వికల్పముగా సమసించి అవ్యయీభావ సమాసమగుచున్నది. "ఆఙ్ మర్యాదాభివిధ్యోః" (పాణి-2-1-13) "ఆశస్త్ర గ్రహణమ్" అనియునుండవచ్చును. న కుంఠః-అకుంఠః, అకుంఠః పరశుః యస్య సః — అకుంఠపరశుః-తస్య. పాండోః సూనుః-పాండుసూనుః-తైః.

సర్వథా దైవం నః స్వస్తి కరిష్యతి. తద్యావ దత్రస్థాం దేవీం మహా రాజస్య నివేదయామి. (ఇతి నిష్క్రాన్తః)

—: విష్కమ్భకః :—

---

ధరతీతి—ధరః, ధనుషః ధరః—ధనుర్ధరః—ఇచటి షష్ఠి ద్వితీయార్థకము. ప్రౌఢా శ్చతే, అనేకే చ తే ధనుర్ధరాశ్చ తే అరయశ్చ-ప్రౌఢానేక ధనుర్ధరారయః, తేషాం విజయః, తేన శ్రాంతః, తస్య.అరాతినా లూనమ్—అరాతిలూనమ్. అరాతిలూనం ధనుః యస్య సః—అరాతిలూనధనుః—బహువ్రీహిలో సమాసాంతప్రత్యయమైన క(ప్) వైకల్పికము—తస్య.

సంధులు :- పరలోకః+తస్య, మునేః+తాపాయ-సాదేశవిసర్గసంధులు. తస్య+అపి, తాపాయ+అస్య, ప్రౌఢ+అనేక, ధనుర్ధర+అరి, బాలస్య+అయమ్—సవర్ణదీర్ఘ సంధులు. సూనుభిః+అయమ్, ధనుః+ధర, అభిమన్యోః+వధాత్—రేఫాదేశవిసర్గసంధులు. చ+ఏకాకినః—వృద్ధిసంధి. ఏకాకినః+బాలస్య-ఉత్వాదేశ విసర్గసంధి. ప్రీతః+అభిమన్యు—ఉత్వాదేశవిసర్గ—ప్రీతో+అభిమన్యు—పూర్వరూప సంధి.

అలంకారము :— భీష్మాచార్యుడు ఒరిగిపోయినను దుర్యోధనుడు దుఃఖింపలేదు. కారణము పుష్కలముగానున్నను కార్యము (దుఃఖించుట) జరుగ లేదు. కావున ఇది "కార్యాజనిర్విశేషోక్తిస్సతి పుష్కలకారణే"—విశేషోక్తి. శ్రాంతుడైయుండుట, ఏకాకియగుట, బాలుడగుట, లూనధనుష్కుడగుట అను ప్రతిబంధకములు ఉన్నప్పటికిని దుర్యోధనుడు సంతసించుట జరిగినది. కావున విభావనాప్రభేదమగుచున్నది. "కార్యోత్పత్తిస్తృతీయా స్యాత్ సత్యపి ప్రతి బంధకే, నరేంద్రానేవ తే రాజన్! దశత్యసిభుజంగమః." ఇట్లు ఈ రెండును తిల తండుల న్యాయమున కలిసియున్నవి కావున సంసృష్టి. తిలతండులవత్సంసృష్టిః, క్షీరనీరవత్సంకరః.

ఛందస్సు :- మ-స-జ-స-త-త-గ, 1-12—శార్దూలవిక్రీడితము.

సర్వథేతి :— సర్వథా=అన్ని విధములుగను, దైవమ్=దైవము, నః=

(తతః ప్రవిశతి ఆసనస్థా దేవీ భానుమతీ, సఖీ చేటీ, చ)

---

మాకు, స్వస్తి=శుభము, కరిష్యతి=చేయఁగలదు. తత్=అందుచేత, దేవీమ్=పట్టమహిషిని, భానుమతీదేవి సనుట, అత్రస్థామ్=ఇచ్చటనున్నదానిని, దేవి ఇచ్చట నున్నది అని, మహారాజస్య=దుర్యోధనునికి, నివేదయామి=విన్నవింతును. (ఇతి=అని, నిష్క్రాంతః=నిష్క్రమించినవాడయ్యెను)

**విష్కంభకః** :— ఇది విష్కంభము. దృశ్యకావ్యమునందు సూచ్య వస్తువును ప్రతిపాదించుటకు ఆలంకారికులచే నిర్దేశింపబడిన అర్థోపక్షేపకములు అయిదింటిలో విష్కంభము మొదటిది. జరిగిన—జరుగనున్న కథాంశములను తెలుపుచు సంక్షిప్త ప్రయోజనముగా గలిగి మధ్యమపాత్రచేగాని, పాత్రలచేగాని ప్రయోగింపబడునది శుద్ధవిష్కంభము. ఇదే నీచ మధ్యమ పాత్రలచే ప్రయోగింపబడినచో మిశ్రవిష్కంభమగును. "వృత్త—వర్తిష్యమాణానాం కథాంశానాం నిదర్శకః, సంక్షేపార్థస్తు విష్కంభో మధ్యపాత్ర ప్రయోజితః." "ఏకానేక కృతః శుద్ధః సంకీర్ణో నీచమధ్యమైః" (దశరూ-1-59) ఇది ఒకే ఒక—కంచుకి—మధ్యమపాత్రచే ప్రయోగింపబడిన శుద్ధవిష్కంభము. ఇందు కురు పాండవ సంగ్రామము ప్రారంభమగుట, భీష్ముడు పడిపోవుట, అభిమన్యుడు హతుడగుట, భానుమతీదేవి వ్రతనియమము స్వీకరించుట అను జరిగిపోయిన కథాంశములు సూచింపబడినవి. సంగ్రామము మరణము ఇత్యాదులు ప్రదర్శనీయములు కావు. సూచ్యములు. "నీరసోఽనుచితస్తత్ర సంసూచ్యో వస్తువిస్తరః, దృశ్యస్తు మధురోదాత్త రసభావ నిరంతరః" (దశరూ—1—57) అని నియమము. కాగా వ్రతనియమములతో బాలోద్యానవనమునందున్న భానుమతీదేవి ప్రవేశించుచున్నదనియు, దుర్యోధనుడు ఆమెను సమీపింపబోవుచున్నాడనియు వర్తిష్యమాణ కథాంశములు సూచింపబడినవి. ఎంత కథ సంక్షేపింపబడినదో స్పష్టము. ఇతివృత్తము ప్రఖ్యాతము కావున ఇట్టి సంక్షిప్త ప్రేక్షక—పాఠకులను ఇబ్బంది పెట్టదు. కవి స్వయంప్రతిభతో చేసిన కల్పనలకే ప్రాధాన్యమిచ్చి అసూచ్యములుగా సంతరించుట సహజము.

**తత ఇతి** :— (తతః=పిదప, ఆసనస్థా=కూర్చున్నదైన, దేవీ

సఖీ : సఖి భానుమతి! కస్మాదిదానీం త్వం స్వప్నదర్శన మాత్రస్య కృతే అభిమానినో మహారాజ దుర్యోధనస్య మహిషీ భూత్వైవం విగళిత ధీరభావాతిమాత్రం సంతప్యసే? (సహి భాణుమది, కీస దాణీ తుమం సివిణ అదంసణమేత్తస్స కిదే అహిమాణిణో మహారాఅ దుజ్జోహణస్స మహిసీ భవిఅ ఏవ్వం విఅలిఅ ధీరభావా అదిమేత్తం సంతప్పసి.)

చేటీ : భట్టిని శోభనం భణతి సువదనా. స్వపన్ జనః కిం న ఖలు ప్రలపతి! (భట్టిణి, సోహణం భణాది సువఅణా. సివిణఅన్తో జనో కిం ణ క్ఖు ప్పలవది)

---

భానుమతీ=భానుమతీదేవి, సఖీ=చెలిమికత్తె, చ=మరియు, చేటీ=చేటిక (దాసి) ప్రవిశతి=ప్రవేశించును. ముగ్గురకును క్రియ ప్రత్యేకముగా నన్వయించును)

సఖీతి :— సఖి భానుమతి!=ఓ చెలీ భానుమతీ!, అభిమానినః=అభిమాన వంతుడైన, మహారాజ దుర్యోధనస్య=దుర్యోధనమహారాజుయొక్క, మహిషీ భూత్వా=పట్టమహిషివైయుండి, త్వమ్=నీవు, స్వప్నదర్శనమాత్రస్య కృతే= కలలో ఏదో చూచినంతమాత్రమునకే, ఏవమ్ = ఇట్లు, ఇదానీమ్=ఇప్పుడు, విగళిత ధీరభావా=ధైర్యము కోల్పోయినదానవై, కస్మాత్=ఎందువలన, అతి మాత్రమ్=మిక్కిలి, సంతప్యసే=కుములుచున్నావు?

భట్టినీతి :— భట్టిని! = ఓ స్వామినీ! సువదనా=ఈ సువదన (సఖి పేరిది) శోభనమ్ భణతి=లెస్స పలుకుచున్నది. జనః=జీవి, స్వపన్=నిద్రించుచు, కిం న ఖలు ప్రలపతి=ఏమి పలవరించడు! కలలో దేనినైనను చూడవచ్చును. ఏమియైనను పలవరించవచ్చు ననుట.

భానుమతీ : హంజే! ఏవమేతత్. కిం త్వయం స్వప్నోఽతిమాత్ర మకుశలదర్శనో మే ప్రతిభాతి. (హంజే, ఏవ్వం ణ్ణేదమ్. కిందు ఏదం సివిణఅం అదిమేత్తం అకుసలదంసణం మే పడిభాది.)

సఖీ : ప్రియసఖి', యద్యేవం తత్కథయ స్వప్నం యేనావా మపి ప్రతిష్ఠాపయంత్యౌ ధర్మప్రశంసయా దేవతా సంకీర్తనేన దూర్వాది పరిగ్రహేణ చ పరిహరిష్యావః. (పిఅసహి, జఇ ఏవ్వం తా కహేహి సవిఅణం జేణ అంహే వి పడిట్ఠావఅంతీఓ ధమ్మప్పసంసాఏ దేవదా సంకిత్తణేణ దువ్వాదిపడిగ్గహేణ అ పడిహాడిస్సామో )

చేటీ : శోభనం ఖలు భణతి సువదనా. అకుశల దర్శనాః స్వప్నాః దేవతానాం ప్రశంసయా కుశలపరిణామాః

---

హంజేఇతి :— హంజే=ఓసీ!, ఏతత్=ఇది, ఏవమ్=ఇట్లే. నీవన్నది నిజమే అనుట, కింతు=కానీ, అయమ్=ఈ, స్వప్నః=కల, అతిమాత్రమ్= మిక్కిలి, అకుశల దర్శనః=అమంగళ సంసూచకముగా, మే=నాకు, ప్రతిభాతి= తోచుచున్నది. కుశలశబ్దము గుర్తింపదగినది.

ప్రియసఖీతి :— ప్రియసఖి!=ఓ నెచ్చెలీ!, యద్యేవమ్ తత్=అట్లయి నచో, స్వప్నమ్=కలను గురించి, కథయ=చెప్పుము, యేన=ఎందుచేతననగా, ఆవామపి=మేమిరువురముకూడ, ప్రతిష్ఠాపయంత్యౌ=శుభమును ప్రతిష్ఠించుచున్న వారమై, ధర్మప్రశంసయా=ధార్మిక ప్రసంగములతోను, దేవతా సంకీర్తనేన= దేవతలను స్తుతించుటతోను, చ=మరియు, దూర్వాది=గరిక మొదలైన మంగళకర ద్రవ్యములయొక్క, పరిగ్రహేణ=స్వీకారముతోను, దర్భాదులను చేతితో పట్టు కొనుట కొంగునకుగాని గుమ్మమునకుగాని కట్టుకొనుట మొదలైన పనులతో ననుట. పరిహరిష్యావః=అమంగళమును పరిహరింతుము.

శోభనమితి :— సువదనా=సువదన, శోభనమ్=లెస్సగా, భణతి ఖలు=

భవంతీతి శ్రూయతే. (సోహణాం ఖు భణాది సువఅణా. అకుసలదంసణా సవిణఆ దేవదాణాం పసంసాఏ కుసల పరిణామా హోన్తి త్తి సుణీఅది.)

భానుమతీ : యద్యేవం తత్కథయిష్యే. అవహితా తావద్భవ. (జఇ ఏవ్వం తా కహఇస్సం. అవహిదా దావ హోహి.)

సఖీ : అవహితాస్మి, కథయతు ప్రియసఖీ. (అవహిదహ్మి, కహేదు పిఅసహీ.)

భానుమతీ : హలా!, భయేన విస్మృతాస్మి. తత్తిష్ఠ యావత్ సర్వం స్మృత్వా కథయిష్యామి. (హలా, భఏణ విసుమరిదహ్మి తా చిట్ఠ జావ సవ్వం సుమరిఅ కహఇస్సం.) (ఇతి చింతాం నాటయతి)

---

పలుకుచున్నదిగదా!, అకుశలదర్శనాః=అశుభసంసూచకములైన, స్వప్నాః= కలలు, దేవతానామ్=దేవతలయొక్క, ప్రశంసయా=సంకీర్తనతో, కుశల పరిణామాః = శుభప్రదములు, భవంతి ఇతి = అగుచున్నవని లేక అగునని, శ్రూయతే=వినబడుచున్నది. అట్టి ప్రసిద్ధి కలదనుట.

యద్యేవమితి :— యద్యేవం తత్ = అట్లయినచో, కథయిష్యే = చెప్పుదును, అవహితా=సావధానవు, భవ=కమ్ము. "తావత్" వాక్యాలంకారార్థము.

అవహితాస్మీతి :— అవహితా అస్మి=సావధాననై యుంటిని, ప్రియ సఖీ=నెచ్చెలి, కథయతు=చెప్పునుగాక!

(తతః ప్రవిశతి దుర్యోధనః కంచుకీ చ)

దుర్యోధనః: సూక్తమిదం కస్యచిత్—

గుప్త్యా సాక్షాన్మహానల్పః స్వయమన్యేన వా కృతః।
కరోతి మహతీం ప్రీతిమపకారోఽపకారిణామ్॥ 3

---

**తత ఇతి** :- (తతః = అంతట, దుర్యోధనః = సుయోధనుడు, చ= మరియు, కంచుకీ=కంచుకి, ప్రవిశతి=ప్రవేశించును—ప్రత్యేకాన్వయము)

**సూక్తమితి** :- ఇదమ్=ఇది, చెప్పబోవునదనుట, కస్యచిత్=ఎవనిదో, సూక్తమ్=అందమైన మాట—

గుప్త్యేతి :- అపకారిణామ్, గుప్త్యా వా, సాక్షాద్వా, మహాన్వా, అల్పో వా, స్వయం వా, అన్యేన వా, కృతః అపకారః మహతీం ప్రీతిం కరోతి.

**అర్థము** :- అపకారిణామ్=శత్రువులకు, గుప్త్యా వా=గుట్టుగా గానీ, సాక్షాత్ వా=ప్రత్యక్షముగా గానీ, బహిరంగముగా ననుట, మహాన్ వా=అధికముగా గానీ, అల్పః వా=అల్పముగా గానీ, పెద్దదిగానీ చిన్నదిగానీ అనుట, స్వయం వా=తనచే గానీ, అన్యేన వా=వేరొకనిచే గానీ, కృతః=చేయబడిన, అపకారః= అపకారము, మహతీమ్=గొప్పదైన, ప్రీతిమ్=ఆనందమును, కరోతి=కలిగించును. అధికానందకర మనుట.

**సంధులు** :- సాక్షాత్+మహాన్—అనునాశికాదేశసంధి. అపకారః+ అపకారిణామ్—ఉత్వాదేశవిసర్గసంధి. అపకారో+అపకారిణామ్—పూర్వరూపస్వర సంధి.

**క్రియ** :- డు కృఞ్ కరణే, లట్, పరస్మై, ప్రథమ. (ఉభయపది)
కరోతి—కురుతః—కుర్వన్తి.

యేనాద్య ద్రోణకర్ణజయద్రథాదిభి ర్హత మభిమన్యు
ముపశ్రుత్య సముచ్ఛ్వసిత మివ న శ్చేతసా.

కంచుకీ : దేవ. నేద మతిదుష్కర మాచార్య శస్త్ర ప్రభావాణామ్.
కర్ణ జయద్రథయో ర్వా కా నామాత్ర శ్లాఘా!

రాజా : వినయంధర! కిమాహ భవాన్? ఏకో బహుభిర్బాలో
లూనశరాసనశ్చ నిహత ఇత్యత్ర కా శ్లాఘా కురుపుంగవా
నామితి? మూఢ! పశ్య—

---

ఛందస్సు :— అనుష్టుప్పులోని ప్రభేదమయిన పథ్యావక్త్రము. సమపాదములలో (2-4) తృతీయస్థానమున (అయిదు, ఆరు, ఏడు అక్షరములతో) జ గణముండుటచే ఇది పథ్యావక్త్రము.

యేనేతి :- యేన=ఎందుచేత ననగా, అద్య=నేడు, ద్రోణ, కర్ణ, జయద్రథాదిభిః=ద్రోణుడు, కర్ణుడు, జయద్రథుడు మొదలగువారిచే, హతమ్=చంపబడినవానినిగా, అభిమన్యుమ్=అభిమన్యుని, ఉపశ్రుత్య=తెలిసికొని, అభిమన్యుడు హతుడగుట ఎరిగియనుట, నః=మాయొక్క, చేతసా=మనస్సుచే, సముచ్ఛ్వసితమ్ ఇవ=నిట్టూర్పబడినట్లున్నది. లేక వికసింపబడినట్లున్నది. సుఖముతో ఆనందముతో తేరుకొని తేలికపడి ఊపిరి తీసికొన్నదనుట.

దేవేతి :- దేవ!=మహారాజా!, ఆచార్య=ద్రోణునియొక్క, శస్త్ర=ఆయుధములయొక్క, ప్రభావాణామ్=శక్తిసామర్థ్యములకు, ఇదమ్=ఈ అభిమన్యువధ, న అతిదుష్కరమ్=కష్టసాధ్యమైనది కాదు, కర్ణజయద్రథయోః వా=కర్ణజయద్రథులకు మాత్రము, అత్ర=ఈ విషయమున, కా నామ శ్లాఘా!=ఘనత ఏమున్నది? అన్యాయముగా చంపుట శ్లాఘింపదగినది కాదనుట.

వినయంధరేతి :— వినయంధర!=ఓ వినయంధరుడా! భవాన్=నీవు, కిమ్ ఆహ=ఏమంటివి? ఏకః=ఒంటరివాడును, బాలః=పిన్నవయసువాడును,

హతే జరతి గాంగేయే పురస్కృత్య శిఖండినమ్।
యా శ్లాఘా పాండుపుత్రాణాం సైవాస్మాకం భవిష్యతి॥ 4

కంచుకీ : (సవైలక్ష్యమ్) దేవ! న మమాయం సంకల్పః. కిం తు భవత్ పౌరుష ప్రతీఘాతోఽస్మాభి ర్నావలోకితపూర్వ ఇత్యత ఏవం విజ్ఞాపయామి.

---

లూన=విరుగగొట్టబడిన, శరాసనః చ=ధనుస్సు కలవాడునైన అభిమన్యుడు, బహుభిః=పలువురచే, నిహతః=చంపబడినాడు, ఇత్యత్ర=అనునీ విషయమున, కురుపుంగవానామ్=కౌరవశ్రేష్ఠులకు, కా నామ శ్లాఘా ఇతి?=ఘనత ఏమున్నది అనియా?; మూఢ =మూర్ఖుడా!, పశ్య=చూడు—

**హత ఇతి** :— శిఖండినం పురస్కృత్య జరతి గాంగేయే హతే (సతి) పాండుపుత్రాణాం యా శ్లాఘా, సైవ శ్లాఘా అస్మాకం భవిష్యతి.

**అర్థము** :- శిఖండినమ్=శిఖండిని, పురస్కృత్య=ముందుంచుకొని, జరతి=వృద్ధుడయిన, గాంగేయే=భీష్ముడు, హతే సతి=చంపబడినవాడగుచుండగా, పాండుపుత్రాణామ్=పాండవులకు, యా శ్లాఘా=ఏ ఘనత (లభించినదో), సా ఏవ శ్లాఘా = అదే ఘనత, అస్మాకమ్ = మాకు(ను) భవిష్యతి=కలుగును. అనుష్టుప్పు.

**సమాసములు** :- పాండోః పుత్రాః—పాండుపుత్రాః, తేషాం—పాండుపుత్రాణామ్.

క్రియ :- భూ సత్తాయామ్, పరస్మై, ల్పట్, ప్రథమ
భవిష్యతి—భవిష్యతః—భవిష్యన్తి.

**సవైలక్ష్యమితి** :- (సవైలక్ష్యమ్ = సిగ్గుతో) దేవ = మహారాజా! అయమ్=ఇది, ఇట్టిభావమును, మమ=నాయొక్క, సంకల్పః=అభిప్రాయము,

రాజా : ఏవమిదమ్.

సహభృత్యగణం సబాంధవం సహమిత్రం ససుతం
సహానుజమ్।
స్వబలేన నిహన్తి సంయుగే న చిరాత్పాండుసుతః
సుయోధనమ్॥ 5

న=కాదు, తమకు అపకీర్తి నాపాదించుట నా ఉద్దేశము కాదు, కిన్తు=కానీ, భవత్ పౌరుష ప్రతీఘాతః=మీ మగటిమి దెబ్బతినుట, అస్మాభిః=మాచేత, అవలోకిత పూర్వః=ఇంతకుముందు చూడబడినది, న=కాలేదు, అట్టిది మేమెరుగ మనుట, ఇతిఅతః=అందుకే, ఏవమ్=ఇట్లు, విజ్ఞాపయామి=విన్నవించితిని. (సమీప భూతములో వర్తమాన రూపము)

**ఏవమితి** :— ఇదమ్=ఇది, ఏవమ్=ఇట్లే.

**సహేతి** :— సహభృత్యగణమ్, సబాంధవమ్, సహమిత్రం ససుతం సహానుజం సుయోధనమ్, పాండుసుతః సంయుగే, స్వబలేన న చిరాత్ నిహన్తి.

**అర్థము** :— సహభృత్యగణమ్ = సేవకుల సమూహముతో కూడిన వాడును, సబాంధవమ్=చుట్టములతో కూడినవాడును, సహ మిత్రమ్=చెలిమి కాండ్రతో కూడినవాడును, ససుతమ్=తనయులతో కూడినవాడును, సహానుజమ్= తమ్ములతో కూడినవాడును అయిన, సుయోధనమ్=దుర్యోధనుని, పాండుసుతః= ధర్మజుడు, సంయుగే=యుద్ధమునందు, న చిరాత్=అనతికాలములోనే, రేపో మాపో అనుట, నిహన్తి=సంహరించును. (సమీప భవిష్యత్కాలమున వర్తమాన రూపము)

**సమాసములు** :- భృత్యానాం గణః—భృత్యగణః, భృత్యగణేన సహితః సహభృత్యగణః-తమ్. బాంధవైః సహితః-సబాంధవః-తమ్-సబాంధవమ్. మిత్రైఃసహ-తమ్. సుతైః సహ-తమ్. అనుజైః సహ-తమ్. తుల్యయోగార్థక మైన సహ అనునది తృతీయాన్తముతో సమసించి బహువ్రీహి అగును—శేస

కంచుకీ : (కర్ణౌ పిధాయ సభయమ్) శాన్తం పాపమ్. ప్రతిహత మమంగళమ్.

రాజా : వినయంధర! కిం మయోక్తమ్?

---

సహేతి తుల్యయోగే (2/2/28). బహువ్రీహిలో అది "స" గా మారుట వైకల్పికము—వోపసర్జనే (6-3. 82). కావుననే రెండు విధములైన రూపములను కవి ప్రయోగించి చూపినాడు. నిహన్తి అను క్రియలోనికి దుర్యోధనునితోపాటు భృత్యాదులకును కర్మయోగమున్నదనుట—తుల్యయోగము. స్వస్య బలమ్—స్వబలమ్—తేన—స్వబలేన. పాండోః సుతః—తమ్.

క్రియ :- హన హింసాగత్యోః, పరస్మై, లట్, ప్రథమ హన్తి—హతః—ఘ్నన్తి.

ఛందస్సు :- లలితావృత్తము — ససజా విషమే యదా గురుః సభరా స్యాల్లలితా సమే లగౌ"—ఒకటి, మూడు పాదములలో (విషమ) స—స—జ—గ—అను గణములును, రెండు, నాలుగు పాదములలో (సమ) స—భ—ర—ల గ—అను గణములను ఉండును.

స - స - జ - గ = స స జ గ
I I U - I I U - I U I -
సహభృ - త్యగణం - సబాంధ - వమ్ (ప్రథమపాదము)
స్వబలే - నని హ - న్తిసంయు- గే (తృతీయపాదము)

I I U - U I I - U I U - IU = స భ ర ల గ
సహమి - త్రం సను - తం స హా - నుజమ్ [ద్వితీయ]
నచిరా - త్పాండుసు - తం సుయో - ధనః [చతుర్థ]

కర్ణావితి :- [కర్ణౌ=చెవులను, పిధాయ=మూసికొని, సభయమ్=భీతితో] పాపమ్=పాపము, శాంతమ్ [భవతు]=శమించుసుగాక, అమంగలమ్=అశుభము, ప్రతిహతమ్ [భవతు]=నాశనమగుసుగాక.

వినయంధరేతి :— ఓ వినయంధరుడా!, మయా=నాచే, కిమ్‌ఉక్తమ్= ఏమి పలుకబడినది? నేనేమంటినని నీవట్లనుచున్నావనుట.

కంచుకీ : సహభృత్యగణం సబాంధవమ్ సహమిత్రం ససుతం సహానుజం।
స్వబలేన నిహన్తి సంయుగే న చిరాత్పాండుసుతం సుయోధనః॥ 6

(ఇతి పఠతి) ఏతద్విపరీత మభిహితం దేవేన

రాజా : వినయంధర! అద్య ఖలు భానుమతీ యథాపూర్వం మామనామంత్ర్య వాసభవనాత్ ప్రాతరేవ నిష్క్రాంతేతి వ్యాక్షిప్తం మే మనః, తదాదేశయ తముద్దేశం యత్రస్థా భానుమతీ.

కంచుకీ : ఇత ఇతో దేవః. (ఉభౌ పరిక్రామతః)

---

సహభృత్యగణమితి :- దుర్యోధనుని శ్లోకమును చివర పాండు సుతం సుయోధనః— [పాండుసుతమ్=ధర్మరాజును, సుయోధనః=దుర్యోధనుడు, నిహన్తి=చంపును] అని మార్చి [ఇతి=అని, పఠతి=చదువును] దేవేన=మహా రాజుచే, ఏతద్విపరీతమ్=దీనికి విపరీతముగా, పూర్తి వ్యతిరేకార్థము వచ్చునట్లుగా ననుట, అభిహితమ్=పలుకబడినది.

అద్యఖల్వితి :- ఓ వినయంధరుడా! అద్య=నేడు, భానుమతీ=భానుమతీ దేవి, యథాపూర్వమ్=ఎప్పటివలె, మామ్=నన్ను, అనామంత్ర్య=వీడ్కొలుపక, వాసభవనాత్=శయనగృహమునుండి, ప్రాతఃఏవ=వేకువజాముననే, నిష్క్రాంతా ఖలు=నిష్క్రమించినదిగదా, ఇతి=అని, మే=నాయొక్క, మనః=అంతరంగము, వ్యాక్షిప్తమ్=కలతచెందినది. తత్=అందుచే, భానుమతీ=భానుమతీదేవి, యత్రస్థా= ఎచ్చటనున్నదో, తమ్=ఆ, ఉద్దేశమ్=స్థానమును, ఆదేశయ=తెలుపుము. అటు మార్గము చూపుమనుట.

ఇత ఇత ఇతి :- ఇత ఇతః దేవః = ఇటు ఇటు మహారాజా!—ఇది రాజమర్యాద. [ఉభౌ=ఇరువురును, పరిక్రామతః=నడుచుచుందురు]

కంచుకీ : (పురోఽవలోక్య, సమన్తతో గంధమాఘ్రాయ) దేవ! పశ్య పశ్య! ఏత త్తుహిన కణ శిశిర సమీరణోద్వేల్లిత బంధనచ్యుత శేఫాలికా విరచిత కుసుమ ప్రకరమ్, ఈషదాలోహిత ముగ్ధవధూ కపోల పాటల లోధ్ర ప్రసూన విజిత శ్యామల లతాసౌభాగ్యమ్, ఉన్మీలిత వకుల కుంద కుసుమ సురభిశీతలం, ప్రభాతకాల రమణీయమ్ అగ్రతస్తే బాలోద్యానమ్. తదవలోకయతు దేవః. తథాహి—

---

పురఇతి :— [పురః=ముందునకు, అవలోక్య=చూచి, సమంతతః= అన్ని వైపులనుండి, గంధమ్=సువాసనను, ఆఘ్రాయ=పీల్చి] దేవ=మహారాజా! పశ్య—పశ్య=చూడుము చూడుము!, తుహిన కణ=మంచుబిందువులతో, శిశిర= చల్లనైన, సమీరణ=వాయువుచే, ఉద్వేల్లిత=కుదుపబడిన, బంధన=తొడిమెల నుండి, చ్యుత=జారిపడిన, శేఫాలికా=నిర్గుండి పువ్వులతో, విరచిత=రచింప బడిన, కుసుమ ప్రకరమ్=పుష్పాస్తరణము కలదియును; "శేఫాలికా తు సువహా నిర్గుండీ నీలికా చ సా" అని అమరము [2—4—70]. ఈషత్ = కొంచెముగా, ఆలోహిత=ఎఱుపెక్కిన, ముగ్ధవధూ=సిగ్గరి పెండ్లికొమార్తె యొక్క, కపోల = చెక్కిళులవలె, పాటల = లేత యెఱుపులోనున్న, లోధ్ర ప్రసూన=లొద్దుగపూలతో, విజిత=జయింపబడిన, శ్యామల లతా=ప్రియంగు వల్లికలయొక్క, సౌభాగ్యమ్=సౌందర్యము కలదియును; ఉన్మీలిత=వికసించిన, వకుల=పొగడలతోను, కుంద కుసుమ=మొల్లలతోను, సురభి=సుగంధితమై, శీతలమ్=చల్లగానున్నదియును, ప్రభాతకాల=ప్రాతఃకాలమునందు, రమణీయమ్= మనోజ్ఞముగానున్నదియును, ఏతత్=ఇది, బాలోద్యానమ్=క్రొత్త పూదోట; తే= నీకు, అగ్రతః=ఎదుట, ఉన్నదనుట. తత్=దానిని, దేవః=మహారాజు, ఆలోక యతు=చూచుసుగాక. తథాహి=అవునుగదా!—

ప్రాలేయమిశ్ర మకరన్ద కరాళకోశైః
పుష్పైస్సమం నిపతితా రజనీప్రబుద్ధైః।
అర్కాంశుభిన్న ముకులోదర సాంద్ర గంధ
సంసూచితాని కమలా న్యలయః పతన్తి॥ 7

---

ప్రాలేయేతి :— రజనీప్రబుద్ధైః ప్రాలేయమిశ్ర మకరంద కరాళకోశైః పుష్పైస్సమం నిపతితాః అళయః అర్కాంశు ...సంచూచితాని కమలాని పతన్తి.

**అర్థము :-** రజనీ = రాత్రియందు, ప్రబుద్ధైః = వికసించినవియును, ప్రాలేయ=మంచుతో, మిశ్ర=కలిసిన, మకరంద=పూదేనెతో, ఆ బరువుతో ననుట, కరాళ=ఒరిగిన లేక నతోన్నతములైన, కోశైః=కోశములుగల, పుష్పైః= పువ్వులతో, సమమ్=సమానముగా, నిపతితాః=రాలిపడుచున్న, అలయః= తుమ్మెదలు; అర్క=సూర్యునియొక్క, అంశు=కిరణములతో, భిన్న=వికసించిన, ముకుల=మొగ్గలయొక్క, ఉదర=కోశములయంతలి, సాంద్ర=దట్టమైన, గంధ= సువాసనతో, సంసూచితాని=తెలియజేయబడిన ఉనికి కలవైన, కమలాని=పద్మము లను, పతన్తి=సమీపించుచున్నవి. అట్టి పద్మములపై వ్రాలుచున్నవనుట.

సమాసములు :— ప్రాలేయేన మిశ్రః — ప్రాలేయ మిశ్రః చ అసౌ మకరందశ్చ—ప్రాలేయమిశ్రమకరందః, తేన కరాళాః—ప్రాలేయ మిశ్రమకరంద కరాళాః కోశాః యేషాం తాని—ప్రాలేయ మిశ్రమకరందకరాళకోశాని—తైః. రజన్యాం ప్రబుద్ధాని-రజనీ ప్రబుద్ధాని-తైః. అర్కాణాం అంశవః-అర్కాంశవః, అర్కాంశుభిః భిన్నాః—అర్కాంశుభిన్నాః చ తే ముకుళాశ్చ—అర్కాంశుభిన్న ముకుళాః. తేషామ్ ఉదరాణి. సాంద్రశ్చాసౌ గంధశ్చ-సాంద్రగంధః. అర్కాంశు భిన్నముకులోదరాణాం సాంద్రగంధః, తేన సంసూచితాని.

క్రియ : పత్ల గతౌ—పరస్మై—ప్రథమ. పతతి—పతతః—పతన్తి.

**సంధులు :—** నిపతితాః+రజనీ—విసర్గలోపసంధి. అర్క+అంశు— సవర్ణదీర్ఘ. ముకుల=ఉదర—గుణసంధి. కమలాని+అలయః—యణాదేశ.

రాజా : (సమంతాదవలోక్య) వినయంధర, ఇద మపర మముష్మి న్నుషసి రమణీయతరమ్. పశ్య—

జృంభారంభ ప్రవితత దళోపాంతజాలప్రవిష్టైః
హస్తైర్భానోర్నృపతయ ఇవ స్పృశ్యమానా విబుద్ధాః।
స్త్రీభి స్సార్ధం ఘనపరిమళస్తోక లక్ష్యాంగరాగా
ముంచం త్యేతే వికచనలినీగర్భశయ్యాం ద్విరేఫాః॥ 8

---

ఛందస్సు :- వసంతతిలక. "ఉక్తా వసంతతిలకా తభజా జగౌ గః"

| త | భ | జ | జ | గగ |
|---|---|---|---|---|
| U U I | U I I | I U I | I U I | U U |
| ప్రాలేయ | మిశ్రమ | కరంద | కరాళ | కోశైః |

**వినయంధరేతి :-** (సమంతాత్ అవలోక్య=తేరిపారజూచి) వినయంధరుడా!, అముష్మిన్=ఈ, ఉషసి=ప్రాతఃకాలమునందు, ఇదమ్=ఇది, ఈ చెప్పబోవునదనుట, అపరమ్=మరియొక, రమణీయతరమ్=మిక్కిలి అందమైన విషయము. పశ్య=చూడుము—

**జృంభేతి :-** జృంభారంభ ప్రవిష్టైః భానోః హస్తైః స్పృశ్యమానాః విబుద్ధాః నృపతయః ఇవ ఏతే ద్విరేఫాః ఘనపరిమళస్తోక లక్ష్యాంగరాగాః స్త్రీభిః సార్ధమ్ వికచనలినీ గర్భశయ్యాం ముంచన్తి.

**అర్థము :—** జృంభ=వికాసముయొక్క, ఆరంభ=ప్రారంభముతో, ప్రవితత=విస్తృతినిపొందిన, దళ=రేకులయొక్క, ఉపాన్త=ముంగొనలు అనునట్టి, జాల=గవాక్షములనుండి, ప్రవిష్టైః=లోనికి ప్రవేశించిన, భానోః=సూర్యుని యొక్క, హస్తైః=కరములతో, స్పృశ్యమానాః=తాకబడుచున్నవై; విబుద్ధాః= మేల్కొల్పబడిన, నృపతయః ఇవ=రాజులవలె, ఏతే=ఈ, ద్విరేఫాః=తుమ్మెదలు,

ఘన=సాంద్రమైన, పరిమళ=సంభోగముతో, స్తోక=కొంచముగా, లక్ష్య= కనిపించు, అంగరాగాః=మైపూత కలవై; లేక పుప్పొడి కలవై, సంభోగ సంరంభములో మైపూత రాలినది రాలిపోగా కొంచముగా మిగిలియున్నదనుట, స్త్రీభిః సార్థమ్=స్త్రీలతోసహా ఆడుతుమ్మెదలతో ననుట, వికచ=వికసించిన, నలినీ=పద్మముయొక్క, గర్భ=కర్ణికయనునట్టి, శయ్యామ్=సెజ్జను, ముంచన్తి= విడుచుచున్నవి. (ముచ్లృ మోక్షణే).

విశేషములు :— "భాభిర్భానోర్నృపతయః" .... అను పాఠాంతర మున్నది, భానోః, భాభిః=కిరణములతో—అని అర్థము. కానీ రాజపరముగా సమన్వయించుటకు హస్తైః అను పాఠమే అనుకూలము. పరిమళశబ్దమునకు "సంభోగః స్యాత్పరిమళే" అని వైజయన్తి. కానీ అమరమునందు "విమర్దోత్థే పరిమలో గంధే జనమనోహరే" (1—5—10) అనియున్నది. "సురతాది విమర్దోత్థే మాల్యాదిగంధే, ఘర్షణ సముద్భవే చందనాది గంధే చ, జనానాం మనోహరే, పరిమళః" అని రామాశ్రమి. సంభోగసమ్మర్దాతిశయమున నలిగిన పుష్పాల వాసనను మాత్రమే పరిమళము అనవలె ననుట. ద్విరేఫ శబ్దము ద్వౌరేఫౌ యస్మిన్‌శబ్దే అను వ్యుత్పత్తితో భ్రమర శబ్దమును సూచింపగా అది తుమ్మెద అనునర్థమునిచ్చును. ఇట్టిదానిని అనురణన పద్ధతి (ధ్వని తరంగముల వలె) అందురు. ఒకప్రక్క యుద్ధము జరుగుచుండగా రారాజునకు ప్రకృతి యందు ఇట్టి సౌందర్యము కన్పించుట ఆతని అనుచితవైఖరిని ఆవిష్కరించు చున్నది.

సమాసములు :- జృంభాయాః ఆరంభః — జృంభారంభః, తేన ప్రవితతాశ్చ తే దళాశ్చ—జృంభారంభప్రవితతదళాః. తేషా ముపాంతాః ఏవ జాలాని—జృంభారంభప్రవితతదళోపాంతజాలాని. తైః ప్రవిష్టాః—జృంభారంభ—ప్రవిష్టాః-తైః. నృణాం పతిః నృపతిః—తే నృపతయః. ఘనశ్చాసౌ పరిమళశ్చ—ఘనపరిమళః. స్తోకం లక్ష్యాః—యథాభవతి స తథేతి—స్తోకలక్ష్యాః. ఘనపరిమళేన స్తోకలక్ష్యాః అంగరాగః యేషాం తే-ఘనపరిమళస్తోకలక్ష్యాంగరాగాః. వికచా చ సా నళినీ చ—వికచనళినీ. తస్యాః గర్భః—వికచనళినీగర్భఃఏవ శయ్యా—తామ్.

కంచుకీ : దేవ, నన్వేషా దేవీ భానుమతీ సువదనయా తరళికయా చ పర్యుపాస్యమానా తిష్ఠతి. తదుపసర్పతు దేవః.

---

**సంధులు :—** దళ+ఉపాన్త—గుణసంధి. ఉప+అన్త—లక్ష్య+అంగ రాగ, జృంభ+ఆరంభ, స+అర్ధమ్—సవర్ణదీర్ఘసంధులు. ప్రవిష్టైః+హస్తైః+ భానోః+నృపతయః—రేఫాదేశవిసర్గసంధులు. నృపతయః+ఇవ, స్పృశ్యమానాః+ విబుద్ధాః; అంగరాగాః+ముంచన్తి — విసర్గలోపసంధులు. ముంచన్తి+ఏతే— యణాదేశసంధి.

ఛందస్సు :— మందాక్రాంత. "మందాక్రాంతాంబుధిరసనగైర్మో భనౌ తౌ గయుగ్మమ్". మ భ న తత గ గ—4–6–4

| మ | భ | న | త | త | గగ |
|---|---|---|---|---|---|
| U U U | U I I | I I I | U U I | U U I | U U |
| ముంచంత్యే | తేవిక | చనళి | నీ గర్భ | శయ్యాం ద్వి | రేఫాః |

**అలంకారము :—** ఆడ—మగ తుమ్మెదలు పద్మములనుండి వెలువడుట ప్రకృతము. స్త్రీలతో నృపతులు పడకగదులనుండి వెలువడుట అప్రకృతము. ఈ రెండిటికి సాదృశ్యము మనోహరముగా కూర్పబడినది. "ఇవ" ఉపమా వాచకము. "ముంచన్తి"తో ఏకక్రియాన్వయరూపమైన సమానధర్మము ఉపాత్తము. కావున పూర్ణోపమాలంకారము. "ఉపమా యత్ర సాదృశ్య లక్ష్మీరుల్లసతి ద్వయోః" ఉపాంతములు అనునట్టి జాలములు, నళినీగర్భము అనునట్టి శయ్య — ఇవి అనుభయతాద్రూప్యరూపకములు. హస్తములు (కిరణములు) అనునట్టి హస్తములతో (చేతులతో) — ఇది శ్లిష్టరూపకము. కావున ఇందలి ఉపమాలంకారము రూపకానుప్రాణితము.

**దేవేతి :—** దేవ=మహారాజా!, నను=వినుము లేక చూడుము, ఇదిగో అనుట, ఏషా=ఈ, దేవీ=మహారాజ్ఞియైన, భానుమతీ=భానుమతీదేవి, సువదనయా= సువదనతోను, చ=మరియు, తరళికయా=తరళికతోను, పర్యుపాస్యమానా= సేవింపబడుచున్నదై, తిష్ఠతి=కూర్చున్నది. ("నను" అనునది అభిముఖీకరణార్థక

రాజా : (దృష్ట్వా) ఆర్య వినయంధర! గచ్ఛ త్వం సాంగ్రామికం మే రథ ముపకల్పయితుమ్. అహ మప్యేష దేవీం దృష్ట్వానుపద మాగత ఏవ.

కంచుకీ : ఏష కృతో దేవాదేశః. (ఇతి నిష్క్రాంతః)

సఖీ : ప్రియసఖి, అపి స్మృతం త్వయా? (పిఅసహి, అవి సుమరిదం తుఏ.)

భానుమతీ : సఖి, స్మృతమ్. అద్య కిల ప్రమదవన ఆసీనాయాః మమాగ్రతః కేనాప్యతిశయిత దివ్యరూపిణా నకులేన

---

మైన అవ్యయము.) తత్=అందుచే, దేవః=మహారాజు, ఉపసర్పతు=సమీపించును గాక!

దృష్ట్వేతి :— (దృష్ట్వా=చూచి) ఆర్య=మాన్యుడా! వినయంధర=ఓ వినయంధరుడా! సాంగ్రామికమ్=యుద్ధమునకు అర్హమయిన, మే=నా యొక్క, రథమ్=అరదమును, ఉపకల్పయితుమ్=సన్నద్ధము చేయుటకు, త్వమ్=నీవు, గచ్ఛ=వెడలుము. ఏషః=ఈ, అహమ్ అపి=నేను కూడ, దేవీమ్=భానుమతీదేవిని, దృష్ట్వా=చూచి, సంభాషించి అనుట, అనుపదమ్=వెనువెంటనే, పదంపడి అనుట, ఆగతః ఏవ=వచ్చినవాడనే. నీ వెనుకనే వత్తుననుట.

ఏష ఇతి :- ఏషః=ఈ, దేవాదేశః=రాజాజ్ఞ, కృతః=నెరవేర్పబడినది, నెరవేర్పబడినట్లే అనుట. (ఇతి=అని, నిష్క్రాంతః=నిష్క్రమించెను)

ప్రియసఖీతి :— ప్రియసఖి!=నెచ్చెలీ!, త్వయా=నీచేత, అపి స్మృతమ్=స్మరింపబడినదా? మరచిన స్వప్నవృత్తాంతము జ్ఞప్తికి తెచ్చుకొంటివా అనుట. (వాక్యారంభమునందు "అపి" ప్రశ్నార్థకము)

సఖీతి :— సఖి=చెలీ! స్మృతమ్=జ్ఞాపకము చేసికోబడినది. గుర్తు తెచ్చుకొంటి ననుట. అద్య = నేడు, ప్రమదవనే=అంతఃపురోద్యానవనమునందు,

అహిశతం వ్యాపాదితమ్. (సహి, సుమరిదమ్. అజ్జ కిల పమదవణే ఆసీణాఏ మమ అగ్గదో కేణావి అతిసఇద దివ్వరూవిణా ణఉలేణ అహిసదం వావాదిదమ్.)

ఉభే : (అపవార్య, ఆత్మగతమ్) శాంతం పాపమ్. ప్రతిహత మమంగళమ్ (ప్రకాశమ్) తతస్తతః. (సంతం పావమ్. పడిహదం అమంగళమ్. తదో తదో)

భానుమతీ : అతి సంతాపోద్విగ్న హృదయయా విస్మృతం మయా. తత్పునరపి స్మృత్వా కథయిష్యే (అదిసందావోవిగ్గ హిఅఆఏ మఏ విసుమరిదం తా పుణో వి సుమరిఅ కహాఇస్సమ్.)

---

ఆసీనాయాః=కూర్చున్నదానైన, మమ=నాయొక్క, అగ్రతః=ఎట్టయెదుట, అతిశయిత=అతిశయించిన, దివ్యరూపిణా=దివ్యమయినరూపము కలదైన, దేవతా రూపమును అతిశయించిన అనుట, కేన అపి=ఏదో ఒక, తెలియని అనుట. నకులేన=ముంగిసచే, అహి శతమ్=నూరు పాములు, వ్యాపాదితమ్ కిల=చంప బడెను సుమా!. ఇచట నకుల శబ్దము పాండవునిగూడ బోధించును. మహాదమహా ద్వీవక్షతో రూపము మారునవసరము సంస్కృతమున లేదు. కావున ఇట్టి చమత్కృతి సుసాధము. "కిల" అనుదానికి "వార్తాసంభావ్యయోః కిల" అని అమరము. (3–4–254) "కిల శబ్దస్తు వార్తాయాం సంభావ్యానునయార్థయోః" ఇతి విశ్వః. "వార్తాయామరుచౌ కిల" ఇతి త్రికాండశేషః.—అని రామాశ్రమి. వీనిలో అనిష్ట వార్తా సూచకముగా ఇచటి "కిల"ను సమన్వయించుట ఉచితము.

**అ**పవార్యేతి — (అపవార్య—దేవిని తప్పించి, ఆమెకు వినబడకుండ, ఆత్మగతమ్=తనలో) పాపమ్=పాపము, శాంతమ్=శమించునుగాక! అమంగళమ్= అశుభము, ప్రతిహతమ్=ప్రతిహతమగుగాక. (ప్రకాశమ్=ఆమెకును వినిపించు నట్లు) తతః తతః=అటుపైని అటుపైని, ఏమయినదనుట.

**అ**తి సంతాపేతి :— అతి సంతాప=మిక్కిలి దుఃఖముతో, ఉద్విగ్న=

రాజా : అహో! దేవీ భానుమతీ సువదనాతరళికాభ్యాం సహ కిమపి మన్త్రయమాణా తిష్ఠతి. భవతు. అనేన లతా జాలేనాన్తరితః శృణోమి తావదాసాం విశ్రబ్ధాలాపమ్. (ఇతి తథా స్థితః)

సఖీ : అలం సన్తాపేన. కథయతు ప్రియసఖీ. (అలం సందావేణ. కహేఇయ పిఅసహీ.)

రాజా : కిం ను ఖల్వస్యాః సన్తాపకారణమ్. అథవా అనామన్త్ర్య మామియమద్య వాసభవనా న్నిష్క్రాన్తేతి సమర్థిత ఏవాస్యా మయా కోపః. అయి భానుమతి! అవిషయః ఖలు దుర్యోధనో భవత్యాః కోపస్య.

---

కలతచెందిన, హృదయయా=మనస్సు కలదానవైన, మయా=నాచేత, విస్మృతమ్=మరువబడినది. తత్=అందుచేత, పునః అపి=మరల, స్మృత్వా=గుర్తుతెచ్చుకొని, కథయిష్యే=చెప్పెదను.

అహో ఇతి :- అహో!=అయ్యారే!, దేవీ=మహారాజ్ఞియైన, భానుమతీ=భానుమతీదేవి, సువదనా తరళికాభ్యామ్=సువదనాతరళికలతో, సహ=కూడి, కిమ్అపి=ఏదో, మన్త్రయమాణా=ముచ్చటించుచున్నదై, తిష్ఠతి=కూర్చున్నది. భవతు=అగుగాక!, అనేన=ఈ, లతా జాలేన=పూదీగల గుంపుతో, అంతరితః=దాచబడినవాడనై, ఆసామ్=వీరియొక్క, విశ్రబ్ధాలాపమ్=స్వేచ్ఛా సంభాషణమును, తావత్ శృణోమి=విందునుగాక! (ఇతి=అని, తథా=అట్లు, స్థితః=ఉండెను, లతలలో దాగెనను)

అలమితి :- సంతాపేన=దిగులుతో, అలమ్=చాలును, దిగులు వీడుమనుట. ప్రియసఖీ=నెచ్చెలి, కథయతు=(తక్కిన స్వప్న కథను) చెప్పునుగాక!

కిం న్వితి :- అస్యాః=ఈమెకు, సంతాపకారణమ్=దుఃఖహేతువు, కింను ఖలు=ఏమైయుండునను! అథవా=లేదా; అద్య=నేడు, మామ్=నన్ను, అనామన్త్ర్య=వీడ్కొల్పక, అలవాటు ప్రకారము "వెళ్ళివత్తును" అని చెప్పి అనుమతిని

కిం కంఠే శిథిలీకృతో భుజలతాపాశః ప్రమాదాన్మయా
నిద్రాచ్ఛేద వివర్తనే ష్వభిముఖం నాద్యాసి సంభావితా।
అన్యస్త్రీజనసంకథాలఘురహం స్వప్నే త్వయా లక్షితో
దోషం పశ్యసి కం ప్రియే పరిజనోపాలంభయోగ్యే మయి॥ 9

---

పొందకయే అనుట, ఇయమ్ = ఈమె, వాసభవనాత్ = పడకటింటినుండి, నిష్క్రాంతా ఇతి=నిష్క్రమించినది కావున, అస్యాః=ఈమెయొక్క, కోపః= కోపము, మయా=నాచేత, సమర్థితః ఏవ=సమర్థింపబడినదే. పీఠ్యాల్పక నిష్క్రమించినప్పుడే ఈమె నాపై అలిగినదని గుర్తించితినను. ఆ కోపమునే సంతాప కారణముగా భావించి పలుకుచున్నాడు— అయి భానుమతి=ఓ భానుమతీ, దుర్యోధనః=దుర్యోధనుడు, భవత్యాః=నీయొక్క, కోపస్య=కోపమునకు, అవిషయః ఖలు=అపాత్రుడుగదా!

కిం కంఠ ఇతి .— ప్రమాదాత్ మయా కంఠే భుజలతాపాశః శిథిలీకృతః కిమ్? అద్య, నిద్రాచ్ఛేదవివర్తనేషు న సంభావితా అసి కిమ్?, స్వప్నే త్వయా, అహమ్, అన్యస్త్రీజన సంకథాలఘుః లక్షితః కిమ్?, ప్రియే! పరిజనోపాలంభయోగ్యే మయి కం దోషం పశ్యసి?

అర్థము :- ప్రమాదాత్=ఏమరుపాటువలన, మయా=నాచేత, కంఠే= కంఠప్రదేశమునందలి, భుజలతాపాశః=బాహువల్లి బంధనము, శిథిలీకృతః కిమ్= బిగి సడలింపబడినదా ఏమి? నీ బిగికౌగిలింతను పొరపాటున సడలించు పాటి దోషమునైనను నేను చేసియెరుగ ననుట. అద్య=నేడు, గడచిన రాత్రి యనుట, నిద్రా=నిద్దురయొక్క, ఛేద=భంజకములైన, వివర్తనేషు=ఒత్తిగిల్లుటలయందు, అటునిటు దొర్లుట నిద్రాఛేదమనుట, సంభావితా=గౌరవింపబడినదానవు, న అసి కిమ్=కాకపోయితివా? చుంబనాదులతో నిన్ను సత్కరింపని దోషము చేసితినా? నిద్రలో కూడ నిన్ను తిరస్కరించియెరుగనే అనుట; స్వప్నే=స్వప్నమునందు, త్వయా = నీచేత, అహమ్=నేను, అన్య స్త్రీజన=ఇతర వనితాజనముతోడి, సంకథా=సరససల్లాపముచేత, లఘుః=అల్పుడనుగా, లక్షితః కిమ్=చూడబడితినా?

(విచిన్త్య) అథవా—

---

అన్యకాంతలతో సరస సల్లాపము చేయుట క్షుద్ర లక్షణము. అట్టిది నాయందు లేదు. ఇక స్వప్నమునందు చూచితివేమో! కలలోనైనను నీకు నేను అట్లు కన్పించియుండనే అనుట. ప్రియే=ఓ ప్రియురాలా! పరిజనః=సేవకుడువోలె, ఉపాలంభ=దూషణకు, యోగ్యే=అర్హుడనైన, మయి=నావట్ల, కం దోషమ్= ఏ దోసగును, పశ్యసి=చూచుచున్నావు?. నేనేమి తప్పు చేసితినని అలిగితివి? అనుట.

సమాసములు :— అశిథిలః (గాఢః) శిథిలః కృతః ఇతి—శిథిలీకృతః. భుజే లతే ఇవ—భుజలతే. భుజలతయోః పాశః భుజలతాపాశః. నిద్రాయాః ఛేదః—నిద్రాఛేదః. నిద్రాఛేదేషు వివర్తనాని—తేషు. ముఖమ్ అభి-అభిముఖమ్— అవ్యయీభావ. స్త్రియః ఏవ జనాః—స్త్రీజనాః. అన్యాశ్చ తే స్త్రీజనాశ్చ—అన్య స్త్రీజనాః అన్యస్త్రీజనైః స కథా—అన్యస్త్రీజన సంకథా. తయా లఘుః ఉపాలంభస్య యోగ్యః—ఉపాలంభయోగ్యః. పరిజనవత్ ఉపాలంభయోగ్యః— తస్మిన్.

సంధులు :— కృతః+భుజ, లక్షితః+దోషమ్—ఉత్వాదేశవిసర్గసంధులు. ప్రమాదాత్+మయా—అనునాశికాదేశసంధి. నిద్రా+ఛేద—తుగాగమవికల్పసంధి. వివర్తనేషు+అభిముఖమ్—యణాదేశ. న+అద్య+అసి—సవర్ణదీర్ఘ. లఘుః+ అహమ్—రేఫాదేశవిసర్గసంధి. పరిజన+ఉపాలంభ—గుణసంధి.

క్రియ :— 1. అస భువి, పరస్మై, లట్, మధ్యమ—అసి—స్థః—స్థ.
2. దృశిర్ ప్రేక్షణే, పరస్మై, లట్, మధ్యమ
పశ్యసి—పశ్యథః—పశ్యథ

ఛందస్సు :— శార్దూలము. మ—స—జ—స—త—త—గ. 1—12 సూర్యాశ్వైర్యది మస్సజౌ సతతగాః శార్దూలవిక్రీడితమ్.

విచిన్త్యేతి :— (విచిన్త్య=బాగుగా ఆలోచించి) అథవా=లేదా—

**ఇయమస్మదుపాశ్రయైకచిత్తా మనసా ప్రేమనిబద్ధమత్సరేణ।**
**నియతం కుపితాతివల్లభత్వాత్ స్వయముత్ప్రేక్ష్య మమాపరాధలేశమ్॥ 10**

---

ఇయమ్, అస్మదుపాశ్రయైకచిత్తా, మనసా, ప్రేమనిబద్ధమత్సరేణ, నియతమ్, కుపితా, అతివల్లభత్వాత్, స్వయమ్, ఉత్ప్రేక్ష్య మమ, అపరాధలేశమ్.

**అన్వయము :-** అస్మదుపాశ్రయైకచిత్తా ఇయమ్, ప్రేమనిబద్ధమత్సరేణ మనసా, అతివల్లభత్వాత్, మమ అపరాధలేశం స్వయముత్ప్రేక్ష్య నియతం కుపితా.

**అర్థము :-** అస్మత్=నేను, ఉపాశ్రయ=ఆధారముగా కలిగిన, ఏక= అనన్యవిషయమైన, చిత్తా=మనస్సు కలిగిన, నన్నే మాత్రమే ఆశ్రయించిన మనస్సు కలది అనుట, ఇయమ్=ఈమె, ప్రేమ=అనురాగముతో, నిబద్ధ=పుట్టిన, మత్సరేణ=ఈర్ష్యకలదైన, మనసా=మనస్సుతో, అతివల్లభత్వాత్=అతిశయించిన ప్రేమ వలన – "అభీష్టే అభీప్సితం హృద్యం దయితం వల్లభం ప్రియమ్" అమర–3–1–53)–; మమ=నాయొక్క, అపరాధలేశమ్=చిన్న తప్పును, స్వయమ్=తనంతతానుగా, ఉత్ప్రేక్ష్య=ఊహించి, నియతమ్=నిశ్చయముగా, కుపితా=కోపించినది. లేని తప్పును ఊహించుకొని కుపితయైన దనుట.

**సమాసములు :-** అహమ్ ఉపాశ్రయః యస్య తత్–అస్మదుపాశ్రయమ్. అస్మదుపాశ్రయం చ తత్ ఏకం చ–అస్మదుపాశ్రయైకమ్, చిత్తమ్ యస్యాః సా–అస్మదుపాశ్రయైక చిత్తా. ప్రేమ్ణా నిబద్ధః మత్సరః యస్మిన్ తత్–ప్రేమ నిబద్ధమత్సరమ్–తేన. వల్లభస్య భావః–వల్లభత్వమ్. అతిశయితం వల్లభత్వమ్–అతి వల్లభత్వమ్–తస్మాత్ అపరాధస్య లేశః–అపరాధలేశః–తమ్.

**సంధులు :-** ఉపాశ్రయ+ఏక–వృద్ధిసంధి. కుపితా+అతి, మమ+ అపరాధ–సవర్ణదీర్ఘ. ప్ర+ఈక్ష్య–గుణసంధి.

**ఛందస్సు :-** ఔపచ్ఛందసికము–షడ్విషమేఽష్టౌ సమే కలాస్తాశ్చ సమే స్యుర్నో నిరంతరాః న సమాత్ర పరాశ్రితా కలా వైతాలీయేఽన్తే రలౌ గురుః పర్యంతే ర్యౌ తథైవ శేషమౌపచ్ఛందసికం సుధీభిరుక్తమ్ (వృత్త. 2–13)

తథాపి శృణుమ స్తావత్కిం వక్ష్యతీతి.

---

ఈ శ్లోకము మాత్రాచ్ఛందస్సులోని వైతాలీయ ప్రభేదములలో నొకటి. విషమపాదములలో (1, 3) ఆరు మాత్రలపైని వరుసగా ర-ల-గ—కూర్చవలెను. సమపాదములలో (2, 4) ఎనిమిది మాత్రలపైని వరుసగా ర-ల-గ-కూర్చవలెను. విషమపాదములలోనుండు తొలి ఆరు మాత్రలు గురులఘువుల మిశ్రణముతో నేర్పడవలెనే తప్ప మూడు గురువులో ఆరు లఘువులో కారాదు అట్లే సమ పాదములలోనుండు తొలి ఎనిమిది మాత్రలకును మరొక నియమము కలదు. అదేమనఁగా—దీనిలో రెండు, నాలుగు, ఆరు స్థానముల మాత్రలు తృతీయ, పంచమ, సప్తమ స్థానముల మాత్రలతో కలిసిపోరాదు. అనగా ఇవి ఏక గురుకములు కారాదనుట. (విషమాలలో ఆరు మాత్రల నేర్పరచుటకు ఎనిమిది వికల్పములు సమపాదములలో ఎనిమిది మాత్రల నేర్పరచుటకు పదమూడు వికల్పములను—సిద్ధించును.) ఇది సామాన్యముగా వైతాలీయ లక్షణము. దీనిలో "ర-ల-గ" లకు బదులు రగణ యగణములను కూర్చుటతో ఔపచ్ఛందసికమేర్పడుచున్నది. తక్కిన నియమములన్నియు సమానము.

| | 6 మాత్రలు | ర | య |
|---|---|---|---|
| 1. | ఇయమస్మదు | పాశ్రయై | క చిత్తా |

| | 8 మాత్రలు | ర | య |
|---|---|---|---|
| 2. | మనసాప్రేమ ని | బద్ధ మ | త్స్వరేణ (పాదాంత లఘువు ఐచ్ఛిక గురువు) |

| | 6 మాత్రలు | ర | య |
|---|---|---|---|
| 3. | నియతం కుపి | తాతి వ | ల్లభత్వాత్ |

| | 8 మాత్రలు | ర | య |
|---|---|---|---|
| 4. | స్వయముత్ప్రేక్ష్య మ | మాపరా | ధ లేశమ్ |

తథాపి ఇతి :— తథాపి=అయినప్పటికిని, కిమ్=ఏమి, వక్ష్యతి ఇతి=చెప్పునో, శృణుమః తావత్=వినవలెను గాక.

భానుమతీ : హలా, అహం తతస్తస్య అతిశయిత దివ్యరూపిణో నకులస్య దర్శనేనోత్సుకా జాతా! (హలా, అహం తదో తస్స అదిశఇద దివ్వరూవిణో ణఉలస్స దంసణేణ ఉచ్ఛుఅ జాదా!)

రాజా : (సవైలక్ష్యమ్) కిం నా మాతిశయిత దివ్యరూపిణో నకులస్య దర్శనేన ఉత్సుకా జాతా! తత్కిమనయా పాపయా మాద్రీసుతానురక్తయా వయమేవం విప్రలబ్ధాః. (సోత్ప్రేక్షమ్—ఇయమస్మదుపాశ్రయైక చిత్తా-ఇతి పఠిత్వా) మూఢ, దుర్యోధన! కులటావిప్రలభ్యమాన మాత్మానం బహుమన్యమానోఽధునా కిం వక్ష్యసి? (కిం కంఠే....ఇత్యాది పఠిత్వా, దిశోఽవలోక్య) అహో! ఏతదర్థ మేవాస్యాః ప్రాతరేవ విశిక్తస్థానాభిలాషః సఖీజన సంకథాసు చ పక్షపాతః. దుర్యోధనస్తు మోహాదవిజ్ఞాతబంధకీహృదయసారః క్వాపి పరిభ్రాంతః. ఆః పాపే! మత్పరిగ్రహపాంసులే!—

---

హలేతి :— హలా=ఓసీ, తతః=అటుపిమ్మట, అతిశయిత=అతిశయించిన, దివ్యరూపిణః=దివ్యరూపముకల, సాటిలేని సౌందర్యము కలిగిన అనుట. తస్య=ఆ, నకులస్య=ముంగిసయొక్క (నకులునియొక్క అనియు), దర్శనేన=దర్శనముతో, ఉత్సుకా జాతా=ఉత్కంఠితురాలనైతివి. ఔత్సుక్యము సంచారిభావము కావున కామపరవశ అయినదని సుయోధనునికి స్ఫూర్తి.

కిమితి :- (సవైలక్ష్యమ్=సిగ్గుపడుచు) కిమ్ నామ=ఏమేమీ? అతిశయిత దివ్యరూపిణః=అతిశయించిన దివ్యరూపముకల, నకులస్య=నకులునియొక్క (నకులముయొక్క) దర్శనేన=అవలోకనముతో, ఉత్సుకా జాతా!=ఉత్కంఠితురాలైనదా! తత్=అయినచో మాద్రీసుత=మాద్రి కొడుకైన నకులునియందు,

తద్భీరుత్వం తవ మమ పురః సాహసా నీదృశాని
శ్లాఘా సాఽస్మద్వపుషి వినయవ్యుత్క్రమేఽప్యేష రాగః।
తచ్చౌదార్యం మయి జడమతౌ చాపలే కోఽపి పంథాః
ఖ్యాతే తస్మిన్వితమసి కులే జన్మ కౌలీన మేతత్॥　　11

---

అనురక్తయా=అనురాగముకలదయిన, అనయా=ఈ, పాపయా=పాపాత్మురాలి చేత, వయమ్=మేము, ఏవమ్=ఇట్లు, విప్రలబ్ధాః కిమ్=వంచితులమైతిమా! (సోత్ప్రేక్షమ్ = ఎగతాళిగా—ఇయ మస్మదుపాశ్రయైకచిత్తా అను శ్లోకమును, పఠిత్వా=పలికి లేక చదివి) మూఢ, దుర్యోధన!=ఓ మూఢుడా, దుర్యోధనుడా!, కులటా=జారిణిచేత, విప్రలభ్యమానమ్=వంచింపబడుచున్న, ఆత్మానమ్=నిన్ను నీవు, బహుమన్యమానః=ధన్యుడుగా భావించుకొన్నవాడవు, అధునా=ఇప్పుడు, కిమ్ వక్ష్యసి=ఏమందువు! (కిం కంఠే—అను శ్లోకమును, పఠిత్వా=పఠించి, దిశః అవలోక్య=అన్నివైపులను పరిశీలనగా—చూచి), అహో!=ఓహో!, ప్రాతః ఏవ = తెల్లవారుజాముననే, అస్యాః = ఈమెకు, వివిక్తస్థాన=నిర్జనస్థలము యొక్క, అభిలాషః=కోరిక; చ=మరియు, సఖీజన=చెలికత్తెంతోడి, సంకథాసు=ముచ్చట్లయందు, పక్షపాతః=అనురాగమును, ఏతదర్థమ్ ఏవ=ఇందుకోసమే నన్నమాట!. దుర్యోధనః తు = ఈ దుర్యోధనుడు మాత్రము, మోహాత్ = అజ్ఞానమువలన, భానుమతీదేవిపైగల మోహము వలన, అవిజ్ఞాత=తెలియబడని, బంధకీ=కులటయొక్క, హృదయ=మనస్సుయొక్క, సారః=తత్త్వముకలవాడై, క్వ అపి=మరొకవిధముగా, పరిభ్రాంతః=విభ్రాంతుడయ్యెను. కులటా హృదయము నెరుగలేక నేను ఆమె ప్రాతరేకాంతవాసాభిలాషాదికమును వ్రతనియమముగా సంభావించి భ్రాంతికి లోనయితి ననుట. ఆః పాపే = ఓసీ పాపాత్మురాలా!, మత్పరిగ్రహపాంసులే!=నా దుష్టపత్నీ!, దుర్మార్గురాలవైన నా ఇల్లాలా! అనుట—

**తద్భీరుత్వమితి :—** మమ పురః తవ తత్ భీరుత్వమ్—సాహసాని ఈదృశాని; అస్మద్వపుషి సా శ్లాఘా—వినయ వ్యుత్క్రమే అపి ఏషః రాగః; చ జడమతౌ మయి తత్ ఔదార్యమ్ — చాపలే కః అపి పంథాః; ఖ్యాతే తస్మిన్ వితమసి కులే జన్మ—ఏతత్ కౌలీనమ్!

అర్థము :- మమ=నాయొక్క, పురః=ప్రత్యక్షమునందు, తవ=నీయొక్క (భానుమతి నుద్దేశించి), తత్=ఆ, భీరుత్వమ్=భీతస్వభావము-పరోక్షమునందేమో, ఈదృశాని=ఇటువంటి (పరపురుషసంగమ రూపములైన) సాహసాని=సాహసకృత్యములు. నా యెదుట భీరుత్వము నభినయించుచు పరోక్షమునందింత లేసి సాహసములు చేయుచున్న నయవంచకురాల వనుట. అస్మత్=నాయొక్క, వపుషి=శరీరమునందు, రూపమునందనుట, సా=అటువంటి, శ్లాఘా=ప్రశంస, ఏకాంతమునందు భానుమతి చేసిన ప్రశంసలను జ్ఞాపకముచేసికొనుట, వినయ=నీతియొక్క లేక సదాచారముయొక్క, వ్యుత్క్రమే అపి=ఉల్లంఘనమునందు కూడ, ఏషః=ఇటువంటి, రాగః=ప్రేమ, చ=మరియు, జడమతౌ=మందబుద్ధినైన, మయి=నాయందు లేక నాపట్ల, తత్=అంతటి, ఔదార్యమ్=ఉదారత్వము—చాపలే=చంచలత్వమునందు, కః అపి=ఒకానొకవిధమైన, పంథాః=మార్గము. ఖ్యాతే=సుప్రసిద్ధమయిన, తస్మిన్=అటువంటి, లేక అంతటి, వితమసి=విశుద్ధమైన, కులే=వంశమునందు, జన్మ=పుట్టుక—ఏతత్=ఇటువంటి లేక ఇంతటి, కౌలీనమ్=కుటిలత్వము. పుట్టిన వంశమునకు తగని నింద్యమైఖరియని చెప్పుట.

సమాసములు :— మమ వపుః — అస్మద్వపుః—తస్మిన్. వినయస్య వ్యుత్క్రమః—తస్మిన్. జడా మతిః యస్య సః—జడమతిః—తస్మిన్.

సంధులు :— సాహసాని+ఈదృశాని, సా+అస్మత్ — సవర్ణదీర్ఘ సంధులు. క్రమే+అపి—పూర్వరూప. అపి+ఏషః—యణాదేశ. ఏషః+రాగః—తదేతద్విసర్గలోప. తత్+చ—శ్చుత్వసంధి. చ+ఔదార్యమ్—వృద్ధి. కః+అపి—ఉత్వాదేశవిసర్గ—కో+అపి—పూర్వరూప.

అలంకారము :— భీరుత్వము సాహసము, కులీనత-కౌలీనము ఇట్లు పరస్పర విరుద్ధభావముల ఘటన వర్ణింపబడుటనిది విషమాలంకారమగును. "విషమం వర్ణ్యతే యత్ర ఘటనాఽననురూపయోః—క్వేయం శిరీషమృద్వంగీ, క్వ తావన్మదనజ్వరః".

సఖీ : తతస్తతః (తదో తదో)

భానుమతీ : తత ఉజ్ఝిత్వా తదాసనస్థానం లతామండపం ప్రవిష్టా. తతస్సోఽపి మా మనుసన్నేవ లతామండపం ప్రవిష్టః. (తదో ఉజ్ఝిఅ తం ఆసణట్ఠాణాం లతామండవం పవిట్ఠా. తదో సో వి మం అణుసరంతో ఏవ లతామండపం పవిట్ఠో.)

రాజా : అహో! కులటోచితమస్యాః పాపాయాః శాలీనత్వమ్।

---

ఛందస్సు :— మందాక్రాంత. మందాక్రాంతా జలధి షడగైః మ్భౌనతౌ తాత్ గురూ చేత్. మ—భ—న—త—త—గ—గ, 4—6—4.

| మ | భ | న | త | త | గగ |
|---|---|---|---|---|---|
| U UU | U I I | I I I | U U I | U UI | U U |
| ఖ్యాతేత | స్మిన్వీత | మసికు | లే జన్మ | కౌలీన | మేతత్ |

తత ఇతి :— తతః తతః=అటుపిమ్మట టటుపిమ్మట— (ఏమైనది?)

తత ఉజ్ఝిత్వేతి :— తతః=అటుపిమ్మట, తత్=ఆ, ఆసనస్థానమ్=కూర్చున్న స్థలమును, ఉజ్ఝిత్వా=విడిచి, లతామండపమ్=లతామండపమును, ప్రవిష్టా=ప్రవేశించినదానను (ఆసమ్=అయితిని), తతః=అంతట, సః అపి=అతడు కూడ, అదికూడ అనుట, నకులః అపి అనురీతి పుంలింగసారస్య మంతటను గ్రాహ్యము. మామ్=నన్ను, అనుసరన్ ఏవ=అనుసరించుచునే, లతామండపమ్ = లతామండపమును, ప్రవిష్టః (అభూత్) = ప్రవేశించెను. (ప్రవేశించినవాడయ్యెననుట).

అహో ఇతి :— అహో!, అస్యాః=ఈ, పాపాయాః=పాపాత్మురాలి యొక్క, అశాలీనత్వమ్=నిర్లజ్జత, కులటా+ఉచితమ్=జారిణులకు తగినట్టిది.

యస్మింశ్చిర ప్రణయ నిర్భర బద్ధభావ
మావేదితో రహసి మత్సురతోపభోగః।
తత్రైవ దుశ్చరిత మద్య నివేదయన్తీ
హ్రీణాసి పాపహృదయే న సఖీజనేఽస్మిన్॥ 12

---

యస్మిన్నితి :— పాపహృదయే! మత్సురతోపభోగః చిరప్రణయ నిర్భర బద్ధ భావం యస్మిన్ సఖీజనే రహసి ఆవేదితః తత్ర ఏవ అస్మిన్ అద్య దుశ్చరితం నివేదయన్తీ న హ్రీణాసి.

అర్థము :— పాపహృదయే=ఓ పాపాత్మురాలా!, మత్=నాయొక్క, సురత+ఉపభోగః=కామక్రీడావిలాసము, చిర=చిరకాలపు, ప్రణయ=ప్రేమతో, నిర్భర=పరిపూర్ణముగా, బద్ధ=నిండిన లేక కూర్చబడిన, భావమ్=అంతరంగ మగునట్లు, యస్మిన్=ఏ, సఖీజనే=చెలిమికత్తెలయందు, రహసి=ఏకాంతమున, ఆవేదితః = (నీచేత) నివేదింపబడినదో; తత్ర ఏవ అస్మిన్ = ఆ చెలిమికత్తెల యందే, అద్య=ఇప్పుడు, దుశ్చరితమ్=దుష్ప్రవర్తనను, నివేదయన్తీ=నివేదించు చున్నదానవై, న హ్రీణాసి=సిగ్గుపడకున్నావు.

సమాసములు :- చిరమ్ ప్రణయః—చిరప్రణయః. నిర్భరం బద్ధః—నిర్భరబద్ధః. చిరప్రణయేన నిర్భరబద్ధః భావః యస్మిన్ తత్. యథా భవతి తథేతి. సురతస్య ఉపభోగః—సురతోపభోగః. మమ సురతోపభోగః. పాపం హృదయం యస్యాః సా—పాపహృదయా—సంబుద్ధౌ—పాపహృదయే!

సంధులు :— యస్మిన్+చిర—సాగమసంధి. ఆవేదితః+రహసి—ఉత్వాదేశవిసర్గసంధి. సురత+ఉప—గుణసంధి. తత్ర+ఏవ—వృద్ధి. జనే+అస్మిన్—పూర్వరూప.

క్రియ :- హ్రీ లజ్జాయామ్, పరస్మై, లట్, మధ్యమ.
హ్రీణాసి—హ్రీణీథః—హ్రీణీథ

ఉభే : తతస్తతః (తదో తదో)

భానుమతీ : తతస్తేన సగర్వం ప్రసారిత కరేణాపహృతం మే స్తనాం శుకమ్. (తదో తేణ సగవ్వం పసారిఅ కరేణ అవహరిదం మే త్థణాంసుఅమ్)

రాజా : (విచింత్య) సగర్వం ప్రసారితకరే ణాపహృతం మే స్తనాంశుకమ్. (సక్రోధమ్) అలమతః పరం శ్రుత్వా. భవతు తావత్తస్య పరవనితాస్కందన ప్రగల్భస్య మాద్రీసుత హతకస్య జీవితమ్ అపహరామి. (కించిత్ గత్వా, విచింత్య) అథవా ఇయమేవ తావత్పాపశీలా ప్రథమ మనుశాసనీయా. (ఇతి నివర్తతే.)

---

ఛందస్సు :— వసంతతిలక. "ఉక్తా వసంతతిలకా తభజా జగౌ గః"

| త | భ | జ | జ | గగ |
|---|---|---|---|---|
| U U I | U I I | I U I | I U I | U U |
| హ్రీణాసి | పాపహృ | దయేన | సఖీజ | నేస్మిన్ |

తతస్తతః=అటుపిమ్మట అటుపిమ్మట....?

తతస్తేనేతి :— తతః=ఆ తరువాత, సగర్వమ్=ఠీవిగా, ప్రసారిత=చాపబడిన, కరేణ=చేయికల్గిన, తేన=(దా) వానిచే (నకులేన), మే=నాయొక్క, స్తనాంశుకమ్=పైట, అపహృతమ్=లాగివేయబడినది లేక తొలగింపబడినది. ఆతడీమె స్తనవల్కలమును తొలగించెననుట.

విచింత్యేతి :— (విచింత్య=ఆలోచించి) ఠీవిగా చాపబడిన చేయికల్గిన వానిచే (నకులునిచే) నా స్తనాంశుకము అపహృతమైనది. (సక్రోధమ్=క్రోధముతో) అతః పరమ్=ఇంతకుపైని, శ్రుత్వా=విని, అలమ్=చాలును. ఇక తరువాత కథను విన నవసరము లేదనుట. భవతు=అగుగాక! పర వనితా=అన్యకాంతలను, స్కందన=పొందుటయందు, ప్రగల్భస్య=చాతుర్యముకలవాడైన, తస్య—ఆ,

ఉభే : తతస్తతః (తదో తదో)

భానుమతీ : తతోఽహమార్యపుత్రస్య ప్రభాతమంగళతూర్యరవ మిశ్రేణ వారవిలాసినీ జన సంగీతశబ్దేన ప్రతిబోధితాఽస్మి. (తదో అహం అజ్జఉత్తస్స పభాదమంగలతూర రవ మిస్సేణ వారవిలాసినీజణ సంగీదసద్దేణ పడిబోధిదహ్మి.)

రాజా : (సవితర్కమ్) కిం ను ప్రతిబోధితాస్మీతి స్వప్నదర్శన మనయా వర్ణితం భవేత్. (విచింత్య) భవతు. సఖీ వచనాత్ వ్యక్తిర్భవిష్యతి.

(ఉభే సవిషాదమన్యోన్యం పశ్యతః)

---

మాద్రీసుత హతకస్య = నీచుడైన నకులునియొక్క, జీవితమ్ = ప్రాణమును అపహరామి = అపహరింతును. (కించిత్ గత్వా=నాలుగు అడుగులు వేసి, విచింత్య = మరల ఆలోచించి) అథవా=లేదా; పాపశీలా=పాపాత్మురాలయిన, ఇయమ్ ఏవ=ఈమెయే, ప్రథమమ్=మున్ముందుగా, అనుశాసనీయా=దండింప దగినది. (ఇతి=అని, నివర్తతే=తిరిగివచ్చును)

తతోఽహమితి :— తతః=తరువాత, అహమ్=నేను, ఆర్యపుత్రస్య= పతిదేవునియొక్క (తదుద్దిష్టమయిన అనుబ) ప్రభాత = ప్రాతఃకాలమునందలి, మంగళ = శుభప్రదములైన, తూర్య = వాద్యములయొక్క, రవ = ధ్వనితో, మిశ్రేణ=కలిసినట్టి, వారవిలాసినీజన=వారకాంతలయొక్క, సంగీత శబ్దేన= మేలుకొలుపు పాటల ధ్వనితో, ప్రతిబోధితా అస్మి=మేల్కొల్పబడినదానను అయితిని. మంగళతూర్య ధ్వనులతో వేశ్యల ప్రభాతగీతములతో రారాజు మేల్కొనును. ఈ శబ్దములతో భానుమతీదేవికి మెలకువ వచ్చినదనియు కల చెదిరి పోయినదనియు ననుట.

సవితర్కమితి :— (సవితర్కమ్-తర్కించుకొనునట్లు) కిమ్ ను= ఏమీ! ప్రతిబోధితాఅస్మి=మేల్కొల్పబడితిని, ఇతి=అని, అనయా=ఈమెచే,

సువదనా : యత్కిమప్యత్రాత్యాహితం తద్భాగీరథీప్రముఖాణాం నదీనాం సలిలేనాపహ్రియతాం, భగవతాం బ్రాహ్మణానామప్యాశిషా ఆహుతి హుతేన ప్రజ్వలితేన భగవతా హుతాశనేన చ నశ్యతు. (జం కిం వి ఎత్థ అచ్చాహిదం తం భాఈరహీప్పముహాణం నఈణం సలిలేణ అవహారీఅదు. భఅవదాణం బ్రహ్మణాణం వి ఆసీసాఏ ఆహుది హుదేణ పజ్జలిదేణ భఅవదా హుదాసణేణ అణస్సదు)

రాజా : అలం వికల్పేన. స్వప్నదర్శనమేవైతదనయా వర్ణితమ్. మయా పునర్మన్దధియా అన్యథైవ సంభావితమ్.

---

స్వప్నదర్శనమ్=కలలో చూచినది, వర్ణితమ్ భవేత్=వర్ణింపబడినదా! (విచిన్త్య=ఆలోచించి) భవతు=అగుగాక! సఖీవచనాత్=చెలికత్తె(ల) మాటవలన, వ్యక్తిః భవిష్యతి=స్పష్టము కాగలదు.

(ఉభే=చెలికత్తెలిరువురును, సవిషాదమ్=దిగులుగా, అన్యోన్యమ్=ఒకరినొకరు, పశ్యతః=చూచుకొందురు)

**యత్కిమపీతి** :— అత్ర=ఈ స్వప్నదర్శనమునందు, యత్ కిమ్ అపి = ఏ కొద్దిపాటి, అత్యాహితమ్=అమంగళమున్నను, మహాభయమున్నను, తత్=అది, భాగీరథీ ప్రముఖాణామ్=గంగ మొదలయిన, నదీనామ్=నదులయొక్క, సలిలేన=జలముతో, అపహ్రియతామ్=పోగొట్టబడునుగాక!, అపి=మరియు, భగవతామ్ = పూజ్యులయిన, బ్రాహ్మణానామ్ = విప్రులయొక్క, ఆశిషా= దీవెన[ల]తో, చ = మరియు, ఆహుతి హుతేన = ఆహుతి హవనముతో, ప్రజ్వలితేన=మండింపబడిన, భగవతా=భగవంతుడైన, హుతాశనేన=అగ్నితో, నశ్యతు=నశించునుగాక. గంగాజలమును చల్లుకొనుటతో, బ్రాహ్మణాశీస్సులతో, హోమములతో దుఃస్వప్నమువలని అనిష్టప్రాప్తి వారింపబడునుగాక అనుట.

**అలమితి** :— వికల్పేన=స్వప్నమా? నిజమా?—కులటయా? సాధ్వియా? మొదలయిన వికల్పములతో, అలమ్=చాలును, తర్కవితర్కములింక అనవసర

దిష్ట్యార్ధశ్రుత విప్రలంభజనితక్రోధాదహం నో గతో
దిష్ట్యా నో పరుషం రుషార్ధ కథనే కించిన్మయా వ్యాహృతమ్।
మాం ప్రత్యాయయితుం విమూఢహృదయం దిష్ట్యా కథాంతం గతా
మిథ్యాదూషితయానయా విరహితం దిష్ట్యా న జాతం జగత్॥ 13

---

మనుట. అనయా=ఈ మెచే, ఏతత్=ఈ, వర్ణితమ్=వర్ణింపబడినది, స్వప్న దర్శనమ్ ఏవ=కలగన్న విషయమే. మందధియా=మందబుద్ధినైన, మయా పునః= నాచేనేమో, అన్యథా ఏవ=వేరొకవిధముగా, అవాచ్యమయిన పద్ధతిలో ననుట, సంభావితమ్=భావింపబడినది.

దిష్ట్యేతి :- దిష్ట్యా అహమ్ అర్ధశ్రుత విప్రలంభజనితక్రోధాత్ గతః నో; దిష్ట్యా అర్ధ కథనే రుషా మయా కించిత్ పరుషం వ్యాహృతమ్ నో; దిష్ట్యా విమూఢహృదయం మాం ప్రత్యాయయితుం కథా అంతం గతా; దిష్ట్యా జగత్ మిథ్యా దూషితయా అనయా విరహితమ్ న జాతమ్.

అర్థము :- దిష్ట్యా=అదృష్టవశమున, అహమ్=నేను, అర్ధ=సగమే, శ్రుత=వినుటచేనైన, విప్రలంభ=భ్రాంతితో, జనిత=కలిగిన, క్రోధాత్=కోపము వలన, గతః=వెడలిపోయినవాడను, నో=కాలేదు. సగమే విని ఆ కోపముతో ఇటనుండి వెడలిపోకపోవుట మంచిదే అయినదనుట దిష్ట్యా=దైవవశమున, అర్ధకథనే=(స్వప్నమునుగూర్చి చెలికత్తెలతో భానుమతీదేవి) సగము చెప్పిన స్థితియందు, రుషా=కోపముతో, మయా=నాచేత, కించిత్=ఏదో ఒక, పరుషమ్= నిష్ఠురము, నో వ్యాహృతమ్=పలుకబడలేదు. సగము విని ఆ కోపముతో దేవిని నిందింపకపోవుట మంచిదే అయినదనుట. దిష్ట్యా=భాగ్యవశమున, విమూఢ హృదయమ్=వివేకశూన్యమయిన అంతరంగము కలవాడనైన, మామ్=నన్ను, ప్రత్యాయయితుమ్=విశ్వసింపజేయుటకు, నాకు విశ్వాసము కలిగించుటకనుట, కథా=స్వప్నవృత్తాంతము, అంతమ్=పరిసమాప్తిని, గతా=పొందినది. కడవరకు ఆమె చెప్పుట (నేను వినుట) మంచిదే అయినదనియు, అట్లుకాక జ్ఞాపకము వచ్చుటలేదనియో లేక మరొక అవాంతరమువలననో ఆ కథ సగములోనే ఆగి పోయియున్నచో ఆమె శీలమునకు సంబంధించి నా విశ్వాసము భయంకరముగా

భానుమతీ : హలా! కథయ కిమత్ర శుభసూచకమ్. (హలా, కహేహి కిం ఎత్థ సుహాసూఅ అమ్)

సఖీ, చేటీ చ : (అన్యోన్యమవలోక్య, అపవార్య) అత్ర నాస్తి, స్త్రోః మకిః శుభసూచకమ్. యద్యత్రాలీకం కథయిష్యే

నుండెడిదనుట. దిష్ట్యా=దైవవశమున, జగత్=ఈ ప్రపంచము, మిథ్యా దూషితయా = అసత్యకళంకిని అయిన, అనయా=ఈమెతో, విరహితమ్= వియుక్తము, న జాతమ్=కాలేదు. ఈమె శీలమును శంకించి దుర్యోధనుడు పరుషముగా మాటలాడియున్నచో భానుమతీదేవి ప్రాణత్యాగము చేసియుండెడిది. అట్లు అసత్యమయిన అపవాదుకు గురియై దేవి ఈ ప్రపంచమును విడిచిపోయెడు దురవస్థ తప్పిపోవుట నిజముగా నా భాగ్యవిశేషమనుట.

సమాసములు :— అర్ధం శ్రుతమ్—అర్ధశ్రుతమ్. అర్ధశ్రుతేన విప్రలంభః—అర్ధశ్రుతవిప్రలంభః. తేన జనితః. అర్ధశ్రుత విప్రలంభజనితశ్చాసౌ క్రోధశ్చ—అర్ధశ్రుత క్రోధః—తస్మాత్. కథనస్య అర్ధమ్—అర్ధకథనమ్—తస్మిన్. విమూఢం హృదయం యస్య సః — విమూఢహృదయః — తమ్. కథాయాః అంతమ్—కథాంతమ్.

సంధులు :— దిష్ట్యా+అర్ధ, రుషా+అర్ధ, కథా+అన్తమ్, దూషితయా+ అనయా—సవర్ణదీర్ఘసంధులు. గతః+దిష్ట్యా—ఉత్వాదేశవిసర్గసంధి. కించిత్+ మయా—అనునాశికాదేశసంధి. వి+అహృతమ్—యణాదేశసంధి.

ఛందస్సు :— శార్దూలవిక్రీడితము. మ—స—జ—స—త—త—గ. 1—12

హలేతి :— హలా!=ఓసీ!, అత్ర=ఈ స్వప్నమునందు, శుభసూచకమ్= మంగళసూచకము, కిమ్=ఏమిటో, కథయ=చెప్పుము.

అన్యోన్యమితి - (అన్యోన్యమ్=పరస్పరమును, అవలోక్య=చూచుకొని, అపవార్య=భానుమతీదేవిని తప్పించి, ఆమెకు వినబడకుండుటను హస్తముద్రతో

తత్ప్రియసఖ్యా అపరాధినీ భవిష్యామి. స ఏవ స్నిగ్ధోజనో యః పృష్టః పరుషమపి హితం భణతి. (ప్రకాశమ్) సఖి! సర్వమేవైత దశుభ నివేదనమ్. తద్దేవతానాం ప్రణామేన ద్విజాతిజన ప్రతిగ్రహేణ చాంతర్యాతమ్. న ఖలు దంష్ట్రిణో నకులస్య వా దర్శన మహిశతవధం చ స్వప్నే ప్రశంసన్తి విచక్షణాః. (ఏత్థ ణత్థి త్థోఅం వి సుహసూఅఅమ్. జఇ ఏత్థ అలీఅం కహఇస్సం తా పిఅసహీఏ అవరాహిణీ భవిస్సమ్. సో ఏవ్వ సిణిద్ధో జణో జో పుచ్ఛిదో పరుసం వి హిదం భణాది. సహీ సవ్వం ఏవ్వ ఏదం అసుహ నివేదణం. తా దేవదాణం పణామేణ దుఃజాదిజణ పడిగ్గహేణ అ అంతరీఅదు. ణ హు దాఢిణో ణఉలస్స వా దంసణం అహిసదవహం అ సివిణఏ పసంసన్తి విఅక్ఖణాఓ.)

---

(-పతాకహస్తేనాపవార్య-) అభినయించుచు ప్రేక్షకులకు వినిపించునట్లు చెలి కత్తెలు తమలోతాము సంభాషించుకొనిరనుట.) అత్ర=ఈ స్వప్నమునందు, స్తోకమ్ అపి=కొంచెమయినను, స్వల్పముగానైనను అనుట, శుభసూచకమ్= మంగళసూచకము, న అస్తి=లేదు. అత్ర=ఈ విషయమున, అలీకమ్= అసత్యమును, లేని శుభమును ఉన్నట్లుగా ననుట, యది కథయిష్యే=చెప్పుదునేని, ప్రియసఖ్యాః=నెచ్చెలికి, అపరాధినీ=అపరాధముచేసిన దానను, భవిష్యామి= అయిపోదును. యః=ఎవడు, పృష్టః=అడుగబడినవాడై, పరుషమ్ అపి=నిష్ఠుర మయినదయినను, హితమ్=హితమును, మేలుకూర్పుదాని ననుట, భణతి= చెప్పునో, సః ఏవ=అతడే, స్నిగ్ధః జనః=స్నేహితుడు. [ప్రకాశమ్=భానుమతికి కూడా వినిపించునట్లు ప్రకాశముగా, పతాకహస్తమును తొలగించి యనుట] సఖి=చెలీ!, ఏతత్=ఈ కల, సర్వమ్=మొత్తము, అశుభనివేదనమ్=అమంగళ నిర్దేశకమే. తత్ = అందుచేత, దేవతానామ్ = దేవతలకు, ప్రణామేన =

రాజా : అవితథమాహ సువదనా. నకులేన పన్నగశతవధః స్తనాంశుకాపహరణం చ నియతమనిష్టోదర్కం తర్కయామి.

పర్యాయేణ హి దృశ్యన్తే స్వప్నాః కామం శుభాశుభాః।
శతసంఖ్యా పునరియం సానుజం స్పృశతీవ మామ్॥ 14

---

ప్రయుక్తటతోను, చ=మరియు, ద్విజాతి జన=బ్రాహ్మణులకు, ప్రతిగ్రహేణ=దానముతోను, ధనధాన్యాది భూరిదక్షిణలిచ్చుటతో ననుట, అన్తర్హితామ్=శమింపజేయబడునుగాక!, స్వప్నే=స్వప్నమునందు, దంష్ట్రిణః వా=వరాహముయొక్కగాని, నకులస్య వా=ముంగిసయొక్కగాని, దర్శనమ్=దర్శనమును, చ=మరియు, అహిశత వధమ్ వా=నూరు పాముల చంపుటనుగాని, విచక్షణాః=పండితులు, స్వప్నఫల నిర్ణాయకులనుట, న ప్రశంసన్తి ఖలు=శుభసూచనగా మెచ్చుకొనరుగదా! ఇది దుఃస్వప్నమేకాని సుస్వప్నము కాదనుట.

**అవితథమితి :—** సువదనా = ఈ సువదన, అవితథమ్=సత్యము, ఆహ=పలికెను, నకులేన=ముంగిసచేనైన, పన్నగ శత వధః=నూరు పాముల సంహరణము, చ=మరియు, స్తనాంశుకాపహరణమ్=కుచవల్కల—ఆహరణము, నియతమ్=అనివార్యముగా, తప్పక అనుట, అనిష్టోదర్కమ్=అమంగళకరము (అని), రాబోవుకాలమున జరుగబోవు విపత్తికి సూచకము అనుట—తర్కయామి=భావించుచున్నాను. (ఉదర్కః ఫలముత్తరమ్—అమర 2—8—29)

**పర్యాయేణేతి :—** కామం, శుభాశుభాః, స్వప్నాః, పర్యాయేణ, దృశ్యన్తే, హి; పునః, ఇయమ్, శతసంఖ్యా, సానుజం, మాం, స్పృశతి ఇవ.

**అర్థము :—** కామమ్=ఏమయినప్పటికిని, శుభ+అశుభాః=మంగళమును అమంగళమును కల్గించునట్టి, స్వప్నాః=కలలు, పర్యాయేణ=ఒకదాని వెనుక నొకటిగా, క్రమముతో ననుట, దృశ్యంతే హి = కాంచబడుచున్నవి కదా!, దుఃస్వప్నములును సుస్వప్నములును వచ్చుట సహజమే అనుట, పునః=కానీ,

(వామాక్షి స్పందనం సూచయిత్వా) ఆః! మమాపి నామ దుర్యోధనస్య అనిమిత్తాని హృదయక్షోభ మావేదయన్తి. (సావష్టంభమ్) అథవా భీరుజన హృదయ ప్రకంపనేషు కా గణనా, దుర్యోధనస్యైవం విధేషు. గీతశ్చాయ మర్థోఽంగిరసా—

---

ఇయమ్=ఈ (స్వప్నమునందలిదనుట), శతసంఖ్యా = నూరు అంకె (పన్నగ శతము), సానుజమ్=సోదరులతో కూడిన, మామ్=నన్ను (నూరుగురమైతిమనుట), స్పృశతి ఇవ=సోకుచున్నట్లున్నది. నాకు అన్వయించుచున్నట్లున్నదనుట.

**సమాసములు** :— శుభాశ్చ తే అశుభాశ్చ=శుభాశుభాః. శతం సంఖ్యా—శతసంఖ్యా. అనుజైః సహితః—సానుజః—తమ్.

**క్రియ** :— దృశిర్ ప్రేక్షణే కర్మణి—ఆత్మనే పదము—లట్. దృశ్యతే—దృశ్యేతే—దృశ్యన్తే. స్పృశ్ పరస్మై, లట్—స్పృశతి—స్పృశతః—స్పృశన్తి.

**సంధులు** :— శుభ+అశుభాః, స+అనుజమ్, స్పృశతి+ఇవ—సవర్ణ దీర్ఘ. పునర్+ఇయమ్.

**ఛందస్సు** :— పథ్యావక్త్రము—యుజోర్జేన సరిద్భర్తుః పథ్యావక్త్రం ప్రకీర్తితమ్.

**వామాక్షీతి** :— (వామ+అక్షి+స్పందనమ్=ఎడమకన్ను అదుటను, సూచయిత్వా=చూపించి, అభినయించి అనుట. ఇది కష్టసాధ్యము. ఇట్టియెడ "ఇదియేమి ఎడమకన్ను అదురుచున్నది" వంటి మాటతో సూచించుట పరిపాటి) ఆః=అరే! అనిమిత్తాని=అపశకునములు, దుర్యోధనస్య=దుర్యోధనుడనైన, మమ అపి నామ=నాకు కూడ, హృదయక్షోభమ్=మనస్తాపమును, ఆవేదయన్తి= కలిగించుచున్నవే! (ఈ వాక్యమును కాకువుతో నుచ్చరింపవలెను) (సావష్టంభమ్=నిబ్బరముగా), అథవా=అయినను, భీరుజన=పిరికివారి యొక్క, హృదయ=చిత్తములను, ప్రకంపనేషు=వణికించునట్టి, ఏవం విధేషు=ఇటువంటి విషయములందు, దుర్యోధనస్య=దుర్యోధనునికి, కా గణనా!=లెక్కయేమి! ఇట్టి

గ్రహాణాం చరితం స్వప్నోఽనిమిత్తా న్యుపయాచితమ్।
ఫలన్తి కాకతాలీయం తేభ్యః ప్రాజ్ఞా న బిభ్యతి॥ 15

వానిని లెక్కింపబనిలే దనుట. అయమ్=ఈ, అర్థః=భావమే, అంగిరసా= అంగిరసునిచే (జ్యోతిశ్శాస్త్రవేత్త) గీతః చ=ఛందోబద్ధము గావింపబడినదికూడ. ఈ విషయమునే ఆంగిరసమహర్షికూడ చెప్పెననుట.

గ్రహాణామితి :— గ్రహాణాం చరితమ్, స్వప్నః, అనిమిత్తాని, ఉపయాచితమ్, కాకతాలీయమ్ ఫలన్తి. ప్రాజ్ఞాః తేభ్యః న బిభ్యతి. (పథ్యా వక్త్రం ఛందః)

అర్థము :— గ్రహాణామ్ = గ్రహములయొక్క లేక నక్షత్రముల యొక్క, చరితమ్=గతి, గ్రహచారమనుట, స్వప్నః=కల, అనిమిత్తాని= అపశకునములు, ఉపయాచితమ్ = బలిప్రదానము—ఇవి, కాకతాలీయమ్ = యాదృచ్ఛికముగా, ఫలన్తి = ఫలించుచున్నవి. ప్రాజ్ఞాః = బుద్ధిమంతులు, తేభ్యః=అపశకున దుఃస్వప్నాదులవలన, న బిభ్యతి=భయపడరు. "అనిమిత్తౌత్పాతికం తథా" అని రెండవ పాదమునకు పాఠాంతరము కన్పించుచున్నది. తథా=అట్లే, అనిమిత్త+ఔత్పాతికమ్=అపశకునము, ప్రచండవాయువు మొదలయిన ఉపద్రవము అని అర్థము. తథా అను వ్యర్థపదముండుట, ఉపద్రవమునకు కాకతాళీయత్వము కుదురకపోవుట కారణముగా ఈ పాఠాంతరముకన్న పైపాఠమే సమంజసమనిపించుచున్నది.

సంధులు :— స్వప్నః+అనిమిత్త—ఉత్వాదేశసంధి. స్వప్నో+ అనిమిత్త—పూర్వరూపసంధి. అనిమిత్తాని+ఉప—యణాదేశ.

సమాసములు :— అనిమిత్తాని చ ఔత్పాతికం చ తేషాం సమాహారః అనిమిత్తౌత్పాతికమ్. కాక ఇవ తాళమివ—కాకతాళమ్. కాకతాళమివ— కాకతాళీయమ్.

క్రియ :— ఞి భీ భయే—లట్—పరస్మై—బిభేతి—బిభితః/బిభీతః—బిభ్యతి. ఫల—నామధాతువు—లట్—పరస్మై—ఫలతి—ఫలతః—ఫలన్తి.

తద్భానుమత్యాః స్త్రీస్వభావసులభా మలీకాశంకా మపనయామి.

భానుమతీ : హలా సువదనే! పశ్య— తావ దుదయగిరి శిఖరాంతరిత ముక్త రథవరో విగలిత సంధ్యారాగ ప్రసన్న దురాలోక మండలో జాతో భగవాన్ దివసనాథః. (హలా సువఅణే, పేక్ఖ దావ ఉదఅగిరి సిహర తరిద విముక్క రహవరో విఅలిఅ సంఝారా అప్పసణ్ణ దురాలోఅ మండలో జాదో భఅవం దివసణాహో!)

సఖీ : సఖి! గోసానిత కనక పత్ర సదృశేన లతాజాలాంతరోప హిత కిరణ నివహేన పింజరితోద్యాన భూమిభాగో దుఃప్రేక్షణీయో భగవాన్ సహస్రరశ్మిః సంవృత్తః.

---

తదితి :— తత్=అందుచేత, భానుమత్యాః=భానుమతీదేవియొక్క, స్త్రీ స్వభావ సులభామ్ = స్త్రీల స్వభావమునందు తరచుగా కనిపించునట్టి, అళీకా శంకామ్=అసత్యమయిన భీతిని, ఏమేమో ఊహించుకొని భయపడిపోవుట స్త్రీ స్వభావమనుట, అపనయామి=తొలగింతును.

హలేతి :— హలా సువదనే! = ఓసీ సువదనా!, పశ్య=చూడుము— ఉదయగిరి = తూర్పుకొండయొక్క, శిఖర = కొనలచేత, అంతరిత = ముందు దాచబడినదై, ముక్త=అటుపిమ్మట విడువబడినదైన, రథవరః=ఉత్తమ రథము కలవాడును, విగళిత=జారిపోయిన, సంధ్యారాగ=తొలిసంజకాంతులతోనైన, ప్రసన్న=ప్రశాంతి కలదగుటచే, ప్రాతస్సంధ్యలోని ప్రశాంతి తొలగిపోవుటచే ననుట, దురాలోక=దుర్నిరీక్ష్యమయిన, మండలః=బింబము కలవాడుగా, భగవాన్= భగవంతుడయిన, దివసనాథః=సూర్యుడు, జాతః=అయ్యెను. ప్రాతఃకాలము గడచి మధ్యాహ్నమగుచున్న దనుట.

సఖీతి :— సఖి=ఓ చెలీ!, గోసానిత=నికషోపలముపై పదనుపెట్టబడిన, కనక పత్ర=బంగారు పత్రములతో, సదృశేన=సాటివచ్చునట్టి, లతాజాల....

తత్సమయస్తే లోహిత చందన కుసుమ గర్భేణార్ఘ్యేణ పర్యుపస్థాతుమ్. (సహి, రోసాణిద కణఅపత్త సరిసే లదాజాలంతరోవహిద కిరణ నివహేణ పింజరిదుజ్జాణ భూమిభాఓ దుప్పేక్ఖణిజ్జో భఅవం సహాస్సరస్సీ సంవుత్తో. తా సమఓ దే లోహిద చందణ కుసుమ గబ్భేణ అగ్ఘేణ పజ్జువట్ఠాదుమ్.)

భానుమతీ : హంజే తరలికే, ఉపనయ మేఽర్ఘ్యభాజనం యావద్భగవతః సహస్రరశ్మేః సపర్యాం నిర్వర్తయామి. (హంజే తరలిఏ, ఉవణేహి మే అగ్ఘభాఅణం జావ భఅవదో సహాస్స రస్సిణో సవరిఅం ణివ్వత్తేమి)

చేటీ : యద్దేవ్యాజ్ఞాపయతి. (జం దేవీ ఆణవేది)

(ఇతి నిష్క్రాంతా)

---

నివహేన, లతా జాల=తీగెలయొక్క, అంతర=మధ్యభాగమునుండి, ఉపహిత=పడుచున్న, కిరణ=కిరణములయొక్క, నివహేన=సమూహముతో, పింజరిత=సువర్ణకాంతిమయము గావింపబడిన, ఉద్యాన భూమిభాగః = వనప్రదేశము కలవాడైన, భగవాన్=భగవంతుడైన, సహస్రరశ్మిః=వేవెలుగు, దుష్ప్రేక్షణీయః=చూడశక్యముగానివాడు, సంవృత్తః=అయినాడు. తత్=అందుచేత, లోహిత చందన=ఎఱ్ఱ చందనము, కుసుమ=పువ్వులు, గర్భేణ=గర్భమునందు కలదయిన. వీనితో కూడినదయిన అనుట, అర్ఘ్యేణ=పూజాద్రవ్యముతో, పర్యుపస్థాతుమ్=అర్చింప నిల్చుటకు, తే=నీకు, సమయః=ఇది తగిన సమయము.

హంజఇతి :— హంజే తరళికే=ఓ తరళికా!, అర్ఘ్యభాజనమ్=పూజాద్రవ్యముల పాత్రను, మే=నాకు, ఉపనయ=తెమ్ము, భగవతః=భగవంతుడయిన, సహస్రరశ్మేః=సూర్యునియొక్క, సపర్యామ్=అర్చనను, నిర్వర్తయామి=కావింతును.

యదితి :— యద్దేవీ ఆజ్ఞాపయతి=మహారాజ్ఞి ఆజ్ఞాపించినట్లే— (ఇతి=అని, నిష్క్రాంతా=నిష్క్రమించినది)

రాజా : అయమేవ సాధుతరోఽవసరః ప్రియాసమీపముపగంతుమ్.
(ఇతి ఉపసర్పతి)

(ప్రవిశ్య)

చేటీ : భట్టిని, ఇదమర్ఘ్యభాజనమ్. తన్నిర్వర్త్యతాం భగవతః సహస్ర రశ్మేః సపర్యా. (భట్టిణి, ఏదం అగ్ఘభాఅణమ్. తా నివ్వట్టీఅదు భఅవదో సహస్సరస్సిణో సవరిఆ.)

సఖీ : (విలోక్య ఆత్మగతమ్) కథం మహారాజ ఆగతః. హన్త జాతో అస్యా నియమభంగః. (కహం మహారాఓ ఆఅదో. హన్త జాదో సే ణిఅమభంగో.)

(రాజా ఉపసృత్య సంజ్ఞయా పరిజనముత్సార్య స్వయమేవార్ఘ్య పాత్రం గృహీత్వా దదాతి)

---

అయమేవేతి :— ప్రియా = ప్రియురాలైన భానుమతీదేవియొక్క సమీపమ్=దగ్గరకు, ఉపగంతుమ్=చేరుటకు, అయమ్ ఏవ=ఇదే, సాధుతరః= మిక్కిలి అనువయిన, అవసరః = సమయము. (ఇతి = అని, ఉపసర్పతి= సమీపించును.)

(ప్రవిశ్య=తరళిక మరలివచ్చి)

భట్టినీతి :— భట్టిని = స్వామినీ! అర్ఘ్యభాజనమ్ = పూజాపాత్ర, ఇదమ్=ఇదిగో, భగవతః=భగవంతుడైన, సహస్ర రశ్మేః=సూర్యునియొక్క సపర్యా=సమర్చన, నిర్వర్త్యతామ్=నిర్వర్తింపబడునుగాక.

విలోక్యేతి :— (విలోక్య = చూచి, ఆత్మగతమ్ = తనలో) కథమ్= ఎట్లూ, మహారాజః=మహారాజు, ఆగతః=వచ్చెనా! వచ్చినాడా అనుట, కాకు స్వరముతో ఆశ్చర్యము. హన్త = అయ్యో!, అస్యాః=ఈమెకు భానుమతీదేవి కనుట, నియమభంగః=వ్రతభంగము, జాతః=అయినది.

(రాజేతి :- రాజా=దుర్యోధనుడు, ఉపసృత్య=సమీపించి, సంజ్ఞయా=

భానుమతీ : (దినకరాభిముఖీభూత్వా) భగవన్, అంబరమహాసర ఏకసహస్రపత్ర, పూర్వ దిశా వధూ ముఖ మండల కుంకుమ విశేషక, సకలభువనైక రత్నప్రదీప యదత్ర స్వప్నదర్శనే కిమప్యత్యాహితం తద్భగవతః ప్రణామేన సభ్రాతృకస్యార్యపుత్రస్య కుశలపరిణామి భవతు. (అర్ఘ్యం దత్త్వా) హంజే తరళికే, ఉపనయ మే కుసుమాని. అపరాసా మపి దేవతానాం సపర్యాం నిర్వర్తయామి. [హస్తౌ ప్రసారయతి] [భవఅం, అంబరమహాసరేక్క సహస్సపత్త, పువ్వ దిసా వహూ ముహమండల కుంకుమ విసేసఅ, సఅల భువణైక్క రఅణప్పదీవ, జం ఎత్థ సవిణ అదంసణే కిం వి అచ్చాహిదం తం భఅవదో పణామేణ సభాదుఅస్స అజ్జఉత్తస్స కుసలపరిణామి హోదు. హంజే తరలికే, ఉవణేహి మే కుసుమాఇం. అవరాణం వి దేవదాణం సవరిఅం ణివ్వత్తేమి.)

---

చేసన్నతో, పరిజనమ్=చేటికను సఖిని, ఉత్సార్య=తప్పించి, స్వయమ్ ఏవ= తనకుతానే, అర్ఘ్యపాత్రమ్=పూజాద్రవ్యముల భాజనమును, గృహీత్వా=తీసికొని, దదాతి=దేవికి అందించును)

దినకరేతి :- (దినకర=సూర్యునకు, అభిముఖీభూత్వా=అభిముఖురాలై) భగవన్=ఓ భగవంతుడా!, అంబర=ఆకాశమనునట్టి, మహాసరః=గొప్ప సరోవరమునందలి, ఏక=అద్వితీయమైన, సహస్రపత్ర=పద్మమా! (సరస్ శబ్దము. సరః+ఏక—విసర్గలోపసంధి) పూర్వదిశా = తూర్పు దిక్కు అనునట్టి, వధూ= పెండ్లికూతుయొక్క, ముఖమండల=ముఖమండలమునందలి, కుంకుమవిశేషక= కుంకుమాలంకారమా! బొట్టువంటివాడా! అనుట. సకల=సమస్తమయిన, భువన= లోకములకును, ఏక = ఒక్కటే అయిన, రత్నప్రదీప = మణిదీపమా!,

[రాజా పుష్పాణ్యుపనయతి. స్పర్శసుఖమభినీయ చ కుసుమాని భూమౌ పాతయతి.]

భానుమతీ : [సరోషమ్] అహో ప్రమాదః పరిజనస్య (పరివృత్య, దృష్ట్వా, ససంభ్రమమ్) కథ మార్యపుత్రః! [అహో పమాదో పరిఅణస్స. కహం అజ్జ ఉత్తో.]

రాజా : దేవి, అనిపుణః పరిజనోఽయమేవం విధే సేవావకాశే

---

త్రైలాదికముతో పనిలేకుండ ముల్లోకములకును వెలుగునిచ్చువాడనుట. అత్ర= ఈ, స్వప్నదర్శనే=కలయందు, కిమపి=ఏదయినను, అత్యాహితమ్=అమంగళ మున్నచో, తత్ = అది, భగవతః = భగవంతుడవయిన నీకు, ప్రణామేన = మ్రొక్కుటతో, సభ్రాతృకస్య=సోదరసహితుడయిన, ఆర్యపుత్రస్య=దుర్యో ధనునకు, కుశల పరిణామి=శుభ పరిణామము కలదిగా, మంగళప్రదముగాననుట, భవతు=అగుగాక! (అర్ఘ్యమ్=అర్ఘ్యమును, దత్త్వా=ఇచ్చి, హంజే తరళికే= ఓసీ తరళికా!, మే = నాకు, కుసుమాని = పువ్వులను, ఉపనయ = ఇమ్ము. అపరాసామ్=తక్కిన, దేవతానామ్ అపి=దేవతలకుకూడ సపర్యామ్=సేవను, నిర్వర్తయామి=నిర్వర్తింతును. (హస్తౌ=చేతులను, ప్రసారయతి=పువ్వులకై చాపును)

(రాజా=దుర్యోధనుడు, పుష్పాణి=పువ్వులను, ఉపనయతి=అందించును. స్పర్శసుఖమ్=మగని స్పర్శ సుఖమును, అభినీయ=అభినయించి, చ=అది కారణముగా, కుసుమాని=పువ్వులను, భూమౌ=నేలపై, పాతయతి=పడవేయును.)

సరోషమితి :— (సరోషమ్ = కోపముగా), పరిజనస్య = సేవక సమూహముయొక్క, ప్రమాదః = నిర్లక్ష్యము లేక ఏమరుపాటు, అహో= ఆశ్చర్యము!. ఇంతకు ముందెన్నడును లేని ఇట్టి నిర్లక్ష్యపైఖరికి ఆమె ఆశ్చర్య పోయె. (పరివృత్య=ప్రక్కకు తిరిగి, దృష్ట్వా=(రాజును) చూచి, ససంభ్రమమ్= కంగారుగా) కథమ్ ఆర్యపుత్రః!=ఏమీ స్వామియా!

దేవీతి :— దేవి=ఓ దేవీ!, అయమ్=ఈ, పరిజనః=సేవకుడు, ఏవం

తత్ ప్రభవత్యత్రానుశాసనే దేవీ.

[భానుమతీ లజ్జాం నాటయతి]

రాజా : అయి ప్రియే!—

వికిర ధవళదీర్ఘాపాంగసంసర్పి చక్షుః
పరిజన పథవర్తిన్యత్ర కిం సంభ్రమేణ।
స్మితమధురముదారం దేవి మామాలపోచ్చైః
ప్రభవతి మమ పాణ్యోరంజలిః సేవితం త్వామ్॥ 16

---

విధే=ఇటువంటి, సేవావకాశే=సేవా విషయమునందు, అనిపుణః=నేర్పరికాడు. (పుంలింగమయిన పరిజన శబ్దము సేవికా సేవకులకు బోధకము. కావుననే చేటికనుద్దేశించి పరిజనస్య అని భానుమతీదేవి యనుటయు, ఆ మాటను పుంలింగతనుబట్టి తనకు అన్వయించుకొని దుర్యోధనుడు అందుకొనుటయు జరిగినది.) తత్=అందుచేత, అత్ర=ఈ విషయమున, అనుశాసనే=శిక్షించుట యందు, దేవీ=మహారాజ్ఞి, ప్రభవతి=అర్హురాలగుచున్నది. నన్ను శిక్షింపదగు ననుట.

(భానుమతీ=రాణి, లజ్జామ్=సిగ్గును, నాటయతి=అభినయించును.) అయి ప్రియే!=ఓ ప్రేయసీ!

**వికిరేతి** :— పరిజన పథవర్తిని, అత్ర, ధవళదీర్ఘాపాంగసంసర్పి, చక్షుః, వికిర, సంభ్రమేణ, కిమ్! హే దేవి, స్మితమధురమ్, ఉదారమ్, ఉచ్చైః, మామ్, ఆలప. మమ పాణ్యోః అంజలిః త్వామ్ సేవితుమ్ ప్రభవతి.

**అర్థము** :— పరిజన పథవర్తిని = సేవక పద్ధతియందు వర్తించు స్వభావము గలవాడనైన, అత్ర=ఈ నాయందు, ధవళ=స్వచ్ఛమైనట్టియు, దీర్ఘ=పొడవైనట్టియు, అపాంగ=కొనగంటిని, సంసర్పి=తాకునట్టి, నేత్రమ్=చూపును, వికిర=ప్రసరింపుము. ఈ సేవకుని మన్నించి క్రీగంట చూడు మనుట. సంభ్రమేణ=తొట్రుపాటుతో, కిమ్=ఏమి పని?, కంగారుపడవలదనుట,

భానుమతీ : ఆర్యపుత్ర, అభ్యనుజ్ఞాతాయాస్త్వయాఽస్తి మే కస్మిన్నపి

---

దేవి=ఓ దేవీ!, స్మితమధురమ్=చిఱునవ్వుతో అందమయినదియు, ఉదారమ్=మనోహరమయినదియునగునట్లు, ఉచ్చైః=స్పష్టముగా, మామ్=నన్ను, ఆలప=పలుకుము. తొట్రుపాటును వదలి చిఱునవ్వులు చిందించుచు అందముగా నాతో పలుకుమనుట; మమ=నాయొక్క, పాణ్యోః=చేతులయొక్క, అంజలిః=సంపుటి, త్వామ్ = నిన్ను, సేవితుమ్ = సేవించుటకు, ప్రభవతి = అర్హమగుచున్నది. "సేవితుం త్వామ్" అనుటకు బదులు "త్వం స్పృశాస్మాన్" అని ఒక పాఠాంతరము. అస్మాన్=మమ్ము, త్వమ్=నీవు, స్పృశ=తాకుము. నన్ను చూడుము, నాతో పలుకుము, నన్ను తాకుము అని ప్రార్థన.

**సమాసములు :—** ధవళం చ తత్ దీర్ఘం చ—ధవళదీర్ఘం చ తత్ అపాంగమ్ చ—ధవళదీర్ఘాపాంగమ్ సంసర్పితుం శీలం యస్య తత్—ధవళదీర్ఘాపాంగ సంసర్పి—సంసర్పిణీ—సంసర్పిణి. పరిజనస్య పంథాః—పరిజనపథః, తస్మిన్ వర్తితుం శీలం యస్య సః—పరిజనపథవర్తీ—తస్మిన్—వర్తిని—వర్తినోః—వర్తిషు. స్మితేన మధురమ్—స్మితమధురమ్.

**సంధులు :—** వర్తిని+అత్ర—యణాదేశ. ఆలప+ఉచ్చైః=గుణ సంధి. పాణ్యోః+అంజలిః—రేఫాదేశ. స్పృశ+అస్మాన్—సవర్ణదీర్ఘ.

**క్రియలు :—** వికిర/వికిరతాత్—వికిరతమ్—వికిరత. ఆలప/ఆలపతాత్—ఆలపతమ్—ఆలపత. స్పృశ/స్పృశతాత్—స్పృశతమ్—స్పృశత. కిర్—లప్—స్పృ—పరస్మై, లోట్, మధ్యమ. కిరక్షేపే; లప వాచి; స్పృశఁ స్పర్శనే.

**ఛందస్సు :— మాలినీవృత్తము**—న న మ య య—7 లేక 8 తరువాత యతి, "ననమయయ యుతేయం మాలినీ భోగిలోకైః".

| న | న | మ | య | య |
|---|---|---|---|---|
| I I I | I I I | U U U | I U U | I U U |
| స్మితమ | ధురము | దారండే | విమామా | లపోచ్చైః |

**ఆర్యపుత్రేతి :—** ఆర్యపుత్ర!=స్వామీ!; త్వయా=నీచేత, అభ్యనుజ్ఞాతాయాః=అనుమతింపబడినదాననైన, మే=నాకు, కస్మిన్ అపి=ఒకానొక,

నియమే అభిలాషః (అజ్జఉత్త, అబ్భణ్ణుణ్ణాదాప తుప అత్థి మే కస్సిం వి ణిఅమే అహిలాసో.)

రాజా : శ్రుత విస్తర ఏవాస్మి భవత్యాః స్వప్నవృత్తాన్తం ప్రతి. తదలమేవం ప్రకృతి సుకుమారమాత్మానం ఖేదయితుమ్

భానుమతీ : ఆర్యపుత్ర, అతిమాత్రం మాం శఙ్కా బాధతే. తదను మన్యతాం మా మార్యపుత్రః. (అజ్జఉత్త, అదిమేత్తం మే సంకా బాహేఇ తా అణుమణ్ణాదు మం అజ్జఉత్తో)

రాజా : (సగర్వమ్) దేవి, అలమనయా శఙ్కయా పశ్య—

---

నియమే=వ్రతమునందు, అభిలాషః=కోరిక, అస్తి=ఉన్నది. నేను ఒక వ్రతము నాచరించుచున్నాను అనుమతించుమనుట. With your kind permission అనుటవంటిదీ వాక్యవిన్యాసము. వ్రత పరిసమాప్తికి నీ ఉనికియు నీ కోరికలును విఘ్నకారులనియు వ్యంగ్యము.

శ్రుతవిస్తరఇతి :— భవత్యాః=నీయొక్క, స్వప్నవృత్తాంతం ప్రతి= స్వప్నకథను గురించి, శ్రుతవిస్తరః+ఏవ=విపులముగా విన్నవాడనే, అస్మి= అయితిని. స్వప్నవృత్తాంతమును పూర్తిగా వింటిననుట. తత్=అందుచేత, ప్రకృతి సుకుమారమ్ = సహజముగా కోమలమయిన, ఆత్మానమ్=శరీరమును, ఏవమ్=ఇట్లు (వ్రతానీకముతో) ఖేదయితుమ్= అలయించుట(కు), అలమ్=చాలు చాలు. అలయింపవద్దు అనుట.

ఆర్యపుత్రేతి :— ఆర్యపుత్ర=స్వామీ!, మామ్=నన్ను, శంకా= అమఙ్గళాశంక, అతిమాత్రమ్=చాల ఎక్కువగా, బాధతే=పీడించుచున్నది. తత్=అందుచేత, మామ్=నన్ను, ఆర్యపుత్రః=స్వామి, అనుమన్యతామ్=(వ్రత పూర్తికి) అనుమతించునుగాక.

సగర్వమితి :— (సగర్వమ్ = గర్వముతో) దేవీ!, అనయా=ఈ, శఙ్కయా=శంకతో, అలమ్=చాలు, శంకింపదగ దనుట. పశ్య=చూడుము—

కిం నో వ్యాప్తదిశాం ప్రకంపితభువా మక్షౌహిణీనాం ఫలం
కిం ద్రోణేన కిమంగరాజవిశిఖై రేవం యది క్లామ్యసి!
భీరు, భ్రాతృశతస్య మే భుజవనచ్ఛాయా సుఖోపస్థితా
త్వం దుర్యోధన కేసరీంద్రగృహిణీ శంకాస్పదం కిం తవ॥ 17

---

కిం న ఇతి — ఏవం క్లామ్యసి యది (తర్హి) వ్యాప్తదిశాం ప్రకంపిత భువామ్ నః అక్షౌహిణీనాం కిం ఫలమ్? ద్రోణేన కిమ్? అంగరాజ విశిఖైః కిమ్? హే భీరు! త్వం మే భ్రాతృశతస్య భుజవనచ్ఛాయా సుఖోపస్థితా, దుర్యోధన కేసరీంద్రగృహిణీ; తవ కిం శంకాస్పదమ్?

అర్థము :— ఏవమ్ = ఇట్లు, క్లామ్యసియది = ఖిన్నురాలవగుదువేని, (తర్హి=ఇక) వ్యాప్తదిశామ్=ఆక్రమింపబడిన దిక్కులు కలవియును, ప్రకంపిత భువామ్ = కంపింపజేయబడిన భూమి కలవియును అయిన, దిగంతములకు వ్యాపించినవియు, భూమిని క్రక్కదలించునవియు ననుట; నః=మనయొక్క, అక్షౌహిణీనామ్=అక్షౌహిణులకు, కిమ్ ఫలమ్=ప్రయోజనమేమి?. అవి ఉండి ఏమి లాభమనుట. ద్రోణేన=ధనురాచార్యునితో, కిమ్ ఫలమ్=ఏమి ప్రయోజనము? అంగరాజ=కర్ణునియొక్క, విశిఖైః=బాణములతో, కిమ్ ఫలమ్=లాభమేమి?; భీరు=ఓసి పిరికిదానా!, త్వమ్=నీవు, మే=నాయొక్క, భ్రాతృశతస్య=నూర్గురు తమ్ములయొక్క, భుజ=బాహువులనునట్టి, వన=అరణ్యముయొక్క, ఛాయా= నీడయందు, సుఖ=హాయిగా, ఉపస్థితా=ఉన్నదానవు. దుర్యోధన=దుర్యోధనుడను నట్టి, కేసరీంద్ర=సింహరాజుయొక్క, గృహిణీ=ఇల్లాలవు. తవ=ఇంతటి నీకు, శంకాస్పదమ్=భయ హేతువు, కిమ్=ఏమిటి? ఏమియునుండరాదనుట.

సమాసములు :- వ్యాప్తాః దిశః యాభిః తాః—వ్యాప్తదిశః—తాసామ్. ప్రకంపితా భూః యాభిః తాః—ప్రకంపితభువః—తాసామ్. అంగదేశస్య రాజా— అంగరాజః, తస్య విశిఖాః—అంగరాజవిశిఖాః—తైః. భ్రాతౄణాం శతమ్—భ్రాతృ శతమ్—తస్య. భుజాః ఏవ వనమ్—భుజవనమ్; తస్య ఛాయా—భుజవనచ్ఛాయా; సుఖమ్ ఉపస్థితా-సుఖోపస్థితా, భుజవనచ్ఛాయాయాం సుఖోపస్థితా-భుజవనచ్ఛాయా

భానుమతీ : ఆర్యపుత్ర, న ఖలు కిమపి మే శంకాకారణం యుష్మాసు సన్నిహితేషు. కిం త్వార్యపుత్రస్యైవ మనోరథసంపత్తి మభినందామి. (అజ్జఉత్త, ణ హు కిం వి మే సంకాకాలణం తుంహేసు సణ్ణిహిదేసు కిం తు అజ్జఉత్తస్స ఏవ్వ మణోరహ సంపత్తిం అహిణందామి)

---

సుఖోపస్థితా. కేసరిణామ్ ఇంద్రః-కేసరీంద్రః, దుర్యోధనః కేసరీంద్రః ఇవ-దుర్యోధనకేసరీంద్రః—తస్య గృహిణీ. శంకాయాః ఆస్పదమ్—శంకాస్పదమ్.

సంధులు :— సః+వ్యాప్త—ఉత్వాదేశవిసర్గసంధి. అక్ష+ఊహిణీ—నిజమునకిచ్చట గుణసంధి జరుగవలసి ఉన్నది. కానీ "అక్షాదూహిన్యాముపసంఖ్యానమ్" అను వార్తికము వృద్ధిసంధిని విధించినది. విశిఖైః+ఏవమ్—రేఫాదేశవిసర్గసంధి. వన+ఛాయా—తుగాగమసంధి. సుఖ+ఉపస్థితా—గుణసంధి. కేసరి+ఇంద్ర, శంకా+ఆస్పదమ్—సవర్ణదీర్ఘ.

క్రియ :- క్లామ్యసి—క్లామ్యథః—క్లామ్యథ—క్లమూగ్లానౌ (దివాది) పరస్మై—లట్—మధ్యమ.

అలంకారము :— భుజములు అనునట్టి వనము అనుచోట అనుభయతాద్రూప్యరూపకము. భుజములయందు వృక్షత్వారోపము గమ్యమానము. దుర్యోధన కేసరీంద్ర అనుచోట ఉపమిత సమాసము చెప్పబడుటచే—ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యాప్రయోగే—ఇది ధర్మలుప్తోపమ.

ఛందస్సు :— శార్దూలవిక్రీడితము—మసజసతతగ—13.

| మ | స | జ | స | త | త | గ |
|---|---|---|---|---|---|---|
| U U U | I I U | I U I | I I U | U U I | U U I | U |
| త్వం దుర్యో | ధనకే | సరీంద్ర | గృహిణీ | శంకాస్ప | దంకింత | వ |

పాదాంత లఘువు సంస్కృతమున ఐచ్ఛిక గురువు—వా పాదాంతేత్వసౌ గ్వక్రః, జ్ఞేయోఽన్యో మాత్రకో ఋజుః.

ఆర్యపుత్రేతి :— ఆర్యపుత్ర = ఓ స్వామీ!, యుష్మాసు = మీరు,

రాజా : అయి సుందరి, ఏతావన్త ఏవ మనోరథా యదహం దయితయా సంగతః స్వేచ్ఛయా విహారా మీతి. పశ్య—

ప్రేమాబద్ధ స్తిమిత నయనాపీయమానాబ్జశోభం
లజ్జా యోగా దవిశదకథం మందమందస్మితం వా।
వక్త్రేందుం తే నియమముషితాలక్తకాగ్రాధరం వా
పాతుం వాంఛా పరమసులభం కిం ను దుర్యోధనస్య॥ 18

---

సన్నిహితేషు=దగ్గర ఉండగా, మే=నాకు, శంకాకారణమ్=భయహేతువు, కిమపి న ఖలు=ఏదియు నుండదుగదా! కింతు=అయినప్పటికిని, ఆర్యపుత్రస్య=స్వామియొక్క, మనోరథ సంపత్తిమ్ ఏవ=వాంఛా సఫలతనే, కోరిక నెరవేరుటనే అనుట, అభినందామి=కోరుకొనుచున్నాను.

అయీతి :— అయి సుందరి=ఓ సొగసరీ! మనోరథాః=నా కోరికలు, ఏతావంతః ఏవ=ఇంతమాత్రములే—యత్=ఏదనగా—అహమ్=నేను, దయితయా=ప్రేయసితో, సంగతః=కూడినవాడనై, స్వేచ్ఛయా=యథేచ్ఛముగా, విహరామి ఇతి=విహరింతును అని. ఇంతమాత్రమే సుమా నా కోరిక అనుట. పశ్య=చూడుము—

ప్రేమాబద్ధేతి :— ప్రేమాబద్ధ స్తిమిత నయనాపీయమానాబ్జశోభమ్, లజ్జాయోగాత్ అవిశదకథమ్, మందమందస్మితమ్, వా, నియమముషితాలక్తకాగ్రాధరమ్, వా, తే, వక్త్రేందుమ్, పాతుమ్, వాంఛా, పరమ్, దుర్యోధనస్య, అసులభమ్, కిమ్, ను?.

అర్థము :— ప్రేమ=అనురాగముతో, ఆబద్ధ=నిండినవగుటచే లేక బంధింపబడినవగుటచే, స్తిమిత = నిశ్చలములైన, నయన = నేత్రములతో, ఆపీయమాన = లోగొనబడుచున్న, అబ్జశోభమ్ = పద్మముల సౌందర్యము కలదియును, లజ్జాయోగాత్=వ్రీడావశమున, అవిశద కథమ్=అస్పష్టోచ్చారణ కలదియును, వా=మరియు (అప్యర్థకము), మందమందస్మితమ్=చిన్న చిఱునవ్వు

కలదియును, నియమ=వ్రతనియమముచే, ముషిత=విడువబడిన, అలక్తక=లాక్షతో కూడిన, అగ్రాధరమ్ = శ్రేష్ఠమయిన అధరము కలదియును, అధర రంజన ద్రవ్యమును—అలక్తక=లిప్‌స్టిక్—వేసికొనలేదనుట, అయిన, తే = నీయొక్క, వక్త్రేందుమ్=జాబిలివంటి మోమును, పాతుమ్=చుంబించుటకు, వాంఛా=కోరిక (ఉన్నది), పరమ్ = ఇంతకుమించి, దుర్యోధనస్య = ఈ సార్వభౌమునికి, అసులభమ్ = దుర్లభమైనది, కిమ్ ను=ఏమున్నది? నీ అధరమును చుంబించు కోరిక తీరుటయే దుర్లభమనియు తక్కినవి తీరుట సులభమే అనియు తాత్పర్యము.

**సమాసములు** :— ప్రేమ్ణా ఆబద్ధే—ప్రేమాబద్ధే చ తే స్తిమితే—ప్రేమాబద్ధ స్తిమితే చ తే నయనే చ—ప్రేమాబద్ధస్తిమితనయనే, తాభ్యామ్ ఆసమన్తాత్ పీయమానా—ప్రేమాబద్ధస్తిమితనయనాపీయమానా; అబ్జయోః శోభా—అబ్జశోభా; ప్రేమాబద్ధ .. మానా అబ్జశోభా యేన తమ్—ప్రేమాబద్ధ... శోభమ్. లజ్జాయాః యోగః—తస్మాత్. న విశదా—అవిశదా కథా యస్మిన్ తమ్—అవిశదకథమ్. మందం చ తత్ మందం చ—మందమందమ్—స్మితమ్ యస్మిన్ తమ్—మందమంద స్మితమ్. వక్త్రమ్ ఇందురివ—వక్త్రేందుః—తమ్. నియమేన ముషితమ్—నియమముషితమ్ అలక్తకం యస్మిన్ సః—నియమ ముషితాలక్తకః; అధరాణామ్—అగ్రః—అగ్రాధరః; నియమ ముషితాలక్తకః అగ్రాధరః యస్మిన్—తమ్. పై భాగము లేక ముందరి భాగము అను అర్థమున అగ్ర శబ్దము నపుంసకలింగము. —పురోఽధికముపర్యగ్రాణి—అమర—3-3-182— దానితో అధరస్య అగ్రమ్ అని చెప్పినచో అధరాగ్రమ్ అని అగును. పైగా రంజకద్రవ్యమును (లిప్‌స్టిక్) అధరమునకంతటికిని పట్టింతురే తప్ప అగ్రభాగమున మాత్రమే పులుమరుగదా! అధికము, ప్రధానము, ప్రథమము అను అర్థములతో అగ్రశబ్దము మరియొకటి ఉన్నది — ఇది విశేష్యమునుబట్టి మూడు లింగములలోను ఉండును. "అగ్రం పురస్తాదుపరి పరిమాణే పలస్య చ ఆలంబనే సమూహే చ ప్రాంతే చ స్యాన్నపుంసకమ్, అధికే చ ప్రధానే చ ప్రథమే చాభిధేయవత్—" అని మేదినీ. అధరశబ్ద పుంలింగతనుబట్టి—ఓష్ఠాధరౌ తు రదన చ్ఛదౌ దశనవాససీ (అమర, 2-6-90) అధరస్తు పుమానోష్ఠే, హీనేఽనూర్ధ్వే చ వాచ్యవత్—అధరాణామ్ అగ్రః అని చెప్పినచో—అగ్రాధరః-అగును. రాజదంతాదిషు పరమ్ (2-2-31) ఇది ఆకృతి గణము—దీనిలో చేర్చినచో అగ్రశబ్దమునకు పూర్వప్రయోగము

(నేపథ్యే మహాన్ కలకలః, సర్వే ఆకర్ణయన్తి.)

భానుమతీ : (సభయం రాజానం పరిష్వజ్య) పరిత్రాయతాం పరిత్రాయతామార్యపుత్రః. (పరిత్తాఅదు పరిత్తాఅదు అజ్జఉత్తో)

రాజా : (సమంతాదవలోక్య) అలం సంభ్రమేణ. పశ్య—

---

చెల్లును. అధరములలోకెల్ల అగ్రగణ్యము భానుమతీదేవి అధర మనుట. న సులభమ్—అసులభమ్.

**సంధులు** :— ప్రేమ+ఆబద్ధ, నయన+ఆపీయమాన+అబ్జ, ముషిత+అలక్తక—అగ్ర+అధరమ్—సవర్ణదీర్ఘ. యోగాత్+అవిశద—జశ్త్వసంధి. వక్త్ర+ఇందుమ్—గుణసంధి.

**ఛందస్సు** :- మందాక్రాంతావృత్తము. "మందాక్రాంతా జలధిషడగైః మ్భౌ నతౌ తాద్గురూ చేత్"—మ—భ—న—త—త—గ—గ, 4—6—7.

| మ | భ | న | త | త | గగ |
|---|---|---|---|---|---|
| U U U | U I I | I I I | U U I | U U I | U U |
| ప్రేమాబ | ద్ధస్తిమి | తనయ | నాపీయ | మానాబ్జ | శోభమ్ |

**నేపథ్య ఇతి** :— (నేపథ్యే = తెరవెనుక, మహాన్ కలకలః = పెద్ద కోలాహలము, సర్వే=అందరును, ఆకర్ణయన్తి=విందురు.)

**సభయమితి** :— (సభయమ్ = భయముతో, రాజానమ్ = రాజును, పరిష్వజ్య=కౌగిలించుకొని) ఆర్యపుత్రః=స్వామి, పరిత్రాయతామ్ పరిత్రాయతామ్=కాపాడునుగాక కాపాడునుగాక! (భయమున ద్విరుక్తి)

**సమంతాదితి** :— (సమంతాత్=అన్నివైపులకును, అవలోక్య=చూచి) అలం సంభ్రమేణ=కంగారు చాలు చాలు, కంగారుపడవల దనుట. పశ్య=చూడుము—

దిక్షు వ్యూఢాంఘ్రిపాంగస్తృణ జటిల చలత్పాంశు దండో౽౦తరిక్షే
ఝాంకారీ శర్కరాలః పథిషు విటపినాం స్కంధకాషైః సధూమః।
ప్రాసాదానాం నికుంజే ష్వభినవజలదోద్గారగంభీర ధీర
శ్చండారంభః సమీరో వహతి పరిదిశం భీరు కిం సంభ్రమేణ॥ 19

---

దిక్ష్వితి :— దిక్షు, వ్యూఢాంఘ్రిపాంగః, అంతరిక్షే, తృణజటిల చలత్పాంశుదండః, పథిషు, ఝాంకారీ, శర్కరాలః, విటపినామ్ స్కంధకాషైః, సధూమః, ప్రాసాదానామ్, నికుంజేషు, అభినవజలదోద్గార గంభీరధీరః, చండారంభః, సమీరః, పరిదిశమ్, వహతి, భీరు సంభ్రమేణ, కిమ్?

అర్థము :— దిక్షు=దిక్కులయందు—అన్నివైపులకు ననుట, వ్యూఢ=విసరివేయబడిన, అంఘ్రిప+అంగః=చెట్లకొమ్మలు కలదియును, అంతరిక్షే=ఆకాశమునందు, తృణ=గడ్డిపరకలతో, జటిల=నిండినదై, అగ్రభాగమున దట్టముగా ఎగురుచున్న గడ్డిపరకలు కలదై అనుట; చలత్ = తిరుగుచున్న, పాంశుదండః = రజఃస్తంభము కలదియును—సుడిగాలి యనుట; పథిషు=బాటల యందు, ఝాంకారీ=మ్రోయునదియును, శర్కరాలః=ఇసుకతో నిండినదియును; విటపినామ్ = వృక్షములయొక్క, స్కంధకాషైః = కొమ్మల ఒరిపిడులచేత, సధూమః = పొగతో కూడినదియును, ప్రాసాదానామ్ = దేవ—నృప భవనముల యొక్క (ప్రాసాదో దేవ భూభుజామ్), నికుంజేషు = సాంద్రస్థలములయందు, భవనములు అధికముగానున్న చోటులయందనుట, అభినవ=క్రొత్తదైన, జలద=మేఘముయొక్క—క్రొక్కారుమేఘము అనుట; ఉద్గార=ఉరుమువలె, గంభీర=గంభీరమైనదై, ధీరః=స్వేచ్ఛగా సంచరించునదియును, గాలిహోరు పుబ్బులోని ఉరుమువలె మ్రోయుచు అన్నివైపులకు ప్రాకుచున్న దనుట—ధీరో ధైర్యాన్వితే స్వైరే బుధే క్లీబం తు కుంకుమే — అని మేదినీ నిఘంటువు, చండారంభః = భయంకరమయిన ఆరంభము కలదియును, అయిన, సమీరః=వాయువు, పరిదిశమ్=అన్ని దిశలకు, వహతి=వీచుచున్నది, భీరు=ఓ పిరికిదానా!, సంభ్రమేణ=కంగారుతో, కిమ్=పని ఏమి!—భయపడవలదనుట. స్రగ్ధరావృత్తము. వహతి—వహతః—వహన్తి. లట్, పరస్మై, ప్రథమ.

సఖి : మహారాజః ప్రవిశత్వీమం దారుపర్వతప్రాసాదమ్. ఉద్వేగకారీ ఖల్వాయ ముత్థితపరుషరజఃకలుషీకృతనయన, ఉన్మూలిత తరువర శబ్ద విత్రస్త మందురా పరిభ్రష్ట వల్లభ తురంగమ పర్యాకులీకృత జన పద్ధతిర్భీషణః సమీరణాసారః. (మహారాఓ పవిసదు ఏదం దారుపవ్వఅప్పాసాదమ్. ఉవ్వేఅకారీ క్ఖు అఅం ఉత్థిద పరుస రఅకలుసీకిదణఅణో ఉమ్మూలిద తరువర సద్ద విత్థత్థ మందురా పరిబ్భట్ట వల్లహ తురంగమ పజ్జాఉలీకిద జణపద్ధఈ భీసణో సమీరణాసారో.)

---

సమాసములు :— అంఘ్రిభిః—పిబతీతి—అంఘ్రిపః—అంఘ్రిపాణామ్ అంగాని—అంఘ్రిపాంగాని. వ్యూఢాని అంఘ్రిపాంగాని యేన సః—వ్యూఢాంఘ్రిపాంగః. తృణైః జటిలః—తృణజటిలః; పాంశూనాం దండః—పాంశుదండః; చలంశ్చాసౌ పాంశుదండః—చలత్పాంశుదండః; తృణజటిలః చలత్పాంశుదండః యస్మిన్ సః-తృణజటిల చలత్పాంశుదండః. స్కంధానాం కాషః—తైః. ధూమేన సహితః—సధూమః. అభినవశ్చ అసౌ జలదశ్చ—అభినవజలదస్య ఉద్గార ఇవ ఉద్గారో యస్య—స చాసౌ గంభీరశ్చ, ధీరశ్చ. చండః ఆరంభః యస్య సః. దిశి దిశి ఇతి పరిదిశమ్.

సంధులు :— వి+ఊఢ, నికుంజేషు + అభినవ—యణాదేశసంధి. వ్యూఢ+అంఘ్రిప+అంగః, చండ+ఆరంభః—సవర్ణదీర్ఘసంధి. జలద+ఉద్గార—గుణసంధి. అంగః+తృణ, ధీరః+చండ—శషసాదేశసంధి. దండః+అంతరిక్షే—ఉత్వాదేశ. దండో+అంత—పూర్వరూప. సమీరః+వహతి—ఉత్వాదేశ.

మహారాజ ఇతి :— ఇయమ్=ఈ, హస్త నిర్దేశముతో ఈ కనిపించు చున్న అనుట, దారుపర్వత = చెక్కలతో కృత్రిమముగా తయారుచేయబడిన కొండమీది, లీలాపర్వత మనుట, ప్రాసాదమ్=భవనమును, మహారాజః=మహారాజు, ప్రవిశతు=ప్రవేశించునుగాక—ప్రార్థనార్థకము. ఉత్థిత=లేచిన, పరుష=

రాజా : (సహర్షమ్) ఉపకారి ఖల్విదం వాత్యాచక్రం సుయోధనస్య. యస్య ప్రసాదా దయత్నపరిత్యక్త నియమయా దేవ్యా సంపాదితోఽస్మన్మనోరథః. కథమితి—

న్యస్తా న భ్రుకుటి ర్న బాష్పసలిలై రాచ్ఛాదితే లోచనే
నీతం నానన మన్యతః సశపథం నాహం స్పృశన్ వారితః।

---

కర్కశమయిన, రజః=ధూళితో, కలుషీకృత=కలుషము గావింపబడిన, నయనః=నేత్రములు కలదియు, ప్రజల కన్నులను కలుషీకరించినదియు ననుట, ఉన్మూలిత=పెకలించివేయబడిన, తరువర=పెద్ద పెద్ద వృక్షములయొక్క, శబ్ద=ధ్వనితో, చెట్లు పడిపోవుచున్న చప్పుడుతో ననుట, విత్రస్త=భయపడినవై, మందురా=అశ్వశాలనుండి, పరిభ్రష్ట=పారిపోయిన, వల్లభ తురంగమ=అశ్వరాజములచే (తురంగమాణాం వల్లభాః—వల్లభతురంగమాః—రాజదంతాదిషుపరమ్), పర్యాకులీకృత = చెల్లాచెదరు గావింపబడిన, జనపద్ధతిః = ప్రజలు సందడిగా తిరుగు మార్గములు కలదియును, జనసమ్మర్దముతో నిండిన బజారులను కలగుండుపరచిన వనుట; అయిన, భీషణః=భయంకరమయిన, అయమ్=ఈ, సమీరణాసారః=సుడిగాలి వేగము, ఉద్వేగకారీ=అందోళన కలిగించుచున్నది. పరిస్థితి ఆందోళనకరముగా ఉన్నదనుట.

సహర్షమితి :— (సహర్షమ్=సంతోషముతో), ఇదమ్=ఈ, వాత్యాచక్రమ్ = సుడిగాలి, సుయోధనస్య = దుర్యోధనునకు నాకు, ఉపకారి ఖలు=ఉపకారకము గదా! ఎందువల్లననగా—యస్య=ఏ సుడిగాలియొక్క, ప్రసాదాత్=అనుగ్రహము వలన, అయత్నపరిత్యక్త నియమయా, అయత్న=నా ప్రయత్నమేమియు లేకుండగనే, పరిత్యక్త=విడిచిపెట్టిన, నియమయా=వ్రతనియమము కలదయిన, దేవ్యా=భానుమతీదేవిచే, అస్మత్=మాయొక్క, మనోరథః=కోరిక, ఆలింగనేచ్ఛ యనుట, సంపాదితః=సమకూర్చబడినది. కథమ్ ఇతి=ఎట్లనగా—

న్యస్తేతి :— భ్రుకుటిః, న, న్యస్తా; లోచనే, బాష్పసలిలైః, న,

తన్వ్యా మగ్నపయోధరం భయవశాదాబద్ధమాలింగితం
భంక్తాఽస్యా నియమస్య భీషణమరున్నాయం వయస్యో
మమ॥ 20

---

ఆచ్ఛాదితే; ఆననమ్ అన్యతః న నీతమ్, స్పృశన్ అహమ్ సశపథమ్ న వారితః; తన్వ్యా, భయవశాత్, మగ్నపయోధరమ్ ఆలింగితమ్ ఆబద్ధమ్, అస్యాః నియమస్య భంక్తా అయమ్ భీషణమరుత్ న; మమ వయస్యః.

అర్థము :— భ్రుకుటిః=బొమముడి, న న్యస్తా=వేయబడలేదు, అనిష్ట సూచకముగా దేవి మోము చిట్లించలేదనుట, లోచనే=కన్నులు, బాష్పసలిలైః= దుఃఖాశ్రువులతో, అనిష్టమును వారించలేని దైన్యము వలని దుఃఖమనుట; న ఆచ్ఛాదితే=నింపబడలేదు; ఆననమ్=ముఖము, అన్యతః=మరొక ప్రక్కకు, న నీతమ్=త్రిప్పబడలేదు, మొగము త్రిప్పుకొనలేదనుట; స్పృశన్=తాకుచున్న వాడనయిన, అహమ్=నేను, సశపథమ్=ఒట్టులతో, న వారితః=వారింపబడనైతిని; నన్ను తాకినచో ఒట్టు ఇత్యాదిగా వారించలేదనుట; తన్వ్యా=ఈ కృశాంగిచేత, భయవశాత్ = భయము కారణముగా, మగ్నపయోధరమ్ = అణగిన కుచములు కలుగునట్లుగా, ఆలింగితమ్=కౌగిలి, ఆబద్ధమ్=బిట్టు బిగింపబడినది. గుండెలణగి పోవునంత గాఢముగా కౌగిలించిన దనుట; అస్యాః= ఈ భానుమతీదేవియొక్క, నియమస్య=వ్రతనియమముయొక్క, భంక్తా=భంజకుడయిన, అయమ్=ఈతడు, భీషణమరుత్ న=భీకర వాయుదేవుడు కానేకాడు, (కింతు=మరి), మమ=నాకు, వయస్యః = చెలికాడే, ప్రియా పరీరంభమును చేకూర్చుటచే ఈ ఝంఝా మారుతము నాకు నర్మసచివుడనుట. అయమ్, భీషణ మరుత్, మమ=నాకు, వయస్యః న=చెలికాడు కాదా!—చెలికాడే అనుట. ఇట్లు కాకువుగానైన నన్వయింప జెల్లును.

సమాసములు :— బాష్పాఖ్యాని తాని సలిలాని—బాష్పసలిలాని-తైః; శపథైః సహితం యథా భవతి తత్తథా—సశపథమ్. మగ్నౌ పయోధరౌ యస్మిన్ కర్మణి తత్తథా—మగ్నపయోధరమ్. భీషణశ్చ అసౌ మరుత్ చ—భీషణమరుత్.

తత్సంపూర్ణ మనోరథస్య మే కామచారః సంప్రతి విహారేషు. తదితో దారుపర్వత ప్రాసాదమేవ గచ్ఛామః.

(సర్వే వాత్యాబాధాం రూపయన్తో యత్నతః పరిక్రామన్తి)

---

భంక్తా—భంక్తారౌ—భంక్తారః—భంక్తృ—పుం. ప్రథమా. ఛందస్సు—శార్దూల విక్రీడితము.

**సంధులు :-** భ్రుకుటిః+న, సలిలైః+ఆచ్ఛాదితే—రేఫాదేశవిసర్గసంధి. ఆ+ఛాదితే-నిత్యతుగాగమసంధి. ఆఙ్మాఙోశ్చ. న+ఆననమ్, న+అహమ్, భంక్తా+అస్యాః, న+అయమ్-సవర్ణదీర్ఘ. అస్యాః+నియమ-విసర్గలోపసంధి. మరుత్+న-అనునాశికాదేశ. వయస్యః+మమ—ఉత్వాదేశవిసర్గసంధి.

**అలంకారము :—** వ్రతనియమ విరుద్ధముగా భానుమతీదేవి ప్రవర్తించుటను "భయవశాత్-భంక్తాస్యా నియమస్య భీషణమరుత్"—అను హేతువులతో సమర్థించుట జరిగినది కావున కావ్యలింగాలంకారము. "సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్, జితోఽసిమంద కందర్ప! మచ్చిత్తేఽస్తి త్రిలోచనః."

**తత్సంపూర్ణేతి :—** తత్=అందుచేత, సంపూర్ణ మనోరథస్య=నెరవేరిన కోరిక కలవాడయిన, మే=నాకు, విహారేషు=విహరణములయందు, సంప్రతి=ఇప్పుడు, కామచారః=స్వేచ్ఛ. వ్రతనియమములు భంగపడిపోయినవి కావున ఇక ఈమెతో స్వేచ్ఛగా విహరింతు ననుట. తత్=అందుచేత, ఇతః=ఇచటి నుండి, దారుపర్వత ప్రాసాదమ్ ఏవ=క్రీడాపర్వతము మీదనున్న భవనమునే, గచ్ఛామః=పెడలుదుము, ఆ భవనములోనికే పోవుద మనుట.

**సర్వ ఇతి :—** (సర్వే=అందరును, వాత్యాబాధామ్=సుడిగాలి బాధను, రూపయన్తః = అభినయించుచున్నవారై, యత్నతః = ప్రయత్నముతో, పరిక్రామన్తి=నడతురు.)

రాజా : కురు ఘనోరు పదాని శనైః శనై
రయి విముంచ గతిం పరివేపసీమ్।
సుతను బాహులతోపరిబంధనం
మమ నిపీడయ గాఢమురః స్థలమ్॥ 21

---

కుర్వితి :— ఘనోరు! శనైః శనైః పదాని కురు; అయి పరివేపినీమ్ గతిం విముంచ; సుతను మమ ఉరఃస్థలమ్ బాహులతోపరిబంధనమ్, గాఢం నిపీడయ.

అర్థము :— ఘనోరు = క్రిక్కిరిసిన ఊరువులు కలదానా!, శనైః శనైః=మెలమెల్లగా, పదాని=అడుగులను, కురు=వేయుము, అయి=ఓయీ! పరివేపినీమ్=వణుకుతో కూడిన లేక తొట్రుపాటుతో కూడిన, గతిమ్=గమనమును, విముంచ=విడువుము, సుతను=సలక్షణమయిన శరీరము కలదానా! ఓ సుందరీ అనుట, మమ=నాయొక్క, ఉరఃస్థలమ్=వక్షస్సీమను, బాహులతోపరిబంధనమ్— బాహులతా=లతల వంటి బాహువులతోనైన, ఉపరిబంధనమ్=కంఠాలింగనము కలదియగునట్లుగా, నిపీడయ = కౌగిలించుకొనుము. లతల వంటి బాహువులతో కంఠసీమను పెనవేసి గుండెను కౌగిలించుకొమ్మనుట.

సమాసములు :— ఘనౌ ఊరూ యస్యాః సా—ఘనోరూః—తత్సంబుద్ధౌ. పరివేపః అస్యాః అస్తి ఇతి—పరివేపినీ తామ్. (పరివేప—అతఇనిఠనౌ—పరివేపిన్_ఋన్నేభ్యోఙీప్) శోభనః తనుః యస్యాః సా—సుతనూః—తత్సంబుద్ధౌ. బాహూ లతే ఇవ—బాహులతాభ్యామ్ ఉపరిబంధనం యస్మిన్ కర్మణి తత్తథా.

సంధులు :— ఘన+ఊరు, లతా+ఉపరి—గుణసంధులు. శనైః+ఇయమ్_రేఫాదేశవిసర్గ. ఉరః+స్థలమ్—ఉరస్థలమ్—ఉరఃస్థలమ్—ఖర్పరే శరి వా విసర్గలోపో వక్తవ్యః.

క్రియ :- డు కృఞ్ కరణే—లోట్, పరస్మై, మధ్యమ.
కురు/కురుతాత్_కురుతమ్—కురుత.
ముంచ/ముంచతాత్—ముంచతమ్—ముంచత—
లోట్, పరస్మై, మధ్యమ. ముచ్లృ మోక్షణే; పీడ ప్రతిష్టంభే
పీడయ/పీడయతాత్—పీడయతమ్—పీడయత.

(ప్రవేశం రూపయిత్వా) ప్రియే! అలబ్ధావకాశః సమీరణః సంవృతత్వాత్ గర్భగృహస్య. విస్రబ్ధ మున్మీలయ చక్షురున్మృష్ట రేణునికరమ్.

భానుమతీ : (సహర్షమ్) దిష్ట్యేహ తావదుత్పాతసమీరణో న బాధతే. (దిట్ఠిఆ ఇహ దావ ఉప్పాదసమీరణో ణ బాధేఇ.)

---

ఛందస్సు :- ద్రుతవిలంబితము—ద్రుతవిలంబిత మాహ నభౌ భరౌ

| న | భ | భ | ర |
|---|---|---|---|
| I I I | U I I | U I I | U I U |
| కురుష | నోరువ | దానిశ | నైశ్ననైః |

వృత్తౌచిత్యము—ఆమె ద్రుతగతికిని ఈత డుపవేశించు విలంబగతికిని ఇది సూచకము.

ప్రవేశమితి :— (ప్రవేశం రూపయిత్వా=గృహప్రవేశమునభినయించి) ప్రియే = ఓ ప్రేయసీ! గర్భగృహస్య = ఈ గృహాంతర్భాగముయొక్క, సంవృతత్వాత్=మూయబడియుండుటవలన, లోపలిభాగము నలువైపుల మూయబడి యుండుటవల్ల ననుట, సమీరణః=వాయువు, అలబ్ధావకాశః=స్థానము దొరకని వాడయ్యెను—సుడిగాలి ఈ లోనికి ప్రవేశించలేదనుట. చక్షుః = నేత్రములను, ఉన్మృష్ట=తుడువబడిన, రేణునికరమ్=ధూళి కలవియగునట్లుగా, విస్రబ్ధమ్= నెమ్మదిగా, ఉన్మీలయ=తెరువుము. రెప్పలపై నంటిన దుమ్మును తుడుచుకొని తెరువుము అనుట.

సహర్షమితి :— (సహర్షమ్=సంతోషముతో) దిష్ట్యా=దైవవశమున, ఇహ=ఇచ్చట, ఉత్పాతసమీరణః=ఉత్పాతములను కలిగించు సుడిగాలి, న బాధతే తావత్=బాధించుటలేదు.

సఖీ : మహారాజ, ఆరోహణ సంభ్రమ నిస్సహం ప్రియసఖ్యా ఊరుయుగలమ్. తత్కస్మాదిదానీం మహారాజ ఆసన వేదీం న భూషయతి. (మహారాఅ, ఆరోహణసంభమణిస్సహం పిఅసహీఏ ఊరుజుఅలమ్. తా కీసదాణీం మహారాఓ ఆసణవేదీం ణ భూసేది.)

రాజా : (దేవీమవలోక్య) భవతి, అనల్పమేవాపకృతం వాత్యా సంభ్రమేణ. తథాహి—

రేణుర్బాధాం విధత్తే తనురపి మహతీం నేత్రయోరాయతత్వాత్
ఉత్కంపోఽల్పోఽపి పీనస్తనభరిత మురః క్షిప్తహారం దునోతి।

---

మహారాజఇతి :— ఓ మహారాజా!, ప్రియసఖ్యాః=మా నెచ్చెలియైన భానుమతియొక్క, ఊరుయుగలమ్=ఊరుద్వయము, ఆరోహణ=దారువపర్వతారోహణమునందలిదైన, సంభ్రమ=తొందరకు, నిస్సహమ్=తట్టుకొనలేనిది—అలసిపోయిన దనుట. (ఆరోహణస్య సంభ్రమేణ నిస్సహమ్.) తత్=అందుచేత, ఇదానీమ్=ఇప్పుడు, మహారాజః=మహారాజు, ఆసనవేదీమ్=ఆసనముగానువయోగపడు తిన్నెను, కస్మాత్ న భూషయతి=అలంకరింపడేల? నీవు కూర్చున్నచో ఈమెయు కూర్చుండు ననుట.

**దేవీమితి :—** (దేవీమ్ = భానుమతిని, అవలోక్య = చూచి) వాత్యా=సుడిగాలివల్లనైన, సంభ్రమేణ=హడావిడితో, అనల్పమ్ ఏవ=ఎక్కువగానే, అపకృతమ్=అపకారము చేయబడినది—సుడిగాలివలన పెద్ద అపకారమే జరిగిన దనుట. తథాహి=అంతేకదా!—

**రేణురితి :—** తనుః అపి రేణుః నేత్రయోః ఆయతత్వాత్ మహతీం బాధాం విధత్తే, అల్పః అపి ఉత్కంపః పీనస్తన భరితమ్ ఉరః క్షిప్తహారం

ఊర్వోర్మందే౽పి యాతే పృథుజఘనభరాద్వేప
థుర్వర్ధతే౽స్యా
వాత్యా ఖేదం మృగాక్ష్యాః సుచిరమవయవైర్దత్తహస్తా
కరోతి॥ 22

---

దునోతి, మందే యాతే అపి పృథుజఘన భరాత్ అస్యాః ఊర్వోః వేపథుః వర్ధతే, మృగాక్ష్యాః అవయవైః దత్తహస్తా వాత్యా సుచిరం ఖేదం కరోతి.

అర్థము :— తనుః అపి=చిన్నదే అయినను, రేణుః=ధూళికణము, నేత్రయోః = (ఈమె) కన్నులయొక్క, ఆయతత్వాత్ = విపులత్వము వలన, మహతీమ్=అధికమయిన, బాధామ్=వ్యథను, విధత్తే=కలిగించుచున్నది; అల్పః అపి=కొద్దిపాటిదే అయినను, ఉత్కంపః=కదలిక, పీనస్తనభరితమ్=గురువక్షోజ భారముతో కూడిన, ఉరః=వక్షఃస్థలమును, క్షిప్తహారమ్=ఎగిరిపడుచున్న దండలు కలదగునట్లు, దునోతి=బాధించుచున్నది; మందే=నెమ్మదిగా, యాతే అపి=నడచినప్పటికిని, మందగమనమే అయినను అనుట, పృథు=ఘనమయిన, జఘన= వెను-కటియొక్క, నితంబముయొక్క అనుట, భరాత్=భారము వలన, అస్యాః= ఈమెయొక్క, ఊర్వోః=ఊరువులకు, వేపథుః=కంపము, వర్ధతే=అధికమగు చున్నది, నెమ్మదిగానే నడచినప్పటికిని జఘనభారము వలన ఊరువులధికముగా కంపించుచున్నవి అనుట, మృగాక్ష్యాః=ఈ హరిణనేత్రయొక్క, అవయవైః= అంగములచేత, దత్తహస్తా=అందింపబడిన సహాయము కలిగినదై, వాత్యా=సుడి గాలి, అస్యాః=ఈమెకు, సుచిరమ్=చాలసేపు, ఖేదమ్=బాధను, కరోతి=కలిగించు చున్నది. సుడిగాలి వలన కలిగిన బాధ నేత్ర స్తన జఘనముల ఆయతత్వ— పీనత్వ—పృథుత్వముల వలన అతిశయించి తేరుకొనుట జాగైన దనుట. ఇందు భానుమతీ సౌందర్యాదికము వ్యంగ్యము.

సమాసములు :— పీనౌ చ తౌ స్తనౌ చ—పీనస్తనాభ్యాం భరితమ్. క్షిప్తాః హారాః యస్మిన్ కర్మణి తత్తథా. పృథు చ తత్ జఘనం చ—పృథు జఘనస్య భరః—తస్మాత్. మృగస్య అక్షిణీ ఇవ అక్షిణీ యస్యాః సా-మృగాక్షీ— తస్యాః. దత్తః హస్తః యస్యై సా—దత్తహస్తా. ఛందస్సు—స్రగ్ధర.

(సర్వే ఉపవిశన్తి)

రాజా : తత్కిమిత్యనాస్తీర్ణం కఠినం శిలాతలమధ్యాస్తే దేవీ!

లోలాంశుకస్య పవనాకులితాంశుకాంతం
త్వద్దృష్టిహారి మమ లోచన బాంధవస్య।

---

**సంధులు** :— రేణుః+బాధామ్, తనుః+అపి, నేత్రయోః+ఆయత, ఊర్వోః+మన్దే, వేపథుః+వర్ధతే, అవయవైః+దత్త—రేఫాదేశవిసర్గసంధులు. ఉత్కంపః+అల్పః+అపి—ఉత్వాదేశవిసర్గసంధి+పూర్వరూపస్వరసంధి. మందే+అపి, వర్ధతే+అస్యాః—పూర్వరూప. అస్యాః+వాత్యా—విసర్గలోప

**క్రియలు** :- ధత్తే-దధాతే-దధతే-డుధాఞ్ ధారణపోషణయోః-ఆత్మనే
ధునోతి-ధునుతః-ధున్వన్తి-టుదు ఉపతాపే—పరస్మై
వర్ధతే-వర్ధేతే-వర్ధన్తే-వృధు జిర్ వృద్ధౌ-ఆత్మనే-లట్-ప్రథమ

**అలంకారము** :— సుడిగాలి భానుమతీదేవిని అందరికంటె అధికముగా చాలసేపు బాధించుటను నేత్రాయతత్వాః హేతువులతో సమర్థించుట జరిగినది కావున కావ్యలింగమలంకారము—సమర్థనీయస్య అర్థస్య కావ్యలింగం సమర్థనమ్.

**సర్వఇతి** — (సర్వే=అందరును, ఉపవిశన్తి=కూర్చుందురు।

**తత్కిమితి** :— దేవీ=భానుమతీదేవి, అనాస్తీర్ణమ్=చాప మొదలైన ఆస్తరణములు ఏమియును లేనట్టిదియును, కఠినమ్=రూక్షమైనదియునైన, శిలాతలమ్=రాతినేలపై, అధ్యాస్తే కిమ్ ఇతి=చతికిలబడుచున్నదేమి!, ఉత్తి నేలపై మహారాణి కూర్చుండదగదని ఆశ్చర్యము.

**లోలాంశుకస్యేతి** :— కరభోరు, పవనాకులితాంశుకాంతమ్ త్వద్దృష్టి—హారి మమ ఊరుయుగ్మమ్, లోలాంశుకస్య మమ లోచనబాంధవస్య తవ జఘనస్థలస్య చిరమ్ అధ్యాసితుమ్ పర్యాప్తమ్ ఏవ.

అధ్యాసితుం తవ చిరం జఘనస్థలస్య
పర్యాప్తమేవ కరభోరు మమోరుయుగ్మమ్॥ 23

**అర్థము** :— కరభోరు=కరభములవంటి ఊరువులు కలదానా! మణికట్టు నుండి చిటికెనవేలువరకునున్న చేతి వెలుపలి భాగమును కరభము అందుపు— మణిబంధాదాకనిష్ఠం కరస్య కరభో బహిః—(అమర, 2-6-81); పవన=వాయువు చేత, ఆకులిత=చెదరగొట్టబడిన, అంశుక=వస్త్రముయొక్క, అంతమ్=కొసలు కలదై, త్వత్=నీయొక్క, దృష్టి=చూపును, హారి=హరించునదైన, మమ= నాయొక్క, ఊరుయుగ్మమ్=ఊరువుల జంట, లోలాంశుకస్య=కదలుచున్న చీరతో కూడినదియును, లోచన=(నా) కన్నులకు, బాంధవస్య=బంధువునైన, తవ=నీయొక్క, జఘనస్థలస్య=విశాలమైన నితంబముయొక్క, చిరమ్=చిర కాలము(పు), అధ్యాసితుమ్=ఆశ్రయణము కొఱకు, అలమ్ ఏవ=చాలినదే. నీ జఘనస్థలమును నా ఊరుయుగళము ఎంతసేపయినను మోయజాలినదే అనుట. నా ఒడిలో కూర్చుండరాదా నేలపై ఏలయని తాత్పర్యము.

**విశేషములు** :— సంయోగాభిలాషారూపమయిన భావమిచ్చట ధ్వని. ఇది దుర్యోధనుని వాక్చాతుర్యము వలన లభించుచున్నది. ఇతడు కవి నిలబెట్టిన పాత్ర. కావున ఇది కవినిబద్ధవక్తృప్రౌఢోక్తి సిద్ధ వస్తుకృత భావధ్వని యగుచున్నది.

**సమాసములు** :— లోలమ్ అంశుకం యస్య—తాదృశస్య. పవనేన ఆకులితః—పవనాకులితః. అంశుకస్య అంతః—అంశుకాంతః, పవనాకులితః అంశుకాంతః యస్య తత్. తవ దృష్టిః—త్వద్దృష్టిః, త్వద్దృష్టిం హరతి శీల మస్య—త్వద్దృష్టిహారి-హారిణీ-హారీణి-తాచ్ఛీల్యణిన్నంత నపుంసకము. బంధురేవ బాంధవః, లోచనయోః బాంధవః—తస్య. (బధ్నాతి—ఆకర్షతి—ఇతి బంధుః). జఘనమ్ స్థలమివ—జఘనస్థలమ్—తస్య. కరభావివ ఊరూ యస్యాః సా— తత్సంబుద్ధౌ—హే కరభోరు!. ఊర్వోః యుగ్మమ్.

**సంధులు** :- లోల+అంశుక, పవన+ఆకులిత+అంశుక+అంతమ్— సవర్ణదీర్ఘ. పరి+ఆప్తమ్—యణాదేశ, మమ+ఊరు-గుణసంధి.

(ప్రవిశ్య పటాక్షేపేణ సంభ్రాంతః)

కంచుకీ : దేవ! భగ్నం భగ్నమ్! (సర్వే సాతంకం పశ్యన్తి)

రాజా : కిం నామ?

కంచుకీ : భగ్నం భీమేన.

రాజా : ఆః కిం ప్రలపసి?

---

**అలంకారము** :— భానుమతీ దుర్యోధనుల ఊరుయుగ్మమునకు అనురూప్యము వర్ణింపబడినది. రెండును లోలాంశుకములే, పరస్పరదృష్టిహారులే. కావుననిందు సమాలంకారము చెప్పవచ్చును—సమం స్యాద్వర్ణనం యత్ర ద్వయోర ప్యనురూపయోః, స్వానురూపం కృతం సద్మ హారేణ కుచమండలమ్.

ఛందస్సు :- వసంతతిలక—ఉక్తా వసంతతిలకా తభజా జగౌ గః.

| త | భ | జ | జ | గగ |
|---|---|---|---|---|
| U U I | U I I | I U I | I U I | U U |
| పర్యాప్త | మేవక | రభోరు | మమోరు | యుగ్మమ్ |

ప్రవిశ్యేతి :— (సంభ్రాంతః=ఉద్వేజితుడై, పటాక్షేపేణ=ఒక్కుమ్మడి తెర త్రోసికొనుటతో, ప్రవిశ్య=ప్రవేశించి—తెర త్రోసివేయుచు రంగప్రవేశము చేసి యనుట-భయకోపదుఃఖాదుల ఆవేశముతో పాత్రలు రంగమున ప్రవేశించుట—పటాక్షేపేణ—సపటాక్షేపం ప్రవిశ్య—అందురు.)

దేవ ఇతి :— దేవ=మహారాజా!, భగ్నం భగ్నమ్=భగ్నమైపోయినది భగ్నమైపోయినది. (అందరును ప్రశ్నార్థకముగా చూతురు)

కిమితి :— కిమ్ నామ?=ఏమది?

భగ్నమితి :— భీమేన=భీమునిచే, (భయంకరమైన వాయువుచే అనుట) భగ్నమ్=నాశనముగావింపబడినది. విరిచివేయబడిన దనుట.

ఆః ఇతి :— ఆః=అహో! కిం ప్రలపసి?=ఏమిటి వాగుచున్నావు?

భానుమతీ : ఆర్యా! కిమనర్థం మంత్రయసే' (అజ్జ, కిం అణత్థం మంతేసి)

కంచుకీ : (సభయమ్) నను భగ్నం భీమేన భవతః........

రాజా : ధిక్ ప్రలాపిన్ వృద్ధాపసద, కోఽయ మద్య తే వ్యామోహః!

కంచుకీ : దేవ, న ఖలు కశ్చిత్ వ్యామోహః. సత్యమేవ బ్రవీమి.

భగ్నం భీమేన భవతో మరుతా రథకేతనమ్।
పతితం కింకిణీ క్వాణ బద్ధాక్రందమివక్షితౌ॥ 24

---

ఆర్యేతి :— ఆర్య!=పూజ్యుడా!, అనర్థమ్=అనిష్టమును, మంత్రయసే కిమ్=పలుకుచున్నావా!

సభయమితి :— (సభయమ్ = భయపడుచు) నను=నిజమే వినుము; భీమేన=భీమునిచే (భీమ వాయువుచే అనుట) భగ్నమ్=భగ్నముకావింపబడినది, భవతః=తమయొక్క....పూర్తికాకుండగనే రాజందుకొని—

ధిగితి :— ధిక్=ఛీ, ప్రలాపిన్=వదరుబోతా!, వృద్ధాపసద=వృద్ధనీచా! అద్య=నేడు, తే=నీకు, అయమ్=ఈ, వ్యామోహః కః=మతిభ్రమణము ఏమి!

దేవేతి :— మహారాజా! కశ్చిత్ వ్యామోహః=వ్యామోహము ఏదియు, న ఖలు=లేదు సుమా! సత్యమ్ ఏవ=నిజమే, బ్రవీమి=పలుకుచున్నాను.

భగ్నమితి :— భీమేన మరుతా భవతః రథకేతనం భగ్నమ్, కింకిణీ క్వాణబద్ధాక్రందమ్ ఇవ క్షితౌ పతితమ్.

అర్థము :— భీమేన=భయంకరమైన, మరుతా=వాయువుచే, భవతః=నీయొక్క, రథకేతనమ్=రథధ్వజము, జెండాతో కూడిన కఱ్ఱ అనుట, భగ్నమ్=విరిగిపోయినది, కింకిణీ=కేతనపు చిఱుమువ్వలయొక్క, క్వాణ=ధ్వనితో, బద్ధ=

రాజా : బలవత్సమీరణవేగాత్ కంపితే భువనే భగ్నః స్యందన కేతుః. తత్కిమిత్యుద్ధతం ప్రలపసి భగ్నం భగ్నమితి!

---

సమకూర్చబడిన, ఆక్రందమ్ ఇవ=రోదనముకలదానివలె, మువ్వల చప్పుడు రోదనధ్వనివలె వినిపించుచుండగా ననుట, క్షితౌ=భూమియందు, నేలపై అనుట, పతితమ్=పడిపోయినది.

**విశేషములు** :— దుర్యోధనుడిచ్చట కశ్చిత్కాంతావాదమును చేసెను. భీమేన అనుటతోడనే భీమసేనుడనుకొని చిందులు త్రొక్కినాడేతప్ప కంచుకి వాక్యమును పూర్తికానీయలేదు. ఇది దుర్యోధనుని ఉలుకును తెలియజేయుచున్నది. భీమ శబ్దమునకు భీషణమయిన భయంకరమయిన అనియు నర్థములు. భీమేన అని తృతీయలోనుండుట మరింత భ్రాంతిజనకమైనది. కడకిది వాయువునకు విశేషణమై గుండెగుబులును చల్లార్చినది. భీమేన మరుతా అని పైని చెప్పినట్లుకాక మరుతా భీమేన—మరుతా = వాయునందనుడైన, భీమేన = భీమునితో—అనియు కొందరు అన్వయము చెప్పిరి. మరుత్ శబ్దము లక్షణావృత్తితో మారుతి పరమనియు, ఆత్మా వై పుత్రనామాసి అనిరి కావున తండ్రి—కొడుకులకు అభేదమనియు సమర్థించుకొనిరి. కానీ ఇది సరసముగా లేదు. పైగా ఇచట జరిగిన సంఘటన—వాయువుచే కేతనము విరుగుటయే తప్ప భీమసేనుని ప్రసక్తి లేదు. భీమేన అను విశేషణమును వేయుటలో దుర్యోధనుని ఉలుకును బయటపెట్టుట యన్నది కవ్యభిప్రేతమయిన చమత్కారము. ఇది వీరి అన్వయమున ఓడిపోవుచున్నది, కావున స్వీకార్యము కాదు. రజశ్చక్ర కల్పనకు భానుమతీ వ్రతనియమ భంజనముతోపాటు కేతనపతనముకూడ ఒక ప్రయోజనము. ఇది దుర్యోధనోరు భంగమునకు సూచకము.

**సమాసములు** :— రథస్య కేతనమ్—రథకేతనమ్. కింకిణీనాం క్వాణః—కింకిణీక్వాణేన ఆబద్ధః ఆక్రందః యేన తత్తథా.

**బలవదితి** :- బలవత్=బలిష్ఠమయిన, సమీరణ=వాయువుయొక్క, వేగాత్=వేగమువలన, భువనే=ప్రపంచమే, కంపితే=ఊగిపోగా, స్యందనకేతుః=

కంచుకీ : దేవ, న కించిత్. కింతు శమనార్థమస్యానిమిత్తస్య విజ్ఞాపయితవ్యో దేవ ఇతి స్వామిభక్తి ర్మాం ముఖరయతి.

భానుమతీ : ఆర్యపుత్ర, పరిహార్యతా మేత దనిమిత్తం ప్రసన్న బ్రాహ్మణ వేదానుఘోషేణ హోమేన చ (అజ్జఉత్త, పడిహారీఅదు ఏదం అణిమిత్తం పసణ్ణ బ్రహ్మణ వేఆణుఘోశేణ హోమేణ అ.)

రాజా : (సావజ్ఞమ్) నను గచ్ఛ, పురోహిత సుమిత్రాయ నివేదయ.

---

రథకేతనము, భగ్నః=విరిగినది. తత్=అంతమాత్రమున, భగ్నమ్ భగ్నమ్ ఇతి = విరిగిపోయినది విరిగిపోయిన దని, ఉద్ధతం ప్రలపసి కిమితి=పొలికేకలు పెట్టుచున్నావేల!

దేవేతి :— దేవ=మహారాజా!, న కించిత్=ఏమియులేదు. కిన్తు=కానీ, అస్య=ఈ, అనిమిత్తస్య=అపశకునముయొక్క, శమనార్థమ్=విఘుగుడుకొరకు, దేవః=మహారాజు, విజ్ఞాపయితవ్యః=విన్నవింపబడవలసినవాడు, ఇతి=అని, స్వామిభక్తిః=ప్రభుభక్తి, మామ్=నన్ను, ముఖరయతి=(ఇట్లు) వాగించుచున్నది.

ఆర్యపుత్రేతి :- ఆర్యపుత్రా!, ప్రసన్న=ప్రసన్నులయిన, బ్రాహ్మణ= విప్రుల, వేద+అనుఘోషేణ=వేదధ్వనులతోను, చ=మరియు, హోమేన= హోమముతోను, ఏతత్=ఈ, అనిమిత్తమ్=అపశకునము, పరిహార్యతామ్= పరిహరింపబడునుగాక!

సావజ్ఞమితి :— (సావజ్ఞమ్=అవహేళనగా, ఇష్టములేకున్నను తప్పని సరియై ఒప్పుకొనుచున్న రీతిలోననియు) నను గచ్ఛ = అట్లయిన పొమ్ము, పురోహితసుమిత్రాయ పురోహితుడయిన సుమిత్రుని కొరకు, నివేదయ=తెలియ జేయుము, పురోహితునికి విన్నవింపుమని కంచుకితో ననుట.

కంచుకీ : యదాజ్ఞాపయతి దేవః. (ఇతి నిష్క్రాంతః)

(ప్రవిశ్య)

ప్రతీహారీ : (సోద్వేగముపసృత్య) జయతు జయతు మహారాజః. మహారాజ, ఏషా ఖలు జామాతుః సింధురాజస్య మాతా దుశ్శలా చ ప్రతీహారభూమౌ తిష్ఠతి. (జఅదు జఅదు మహారాఓ. మహారాఅ, ఏసా క్ఖు జామాదుణో సింధురాఅస్స మాదా దుస్సలా అ పడిహారభూమిాఏ చిట్ఠది)

రాజా : (కించిద్విచింత్యాత్మగతమ్) కిం జయద్రథమాతా దుశ్శలా చేతి కచ్చిదభిమన్యువధామర్షితైః పాండుపుత్రైః న కించిదత్యాహితమ్ ఆచేష్టితం భవేత్. (ప్రకాశమ్) గచ్ఛ. ప్రవేశయ శీఘ్రమ్.

---

యదితి :— దేవః = మహారాజు, యత్ ఆజ్ఞాపయతి (తత్) = ఏది ఆజ్ఞాపించుచున్నాడో అట్లే — (ఇతి = అని, నిష్క్రాంతః=నిష్క్రమించును). (ప్రవిశ్య=ప్రతీహారి ప్రవేశించి)

సోద్వేగమితి :— (సోద్వేగమ్ = కంగారుపడుచు, ఉపసృత్య = సమీపించి) జయతు జయతు మహారాజః=మహారాజుకు జయమగునుగాక అనుట, మహారాజా, జామాతుః=అల్లుడుగారైన, సింధురాజస్య=జయద్రథునియొక్క, మాతా=తల్లియు, చ=మరియు, దుశ్శలా=దుస్సలయు, ఏషా ఖలు=ఇదిగో ఈమే అని వారు ఉన్న గుమ్మము వైపునకు హస్తనిర్దేశము చేయుట, ప్రతీహారభూమౌ= గుమ్మమునందు, తిష్ఠతి = ఉన్నది, తమ దర్శనమునకై వేచిఉన్న దనుట. (ప్రత్యేకాన్వయము కావున ఏకవచనము.)

కించిదితి :— (కించిద్విచింత్య=కొంచెమాలోచించి, ఆత్మగతమ్= తనలో) కిమ్ = ఏమీ, జయద్రథ మాతా దుశ్శలా చ = జయద్రథుని తల్లియు దుస్సలయునా!; అభిమన్యు = అభిమన్యునియొక్క, వధ = హననముతో,

ప్రతీహారీ : యన్మహారాజ ఆజ్ఞాపయతి (ఇతి నిష్క్రాంతః) (జం మహారాఓ ఆణవేది.)

(తతః ప్రవిశతి సంభ్రాన్తా జయద్రథమాతా దుశ్శలా చ)

(ఉభే సాస్రం దుర్యోధనపాదయోః పతతః)

మాతా : పరిత్రాయతాం పరిత్రాయతాం కుమారః (పరిత్తాఅదు పరిత్తాఅదు కుమాలో) (దుశ్శలా రోదితి)

---

అమర్షితైః=క్రుద్ధులయిన, పాండుపుత్రైః=పాండవులచే, కించిత్=ఏదయినను, అత్యాహితమ్=గొప్ప అనిష్టము, అత్యాహితం మహాభీతిః కర్మ జీవానపేక్షి చ— అమర, 3-3-77 ఆచేష్టితమ్ = చేయబడినది, న భవేత్ కచ్చిత్=కాలేదుగదా! వారు ఏదేని—జయద్రథవధాదికమయిన—అనిష్టమును చేసియుండలేదుగదా అనుట. (ప్రకాశమ్=ప్రకాశముగా) గచ్ఛ=పొమ్ము, శీఘ్రమ్=వెంటనే, ప్రవేశయ=ప్రవేశ పెట్టుము.

యదితి :— మహారాజు, యత్ ఆజ్ఞాపయతి తత్ = ఆజ్ఞాపించినట్లే (ఇతి=అని, నిష్క్రాంతః=నిష్క్రమించినవాడగును)

తత ఇతి :— (తతః=అటుపైని, సంభ్రాన్తా=ఉద్విగ్నయైన, జయద్రథ మాతా=జయద్రథుని తల్లియు, చ=మరియు, దుశ్శలా=దుస్సలయు, ప్రవిశతి= ప్రవేశించును.)

ఉభ ఇతి :— (ఉభే=ఇరువురును, సాస్రమ్=ఏడ్చుచు, దుర్యోధన పాదయోః=రారాజు పాదములందు, పతతః=పడుదురు)

పరిత్రాయతామితి:- కుమారః=కుమార దుర్యోధనుడు, పరిత్రాయతామ్ పరిత్రాయతామ్=రక్షించునుగాక రక్షించునుగాక!

(దుశ్శలా=దుస్సల, రోదితి=విలపించును)

రాజా : (ససంభ్రమ ముత్థాప్య) అంబ, సమాశ్వసిహి సమాశ్వసిహి. కిమత్యాహితమ్? అపి కుశలం సమరాంగణే ష్వప్రతిరథస్య జయద్రథస్య.

మాతా : జాత, కుతః కుశలమ్! (జాద, కుదో కుసలమ్)

రాజా : కథమివ?

మాతా : (సాశంకమ్) అద్య ఖలు పుత్రవధామర్షోద్దీపితేన గాండీవినా అనస్తమితే దివసనాథే తస్య వధః ప్రతిజ్ఞాతః. (అజ్జ క్ఖు పుత్తవహామరిసుద్దీవిదేణ గాండీవిణా అణత్థమిదే దివహణాహే తస్స వహో పడిణ్ణాదీ.)

---

ససంభ్రమమితి:- (ససంభ్రమమ్=కంగారుపడుచు, ఉత్థాప్య=లేవనెత్తి) అంబ!=తల్లీ!, సమాశ్వసిహి సమాశ్వసిహి=ఊరడిల్లుమూరడిల్లుము! కిమ్ అత్యాహితమ్?=వచ్చిన అరిష్టమేమి?. సమరాంగణేషు=యుద్ధరంగములందు, అప్రతిరథస్య = ప్రతిరథుడు లేని, ఎదిరింపగల సాటివీరుడు లేని అనుట (న విద్యతే ప్రతిరథః యస్య సః) జయద్రథస్య=జయద్రథునికి, అపి కుశలమ్=క్షేమమే కదా!

జాతేతి :- జాత=ఓడ్డా!, కుతః కుశలమ్=సేమమెక్కడ!

కథమితి :- కథమ్ ఇవ=ఎట్లూ?

సాశంకమితి :- (సాశంకమ్=అనిష్టాశంకతో) పుత్రవధ=అభిమన్యు వధవలన కలిగిన, అమర్షా = క్రోధముతో, ఉద్దీపితేన = మండిపడుచున్న, గాండీవినా=అర్జునునిచే, అద్య=ఈనాడు, దివసనాథే=సూర్యుడు, అనస్తమితే=అస్తమించనివాడు అగుచుండగా, సూర్యాస్తమయము కాకముందే అనుట, తస్య=జయద్రథునియొక్క, వధః=హననము, ప్రతిజ్ఞాతః ఖలు=ప్రతిజ్ఞగావింపబడినది గదా!, అట్టి ప్రతిజ్ఞ చేసెననుట.

రాజా : (స్మితమ్) ఇదం తద శ్రుకారణ మమ్బాయా దుఃశలాయాశ్చ. పుత్రశోకాదున్మత్తస్య కిరీటినః ప్రలాపైరేవ మవస్థా. అహో ముగ్ధత్వ మబలానామ్ అంబ! కృతం విషాదేన వత్సే! దుశ్శలే! అల మశ్రుపాతేన. కుతశ్చాయం తస్య ధనంజయస్య ప్రభావో దుర్యోధన బాహుపరిఘ రక్షితస్య మహారథజయద్రథస్య విపత్తి ముత్పాదయితుమ్.

---

సస్మితమితి :- (సస్మితమ్=చిఱునవ్వుతో) అంబాయాః=తల్లియొక్క, చ = మరియు, దుశ్శలాయాః = దుస్సలయొక్కయు, అశ్రు = దుఃఖమునకు, కారణమ్=హేతువు, ఇదమ్ తత్=ఇదియన్నమాట! పరిగణింపదగినది కాదనుట. పుత్రశోకాత్=పుత్రశోకమువలన, ఉన్మత్తస్య=పిచ్చివాడయిన, కిరీటినః=అర్జునుని యొక్క, ప్రలాపైః=వాగుడులచే, ఏవమ్=ఇట్టి, అవస్థా=దుఃస్థితి వచ్చినదనుట. అహో=ఓహో!, అబలానామ్=మగువలయొక్క, ముగ్ధత్వమ్=బేలతనము! అబలలు ఎంత బేల లనుట. అంబ=తల్లీ!, విషాదేన=దుఃఖముతో, కృతమ్=చాలును. దుఃఖ మిక వీడు మనుట. కృతమ్ అనునది అలమర్థకము—కృతం యుగేఽలమర్థే స్యాద్విహితే హింసితే త్రిషు (ఇతి మేదినీ); శక్తౌ నివారణే తృప్తౌ పర్యాప్తం స్యాత్ యథేప్సితే—(ఇతి రుద్రః) అని నిఘంటువు. వత్సే దుస్సలే= ఓ చిన్నారి దుస్సలా!, అశ్రుపాతేన అలమ్=కన్నీటితో చాలు, ఇక ఏడ్వుమాను మనుట. దుర్యోధన=సుయోధనునియొక్క, బాహు=భుజములనునట్టి, పరిఘ= అర్గళములతో (పరిఘో యోగభేదేఽస్త్రవిశేషేఽర్గళఘాతయోః ఇతి మేదినీ) లోహముతో చేయబడిన అడ్డగడియవంటి బాహువులతో ననుట, రక్షితస్య = రక్షింపబడినవాడైన, మహారథ = మహారథుడయిన, పరిపూర్ణవీరుడనుట, జయద్రథస్య = సింధురాజునకు, విపత్తిమ్ = ఆపదను, ఉత్పాదయితుమ్ = కలిగించుటకు, తస్య = ఆ (ఉన్మత్తునినుట), ధనంజయస్య = అర్జునునికి, అయమ్=ఈ, ప్రభావః=సామర్థ్యము, కుతః=ఎక్కడిది! లేదనుట.

మాతా : జాత!, తే హి పుత్రబంధువధామర్షోద్దీపితకోపానలా అనపేక్షితశరీరా వీరాః పరిక్రామన్తి. (జాద, దే హి పుత్తబంధు వహామరిసుద్దీవిదకోవాణలా అణపేక్ఖిదసరీరా వీరా పరిక్కామన్తి)

రాజా : (సోపహాసమ్) ఏవమేతత్. సర్వజనప్రసిద్ధైవామర్షితా పాండవానామ్. పశ్య—

హస్తాకృష్ట విలోల కేశవసనా దుశ్శాసనేనాజ్ఞయా
పాంచాలీ మమ రాజచక్రపురతో గౌర్గౌరితి వ్యాహృతా।

---

మహారథుడు— ఏకో దశసహస్రాణి యోధయే ద్యస్తు ధన్వినామ్।
శస్త్ర శాస్త్ర ప్రవీణశ్చ విజ్ఞేయ స్స మహారథః॥

జాతేతి :— జాత=బిడ్డా!, పుత్ర=కుమారునియొక్క, బంధు=చుట్టముల యొక్క, వధ=హననముచేనైన, అమర్ష=క్రోధముచే, ఉద్దీపిత=ప్రజ్వలింపజేయ బడిన, కోపానలాః=కోపాగ్నికలవారై, తే=ఆ, వీరాః=పాండవవీరులు, అనపేక్షిత శరీరాః=స్వశరీరములను లెక్కచేయనివారై, తమ శరీరమునకు ఏమగునో అను చింతను విడచిన తెంపరులై అనుట. పరిక్రామన్తి హి=సంచరించుచున్నారు గదా! ఇంతటి సాహసులకు అలవికానిది ఉండునా అనుట, నీ రక్షణము సరిపోవునా అనుటయు.

సోపహాసమితి :— (సోపహాసమ్ = ఎక్కిరింపుగా) ఏతత్ = ఇది, ఏవమ్=ఇట్లే, ఆ తిరుగుడు తిరుగుడే అనుట. పాండవానామ్=పాండుపుత్రుల యొక్క, అమర్షితా=క్రోధగుణము, సర్వజన ప్రసిద్ధా ఏవ=లోకులందరునెరిగినదే! పశ్య=చూడుము—చెప్పెద వినుమనుట.

హస్తేతి :— మమ ఆజ్ఞయా దుశ్శాసనేన హస్తాకృష్టవిలోల కేశవసనా పాంచాలీ రాజచక్రపురతః గౌః గౌః ఇతి వ్యాహృతా, తస్మిన్ ఏవ సః

తస్మిన్నేవ స కిం ను గాండివధరో నాసీత్పృథా నందనో
యూనః క్షత్రియవంశజస్య కృతినః క్రోధాస్పదం
కిం న తత్। 25

గాండివధరః పృథానందనః న ఆసీత్ కిమ్ ను!; క్షత్రియ వంశజస్య కృతినః యూనః తత్ క్రోధాస్పదమ్ కిమ్ న!

**అర్థము :—** మమ=నాయొక్క, ఆజ్ఞయా=ఆనతో, దుశ్శాసనేన=దుశ్శాసనునిచే; హస్త=చేతితో, ఆకృష్ట=లాగివేయబడుటచే, విలోల=జారిపోవుచున్న, కేశ=క్రొమ్ముడియు, వసనా=వస్త్రమును కలదైన, పాంచాలీ=ద్రౌపది, రాజచక్రపురతః=రాజసమూహమునెదుట, గౌః గౌః ఇతి=గోవును నేను గోవును అని, గోవువలె రక్షణీయను అనుట, వ్యాహృతా=దీనముగా పలికినది; తస్మిన్ ఏవ (సమయే)=అదే సమయమందు, సః=ఆ, గాండివధరః=గాండీవము ధరించువాడైన, పృథానందనః=అర్జునుడు, న ఆసీత్ కింను=లేడా?; క్షత్రియవంశజస్య=రాజవంశములో పుట్టినవాడును, కృతినః=నేర్పరియు, శస్త్రాస్త్రవిద్యానిపుణుడనుట, యూనః=యువయు అయిన వానికి, కోడెప్రాయపు రాచబిడ్డకనుట, తత్=అది, నిండుకొలువున భార్యనవమానించుట, క్రోధాస్పదమ్=క్రోధస్థానము, కోపకారణమనుట, కిం న=కాదా! శార్దూలవిక్రీడితము.

**సమాసములు :—** హస్తేన ఆకృష్టం—హస్తాకృష్టేన కారణేన విలోలమ్ హస్తాకృష్ట విలోలమ్; కేశాశ్చ వసనం చ తేషాం సమాహారః—కేశవసనమ్. హస్తాకృష్ట విలోలం కేశవసనం యస్యాః సా. రాజ్ఞః చక్రమ్—రాజచక్రస్య పురతః. ధరతి ఇతి ధరః—గాండివస్య ధరః—ద్వితీయార్థే షష్ఠీ. పృథాయాః నందనః. క్షత్రియాణాం వంశః—క్షత్రియవంశే జాయత ఇతి—తస్య. క్రోధస్య ఆస్పదమ్.

**సంధులు :—** హస్త+ఆకృష్ట, దుశ్శాసనేన+ఆజ్ఞయా, న+ఆసీత్, క్రోధ+ఆస్పదమ్—సవర్ణదీర్ఘసంధులు. పురతః+గౌః, ధరః+న, నందనః+యూనః—ఉత్వాదేశవిసర్గ. గౌః+గౌః+ఇతి—రేఫాదేశ. తస్మిన్+ఏవ—అనునాశిక ద్విత్వసంధి, సః+కిమ్—సఏషవిసర్గలోపసంధి—తదేతద్విసర్గలోప.

మాతా : అసమాప్త ప్రతిజ్ఞాభర స్యాత్మవధోఽస్య ప్రతిజ్ఞాతః.
(అసమత్త పడిణ్ణా భారస్స అప్పవహో సే పడిణ్ణాదో.)

రాజా : యద్యేవమల మానందస్థానేఽపి తే విషాదేన. నను వక్తవ్యమ్ ఉత్పన్నః సానుజో యుధిష్ఠిర ఇతి. అన్యచ్చ మాతః, కా శక్తిరస్తి ధనంజయస్యాన్యస్య వా కురుశత పరివార వర్ధిత మహిమ్నః కృపకర్ణ ద్రోణాశ్వత్థామాది మహారథ ద్విగుణీకృత నిరావరణ విక్రమస్య నామాపి గ్రహీతుం తే తనయస్య. అయి సుతపరాక్రమానభిజ్ఞే!

---

అసమాప్తేతి :— అసమాప్త = నెరవేర్పబడని, ప్రతిజ్ఞాభరస్య = ప్రతిజ్ఞాభారము కలవాడైన, అస్య=ఈ అర్జునునికి, ఆత్మవధః=ఆత్మహతి, ప్రతిజ్ఞాతః=ప్రతినగా స్వీకరింపబడినది. చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చుకొననిచో ఆత్మత్యాగము చేసెదనని ప్రతినపూనె ననుట.

యదీతి :— యది ఏవమ్ = అట్లే అయినచో, ఆనందస్థానే అపి= సంతోషించవలసినచోటకూడ, తే=నీయొక్క, విషాదేన=దుఃఖముతో, అలమ్= చాలును, సంతోషించవలసినదిపోయి ఏడ్తువేల అనుట. సానుజః=తమ్ములతో సహా, యుధిష్ఠిరః=ధర్మజుడు, ఉత్పన్నః=నాశనమైపోయినాడు, ఇతి నను= అని కదా, వక్తవ్యమ్=చెప్పవలసినది! మాతః=అంబా!, అన్యత్ చ=మరొక మాట; కురుశత=నూర్గురు కౌరవులే, పరివార=బంధువులుగా, వర్ధిత=వృద్ధి పొందింపబడిన, మహిమ్నః = మహత్తుకలవాడును, బంధువులైన నూర్గురు కౌరవులచే అనుట, కృపుడు, కర్ణుడు, ద్రోణుడు, అశ్వత్థామ, ఆది=మొదలయిన, మహారథ=మహారథులచేత, ద్విగుణీకృత=రెట్టింపుచేయబడినదై, నిరావరణ= అవధిలేనిదైన, విక్రమస్య=పరాక్రమము కలవాడును అయిన, తే=నీయొక్క, తనయస్య=సుతునియొక్క, నామ అపి=పేరునయినను, గ్రహీతుమ్=పట్టు కొనుటకు, ధనంజయస్య వా=కిరీటికిగాని, అన్యస్య వా=వేరొకనికిగాని, కా శక్తిః అస్తి = ఏమి శక్తి ఉన్నది!. అయి సుత పరాక్రమ+అనభిజ్ఞే = కుమారుని ప్రతాపము నెరుగనిదానా!

ధర్మాత్మజం ప్రతి యమౌ చ కథైవ నాస్తి
మధ్యే వృకోదర కిరీటభృతో ర్బలేన।
ఏకోఽపి విస్ఫురితమండల చాప చక్రం
కం సిన్ధురాజ మభిషేణయితుం సమర్థః 26

---

ధర్మాత్మజమితి :— ధర్మాత్మజమ్ చ యమౌ ప్రతి కథా ఏవ నాస్తి; వృకోదర కిరీటభృతోః మధ్యే, కః ఏకః అపి, విస్ఫురితమండలచాపచక్రమ్ సింధురాజమ్ బలేన అభిషేణయితుమ్ సమర్థః!

అర్థము :- ధర్మాత్మజమ్ ప్రతి = ధర్మరాజును గూర్చియు, చ = మరియు, యమౌ ప్రతి=కవలనుగూర్చియు, కథా ఏవ=చెప్పదగినదే, నాస్తి = లేదు, వీరు ముగ్గురు లెక్కలోనివారు కాదనుట; వృకోదర కిరీటభృతోః మధ్యే=భీమార్జునుల నడుమ, వీరిద్దరిలో ననుట, కః ఏకః అపి=ఏ ఒక్కడైనను, విస్ఫురిత = కదలుచున్నదియు, మండల = వర్తులాకారముగానుండునదియునైన (ఎక్కుపెట్టుటచే) చాప చక్రమ్ = ధనుర్మండలము కలవాడైన, సింధురాజమ్= జయద్రథుని, బలేన=బలవంతముగా, అభిషేణయితుమ్=సేనతో ఆక్రమించుటకు, సమర్థః=చాలినవాడా! ఇద్దరిలో ఏ ఒక్కడును సమర్థుడు కాడనుట. (యత్సేన యాభిగమన మరౌ తదభిషేణనమ్—అమర, 3-౨-95)

సమాసములు :- వృకస్య ఉదరమివ ఉదరం యస్య సః—వృకోదరః కిరీటం బిభర్తి ఇతి-కిరీటభృత్. వృకోదరశ్చ కిరీటభృచ్చ-వృకోదర కిరీటభృతౌ— తయోః. విస్ఫురితం మండలం యస్య తత్—విస్ఫురితమండలమ్ చాప చక్రమ్ యస్య సః—విస్ఫురితమండల చాప చక్రః—తమ్. సింధూనామ్ రాజా-సింధురాజః— తమ్.

సంధులు :— కథా+ఏవ=వృద్ధి. న+అస్తి—సవర్ణదీర్ఘ. కిరీటభృతోః+ బలేన—రేఫాదేశవిసర్గసంధి. ఏకః+అపి—ఉత్వాదేశవిసర్గ. ఏకో+అపి—పూర్వ రూప. అస్తి—స్తః—సన్తి—అసభువి—పరస్మై, లట్, ప్రథమ. వసంతతిలక.

భానుమతీ : ఆర్యపుత్ర, యద్యప్యేవం తథాపి గురుకృతప్రతిజ్ఞాభారో ధనంజయః స్థానం ఖలు శంకాయాః. (అజ్జఉత్త, జఇవి ఏవ్వం తహావి గురు కిదపడిణ్ణాభారో ధనంజఓ ట్ఠాణం క్ఖు సంకాఏ.)

మాతా : జాతే, సాధు కాలోచితం త్వయా మంత్రితమ్. (జాదే, సాహు కాలోఇదం తుఏ మంతిదమ్)

రాజా : ఆః, మమాపి నామ దుర్యోధనస్య శంకాస్థానం పాండవాః. పశ్య—

కోదండజ్యాకిణాంకైరగణితరిపుభిః కంకటోన్ముక్తదేహైః
శ్లిష్టానోన్యాతపత్రైః సితకమల వనభ్రాంతి ముత్పాదయద్భిః।

---

ఆర్యపుత్రేతి :— ఆర్యపుత్రా!, యది అపి ఏవమ్ = ఇది ఇంతటిదే, నీవన్నది నిజమే అనుట, తథా అపి=అయినను, గురు=గొప్పదియైన, కృత= చేయబడిన, ప్రతిజ్ఞా=ప్రతినయొక్క, భారః=బరువుకలవాడైన, ధనంజయః= అర్జునుడు, ప్రతిజ్ఞ చేసినవాడగుటచే అనుట, శంకాయాః=శంకకు, సింధురాజును చంపివేయునేమో అని భయపడుటకు, స్థానమ్ ఖలు = కారణమగునుగదా!, కాదందురా అనుట.

జాతేఇతి :— జాతే=బిడ్డా!, కాలోచితమ్=సమయమునకు తగినదియు, సాధు=సముచితమయినదియు, త్వయా=నీచేత, మంత్రితమ్=ఆలోచించి పలుక బడినది. లెస్స పలికితివి బిడ్డా అనుట.

ఆః ఇతి :— ఆః=ధిక్; దుర్యోధనస్య=దుర్యోధనుడనైన, మమ+ అపి నామ = నాకుకూడ, పాండవాః=పాండుపుత్రులు, శంకాస్థానమ్=శంకా హేతువా!, వారిని చూచి నేను భయపడవలెనా అనుట. పశ్య=చూడుము—

కోదండజ్యేతి :- కోదండజ్యాకిణాంకైః అగణిత రిపుభిః కంకటోన్ముక్త

రేణుగ్రస్తార్కభాసాం ప్రచలదసిలతాదంతురాణాం
బలానా
మాక్రాంతా భ్రాతృభిర్మే దిశి దిశి సమరే కోటయ
స్సంపతన్తి॥ 27

---

దేహైః, శ్లిష్టాన్యోన్యాతపత్రైః, సితకమలవనభ్రాంతిమ్ ఉత్పాదయద్భిః, మే భ్రాతృభిః, రేణుగ్రస్తార్కభాసామ్, ప్రచలదసిలతాదంతురాణామ్ బలానామ్ కోటయః ఆక్రాంతాః దిశి దిశి సంపతన్తి.

అర్థము :— కోదండ=ధనుస్సుయొక్క, జ్యా=నారిచేనైన, కిణ+అంకైః=కాయలు కలవారును, చేతులు కాయలుకాసిన వారనుట, అగణిత=సరకు గొనని, రిపుభిః=శత్రువులు కలవారును, శత్రువులను లక్ష్యపెట్టని వారనుట, కంకట = కవచములతో, ఉన్ముక్త = విరహితములయిన, దేహైః = శరీరములు కలవారును, కవచములు ధరింపనివారనుట—నిర్లక్ష్యపైఖరికి ఇది ప్రతీక, శ్లిష్ట=ఒరిసికొనుచున్న, అన్యోన్య+ఆతపత్రైః=ఒండొరుల గొడుగులు కలవారై, సిత కమలవన = తెల్ల కలువల సరోవరముయొక్క, భ్రాంతిమ్=భ్రమను, ఉత్పాద యద్భిః = కలిగించుచున్నవారును అయిన, మే = నాయొక్క, భ్రాతృభిః= సోదరులతో; రేణుగ్రస్త=దుమ్ముతో కప్పివేయబడిన, అర్కభాసామ్=సూర్య కిరణములు కలవియును, ప్రచలత్=కదలుచున్న, అసిలతా=లతలవంటి ఖడ్గము లతో, దంతురాణామ్ = క్రిక్కిరిసినవియునైన, బలానామ్ = (నా) సైన్యముల యొక్క, కోటయః=కోట్లు, ఆక్రాంతాః=ఆక్రమించినవై—వ్యాపించినవై అనుట, దిశి దిశి=అన్నివైపులను, సంపతన్తి=(శత్రువులపై విరుచుకు) పడుచున్నవి.

విశేషములు :— మమ = నాయొక్క, భ్రాతృభిః = సోదరులచే, బలానామ్=శత్రుసైన్యములయొక్క, కోటయః=కోట్లు, ఆక్రాంతాః=ఆక్రమింప బడినవై, దిశి దిశి=నలువైపులకును, సంపతన్తి=పారిపోవుచున్నవి—ఇట్లు కొందరు అన్వయించుట కలదు. స్రగ్ధరావృత్తము.

సమాసములు :— కోదండస్య జ్యా — కోదండజ్యాయాః కిణాః —

అపిచ భానుమతి! విజ్ఞాతపాండవప్రభావే! కిం త్వము
ప్యేవమ్ ఆశంకసే. పశ్య—

దుశ్శాసనస్య హృదయక్షతజాంబుపానే
దుర్యోధనస్య చ యథా గదయోరుభంగే।
తేజస్వినాం సమరమూర్ధని పాండవానాం
జ్ఞేయా జయద్రథవధేఽపి తథా ప్రతిజ్ఞా॥ 28

---

కోదండజ్యాకిణానామ్ అంకాః యేషాం తైః. న గణితాః—అగణితాః రిపవః యైః తే—అగణిత రిపవః—తైః. కంకజేన కంకటా ద్వా ఉన్ముక్తాః దేహాః యేషాం తైః. శ్లిష్టాని చ తాని అన్యోన్యాని—శ్లిష్టాన్యోన్యాని ఆతపత్రాణి యేషాం తైః. సితాని చ తాని కమలాని-సితకమలానాం వనమ్—సితకమల వనస్య వనమితి వా భ్రాంతిః—తామ్. అర్కస్య భాః—అర్కభాః. రేణుభిః గ్రస్తాః—రేణుగ్రస్తాః అర్కభాః యైః తేషామ్. అసిః లతేవ—అసిలతా. ప్రచలత్యః అసిలతాః—ప్రచలదసిలతాః, ప్రచలదసిలతాభిః దంతురాణి—తేషామ్.

**సంధులు :-** కిణ+అంక, శ్లిష్ట+అన్యోన్య+ఆతపత్త్రి, గ్రస్త+ అర్క—సవర్ణదీర్ఘసంధులు. అంకైః+అగణిత, భ్రాతృభిః+మే—రేఫాదేశవిసర్గ సంధి. ఉత్+ముక్త—అనునాసికాదేశసంధి. కంకట+ఉన్ముక్త—గుణసంధి.

**క్రియ :—** పత్లగతౌ, పతతి—పతతః—పతన్తి—లట్, పర, ప్రథ

**అపిచేతి :—** అపిచ=మరియు, భానుమతి=ఓ దేవీ, విజ్ఞాత=తెలిసికొనబడిన, పాండవ ప్రభావే=పాండవుల శక్తిసామర్థ్యములు కలదానా! త్వమ్అపి= నీవుకూడ, ఏవమ్=ఇట్లు, ఆశంకసే=శంకించుచున్నావా! పశ్య=చూడుము—

**దుశ్శాసనస్యేతి :—** దుశ్శాసనస్య హృదయక్షతజాంబుపానే, చ, గదయా దుర్యోధనస్య ఊరుభంగే, తేజస్వినాం పాండవానాం యథా ప్రతిజ్ఞా తథా సమరమూర్ధని జయద్రథ వధే అపి జ్ఞేయా.

కః కోఽత్ర భోః! జైత్రం మే రథముపకల్పయ తావత్. యావదహమపి తస్య ప్రగల్భపాండవస్య జయద్రథ పరిరక్షణేనైవ మిథ్యాప్రతిజ్ఞా వైలక్ష్యసంపాదిత మశస్త్రపూతం మరణ ముపదిశామి.

---

అర్థము :— దుశ్శాసనస్య=దుశ్శాసనునియొక్క, హృదయ=గుండెల నుండి, క్షతజ+అంబు పానే=రక్తము త్రాగుటయందును, చ=మరియు, గదయా= గదతో, దుర్యోధనస్య = సుయోధనునియొక్క (నాయొక్క), ఊరు భంగే= తొడలు విఱుచుటయందును, తేజస్వినామ్ = బలశాలురైన, పాండవానామ్ = పాండవులకు, యథా=ఎట్లు, ప్రతిజ్ఞా=ప్రతిన కలదో, తథా=అట్లే, సమరమూర్ధని= రణరంగమున; జయద్రథవధే అపి=జయద్రథుని చంపుటయందును, జ్ఞేయా= కలదని తెలియవగినది. అట్టిదే ఈ ప్రతిజ్ఞయు ననుట. రెండును వ్యర్థములని తాత్పర్యము.

సమాసములు :— హృదయస్య క్షతజమ్ (క్షతాత్ జాతమ్) హృదయ క్షతజమేవ అంబు—తస్య పానమ్—తస్మిన్. ఊర్వోః భంగః—తస్మిన్. తేజః అస్య అస్తి ఇతి—తేజస్విన్—అస్మాయామేధాస్రజోవినిః—అసంతమునకు మతు బర్థమున విన్‌ప్రత్యయము. సమరస్య మూర్ధా—తస్మిన్. జయద్రథస్య వధః— తస్మిన్.

సంధులు :— క్షతజ+అంబు—సవర్ణదీర్ఘ. గదయా+ఊరు—గుణసంధి. వధే+అపి—పూర్వరూప. వసంతతిలకావృత్తము.

కఃకోఽత్రేతి :— కః కోఽత్రభోః=ఎవరక్కడ! జైత్రమ్=జైత్రము అను పేరుగల్గిన, మే=నాయొక్క, రథమ్=అరదమును, తావత్ ఉపకల్పయ=సన్నద్ధము చేయుము. అహమ్ అపి=నేనుకూడ, తస్య=ఆ, ప్రగల్భ పాండవస్య=వాచాలుడగు అర్జుననికి, జయద్రథ రక్షణేన+ఏవ = జయద్రథుని కాపాడుటతోనే, మిథ్యా= అసత్యము కావింపబడిన, ప్రతిజ్ఞా = ప్రతినవలన కల్గిన, వైలక్ష్య=సిగ్గుచే, సంపాదితమ్ = సమకూర్చుకొనబడినదియు, అశస్త్రపూతమ్ = శస్త్రాఘాతముచే పవిత్రముకానిదియు, (శస్త్రాఘాతము లేకపోవుటచే మరణము అపవిత్రమన్నట్టు—

(ప్రవిశ్య)

కంచుకీ : దేవ

ఉద్ఘాత క్వణిత విలోల హేమఘంటః
ప్రాలంబ ద్విగుణిత చామర ప్రహాసః।
సజ్జోఽయం నియమిత వల్గితాకులాశ్వః
శత్రూణాం క్షపితమనోరథో రథస్తే॥ 29

---

వీరమరణము కాకపోవుట హేతువు) అయిన, మరణమ్=చావును, ఉపదిశామి=ఉపదేశింతును. జయద్రథ రక్షణముతోనే అర్జున మరణ మనుట.

(ప్రవిశ్య=ప్రవేశించి)

దేవ=మహారాజా!

**ఉద్ఘాతక్వణితేతి** :— ఉద్ఘాతక్వణిత విలోల హేమఘంటః, ప్రాలంబ ద్విగుణితచామరప్రహాసః, నియమితవల్గితాకులాశ్వః, శత్రూణాం క్షపిత మనోరథః, అయం తే రథః సజ్జః.

**అర్థము** :— ఉద్ఘాత=కుదుపులచే, క్వణిత=మ్రోయునట్టియు, విలోల=కదలునట్టియు, హేమఘంటః=బంగారు గంటలు కలదియును, ప్రాలంబ=వ్రేలాడదీయబడిన పూలదండలతో, ద్విగుణిత=రెట్టింపుకావింపబడిన, చామర=చామరముల యొక్క, ప్రహాసః=తెల్లదనము కలదియును, నియమిత=అదుపుచేయబడిన, వల్గిత = గమనవిశేషముచే, ఆకుల = గుంజుకొనుచున్న, అశ్వాః = గుఱ్ఱములు కలదియును, శత్రూణామ్=వైరులకు, క్షపిత=నాశనముగావింపబడిన, మనోరథః=కోరికలు కలదియు, శత్రువుల జయకాంక్షలను నాశనముగావించునదనుట, అయిన, తే-నీయొక్క, అయమ్ రథః=ఇదిగో ఈ రథము, సజ్జః=సన్నద్ధము గావింపబడినది.

**సమాసములు** :— క్వణితాశ్చ తే విలోలాశ్చ — క్వణితవిలోలాః. ఉద్ఘాతైః క్వణితవిలోలాః—ఉద్ఘాత క్వణితవిలోలాః ఘంటాః యస్య సః.

రాజా : దేవి, ప్రవిశ త్వమభ్యంతరమేవ. (యావదహమపి తస్య ప్రగల్భపాండవస్య ఇత్యాది పఠన్ పరిక్రామతి.)

(ఇతి నిష్క్రాంతాస్సర్వే)

—: ఇతి ద్వితీయోఽంకః :—

---

చామరాణాం ప్రహాసః—చామరప్రహాసః. ప్రాలంబేన ద్విగుణితః—ప్రాలంబ ద్విగుణితః. ప్రాలంబద్విగుణితః చామరప్రహాసః యస్య సః. నియమితం చ తత్ వల్గితం చ—నియమితవల్గితమ్. నియమితవల్గితేన ఆకులాః అశ్వాః యస్య సః. క్షపితాః మనోరథాః యేన సః.

సంధులు :— సజ్జః+అయమ్—ఉత్వాదేశవిసర్గ. సజ్జో+అయమ్—పూర్వరూప. వల్గిత+ఆకుల+అశ్వః—సవర్ణదీర్ఘ. మనోరథః+రథః—ఉత్వాదేశ విసర్గ. రథః+తే—సాదేశవిసర్గసంధి.

ఛందస్సు :— ప్రహర్షిణీవృత్తము. త్ర్యాశాభిర్మనజరగాః ప్రహర్షిణీయమ్. మ—న—జ—ర—గ. 1—3—10 (పాదాంతము)

| మ | న | జ | ర | గ |
|---|---|---|---|---|
| U U U | I I I | I U I | U I U | U |
| శత్రూణాం | క్షపిత | మనోర | థోరథ | స్తే |

"మ్నౌ జ్రౌ గస్త్రిదశయతిః ప్రహర్షిణీయమ్" ఇతి వృత్తరత్నాకరే.

**దేవీతి** :— దేవి=భానుమతీ! **త్వమ్=నీవు, అభ్యంతరమ్ ఏవ=అంతః పురమును**, ప్రవిశ=ప్రవేశింపుము.

యావదితి :— (యావదహమపి తస్య ప్రగల్భపాండవస్య ఇత్యాది వచనమును, పఠన్=అనుచు, పరిక్రామతి=దుర్యోధనుడు నిష్క్రమించును.)

(అందరును నిష్క్రమింతురు)

—: ఇది ద్వితీయాంకము :—

# తృతీయాఙ్కః

(తతః ప్రవిశతి వికృతవేషా రాక్షసీ)

రాక్షసీ : (వికృతం విహస్య, సపరితోషమ్)

హతమానుష మాంసభారకే కుంభసహస్రవసాభిః సంచితే
అనిశం చ పిబామి శోణితం వర్షశతం సమరో భవతు॥ 1

---

(తతః=తరువాత, వికృతవేషా=భయంకరవేషముగల, రాక్షసి, ప్రవిశతి=ప్రవేశించును.)

(వికృతమ్ విహస్య=వికటముగా నవ్వి, సపరితోషమ్=సంతోషముతో)

**హతేతి** :— హతమానుషమాంసభారకే, కుంభసహస్రవసాభిః సంచితే అనిశమ్, శోణితమ్, పిబామి; సమరః వర్షశతమ్, భవతు.

**అర్థము** :— హత=చంపబడిన, మానుష=సైనికులయొక్క, మాంస భారకే=మాంసరాశులతో కూడినదియు, కుంభసహస్ర=వేయి కడవలకు చాలిన, వసాభిః=వవలతో (హృన్మేదస్తు వపా వసేత్యమరః), సంచితే=నిండినదియు నైన సమరమునందు, అనిశమ్=ఎల్లవేళల, శోణితమ్=రక్తమును, పిబామి=త్రాగుచున్నాను, సమరః=ఈ యుద్ధము, వర్షశతమ్=వేయి సంవత్సరములు, భవతు=జరుగుగాక!

**సమాసములు** :— హతాశ్చ తే మానుషాశ్చ—హతమానుషాణాం మాంసమ్—హతమానుషమాంసస్య భారకః యస్మిన్ సః—హతమానుషమాంస భారకః—తస్మిన్. కుంభానాం సహస్రం—కుంభసహస్ర పరిమాణాః వసాః—కుంభసహస్రవసాః—తాభిః. వర్షాణాం శతమ్—వర్షశతమ్.

(నృత్యన్తీ సపరితోషమ్) యది సింధురాజ వధ దివస ఇవ దివసే దివసే సమరకర్మ ప్రతిపద్యతేఽర్జునస్తతః పర్యాప్త భరిత కోష్ఠాగారం మాంసశోణితైర్మే గృహం భవిష్యతి. (పరిక్రమ్య దిశోఽవలోక్య) అథ క్వాను ఖలు రుధిరప్రియో భవిష్యతి. తద్యావదేతస్మిన్సమరే ప్రియభర్తారం రుధిర ప్రియ మన్వేషయామి. (పరిక్రమ్య) భవతు. శబ్దాయిష్యే తావత్. అరే రుధిరప్రియ ఇత ఏహి ఇత ఏహి.

(హదమానుశమాంశ భాలప కుంభశహస్సవశాహిం శంచివ అణిశం అ పివామి శోణిఅం వలిశశద శమలే హుపీఅదు॥ 1

జఇ శింధులాఅవహదిఅహే విఅ దిఅహే-దిఅహే శమల కమ్మ పడివజ్జఇ అజ్జుణ తదో పజ్జత్తభలిద కోట్ఠాగాలే మంశశోణి ఏహిం మే గేహే హువీఅది. అహ కహిం ణు క్ఖు లుహిలప్పిఏ హువీఅది. తా జావ ఇమశ్శిం శమలే పిఅ భత్తాలం లుహిలప్పిఅం అణ్ణేశామి హోదు. శద్దావఇశ్శం దావ. అలే లుహిలప్పిఆ. లుహిలప్పిఆ ఇదో ఏహి ఇదో ఏహి.)

---

**యదీతి** — (నృత్యన్తీ = గెంతుచు, సపరితోషమ్ = ఆనందముతో) సింధురాజవధదివసే ఇవ = జయద్రథుని చంపునాట వలె, దివసే దివసే = అనునిత్యమును, సమరకర్మ=యుద్ధమును, అర్జునః=కిరీటి, ప్రతిపద్యతే యది= పొందుచో, తతః=అప్పుడు, మే=నాయొక్క, గృహమ్=ఇల్లు, మాంసశోణితైః= మాంసరక్తములతో, పర్యాప్త=పూర్తిగా, భరిత=నిండిన, కోష్ఠాగారమ్= కోశాగారములుకలది, భవిష్యతి=అగును. (పరిక్రమ్య=అటునిటు తిరిగి, దిశః అవలోక్య=అన్నివైపులకు చూచి) అథ=ఇంతకును, రుధిరప్రియః=రుధిర ప్రియుడు, క్వ ను ఖలు భవిష్యతి=ఎక్కడున్నాడోగదా! తత్=అదువల్ల, ప్రియ

(తతః ప్రవిశతి తథావిధో రాక్షసః)

రాక్షసః : (శ్రమం నాటయన్)

ప్రత్యగ్ర హతానాం మాంసం యద్యుష్ణం రుధిరం చ
లభ్యతే।
తదైష మమ పరిశ్రమః క్షణమాత్రమేవ లఘు నశ్యేత్॥ 2

(పచ్చగ్గ హదాణం మంశవ జఇ ఉణ్హే లుహిరే అ లబ్భఇ।
తా ఏశో మహ పలిశ్శమే క్ఖణమేత్తం ఏవ్వ లహు ణశ్శఇ॥)

---

భర్తారమ్=నాకు ప్రియుడైన భర్త, రుధిరప్రియమ్=రుధిరప్రియుని, ఏతస్మిన్=ఈ, సమరే=యుద్ధభూమియందు, అన్వేషయామి=వెదకుదును. (పరిక్రమ్య=నాలుగడుగులు వేసి) భవతు=అగుగాక. శబ్దాయిష్యే తావత్=గట్టిగా పిలుతును. అరే రుధిరప్రియ=ఓరీ రుధిరప్రియుడా! ఇతఃఏహి=ఇటురమ్ము, ఇతఃఏహి=ఇటురమ్ము.

(తతః=అంతట, తథావిధః=అట్టిదైన, రాక్షసః=రాక్షసుడు, ప్రవిశతి=ప్రవేశించును.)

(శ్రమమ్=అలసటను, నాటయన్=అభినయించుచు)

ప్రత్యగ్రేతి :— ప్రత్యగ్రహతానామ్, మాంసమ్, చ, ఉష్ణమ్, రుధిరమ్, లభ్యతే యది, తదా, మమ, ఏషః, పరిశ్రమః, క్షణమాత్రమ్ ఏవ, లఘు, నశ్యేత్.

**అర్థము** :— ప్రత్యగ్రహతానామ్ = అప్పుడే చంపబడినవారియొక్క, మాంసమ్=పలలము, చ=మరియు, ఉష్ణమ్=వేడివేడిదైన, రుధిరమ్=రక్తము, లభ్యతే యది=దొరకునేని, తదా=అప్పుడు, మమ=నాయొక్క, ఏషః=ఈ, పరిశ్రమః=అలసట, క్షణమాత్రమేవ=త్రుటిమాత్రములోనే, లఘు=శీఘ్రముగా, నశ్యేత్=తీరిపోవును.

(రాక్షసీ పునర్వ్యాహరతి)

రాక్షసః : (ఆకర్ణ్య) అరే కైషా మాం శబ్దాయతే (విలోక్య) కథం ప్రియా వసాగంధా! (ఉపసృత్య) వసాగంధే, కస్మాన్మాం శబ్దాయసే? (అరే కే ఏశే మమం శద్దావేది. కహం పిఆ మే వసాగంధా. వసాగంధే కీశ మం శద్దావేశి.)

రుధిరాసవపాన మత్తికే రణహిండనస్ఖలద్గాత్రికే।
శబ్దాయసే కస్మాన్మాం ప్రియే పురుషసహస్రం హతం
శ్రూయతే॥ 3

---

సమాసములు :— ప్రత్యగ్రమ్హతాః—ప్రత్యగ్రహతాః—తేషామ్.

సంధులు :— ప్రతి+అగ్రమ్, యది+ఉష్ణమ్-యణాదేశసంధులు. తదా+ఏష—వృద్ధిసంధి. ఏషః+మమ—ఏతదేతద్విసర్గలోపసంధి.

క్రియ :- డు లభష్ ప్రాప్తౌ, ఆత్మనే, లట్, ప్రథమ
లభ్యతే—లభ్యేతే—లభ్యన్తే
నశ్ - నాశనే, పరస్మై, విధిలిఙ్, ప్రథమ
నశ్యేత్—నశ్యేతామ్—నశ్యేయుః

(రాక్షసీ=రాక్షసి, పునః వ్యాహరతి=మరల పిలుచును.)

**అరేఇతి** :— (ఆకర్ణ్య=విని) అరే=అహో! కా ఏషా=ఎవరీమె, మామ్=నన్ను, శబ్దాయతే=పిలుచుచున్నది? (విలోక్య=చూచి) కథమ్=ఎట్టూ! ప్రియా=నా ప్రియురాలైన, వసాగంధా=వసాగంధయా! (ఉపసృత్య=సమీపించి) వసాగంధే=ఓ వసాగంధా! మామ్=నన్ను, కస్మాత్=ఏల, శబ్దాయసే=పిలుచుచున్నావు?

**రుధిరేతి** :- రుధిరాసవపానమత్తికే, రణహిండనస్ఖలద్గాత్రికే, ప్రియే, మామ్, కస్మాత్, శబ్దాయసే? పురుషసహస్రమ్, హతమ్, శ్రూయతే.

అశ్వత్థామా కరధృతధనుః పాండుపాంచాలసేనా
తూలోత్క్షేప ప్రళయపవనః కిం నయాతః స్మృతిం తే॥ 23

యుధిష్ఠిర, యుధిష్ఠిర, అజాతశత్రో, అమిథ్యావాదిన్, ధర్మపుత్ర, సానుజస్య తే కిమనేనాపకృతమ్. అథవా కిమనేనాలీకప్రకృతి జిహ్మ చేతసా. అర్జున, సాత్యకే, బాహుశాలిన్, వృకోదర, మాధవ

---

పాండు పాంచాలసేనా తూలోత్క్షేప ప్రళయపవనః, కరధృతధనుః, అశ్వత్థామా, న, యాతః, కిమ్, ఖలు!

అర్థము :— తాతమ్ = నా తండ్రిని, శస్త్రగ్రహణ విముఖమ్ = కత్తి పట్టుటకు విముఖునిగా, నిశ్చయేన=నిశ్చయముగా, ఉపలభ్య=గుర్తించి, ఇక కత్తి పట్టడనుటను నిశ్చయముగానెరిగి యనుట; శంకామ్ = (బొగములను) భయమును, త్యక్త్వా=విడిచి, అస్య=ఈ ద్రోణునియొక్క, ఉత్తమాంగే=శిరస్సునందు, పాణిమ్=చేతిని, విదధతః=వేయుచున్న, తే=నీయొక్క, స్మృతిమ్=స్మృతి పథమును;—పాండు పాంచాలసేనా = పాండవుల పాంచాలురసైన్యములనునట్టి, తూల=దూదిని, ఉత్క్షేప=ఎగురగొట్టుటయందు, ప్రళయపవనః=ఝంఝూమారుతము వంటివాడును, కరధృతధనుః=చేతబట్టిన విల్లుకలవాడునైన,—అశ్వత్థామా=ఈ ద్రోణసుతుడు, న యాతః కిమ్ ఖలు=పొందలేదా యేమి? ఆ క్షణమునందు నన్ను మరచితివి కావలయు నిట్టి యకృత్యమును నిర్భీతిగా చేయగల్గితి వనుట. (మందాక్రాంత).

సమాసములు :— శస్త్రస్య గ్రహణమ్—శస్త్రగ్రహణే విముఖః-తమ్. ఉత్తమం చ తదంగం చ—తస్మిన్. కరేణ ధృతమ్—కరధృతం ధనుః యేన సః. పాండవాశ్చ పాంచాలాశ్చ-పాండుపాంచాలానామ్ సేనా-సేనా ఏవ తూలః-తూలస్య ఉత్క్షేపః-ఉత్క్షేపే ప్రళయపవనః. (ప్రళయే పవనః).

యుధిష్ఠిరేతి :— ఓ యుధిష్ఠిరా!, అజాతశత్రూ!, సత్యసంధా! ఓ ధర్మరాజా! అనేన=ఈ ద్రోణునిచే, సానుజస్య=సోదరసహితుడవైన, తే=నీకు,

యుక్తం నామ భవతాం సురాసురమనుజలోకైక ధనుర్ధరస్య ద్విజన్మనః పరిణతవయసః సర్వాచార్యస్య విశేషతో మమ పితురమునా ద్రుపదకుల కలంకేన మనుజపశునా స్పృశ్యమాన ముత్తమాంగ ముపేక్షితుమ్. అథవా సర్వ ఏవైతే పాతకినః. కిమేతైః—

కృతమనుమతం దృష్టం వా యైరిదం గురుపాతకం
మనుజపశుభి ర్నిర్మర్యాదై ర్భవద్భి రుదాయుధైః!
నరక రిపుణా సార్ధం తేషాం సభీమ కిరీటినా
మయమహ మసృఙ్మేదోమాంసైః కరోమి దిశాం బలిమ్॥ 24

---

కిమ్ అపకృతమ్=ఏమి అపకారము చేయబడినది! అథవా=కాదేని, అనేన=ఈ, అలీకప్రకృతి జిహ్వాచేతసా = మిథ్యాస్వభావము కలవానియొక్క కుటిల హృదయముతో, కిమ్=ఏమిపని? అర్జునా!, సాత్యకీ!, బాహుబలశాలి వృకోదరుడా!, శ్రీకృష్ణా!, సురాసురమనుజలోకైకధనుర్ధరస్య=దేవ రాక్షస మానవలోకములందు ఎదురులేని ధానుష్కుడును, ద్విజన్మనః=బ్రాహ్మణుడును, పరిణతవయసః=వయస్సు పైబడినవాడును, సర్వాచార్యస్య=అందరికిని గురువును, విశేషతః= విశేషించి, మమ=నాయొక్క, పితుః=తండ్రియొక్క, ఉత్తమాంగమ్=శిరస్సు, ద్రుపదకుల కలంకేన = ద్రుపదవంశమునకు మచ్చవంటివాడైన, అమునా = ఈ, మనుజపశునా=బుద్ధిహీనునిచేత, స్పృశ్యమానమ్=తాకబడుచుండగా, ఉపేక్షితుమ్= ఉపేక్షించియూరకుండుట, భవతామ్ = మీకు, యుక్తమ్ నామ = పాడియేనా!. అథవా=కాదేని, ఏతే సర్వే=వీరందరును, పాతకినః ఏవ=పాపాత్ములే. ఏతైః= ఈ పాపులతో, కిమ్=ఏమి ప్రయోజనము—

కృతమితి :— మనుజ పశుభిః, నిర్మర్యాదైః, ఉదాయుధైః, యైః, భవద్భిః, ఇదమ్, గురుపాతకమ్, కృతమ్, వా, అనుమతమ్(వా), దృష్టమ్(వా), తేషామ్, నరక రిపుణా, సార్ధమ్, సభీమ కిరీటినామ్, అసృఙ్ మేదోమాంసైః, అయమ్, అహమ్, దిశామ్, బలిమ్, కరోమి.

అర్థము :- మనుజ పశుభిః = పశువులవంటి మానవులును (బుద్ధిహీను లనుట), నిర్మర్యాదైః=మర్యాదలనెరుగనివారును, ఉదాయుధైః=సంధించిన ధనురాద్యాయుధములుకలవారునైన, యైః=ఏ, భవద్భిః=మీచేత, ఇదమ్=ఈ, గురుపాతకమ్=మహాపాపము లేక ఆచార్య సంహారము, కృతమ్ వా=చేయబడినదో, అనుమతమ్ వా=అనుమతింపబడినదో, దృష్టమ్ వా=చూడబడినదో—చేసినవారు, అంగీకరించినవారు, చూసినవారుననుట, తేషామ్=ఆ మీ అందరియొక్కయు, నరక రిపుణా సార్థమ్=నరకాంతకుడగు శ్రీకృష్ణునితో కలిపి, సభీమ కిరీటినామ్= భీమార్జునులతోసహ మీ అందరియొక్కయుననుట—అసృక్ మేదోమాంసైః = రక్తము, క్రొవ్వు, మాంసములతో, అయమ్=ఈ, అహమ్=నేను, దిశామ్=దశ దిశలకును, బలిమ్=బలిని, కరోమి=చేయుదును. మీ అందరిని యుద్ధభూమికి బలియిత్తు ననుట.

సమాసములు :- గురు చ తత్ పాతకం చ. (గురౌ పాతకమ్). మనుజాః పశవః ఇవ—తైః. నరకస్య రిపుః—తేన. భీమశ్చ కిరీటీ చ—భీమ కిరీటిభ్యామ్ సహితాః-స భీమ కిరీటినః తేషామ్. అసృక్చ మేదశ్చ మాంసం చ- అసృజ్మేదో మాంసాని—తైః.

సంధులు :- యైః+ఇదమ్, పశుభిః+నిర్మర్యాదైః+భవద్భిః+ఉదాయుధైః—రేఫాదేశవిసర్గసంధులు. అసృక్+మేదస్—అనునాశికాదేశ. మేదస్+ మాంసైః—ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- డు కృఞ్ కరణే, పరస్మై, లట్, ఉత్తమ
కరోమి—కుర్వః—కుర్మః.

ఛందస్సు :- హరిణీవృత్తము. "నసమరసలా గః షడ్వేదైః హయైః హరిణీ మతా". న—స—మ—ర—స—లగ. 1—6—4—7.

| న | స | మ | ర | స | లగ |
|---|---|---|---|---|---|
| I I I | I I U | U U U | U I U | I I U | I U |
| కృతమ | నుమతం | దృష్టంవా | యైరిదం | గురుపా | తకమ్ |

కృపః : వత్స, కిం న సంభావ్యతే భారద్వాజతుల్యే బాహు శాలిని దివ్యాస్త్రగ్రామ కోవిదే భవతి.

అశ్వత్థామా : భో భోః, పాండవ మత్స్య సోమక మాగధాద్యాః క్షత్రియాపసదాః!

పితుర్మూర్ధ్ని స్పృష్టే జ్వలదనలభాస్వత్పరశునా
కృతం యద్రామేణ శ్రుతిముపగతం తన్న భవతామ్।
కిమద్యాశ్వత్థామా తదరిరుధిరాసార విఘసం
న కర్మ క్రోధాంధః ప్రభవతి విధాతుం రణముఖే। 25

---

**వత్సేతి :—** వత్స = బిడ్డా! భారద్వాజతుల్యే = ద్రోణాచార్యునితో సమానుడవు, బాహుశాలిని=భుజబలసంపన్నుడవును, దివ్యాస్త్ర గ్రామ కోవిదే= దివ్యాస్త్ర సమూహమునెరిగినవాడవునైన, భవతి=నీ విషయమునందు, కిమ్ న సంభావ్యతే=అసంభవమేమున్నది! ఏదయిన సంభవమే—అన్నింతపని చేయగల వనుట.

**భోభో ఇతి :-** భో భోః=ఓరోరీ! పాండవ, మత్స్య, సోమక, మాగధ ప్రముఖులారా! క్షత్రియాధములారా!

**పితురితి :—** పితుః, మూర్ధ్ని, స్పృష్టే, జ్వలదనలభాస్వత్పరశునా, రామేణ, యత్, కృతమ్, తత్, భవతామ్, శ్రుతిమ్, న, ఉపగతమ్? క్రోధాంధః, అశ్వత్థామా, అద్య, రణముఖే, అరిరుధిరాసారవిఘసమ్, తత్, కర్మ, విధాతుమ్, న, ప్రభవతి, కిమ్?

**అర్థము :–** పితుః=తండ్రియైన జమదగ్ని యొక్క, మూర్ధ్ని=శిరస్సు నందు, స్పృష్టే=తాకబడగా, శిరస్సును తాకగానను, జ్వలత్=మండుచున్న, అనల=అగ్నివలె, భాస్వత్=ప్రకాశించుచున్న, పరశునా=గొడ్డలికలవాడైన, రామేణ=పరశురామునిచేత, యత్=ఏది, కృతమ్=చేయబడినదో, తత్=అది,

సూత, గచ్ఛ త్వం సర్వోపకరణైః సాంగ్రామికైః
సర్వాయుధై రుపేతం మహాహవలక్షణం నామాస్మత్
స్యందన ముపనయ.

సూతః : యదాజ్ఞాపయతి కుమారః.

---

భవతామ్=మీయొక్క, శ్రుతిమ్=చెవిని, న+ఉపగతమ్=చేరలేదా?—మీరు వినియుండ లేదా అనుట. క్రోధాంధః=తీవ్ర కోపావిష్టుడైన, అశ్వత్థామా=ఈ అశ్వత్థామ, అద్య=నేడు, రణముఖే=రణాగ్రమునందు, అరి=శత్రువులయొక్క, రుధిర+ఆసార=రక్తధారలే, విఘసమ్=పితృభోజనముగా కలిగిన, తత్ కర్మ=ఆ పనిని—అలనాడు పరశురాముడు చేసిన క్షత్రియసంహారరూపమైన పనిననుట; విధాతుమ్=చేయుటకు, న ప్రభవతి కిమ్=చాలడా ఏమి? నేనును అంతటి సమర్థుడనే అనుట. (శిఖరిణీవృత్తము).

సమాసములు :- జ్వలంశ్చాసౌ అనలశ్చ-జ్వలదనలః ఇవ భాస్వాన్—జ్వలదనలభాస్వాన్ పరశుః యస్య సః—తేన. అరీణాం రుధిరమ్—అరిరుధిరస్య ఆసారః—అరిరుధిరాసారః ఏవ విఘసః యస్మిన్ కర్మణి తత్. క్రోధేన అంధః. రణస్య ముఖమ్—తస్మిన్.

సంధులు - పితుః+మూర్ధ్ని-రేఫాదేశవిసర్గ. తత్+న-అనునాశికాదేశ. అద్య+అశ్వత్థామా, రుధిర+ఆసార, క్రోధ+అంధ—సవర్ణదీర్ఘసంధులు.

సూతేతి :- సూత = సూతుడా! త్వమ్ = నీవు, గచ్ఛ = కదలుము, సర్వోపకరణైః=సమస్త సాధనములతోను, సాంగ్రామికైః=రణమునకవసరమైన, సర్వాయుధైః=సమస్తాయుధములతోను, ఉపేతమ్=కూడుకొన్నదియు, మహాహవ లక్షణమ్ నామ = "మహాహవ లక్షణము" అను పేరుకలదియునైన, అస్మత్ స్యందనమ్=మా రథమును, ఉపనయ=తెమ్ము.

యదితి :- కుమారః=కుమారుడు, యత్ ఆజ్ఞాపయతి=ఆజ్ఞాపించినట్లే.

(ఇతి నిష్క్రాన్తః)

కృపః : వత్స, అవశ్య ప్రతికర్తవ్యేఽస్మిన్ దారుణే పరిభవాగ్నౌ సర్వేషామస్మాకం కోఽన్యస్త్వామంతరేణ శక్తః ప్రతికర్తుమ్. కిన్తు—

అశ్వత్థామా : కిమతః పరమ్.

కృపః : సైనాపత్యేఽభిషిక్తం భవన్తమిచ్ఛామి సమరభువమవతారయితుమ్.

అశ్వత్థామా : మాతుల, పరతంత్రమిద మకించిత్కరం చ.

---

(ఇతి=అని, నిష్క్రాంతః=నిష్క్రమించును.)

వత్సావశ్యేతి :— వత్స=బిడ్డా! అవశ్య ప్రతికర్తవ్యే=తప్పనిసరిగా ప్రతీకారము చేయదగిన, అస్మిన్=ఈ, పరిభవాగ్నౌ=అవమానాగ్నియందు, అస్మాకమ్ సర్వేషామ్=మా అందరికిని, త్వామ్ అంతరేణ=నిన్ను తప్పించి— నీవుగాక యనుట, అన్యః = వేరొకడు, ప్రతికర్తుమ్ = ప్రతీకారము చేయుటకు, శక్తః=సమర్థుడు, కః(ఎవడు?) ఏడి?. నీవు తప్ప వేరొకడు లేడనుట. కిన్తు= కాని—

కిమితి :- అతః పరమ్=ఇంతకుమించి, కిమ్=ఏమున్నది? కిన్తు అని ఆగిపోయితివేమి, ఆ పైది చెప్పుమనుట.

సైనాపత్యేఇతి :— సమరభువమ్ = యుద్ధరంగమును, అవతారయితుమ్=పొందించుటకు—యుద్ధభూమికి దింపుటకనుట, భవంతమ్ = నిన్ను, సైనాపత్యే = సైన్యాధ్యక్షపదవియందు, అభిషిక్తమ్ = అభిషేకింపబడినవానిగా, ఇచ్ఛామి = కోరుచున్నాను. సైన్యాధ్యక్షుడవైన పిదప రణమునకేగుట నా అభిమతమనుట.

మాతులేతి :— మాతుల=మామా! ఇదమ్=ఈ పని, పరతంత్రమ్= పరుని అధీనములోనిది—సైనాధ్యక్ష్యమునీయవలసినవాడు దుర్యోధనుడనుట, చ=

కృష్ణః : వత్స, న ఖలు పరతంత్రః నాకించిత్కరం చ. పశ్య—

భవేదభీష్మమద్రోణం ధార్తరాష్ట్రబలం కథమ్
యది తత్తుల్యకక్షోఽత్ర భవాన్ ధురి న యుజ్యతే॥ 26

---

మరియు, అకించిత్కరమ్ = ఏమియునొరిగింపనిది—ఆ పదవి వలన ఒరుగున దేమియు లేదనుట.

వత్సేతి :— వత్స=బిడ్డా!, పరతంత్రమ్ న ఖలు=పరాధీనమైనది కానే కాదు, చ=మరియు, అకించిత్కరం న=ఒరిగింపనిదియు కాదు. పశ్య=చూడు—

భవేదితి :— తత్తుల్యకక్షః, భవాన్, అత్ర, ధురి, న యుజ్యతే, యది, అభీష్మమ్, అద్రోణమ్, ధార్తరాష్ట్రబలమ్, కథమ్, భవేత్.

అర్థము :— తత్తుల్యకక్షః = భీష్మ ద్రోణులతో సమానస్థాయికల్గిన, భవాన్=నీవు, అత్ర=ఈ, ధురి=సైనాపత్యమునందు, న యుజ్యతే యది= నియుక్తుడవు కాకపోయినచో, అభీష్మమ్=భీష్ముడు లేనిదియు, అద్రోణమ్= ద్రోణుడు లేనిదియునైన, ధార్తరాష్ట్రబలమ్=దుర్యోధనసైన్యము, కథమ్ భవేత్= ఎట్లు నిలువగల్గును? సైన్యమును కాపాడగల్గువాడు వేరొకడు లేడనుట. (పథ్యా వక్త్రము)

సమాసములు :— తయోః తుల్యా కక్షా యస్య సః. న విద్యతే భీష్మః యస్మిన్ తత్. న విద్యతే ద్రోణః యస్మిన్ తత్. ధృతరాష్ట్రస్యాపత్యం పుమాన్—ధార్తరాష్ట్రస్య బలమ్.

సంధులు :— కక్షః+అత్ర-ఉత్వాదేశవిసర్గ—కక్షో+అత్ర-పూర్వరూప స్వరసంధి.

కృతపరికరస్య భవాదృశస్య త్రైలోక్యమపి న క్షమం పరిపంథీభవితుం కిం పునర్యుధిష్ఠిర బలమ్ తదేవం మన్యే పరికల్పితాభిషేకోపకరణః కౌరవరాజో న చిరాత్ త్వామేవ అభ్యపేక్షమాణ స్తిష్ఠతీతి.

అశ్వత్థామా : యద్యేవం త్వరతే మే పరిభవానలదహ్యమానమిదం చేతః తత్ప్రతీకారజలావగాహనాయ. తదహం గత్వా తాతవధ విషణ్ణమానసం కురుపతిం సైనాపత్య స్వయం గ్రహణ ప్రణయ సమాశ్వాసనయా మంద సంతాపం కరోమి.

---

క్రియ :- యుజజ్ సమాధౌ, ఆత్మనే, లట్, ప్రథమ.
యుజ్యతే—యుజ్యేతే—యుజ్యన్తే.
భూ సత్తాయామ్, పరస్మై—విధిలిజ్—ప్రథమ
భవేత్—భవేతామ్—భవేయుః.

కృతపరికరస్యేతి :- కృతపరికరస్య = యుద్ధసన్నద్ధుడైన, భవాదృశస్య=నీవంటివానికి, పరిపంథీభవితుమ్= శత్రువుగా నిలుచుటకు, త్రైలోక్యమ్ అపి=లోకత్రయమైనను, ముల్లోకములైనను, న క్షమమ్=చాలదు, కిం పునః యుధిష్ఠిరబలమ్=ధర్మజుని సైన్యమనగానెంత! తత్=అందుచే, ఏవమ్=ఇట్లు, మన్యే = భావించుచున్నాను—పరికల్పిత=సమకూర్పబడిన, అభిషేకోపకరణః= అభిషేకసామగ్రి కలవాడై, కౌరవరాజః=దుర్యోధనుడు, న చిరాత్=ఇప్పట్టున, త్వామ్ ఏవ=నిన్నే, అభ్యపేక్షమాణః=ఎదురుచూచుచున్నవాడై, తిష్ఠతి ఇతి= ఉండియుండును.

యద్యేవమితి :- యది ఏవమ్ = ఏమైనప్పటికిని, పరిభవానల = అవమానాగ్నిచేత, దహ్యమానమ్=దహింపబడుచున్న, మే=నాయొక్క, ఇదమ్= ఈ, చేతః = మనస్సు, తత్ = దానికి, ప్రతీకార=ప్రతీకారముచేయుటయనునట్టి, జలావగాహనాయ=స్నానముకొఱకు, త్వరతే=తొందరపడుచున్నది. తత్=

కృపః : వత్స, ఏవమిదమ్. అతస్తమేవోద్దేశం గచ్ఛావః.

(ఇతి పరిక్రామతః)

(తతః ప్రవిశతః కర్ణదుర్యోధనౌ)

దుర్యోధనః : అంగరాజ,

తేజస్వీ రిపుహతబంధు దుఃఖపారం
బాహుభ్యాం వ్రజతి ధృతాయుధ ప్లవాభ్యామ్।

---

అందుచే, అహమ్=నేను, గత్వా=ఏగి, తాతవధ విషణ్ణమానసమ్=తండ్రి మృతిచే కుమిలిపోవుచున్న హృదయముగలవాడైన, కురుపతిమ్=దుర్యోధనుని, సైనాపత్యస్వయంగ్రహణ=సైన్యాధ్యక్షపదవిని (నేనుగా) స్వయముగా అంగీకరించుటయనునట్టి, ప్రణయ=ఇష్టకార్యముచే(సి), సమాశ్వాసనయా=ఓదార్పుటతో, మందసంతాపమ్ = ఉపశమించిన దుఃఖముకలవానిగా, కరోమి = చేయుదును. సైనాపత్యమును నేనుగా కోరి దుర్యోధనుని ఆనందింపజేయుదు ననుట.

వత్సేతి :— వత్స=బిడ్డా! ఏవమ్ ఇదమ్=ఇది ఇట్లే—ఇది ఉచితమనుట. అతః=అందుచే, తమ్=ఆ, ఉద్దేశమ్ ఏవ=ప్రదేశమునే—దుర్యోధనుడున్న చోటికే అనుట, గచ్ఛావః=పోవుదము.

(ఇతి=అని, పరిక్రామతః=ముందుకు కదలుదురు)

(తతః=పిమ్మట, కర్ణదుర్యోధనౌ=కర్ణుడును దుర్యోధనుడును, ప్రవిశతః=ప్రవేశింతురు)

అంగరాజా!

తేజస్వీతి :— తేజస్వీ, ధృతాయుధప్లవాభ్యామ్, బాహుభ్యామ్, రిపుహత బంధు దుఃఖపారమ్, వ్రజతి; సంఖ్యే, ఆచార్యః, సుతనిధనమ్, నిశమ్య, శస్త్రగ్రహ సమయే, విశస్త్రః, ఆసీత్, కిమ్?

ఆచార్యః సుతనిధనం నిశమ్య సంఖ్యే
కిం శస్త్రగ్రహ సమయే విశస్త్ర ఆసీత్॥ 27

---

**అర్థము** :- తేజస్వీ = పరాక్రమసంపన్నుడైన వ్యక్తి, ధృత=ధరింపబడిన, ఆయుధ=శస్త్రములు అనునట్టి, ప్లవాభ్యామ్=నావలు కలవైన, బాహాభ్యామ్=బాహువులతో, రిపు=శత్రువులచేత, హత=చంపబడిన, బంధు=చుట్టములు కల్గుటచేనైన, దుఃఖ=శోకముయొక్క—బంధునాశనమున కలిగిన దుఃఖమనుట, పారమ్=ఒడ్డును, వ్రజతి=పొందును. మరి— సంఖ్యే=రణమునందు, ఆచార్యః=ద్రోణాచార్యుడు, సుతనిధనమ్=పుత్రుని మృతుని, నిశమ్య=విని, శస్త్రగ్రహ సమయే=ఆయుధమును పట్టవలసిన తరుణమందు, విశస్త్రః=ఆయుధమును వీడినవాడు, ఆసీత్ కిమ్=అయ్యేనేమి?

**సమాసములు** :— తేజః అస్య అస్తి ఇతి—తేజస్వీ. రిపుణా హతః—రిపుహతశ్చ అసౌ బంధుశ్చ—రిపుహతబంధోః దుఃఖమ్—రిపుహతబంధు దుఃఖస్య పారమ్_తమ్. ఆయుధః ఏవ ప్లవః_ఆయుధప్లవః_ధృతౌ ఆయుధప్లవౌ యాభ్యాం తౌ—ధృతాయుధప్లవౌ—తాభ్యామ్. సుతస్య నిధనమ్. శస్త్రస్య గ్రహః—శస్త్రగ్రహస్య సమయః—తస్మిన్. విగతం శస్త్రం యస్య (యేన) సః—విశస్త్రః.

**సంధులు** :- ధృత+ఆయుధ—సవర్ణదీర్ఘ. విశస్త్రః+ఆసీత్—విసర్గలోప సంధి.

**క్రియ** :— అస భువి, లఙ్, పరస్మై—ప్రథమ
ఆసీత్_ఆస్తామ్—ఆసన్.

**ఛందస్సు** :- ప్రహర్షిణీవృత్తము. త్ర్యాశాభిర్మ్నజరగాః ప్రహర్షిణీయమ్. 1_3_10

| మ | న | జ | ర | గ |
|---|---|---|---|---|
| UUU | III | IUI | UIU | U |
| తేజస్వీ | రిపుహ | తబంధు | దుఃఖపా | రమ్ |

అథవా సూక్తమిదమభియుక్తైః ప్రకృతిర్దుస్త్యజేతి. యతః శోకాంధమనసా తేన విముచ్య క్షాత్రధర్మ కార్కశ్యం ద్విజాతి ధర్మసులభో మార్దవ పరిగ్రహః కృతః.

కర్ణః : రాజన్, కౌరవేశ్వర, న ఖల్విద మేవమ్.

దుర్యోధనః : కథం తర్హి.

కర్ణః : ఏవం కిలాస్యాభి ప్రాయో యథా అశ్వత్థామా మయా పృథివీరాజ్యే అభిషేక్తవ్య ఇతి. తస్యాభావాత్ వృద్ధస్య మే బ్రాహ్మణస్య వృథా శస్త్రగ్రహణమితి తథా కృతవాన్.

---

అథవా=లేదా, ప్రకృతిః=స్వభావము దుస్త్యజా ఇతి=దురతిక్రమణీయము అని, అభియుక్తైః=పండితులచేత, ఇదమ్=ఈ చెప్పబడినది, సూక్తమ్=లెస్స మాట—అన్వర్థమనుట. యతః=ఏలయన, శోకాంధ=దుఃఖాతిశయముచే వివేకము కోల్పోయిన, మనసా=మనస్సుకలవాడైన, తేన=ఆ ద్రోణాచార్యునిచేత, క్షాత్ర ధర్మకార్కశ్యమ్=క్షత్రియోచితమైన కాఠిన్యము, విముచ్య=విడువబడి, ద్విజాతి ధర్మ సులభః = బ్రాహ్మణ ధర్మమునకు అనుకూలమైన, మార్దవ పరిగ్రహః= మృదుభావస్వీకారము, కృతః=చేయబడినది.

రాజన్నితి :— మహారాజా!, కౌరవేశ్వర=దుర్యోధనా! ఇదమ్=ఇది (శస్త్రత్యాగము) ఏవమ్=నీవనుకొనుచున్నట్లు, న ఖలు=కాదు సుమా!

కథమితి :- కథమ్ తర్హి=మరియెట్లు!

ఏవమితి :— ఏవమ్ కిల=ఇట్లు సుమా! యథా=ఎట్లయినను ఎప్పటి కైనను, అశ్వత్థామా=అశ్వత్థామ, మయా=నాచేత (ద్రోణునిచేత), పృథివీరాజ్యే= భూ సామ్రాజ్యమునందు—రాజపదవియందనుట, అభిషేక్తవ్యః ఇతి=అభిషేకింప బడవలెను అని, అస్య = ద్రోణునియొక్క, అభిప్రాయః = ఆలోచన, ఇట్టి

దుర్యోధనః : (సశిరఃకంపమ్) ఏవమిదమ్

కర్ణః : ఏతదర్థం చ కౌరవపాండవ పక్షపాతప్రవృత్త మహా సంగ్రామస్య రాజకస్య పరస్పరక్షయమపేక్షమాణేన తేన ప్రధానపురుషవధ ఉపేక్షా కృతా.

దుర్యోధనః : ఉపపన్నమిదమ్.

---

అభిప్రాయమాతనికి కలదనుట; తస్య+అభావాత్=అది పోవుటచే, పుత్ర మరణము వలన అట్టియభిప్రాయము నెరవేరునవకాశమే లోపించుటచేననుట, వృద్ధస్య= ముదుసలిని, బ్రాహ్మణస్య=బ్రాహ్మణుడను అయిన, మే=నాకు, శస్త్రగ్రహణమ్= ఆయుధధారణము, వృథా ఇతి=వ్యర్థమే అని, తథా=అట్లు, కృతవాన్=చేసినాడు— ఆయుధము వీడినాడనుట.

ఏవమితి :— (స శిరఃకంపమ్ = తల పంకించుచు) ఏవమ్ ఇదమ్= ఇది అంతే!

**ఏతదితి** :— చ=మరియు, ఏతదర్థమ్=ఇందుకొరకే, కౌరవ పాండవ పక్షపాత=కౌరవ పాండవ పక్షపాతముతో, ప్రవృత్త=ప్రారంభింపబడిన, మహా సంగ్రామస్య = ఘోరయుద్ధముకలదైన, రాజకస్య = రాజసమూహముయొక్క, (మొత్తము రాజులందరునేదోయొకపక్షమున చేరిపోయిన మహాసంగ్రామమనుట) పరస్పరక్షయమ్=పరస్పర వినాశమును, అపేక్షమాణేన=కోరుకొనుచున్న, తేన= ఆ ద్రోణునిచే, ప్రధానపురుషవధే=ముఖ్యులను చంపుటయందు, ఉపేక్షా కృతా= ఉదాసీనవైఖరి అవలంబింపబడినది—ప్రధాన ప్రతిపక్షులను చంపక ఉపేక్షించె ననుట.

ఉపేతి :- ఇదమ్=నీవు చెప్పిన ఈ విషయము, ఉపపన్నమ్=యుక్తి సహమే.

కర్ణః : అన్యచ్చ, రాజన్, ద్రుపదేనాప్యస్య బాల్యాత్ ప్రభృత్యభిప్రాయవేదినా న స్వరాష్ట్రే వాసో దత్తః.

దుర్యోధనః : సాధు, అంగరాజ, సాధు. నిపుణ మభిహితమ్.

కర్ణః : న చాయం మమైకస్యాభిప్రాయః. అన్యేఽభియుక్తా అపి నై వేదమన్యథా మన్యన్తే.

దుర్యోధనః : ఏవమేతత్, కః సందేహః.

---

అన్యదితి :— అన్యత్ చ=మరొకటియు కలదు, రాజన్=మహారాజా! బాల్యాత్ ప్రభృతి = చిన్నప్పటినుండియు, అభిప్రాయవేదినా=ద్రోణునియొక్క ఈ అభిప్రాయమునెరిగినవాడైన, ద్రుపదేన అపి=ద్రుపదునిచేగూడ, స్వరాష్ట్రే= తన రాజ్యమందు, వాసః=నివాసము, అస్య=ఈ ద్రోణునికి, న దత్తః=ఈయబడ లేదు.

సాధ్వితి :— అంగరాజ=కర్ణా!, సాధు సాధు=బాగు బాగు. నిపుణమ్= నేర్పుగా, అభిహితమ్ = చెప్పబడినది—నీ బుద్ధినైపుణ్యము వెల్లడియగుచున్న దనుట.

నచేతి :— చ=మరియు, అయమ్=ఈ, అభిప్రాయః=అభిప్రాయము, న మమ ఏకస్య=నా ఒక్కనిదే కాదు. అభియుక్తాః=పండితులు, అన్యే అపి= ఇతరులుకూడ—మరికొందరు. రాజనీతివిశారదులుకూడ ననుట, ఇదమ్ = దీనిని, అన్యథా = మరొకరీతిగా (నే చెప్పినదానికి భిన్నముగా) న మన్యంతే ఏవ = తలంచుట లేనేలేదు.

ఏవమితి :— ఏతత్=ఇది, ఏవమ్=ఇంతే—నిజమే అయియుండుననుట. సందేహః కః=సందేహమేమి!

దత్త్వాభయం సోఽతిరథో వధ్యమానం కిరీటినా।
సింధురాజముపేక్షేత నైవం చేత్కథమన్యథా॥ 28

కృపః : (విలోక్య) వత్స, ఏష దుర్యోధనః సూతపుత్రేణ సహాస్యాం న్యగ్రోధచ్ఛాయాయాముపవిష్టస్తిష్ఠతి. తదుపసర్పావః.

(తథా కృత్వా)

---

దత్త్వా ఇతి :- ఏవమ్, న, చేత్, అన్యథా, అతిరథః, సః, అభయమ్, దత్త్వా, కిరీటినా, వధ్యమానమ్, సింధురాజమ్, కథమ్, ఉపేక్షేత.

అర్థము :- ఏవమ్ = నీవు చెప్పినట్లే, న చేత్ = కాకపోయినచో, అన్యథా=మరి, అతిరథః=అతిరథుడైన, సః=ఆ ద్రోణుడు, అభయమ్ దత్త్వా= అభయమునిచ్చియు, కిరీటినా = అర్జునునిచే, వధ్యమానమ్ = చంపబడుచున్న, సింధురాజమ్ = సింధురాజగు జయద్రథుని, కథమ్ = ఎట్లు, ఉపేక్షేత=ఉపేక్షించి యూరకుండును! ఉపేక్షించెను కావున నీవన్నది నిజమే అనుట.

సంధులు :- దత్త్వా+అభయమ్—సవర్ణదీర్ఘ. సః+అతిరథః—సో+అతిరథః—పూర్వరూపస్వరసంధి. న+ఏవమ్—వృద్ధిసంధి. (పథ్యావక్త్రము)

క్రియ :- ఈక్షఙ్ దర్శనే—ఆత్మనే, విధిలిఙ్, ప్రథమ.
ఉప+ఈక్షేత—ఈక్షేయాతామ్—ఈక్షేరన్.

వత్సేతి :- (విలోక్య=చూచి) వత్సా! ఏషః=ఇతడే, దుర్యోధనః= సుయోధనుడు, సూతపుత్రేణ సహ = రాధేయునితో కలిసి, అస్యామ్ = ఈ, న్యగ్రోధచ్ఛాయాయామ్ = మర్రిచెట్టు నీడలో, ఉపవిష్టః తిష్ఠతి=కూర్చున్నాడు. తత్ ఉపసర్పావః=సమీపింతుముగాక.

(తథా=అట్లు, కృత్వా=చేసి, సమీపించి అనుట)

ఉభౌ : విజయతాం కౌరవేశ్వరః.

దుర్యోధనః : (దృష్ట్వా) అయే కథం కృపోఽశ్వత్థామా. (ఆసనాద వతీర్య కృపం ప్రతి) గురో అభివాదయే. (అశ్వత్థామానముద్దిశ్య) ఆచార్యపుత్ర!

ఏహ్యస్మదర్థహత తాత పరిష్వజస్వ
క్లాంతైరిదం మమ నిరంతరమంగమంగైః।
స్పర్శ స్తవైష భుజయోః సదృశః పితుస్తే
శోకేఽపి యో మహతి నిర్వృతిమాదధాతి॥ 29

---

విజయతామితి :- కౌరవేశ్వరః = దుర్యోధనుడు, విజయతామ్ = జయించుగాక!

అయేఇతి :- (దృష్ట్వా = చూచి), అయే కథమ్=అహో! ఎట్టా! కృపః=కృపాచార్యుడును, అశ్వత్థామా=అశ్వత్థామయు నా! (ఆసనాత్=కూర్చున్న చోటినుండి, ఉత్థాయ = గౌరవసూచకముగా లేచి, కృపం ప్రతి = కృపాచార్యునుద్దేశించి—) గురో = ఆచార్యా!, అభివాదయే = నమస్కరించుచున్నాను. (అశ్వత్థామానమ్ ఉద్దిశ్య=ద్రౌణినుద్దేశించి) ఆచార్యపుత్రా!

ఏహీతి :- హే అస్మదర్థహత తాత! ఏహి, క్లాంతైః, అంగైః, మమ, అంగమ్, నిరంతరమ్, పరిష్వజస్వ, తవ, భుజయోః, ఏషః, స్పర్శః, తే, పితుః, సదృశః, యః, మహతి, శోకే, అపి, నిర్వృతిమ్, ఆదధాతి. (నః, శోకే, అపి, తనూరుహేషు, వికృతిమ్ ఏతి శోకేఽపి నో వికృతిమేతి తనూరుహేషు).

అర్థము :- అస్మదర్థ హత తాత = మాకొరకునై చనిపోయిన తండ్రి కలవాడా! ఏహి = రమ్ము, క్లాంతైః=అలిసిపోయిన, అంగైః=నీ బాహువులతో (అంగములతో) మమ = నాయొక్క, అంగమ్ = శరీరమును, నిరంతరమ్= గాఢముగా, పరిష్వజస్వ = కౌగిలించుకొమ్ము. తవ = నీయొక్క, భుజయోః=

(ఆలిఙ్గ్య పార్శ్వే ఉపవేశయతి, అశ్వత్థామా బాష్ప ముత్సృజతి)

కర్ణః : ద్రౌణాయన, అల మత్యర్థ మాత్మానం శోకానలే ప్రక్షిప్య.

---

బాహులయొక్క, ఏషః=ఈ, స్పర్శః=స్పర్శ, తే=నీయొక్క, పితుః=తండ్రి యొక్క స్పర్శతో, సదృశః=సమానము. యః=ఆయీ స్పర్శ, మహతి= గొప్పదయిన, శోకే అపి = దుఃఖమునందుకూడ, నిర్వృతిమ్ = మనశ్శాంతిని, ఆదధాతి = కలిగించును. (నః = మాకు, శోకే అపి=దుఃఖసమయమునందును, తనూరుహేషు=రోమ(గంధులయందు, వికృతిమ్= పులకింతను, ఏతి=పొందును— శోకమునందును నీ స్పర్శ రోమాంచమును కలిగించుననుట- ఇది పాఠాంతరము) (వసంతతిలక)

సమాసములు :— మమ ఇదమ్—అస్మదర్థం హతః—అస్మదర్థహతః తాతః యస్య సః—అస్మదర్థహత తాతః—తత్సంబుద్ధి.

సంధులు :- ఏహి+అస్మత్—యణాదేశ. క్లాంతైః+ఇదమ్—రేఫాదేశ విసర్గ. స్పర్శః+తవ, పితుః+తే—సాదేశవిసర్గ. తవ+ఏష—వృద్ధి. శోకే+ అపి—పూర్వరూపస్వరసంధి.

క్రియలు :- ఇణ్ గతౌ, పరస్మై, లోట్, మధ్యమ.
ఏహి/ఇతాత్—ఇతమ్—ఇత.
ష్వఞ్జ్ పరిష్వంగే—ఆత్మనే, లోట్, మధ్యమ
పరి ష్వజస్వ—పరిష్వజేథామ్—పరిష్వజధ్వమ్

(ఆలిఙ్గ్య=కౌగిలించుకొని, పార్శ్వే=ప్రక్కన, ఉపవేశయతి=కూర్చుండ బెట్టుకొనును. అశ్వత్థామ, బాష్పమ్ ఉత్సృజతి=కంట తడిపెట్టును)

ద్రౌణాయనేతి :— ద్రౌణాయన=ద్రోణనందనా!, ఆత్మానమ్=నిన్ను

దుర్యోధనః : ఆచార్యపుత్ర, కో విశేష ఆవయోరస్మిన్ వ్యసన మహార్ణవే. పశ్య—

తాత స్తవ ప్రణయవాన్ స పితుస్సఖా మే
శస్త్రే యథా తవ గురుః స తథా మమాపి।
కిం తస్య దేహనిధనే కథయామి దుఃఖం
జానీహి తత్ గురుశుచా మనసా త్వమేవ॥ 30

---

నీవు, శోకానలే=దుఃఖాగ్నియందు, అత్యర్థమ్=అత్యంతము, ప్రక్షిప్య=ముంచుకొనుట, అలమ్=చాలు. దుఃఖాగ్నిలో మునుగవద్దనుట.

ఆచార్యపుత్రేతి :- గురుసుతా! అస్మిన్ = ఈ, వ్యసనమహార్ణవే= దుఃఖసముద్రమునందు, ఆవయోః = మన ఇరువురి నడుమ, కః విశేషః=విశేషమేమి! పశ్య=చూడు—

తాతఇతి :— తవ, ప్రణయవాన్, సః, తాతః, మే, పితుః, సఖా. శస్త్రే, యథా, తవ, తథా, మమ, అపి, సః, గురుః. తస్య దేహ నిధనే, దుఃఖమ్, కిమ్, కథయామి, తత్, గురుశుచా, మనసా, త్వమేవ, జానీహి.

అర్థము :- తవ=నీయొక్క, ప్రణయవాన్=పుత్రప్రేమకలవాడైన, సః=ఆ జగత్ప్రసిద్ధుడైన, తాతః=తండ్రి, మే=నాయొక్క, పితుః=తండ్రికి, సఖా=చెలికాడు. శస్త్రే=శస్త్రవిద్యయందు, యథా=ఎట్లు, తవ=నీకో, తథా= అట్లు, మమ అపి=నాకును, సః=ఆ మహానుభావుడు, గురుః=గురువు. తస్య= అటువంటివానియొక్క, దేహనిధనే=మృతిపట్ల, దుఃఖమ్=దుఃఖమునుగూర్చి, కిమ్ కథయామి=ఏమి చెప్పను. తత్=దానిని, గురుశుచా=అత్యంత దుఃఖముతో కూడిన, మనసా = మనస్సుతో, త్వమ్ ఏవ = నీవే, జానీహి=తెలిసికొనుము. దుఃఖవిషయమున మనకు హెచ్చుతగ్గులు లేవనుట. (వసంతతిలక)

సమాసములు :— దేహస్య నిధనమ్-తస్మిన్. గుర్వీచ సా శుక్ చ— గురుశుక్—తయా.

కృపః : వత్స, యథాహ కురుపతి స్తథైవై తత్.

అశ్వత్థామా : రాజన్, ఏవం పక్షపాతిని త్వయి యుక్తమేవ శోక భారం లఘూకర్తుమ్. కిన్తు—

మయి జీవతి మత్తాతః కేశగ్రహమవాప్తవాన్।
కథమన్యే కరిష్యన్తి పుత్రేభ్యః పుత్రిణః స్పృహామ్॥
31

---

క్రియ :— కథ వాక్య ప్రబంధే+స్వార్థే ణిచ్—పరస్మై—లట్—ఉత్తమ
కథయామి—కథయావః—కథయామః
జ్ఞా అవబోధనే—పరస్మై—లోట్—మధ్యమ
జానీహి/జానీతాత్—జానీతమ్—జానీత

వత్సేతి :— వత్స=బిడ్డా!, కురుపతిః=ఈ దుర్యోధనుడు, యథా ఆహ= ఎట్లు చెప్పెనో, ఏతత్ = ఇది, తథా ఏవ = అట్లే. నీ అంతగా మహారాజును దుఃఖించుచున్నాడనుట.

రాజన్నితి :— రాజన్=మహారాజా! ఏవమ్=ఇట్లు, పక్షపాతిని=నాపట్ల ఆదరముకలవాడవైన, త్వయి=నీవు, శోకభారమ్=నా దుఃఖాతిశయమును, లఘూ కర్తుమ్=తగ్గించుట (పాలుపంచుకొనుటతో) యుక్తమేవ=అర్హమైనదే. కిన్తు= కాని—

మయీతి :— మయి, జీవతి, మత్తాతః, కేశగ్రహమ్, అవాప్తవాన్; పుత్రిణః, అన్యే, పుత్రేభ్యః, స్పృహామ్, కథమ్, కరిష్యన్తి.

అర్థము :— మయి=నేను, జీవతి=జీవించియుండగా, మత్తాతః=నా తండ్రి, కేశగ్రహమ్=కచగ్రహణమును, అవాప్తవాన్=పొందినాడు, పుత్రిణః= పుత్రసంతానవంతులైన, అన్యే = ఇతరులు, పుత్రేభ్యః = సుతులకొఱకు, స్పృహామ్=కోరికను లేక అభిలాషను, కథమ్=ఎట్లు, కరిష్యన్తి=పొనరింతురు! పుత్రప్రేమకు నిక ప్రయోజనమేమనుట.

కర్ణః : ద్రౌణాయన, కిమత్ర క్రియతే యదా తేనైవ సర్వ పరిభవత్రాణ హేతునా శస్త్ర ముత్సృజతా తాదృశీ మవస్థా మాత్మా నీతః.

అశ్వత్థామా : అంగరాజ, కిమాహ భవాన్, కిమత్ర క్రియత ఇతి. యత్క్రియతే—

యో యశ్శస్త్రం బిభర్తి స్వభుజగురుమదః పాండవీనాం
చమూనాం
యో యః పాంచాలగోత్రే శిశు రధికవయా
గర్భశయ్యాం గతో వా।

---

సమాసములు :— మమ తాతః—మత్తాతః. కేశానాం గ్రహః—తమ్. (పథ్యావక్త్రం ఛందః).

క్రియ :- డు కృఞ్ కరణే—పరస్మై, లృట్—ప్రథమ
కరిష్యతి—కరిష్యతః—కరిష్యన్తి.

ద్రౌణాయనేతి :— ద్రౌణాయన = ద్రోణనందనా! సర్వ పరిభవ= అందరిని అవమానములనుండి, త్రాణ=రక్షించుటకు, హేతునా=కారణభూతుడై, శస్త్రమ్=ఆయుధమును, ఉత్సృజతా=విడిచినవాడగుటచే, తేన ఏవ=ద్రోణునిచేతనే, తాదృశీమ్=అటువంటిదైన, అవస్థామ్=దుఃస్థితిని, ఆత్మా=తనకుతాను, నీతః= పొందింపబడగా (పొందించుకొనగా), అత్ర=ఈ విషయమున, కిమ్ క్రియతే= ఏమి చేయబడును. అవమానమునాతడు కోరి తెచ్చుకొనగా మనమేమి చేయగల మనుట.

అంగరాజేతి :— అంగరాజ = కర్ణా!, భవాన్ = నీవు, కిమ్ ఆహ= ఏమంటివి—కిమత్ర క్రియతే ఇతి=ఏమి చేయబడుననియా!—ఈ విషయమున మన మేమి చేయగలమనియా!. యత్=ఏది, క్రియతే=చేయబడునో, శ్రూయతామ్= వినుదువుగాక!—విను మనుట.

య ఇతి :- పాండవీనామ్, చమూనామ్, స్వభుజగురుమదః, యః,

యో యస్తత్కర్మసాక్షీ చరతి మయి రణే యశ్చ
యశ్చ ప్రతీపః
క్రోధాంధస్తస్య తస్య స్వయ మపి జగతా మంతక
స్యాంతకోఽహమ్॥ 32

యః, శస్త్రమ్, బిభర్తి; పాంచాలగోత్రే, యః, యః, శిశుః వా, అధికవయా వా, గర్భశయ్యామ్, గతః, వా; యః, యః, తత్ కర్మసాక్షీ; రణే, మయి, చరతి, యః, యః, ప్రతీపః, తస్య, తస్య, అపి, స్వయమ్, జగతామ్, అంతకస్య, క్రోధాంధః, అహమ్, అంతకః.

అర్థము :— పాండవీనామ్=పాండవులకు సంబంధించిన, చమూనామ్= సైన్యములలో, స్వభుజ గురు మదః = తన బాహువులయందు గొప్ప మదము కలవాడై, యః యః=ఎవడెవడు, శస్త్రమ్=ఆయుధమును, బిభర్తి=ధరించునో; పాంచాలగోత్రే=పాంచాలవంశమునందు, యః యః=ఎవడెవడు, శిశుః వా=శిశువు గాని, గర్భశయ్యామ్=మాతృగర్భాశయమను శయ్యను, గతః వా=పొందినవాడు గాని కలడో, తత్కర్మ సాక్షీ=ద్రోణునికి జరిగిన అవమానమునకు సాక్షియైన వాడును, చ=మరియు, రణే=యుద్ధమునందు, మయి=నేను, చరతి సతి=సంచరించు చుండగా, యః యః=ఎవడెవడు, ప్రతీపః=వ్యతిరేకించువాడు/లేక/ ఎదిరించువాడు అగునో, ఇహ=ఈ రణభూమియందు, క్రోధాంధః=అత్యంత కోపావిష్టుడనైన, అహమ్=నేను, తస్య తస్య=వానికి వానికిని, అపి=మరియు, స్వయమ్= స్వయముగా, జగతామ్ = లోకములకన్నింటికిని, అంతకస్య = వినాశకుడైన యమునికిని, అంతకః=అంతకుడను—అయ్యెదననుట.

సమాసములు :- గురు చేదం మదం చ—స్వభుజయోః గురుమదం యస్య సః. పాంచాలానామిదం గోత్రం పాంచాలగోత్రమ్—తస్మిన్. అధికం వయః యస్య సః—అధికవయాః. గర్భమేవ శయ్యా—తామ్. తత్ చ కర్మ చ— తత్కర్మణః సాక్షీ. క్రోధేన అంధః. (స్రగ్ధరావృత్తము)

సంధులు :— యః+యః, గతః+వా—ఉత్వాదేశవిసర్గ. శిశుః+అధిక— రేఫాదేశవిసర్గ. వయాః+గర్భ—విసర్గలోప. యః+తత్, అంధః+తస్య—సాదేశ

అపి చ, భో జామదగ్న్యశిష్య కర్ణ,

దేశస్సోఽయమరాతిశోణితజలై ర్యస్మిన్ హ్రదాః పూరితాః
క్షత్రాదేవ తథావిధః పరిభవ స్తాతస్య కేశగ్రహః।
తాన్యేవాహితశస్త్రఘస్మరగురూణ్యస్త్రాణి భాస్వన్తి మే
యద్రామేణ కృతం తదేవ కురుతే ద్రౌణాయనిః క్రోధనః॥ 33

---

విసర్గ. యః+చ—శాదేశవిసర్గ. క్రోధ+అంధః, అంతకస్య+అంతకః—సవర్ణ దీర్ఘ. అంతకః+అహమ్—ఉత్వాదేశవిసర్గ—అంతకో+అహమ్—పూర్వరూప.

క్రియ :— డుభృఞ్ ధారణపోషణయోః—పరస్మై—లట్—ప్రథమ.
బిభర్తి—బిభృతః—బిభ్రతి.

**అపిచేతి** :— అపి చ=మరియు, భో జామదగ్న్యశిష్య=పరశురాముని శిష్యుడా, కర్ణ=ఓయీ కర్ణుడా!

దేశఇతి :— యస్మిన్, హ్రదాః, అరాతిశోణితజలైః, పూరితాః, అయమ్, దేశః, సః, తాతస్య, కేశగ్రహః, క్షత్రాత్, ఏవ; తథావిధః, పరిభవః; అహిత శస్త్ర ఘస్మర గురూణి, భాస్వన్తి, యే, అస్త్రాణి, తాని, ఏవ; రామేణ, యత్, కృతమ్, క్రోధనః, ద్రౌణాయనిః, తత్, ఏవ, కురుతే.

**అర్థము** :— యస్మిన్ = ఏ ప్రదేశమునందు, హ్రదాః = చెరువులు, అరాతి=శత్రువుల, శోణిత=రక్తమనునట్టి, జలైః=నీరములతో, పూరితాః=నింపబడినవో, అయమ్ = ఈ, దేశః = భూభాగము, సః=అదే—భార్గవరాముడు శత్రు సంహారము చేసినది ఈ దేశమందే అనుట; తాతస్య = తండ్రికి, కేశగ్రహః= కేశగ్రహణము, క్షత్రాత్ ఏవ = క్షత్రియునివల్లనే, జుట్టుపట్టుకొన్నవాడు క్షత్రియుడే అనుట; పరిభవః=అపమానము, తథా విధః=సర్వాత్మనా అట్టిదే— భృగుమహర్షికి జరిగిన అవమానము వంటిదే అనుట; అహిత=శత్రువులయొక్క, శస్త్ర = ఆయుధములను, ఘస్మర = భక్షించునవియు, గురూణి = గొప్పవియు, భాస్వన్తి =ప్రకాశించు వియునైన, మే=నాయొక్క, అస్త్రాణి=అస్త్రములు, తాని

దుర్యోధనః : ఆచార్యపుత్ర, తస్య తథావిధస్య అనన్యసాధారణస్య తే వీరభావస్య కిమన్యత్ సదృశమ్.

కృపః : రాజన్, సుమహాన్ ఖలు ద్రోణపుత్రేణ వోఢు మధ్యవసితః సమరభారః తదహమేవం మన్యే భవతా కృతపరికరో౾యముచ్ఛేత్తుం లోకత్రయమపి సమర్థః

---

ఏవ=అట్టివే—పరశురాముని అస్త్రములవంటివే అనుట; రామేణ=పరశురాముని చేత, యత్ = ఏది, కృతమ్ = అలనాడు చేయబడినదో, క్రోధనః=కోపనుడైన, ద్రౌణాయనిః=అశ్వత్థామ, తత్ ఏవ=దానినే—అట్టి క్షత్రియసంహారమునే అనుట, కురుతే = చేయుచున్నాడు. (సమీప భవిష్యత్తున వర్తమానరూపము) (శార్దూలము)

సమాసములు :— అరాతీనాం శోణితాని—అరాతిశోణితాన్యేవ జలాని—తైః. అహితానాం శస్త్రాణి—అహితశస్త్రాణాం ఘస్మరాణి—అహితశస్త్ర ఘస్మరాణి చ తాని గురూణి చ—అహితశస్త్రఘస్మరగురూణి.

సంధులు :— సః+అయమ్—సో౾యమ్—ఉత్వాదేశవిసర్గ—పూర్వరూపస్వర. జలైః+యస్మిన్—రేఫాదేశవిసర్గ. పరిభవః+తాతస్య—సాదేశ విసర్గ. తాని+ఏవ, గురూణి+అస్త్రాణి—యణాదేశ. ఏవ+అహిత—సవర్ణదీర్ఘ.

ఆచార్యపుత్రేతి :- ఆచార్య పుత్ర=గురుపుత్రా! అశ్వత్థామా! తథా విధస్య=అట్టిదే అయినదియు, అనన్యసాధారణస్య=అన్యులయందు సాధారణముగా కన్పించనిదియునైన, తే=నీయొక్క, తస్య=ఆ జగద్విదితమైన, వీరభావస్య= వీరత్వమునకు, అన్యత్=నీవన్నట్లు చేయుట కాక వేరొకటి, కిమ్ సదృశమ్= తగిన పని యేమున్నది?

రాజన్నితి :— మహారాజా!, ద్రోణపుత్రేణ=అశ్వత్థామచే, వోఢుమ్= వహించుటకు, అధ్యవసితః=నిశ్చయింపబడినదైన, సమరభారః=యుద్ధభారము, సుమహాన్ ఖలు=చాల పెద్దదిగదా!. తత్=అందుచే, అహమ్=నేను, ఏవమ్=

కిం పునర్యుధిష్ఠిరబలమ్. అతో౽భిషిచ్యతాం సైనాపత్యే.

దుర్యోధనః : సుష్ఠు యుజ్యమానమభిహితం యుష్మాభిః. కిం తు ప్రాక్ప్రతిపన్నో౽యమర్థో౽౦గరాజస్య.

కృపః : రాజన్, అసదృశ పరిభవశోకసాగరే నిమజ్జంతమేన మంగరాజస్యార్థే నైవోపేక్షితుం యుక్తమ్. అస్యాపి తదేవారికులమనుశాసనీయమ్. అతః కిమస్య పీడా న భవిష్యతి.

---

ఇట్లు, మన్యే = భావించుచున్నాను—భవతా=నీచేత, కృతపరికరః=సజ్జీకృతుడై, అయమ్=ఈ అశ్వత్థామ, లోకత్రయమ్ అపి=ముల్లోకములనుగూడ, ఉచ్ఛేత్తుమ్=తుత్తునియలు చేయుటకు, సమర్థః=చాలినవాడు, కిమ్ పునః యుధిష్ఠిరబలమ్=ఇంక పాండవసైన్యము మాట ఏమి!. అతః=అందుచే, సైనాపత్యే=సేనాపతిత్వము నందు, అభిషిచ్యతామ్=ఇతడు అభిషేకింపబడుగాక! సేనాపతిని చేయుమనుట.

సుష్ఠ్విత్తి :— యుష్మాభిః=తమచేత, యుజ్యమానమ్=యుక్తియుక్తమైనది, సుష్ఠు అభిహితమ్=బాగుగా చెప్పబడినది. కిన్తు=కాని, అయమ్=ఈ, అర్థః=పదవి, అంగరాజస్య=అంగరాజయిన కర్ణునికి, ప్రాక్ ప్రతిపన్నః=ముందే నిశ్చయింపబడినది.

రాజన్నితి :— మహారాజా! అసదృశ=సాటిలేని, పరిభవః=అవమాన మనుసట్టి, శోకసాగరే=దుఃఖసముద్రమునందు, నిమజ్జన్తమ్=మునిగిపోవుచున్న, ఏనమ్=ఈ అశ్వత్థామను, అంగరాజస్య అర్థే=కర్ణుని కొరకునై, ఉపేక్షితుమ్=నిర్లక్ష్యముచేయుట, న యుక్తమ్=ఉచితము కాదు. అస్య అపి=ఈతనికికూడ, తత్ ఏవ=అదే, అరికులమ్=శత్రుసమూహము, అనుశాసనీయమ్=సంహరింప దగినది. అతః=అందుచేత, అస్య=ఈతనికి, పీడా=మనఃఖేదము, న భవిష్యతి కిమ్ = కలుగదా? (తాను సంహరింపవలసిన శత్రువు కర్ణనాయకత్వమున సంహరింపబడుట అశ్వత్థామకు ఖేదకారక మనుట.)

అశ్వత్థామా : రాజన్, కౌరవేశ్వర, కిమద్యాపి యుక్తాయుక్త విచారణయా.

ప్రయత్నపరిబోధితః స్తుతిభిరద్య శేషే నిశా
మకేశవ మపాండవం భువనమద్య నిస్సోమకమ్।
ఇయం పరిసమాప్యతే రణకథాద్య దోశ్శాలినా
మపైతు నృపకాననాతిగురురద్య భారో భువః॥ 34

---

రాజన్నితి :— రాజన్=మహారాజా! కౌరవేశ్వర=కౌరవప్రభూ! అద్య అపి = ఈ క్షణమునందుకూడ, యుక్తాయుక్త విచారణయా కిమ్ = ఉచితానుచిత విచారణమేల!

ప్రయత్నేతి :— స్తుతిభిః, ప్రయత్న పరిబోధితః, (యథా భవిష్యసి తథా) అద్య, నిశామ్, శేషే; అద్య, భువనమ్, అకేశవమ్, అపాండవమ్, నిస్సోమకమ్. అద్య, దోశ్శాలినామ్, ఇయమ్, రణకథా, పరిసమాప్యతే; నృపకాననాతి గురుః, భారః, భువః, అద్య, అపైతు. (పృథ్వీఛందము)

అర్థము - స్తుతిభిః = సౌఖశాయనికుల స్తోత్రములతో, ప్రయత్న పరిబోధితః=అతి ప్రయత్నముమీద మేల్కొల్పబడువాడవగునట్లు, అద్య=నేడు, నిశామ్=రాత్రిని, శేషే=నిద్రింతువు. నిశ్చింతగా గాఢముగా నిద్రింపుమనుట. అద్య=నేడు, భువనమ్=లోకము, అకేశవమ్=కృష్ణరహితము, అపాండవమ్= పాండవరహితము, నిస్సోమకమ్=సోమకవంశరహితమును అగును. అద్య= ఈనాడు, దోశ్శాలినామ్=భుజపరాక్రమముకలవారికి, ఇయమ్=ఈ, రణ కథా= యుద్ధ వృత్తాంతము—రణమనుమాట— పరిసమాప్యతే=ముగింపజేయబడుచున్నది. నృప = రాజులనునట్టి, కానన=అరణ్యములతోనైన, అతి గురుః=మిక్కిలి గొప్పదైన, భారః=బరువు, భువః=భూమికి, అద్య=నేడు, అపైతు=తొలగుగాక!

సమాసములు :— ప్రయత్నేన పరిబోధితః—ప్రయత్నపరిబోధితః. న విద్యంతే కేశవః యస్మిన్. న విద్యంతే పాండవాః యస్మిన్. నిర్గతః సోమక

కర్ణః : (విహస్య) వక్తుం సుకరమిదం దుష్కరమధ్యవసితుమ్.
బహవః కౌరవబలేఽస్య కర్మణః శక్తాః.

అశ్వత్థామా : అంగరాజ, ఏవమిదమ్. బహవః కౌరవబలేఽత్ర
శక్తాః. కిం తు దుఃఖోపహతః శోకావేగవశాత్
బ్రవీమి న పునర్వీరజనాధిక్షేపేణ.

---

వంశః యస్మాత్ తత్ నిస్సోమకమ్. రణస్య కథా. దోర్భిః శాలన్తే ఇతి దోశ్శాలినః—తేషామ్. నృపాః ఏవ కాననాని—నృపకాననైః అతిగురుః.

సంధులు — స్తుతిభిః+అద్య, అతిగురుః+అద్య—రేఫాదేశవిసర్గ. కథా+అద్య, కానన+అతిగురు—సవర్ణదీర్ఘ. భారః+భువః—ఉత్వాదేశవిసర్గసంధి.

క్రియ :- శీఙ్ స్వప్నే, ఆత్మనే, లట్, మధ్యమ
శేషే—శయాథే—శేధ్వే
ఆప్ఌ లంభనే, కర్మణి, ఆత్మనే, లట్, ప్రథమ

(సమ్+ఆప్+య)
ఆప్యతే—ఆప్యేతే—ఆప్యన్తే
ఇణ్ గతౌ, పరస్మై, లోట్—ప్రథమ
ఏతు/ఇతాత్—ఇతామ్—యన్తు (అప+ఏతు—వృద్ధి)

వక్తుమితి :- (విహస్య=ఏటకారముగా నవ్వి) ఇదమ్=ఇది, వక్తుమ్=చెప్పుటకు, సుకరమ్=తేలికే, అధ్యవసితుమ్=నిర్వహించుటకు, దుష్కరమ్=కష్టము. కౌరవబలే=కౌరవసైన్యమునందు, అస్య=ఈ, కర్మణః=పనికి, శక్తాః=చాలినవారు—సమర్థులు, బహవః=చాలమంది ఉన్నారు.

అంగరాజేతి :- కర్ణా!, ఇదమ్=ఇది, ఏవమ్=నీవన్నట్లే, బహవః=పలువుర, కౌరవబలే=కురుసైన్యమునందు, అత్ర=ఈ పని చేయుటయందు, శక్తాః=సమర్థులు. కిన్తు=అయినను, దుఃఖోపహతః=దుఃఖపీడితుడనై, శోకావేగ

కర్ణః : మూఢ, దుఃఖితస్యాశ్రుపాతః కుపితస్య చాయుధ ద్వితీయస్య సంగ్రామావతరణముచితం, నైవం విధాః ప్రలాపాః

అశ్వత్థామా : (సక్రోధమ్) అరేరే రాధాగర్భభారభూత, సూతాపసద, మమాపి నామాశ్వత్థామ్నో దుఃఖితస్యాశ్రుభిః ప్రతిక్రియాముపదిశసి న శస్త్రేణ పశ్య—

నిర్వీర్యం గురుశాపభాషితవశాత్కిం మే తవేవాయుధం
సంప్రత్యేవ భయాద్విహాయ సమరం ప్రాప్తోఽస్మి కిం త్వం యథా।

---

వశాత్=శోకముయొక్క తీవ్రతవలన, బ్రవీమి=పల్కుతినేకాని, వీరజనాధిక్షేపేణ= కురువీరులపట్ల ధిక్కారముతో, న పునః=కాదు సుమా!

మూఢేతి :— మూఢుడా! దుఃఖితస్య=శోకాక్రాంతునకు, అశ్రుపాతః= కన్నీరు, చ=మరియు, కుపితస్య=కోపావిష్టుడై, ఆయుధ ద్వితీయస్య=శస్త్రము సహాయముగాకల్గినవానికి, సంగ్రామావతరణమ్=యుద్ధభూమికి ఉరుకుట, ఉచితమ్= అర్హము, ఏవం విధాః=ఇటువంటి, ప్రలాపాః=డంబములు, న=ఉచితముకాదు.

అరేరేఇతి :— (సక్రోధమ్=క్రోధముతో) అరేరే=ఓరోరీ! రాధాగర్భ భారభూత=రాధాదేవి గర్భాశయమునకు బరువుచేటయినవాడా! సూతాపసద=నీచ రథకారా! దుఃఖితస్య=దుఃఖితుడనైన, అశ్వత్థామ్నః=అశ్వత్థామను, మమ అపి నామ = నాకుగూడ, అశ్రుభిః = కన్నీటితో, ప్రతిక్రియామ్ = ప్రతీకారమును, (దుఃఖోపశమనమును), ఉపదిశసి = ఉపదేశించుచున్నావు, న శస్త్రేణ = ఆయుధముతో కాదనుచున్నావు—ఆయుధము ధరించి ప్రతీకారము తీర్చుకొనుటకు నీవు సమర్థుడవు కావనుచున్నావు. పశ్య=చూడు—

నిర్వీర్యమితి :— మే, ఆయుధమ్, తవ, ఇవ, గురుశాపభాషితవశాత్, నిర్వీర్యమ్, కిమ్? త్వమ్, యథా, సంప్రతి, ఏవ, భయాత్, సమరమ్, విహాయ,

జాతోఽహం స్తుతివంశకీర్తనవిదాం కిం సారథీనాం కులే
క్షుద్రారాతికృతాప్రియం ప్రతికరోమ్యస్త్రేణ నాస్త్రేణ
యత్ ॥ 35

---

ప్రాప్తః, అస్మి, కిమ్? స్తుతివంశకీర్తనవిదామ్, సారథీనామ్, కులే, అహమ్, జాతః కిమ్?, క్షుద్రారాతికృతాప్రియమ్, అస్త్రేణ, ప్రతికరోమి, న, అస్త్రేణ, యత్.

**అర్థము** :— మే=నాయొక్క, ఆయుధమ్=శస్త్రము, తవ ఇవ=నీ యొక్క ఆయుధమువలె, గురుశాప భాషిత వశాత్=గురువుయొక్క శాపోక్తుల వలన, నిర్వీర్యమ్ కిమ్=శక్తిరహితము అయినదా?; త్వమ్ యథా=నీవలె, సంప్రతి ఏవ=ఇప్పుడే, భయాత్=భయమువలన, సమరమ్ విహాయ=యుద్ధము వీడి, ప్రాప్తః=వచ్చినవాడను, అస్మి కిమ్=అయితినా?, స్తుతి=పొగడుటలకు, వంశకీర్తన=కులస్తుతులకు, విదామ్=వేత్తలయిన—స్తోత్రపాఠములకు నేర్పరులైన, సారథీనామ్=సూతులయొక్క, కులే=వంశమున, అహమ్=నేను, జాతః కిమ్= పుట్టినవాడనా? క్షుద్ర=నీచులైన, అరాతి=శత్రువులచే, కృత=చేయబడిన, అప్రియమ్=అనిష్టమును, అస్త్రేణ=కన్నీటితో, ప్రతికరోమి=ప్రతికరింతును, న అస్త్రేణ యత్=ఆయుధముతో కాదు అనుటకు—అని వెనుకకు అన్వయము. (శార్దూలము)

**సమాసములు** :— శాపరూపమ్ భాషితమ్—శాపభాషితమ్. గురోః శాపభాషితమ్—గురుశాపభాషితస్య వశాత్. వంశస్య కీర్తనమ్—స్తుతయశ్చ వంశకీర్తనాని చ—స్తుతివంశకీర్తనాని వేత్తి—తేషామ్. క్షుద్రశ్చాసౌ అరాతిశ్చ— క్షుద్రారాతినా కృతమ్—క్షుద్రారాతికృతం చ తదప్రియం చ.

**సంధులు** :— తవ+ఇవ—గుణసంధి. తవేవ+ఆయుధమ్, క్షుద్ర+ అరాతి, కృత+అప్రియమ్, న+అస్త్రేణ—సవర్ణదీర్ఘ. సంప్రతి+ఏవ, కరోమి+ అస్త్రేణ—యణాదేశ. ప్రాప్తః+అస్మి—ఉత్వాదేశ—ప్రాప్తో+అస్మి—పూర్వరూప సంధి. జాతః+అహమ్—జాతో+అహమ్—ఉత్వాదేశ, పూర్వరూప.

కర్ణః : (సక్రోధమ్) అరేరే వాచాట, వృథా శస్త్రగ్రహణ
దుర్విదగ్ధ వటో!
నిర్వీర్యం వా సవీర్యం వా మయా నోత్సృష్ట
మాయుధం।
యథా పాంచాలభీతేన పిత్రా తే బాహుశాలినా॥ 36
అపిచ—
సూతో వా సూతపుత్రో వా యో వా కో వా
భవామ్యహమ్।
దైవాయత్తం కులే జన్మ మదాయత్తం తు పౌరుషమ్॥
37

---

క్రియలు :— అస భువి, లట్, పరస్మై, ఉత్తమ—అస్మి—స్వః—స్మః. డుకృఞ్ కరణే—పరస్మై, లట్, ఉత్తమ—కరోమి—కుర్వః—కుర్మః.

వాచాటేతి :— (క్రోధముతో) ఓరోరీ! వాచాట=దుష్ప్రలాపీ! వృథా=వ్యర్థముగా, శస్త్రగ్రహణ=ఆయుధమునుపట్టి, దుర్విదగ్ధ=మిడిసిపడుచున్న, వటో=బ్రహ్మచారీ!

నిర్వీర్యమితి :— పాంచాలభీతేన, బాహుశాలినా, తే, పిత్రా, యథా, ఉత్సృష్టమ్, తథా, మయా, నిర్వీర్యం, వా, సవీర్యమ్, వా, ఆయుధమ్, న, ఉత్సృష్టమ్.

అర్థము :— పాంచాలభీతేన = ద్రుపదపుత్రునికి భయపడినవాడును, బాహుశాలినా=భుజపరాక్రమముకలవాడునైన, తే=నీయొక్క, పిత్రా=తండ్రిచేత, యథా=ఏవిధముగా, ఆయుధమ్=ఆయుధము, ఉత్సృష్టమ్=విడువబడినదో, తథా=ఆవిధముగా, మయా=నాచేత, నిర్వీర్యమ్ వా=బలహీనమో, సవీర్యమ్ వా=బలసహితమో, ఆయుధమ్=ఆయుధము, న ఉత్సృష్టమ్=విడువబడలేదు.

అపి చ=మరియు—

సూతో వేతి :— అహమ్=నేను, సూతః వా=సూతుడనో, సూతపుత్రః

అశ్వత్థామా : (సక్రోధమ్) అరేరే రథకారకులకలంక, రాధాగర్భభారభూత, అరే ఆయుధానభిజ్ఞ, తాతమప్యధిక్షిపసి. అథవా—

స భీరుః శూరో వా ప్రథితభుజసారస్త్రిభువనే।
కృతం యత్తేనాజౌ ప్రతిదినమియం వేత్తి వసుధా।
పరిత్యక్తం శస్త్రం కథమితి స సత్యవ్రతధరః
పృథాసూనుః సాక్షీ త్వమసి రణభీరో క్వ ను తదా॥ 38

---

వా=సూతపుత్రుడనో, యః వా కః వా=ఎవడో ఒకడను, భవామి=అగుదును. కులే=ఒక కులమునందు, జన్మ=పుట్టుక, దైవాయత్తమ్=దైవాధీనము. తు=కాని, పౌరుషమ్=శౌర్యముమాత్రము, మదాయత్తమ్=నా అధీనములోనిదే.

**అరేరే ఇతి :-** (సక్రోధమ్=కోపముతో) అరేరే=ఓరోరీ!, రథకారకుల కలంక=సూతవంశమునకు మాయని మచ్చవంటివాడా!, రాధాగర్భభారభూతుడా!. ఓరీ!, ఆయుధానభిజ్ఞ=శస్త్రప్రయోగమునెరుగని అజ్ఞుడా!, తాతమ్ అపి=నా తండ్రినికూడ, అధిక్షిపసి=దెప్పుచున్నావా! అథవా=కానిమ్ము—

**స భీరురితి :-** త్రిభువనే, ప్రథిత భుజసారః, సః, భీరుః వా, శూరః వా; తేన, ప్రతిదినమ్, ఆజౌ, యత్, కృతమ్, ఇయమ్, వసుధా, వేత్తి; శస్త్రమ్, కథమ్, పరిత్యక్తమ్, ఇతి, సత్యవ్రతధరః, సః, పృథాసూనుః, సాక్షీ; రణభీరో, త్వమ్, తదా, క్వను అపి? (శిఖరిణీ)

**అర్థము :-** త్రిభువనే=ముల్లోకములందును, ప్రథిత=ప్రసిద్ధికెక్కిన, భుజసారః=బాహుబలముకలవాడైన, సః=ఆ ద్రోణుడు, భీరుః వా=పిరికివాడో, శూరః వా=శూరుడో!—అది అట్లుండనిమ్ము—తేన=వానిచేత, ప్రతిదినమ్=(ఇన్ని రోజులుగా) నిత్యమును, ఆజౌ=రణరంగమున, యత్ కృతమ్=ఏది ఆచరింపబడినదో దానిని, ఇయమ్=ఈ, వసుధా=భూమి, వేత్తి=ఎరుగును; శస్త్రమ్=

కర్ణః : (విహస్య) ఏవం భీరురహమ్. త్వం పునర్విక్రమైకరసం పితరమనుస్మృత్య కిం కరిష్యసీతి మహాన్మే సంశయో జాతః. అపిచ రే మూఢ—

యది శస్త్రముజ్ఝిత మశస్త్రపాణయో
న నివారయన్తి కిమరీ నుదాయుధాన్।
య దనేన మౌళిదళనేఽప్యుదాసితం
సుచిరం స్త్రియేవ నృపచక్రసన్నిధౌ॥ 39

---

ఆయుధము, కథమ్=ఎట్లు, పరిత్యక్తమ్ ఇతి=విడువబడినదో అనుటకు, సత్య వ్రతధరః=సత్యవాక్యపరిపాలకుడైన, సః=ఆ, పృథాసూనుః=కౌంతేయుడు, సాక్షీ=ప్రత్యక్షద్రష్ట. రణభీరో=ఆజికి భయపడువాడా!, త్వమ్=నీవు, తదా= ఆ సమయమునందు, క్వ ను అసి=ఎచ్చటనుంటివో!

సమాసములు :— భుజయోః సారమ్—ప్రథితం భుజసారం యస్య సః. త్రయాణాం భువనానాం సమాహారః—త్రిభువనమ్—తస్మిన్. దినే దినే ప్రతిదినమ్. సత్యమేవ వ్రతమ్—సత్యవ్రతస్య ధరః (ధరతీతి ధరః). పృథాయాః సూనుః. రణాత్ భీరుః—రణభీరుః—తత్సంబుద్ధౌ.

ఏవమితి :- (విహస్య=వెటకారముగా నవ్వి) ఏవమ్=ఇట్లు, అహమ్= నేను, భీరుః=పిరికివాడనే—నిజమే. త్వమ్ పునః=నీవుమాత్రము, విక్రమైక రసమ్=పరాక్రమమున ఆనందించువాడైన, పితరమ్=తండ్రిని, అనుస్మృత్య= తలచుకొని, కిం కరిష్యసి=ఏమి చేయబోవుచున్నావు, ఇతి=అని, మే=నాకు, మహాన్=గొప్ప, సంశయః=సంశయము, జాతః=కలిగినది. అపిచ=మరియు, రే=ఓరీ, మూఢ=మూర్ఖుడా!

యదీతి :— శస్త్రమ్, ఉజ్ఝితమ్, యది, అశస్త్రపాణయః, ఉదాయుధాన్, అరీన్, న, నివారయన్తి, కిమ్? నృపచక్రసన్నిధౌ, స్త్రియా ఇవ, అనేన, మౌళి దళనే, అపి, సుచిరమ్, ఉదాసితమ్,

అశ్వత్థామా : (సక్రోధం సకంపం చ) దురాత్మన్, రాజవల్లభ,
ప్రగల్భ, సూతాపసద. అసంబద్ధప్రలాపిన్,

---

అర్థము :— శస్త్రమ్ = ఆయుధము, ఉజ్ఝితమ్ యది=విడువబడినచో, అశస్త్రపాణయః=చేతిలో నాయుధములేని మహావీరులు, ఉదాయుధాన్=ఎత్తిపట్టిన ఆయుధములు కలవారయిన, అరీన్ = శత్రువులను, న నివారయన్తి కిమ్ = ఎదుర్కొని మళ్ళించుటలేదా? నృపచక్రసన్నిధౌ=రాజసమూహముయొక్క ఎట్టయెదుట, స్త్రియా ఇవ=ఆడుదానిచేతవలె, అనేన=నీ తండ్రిచేత, మౌళిదళనే అపి= శిరశ్ఛేదమువట్లగూడ, సుచిరమ్=పూర్తియగునంతవరకు, ఉదాసితమ్=ఉపేక్ష వహింపబడినది— నీ తండ్రి ఆడుదానివలె నూరకుండెనే తప్ప తిరుగబడుటకు ప్రయత్నమే చేయలేదనుట.

సమాసములు :- న విద్యతే శస్త్రం పాణౌ యస్య సః—అశస్త్రపాణిః. పాణీ—పాణయః. మౌళేః దళనమ్—తస్మిన్. నృపాణాం చక్రస్య సన్నిధౌ.

సంధులు :- పాణయః+న—ఉత్వాదేశవిసర్గ. దలనే+అపి—పూర్వరూపసంధి. అపి+ఉదాసితమ్—యణాదేశ. స్త్రియా+ఇవ—గుణసంధి.

క్రియ :— వృఞ్ ఆవరణే—ణిజ్వ—పరస్మై, లట్, ప్రథమ
(ని) వారయతి—వారయతః—వారయన్తి.

ఛందస్సు :— మంజుభాషిణీవృత్తము—సజసా జగౌ చ యది మంజుభాషిణీ.

| స | జ | స | జ | గ |
|---|---|---|---|---|
| I I U | I U I | I I U | I U I | U |
| సుచిరం | స్త్రియేవ | నృపచ | క్రసన్ని | ధౌ |

దురాత్మన్నితి :- (సక్రోధమ్ = కోపముతోను, చ = మరియు, సకంపమ్ = కంపముతోను) దురాత్మన్ = దుర్మార్గుడా! రాజవల్లభ=రాజునకు ప్రియోక్తులు పల్కువాడా!, ప్రగల్భ = కోతలరాయడా! సూతాపసద = నీచసూతుడా!, అసంబద్ధప్రలాపిన్=నోటికివచ్చినట్లు ప్రేలువాడా!

కథమపి న నిషిద్ధో దుఃఖినా భీరుణా వా
ద్రుపదతనయపాణి స్తేన పిత్రా మమాద్య।
తవ భుజబల దర్పాధ్మాయమానస్య వామః
శిరసి చరణ ఏష న్యస్యతే వారయైనమ్॥ 40

---

కథమితి :– దుఃఖినా వా, భీరుణా వా, కథమపి, తేన, మమ, పిత్రా, ద్రుపదతనయపాణిః, అద్య, న, నిషిద్ధః; భుజబలదర్పాధ్మాయమానస్య, తవ, శిరసి, ఏషః, వామః, చరణః, న్యస్యతే, ఏనమ్, వారయ.

అర్థము :– దుఃఖినా వా=దుఃఖితుడగుటచేతనో, భీరుణా వా=పిరికివాడగుటచేతనో, కథమపి=ఏవిధముగానైనను, తేన=ఆ, మమ=నాయొక్క, పిత్రా=తండ్రిచేత, ద్రుపదతనయపాణిః=ధృష్టద్యుమ్నుని చేయి, అద్య=నేడు, న నిషిద్ధః = వారింపబడలేదు; భుజబల=బాహుబలపు, దర్ప=గర్వముతో, ఆధ్మాయమానస్య = పిక్కటిల్లుచున్న, తవ = నీయొక్క, శిరసి=శిరస్సునందు (తలపై ననుట), ఏషః=ఇదే, వామః చరణః=ఎడమకాలు, న్యస్యతే=ఉంచబడుచున్నది, ఏనమ్=దీనిని, వారయ=వారించుము–తప్పించుకొమ్మనుట.

సమాసములు :– ద్రుపదస్య తనయః–ద్రుపదతనయస్య పాణిః. భుజయోః బలమ్–భుజబలస్య దర్పః–భుజబలదర్పేణ ఆధ్మాయమానః–తస్య.

సంధులు :– నిషిద్ధః+దుఃఖినా–ఉత్వాదేశవిసర్గ. పాణిః+తేన–సాదేశవిసర్గ. మమ+అద్య, దర్ప+ఆధ్మాయమాన–సవర్ణదీర్ఘ. చరణః+ఏషః+న్యస్యతే–విసర్గలోపసంధి. వారయ+ఏనమ్–వృద్ధిసంధి.

క్రియ :– వృఞ్ ఆవరణే–ణిజ్వా–లోట్–పరస్మై–మధ్యమ.
వారయ/వారయతాత్–వారయతమ్–వారయత

ఛందస్సు :- మాలినీవృత్తము–న-న-మ-య-య యుతేయం మాలినీ భోగిలోకైః

| న | న | మ | య | య |
|---|---|---|---|---|
| I I I | I I I | U U U | I U U | I U U |
| శిరసి | చరణ | ఏషన్య | స్యతేవా | రయైనమ్ |

(ఇతి తథా కర్తుముత్తిష్ఠతి)

కృపదుర్యోధనౌ : గురుపుత్ర, మర్షయ మర్షయ. (ఇతి నివారయతః)
(అశ్వత్థామా చరణప్రహారం నాటయతి)

కర్ణః : (సక్రోధముత్థాయ ఖడ్గమాకృష్య) అరే దురాత్మన్, వాచాల, బ్రహ్మబంధో, ఆత్మశ్లాఘ—

జాత్యా కామమవధ్యోఽసి చరణం త్విదముద్ధృతమ్।
అనేన లూనం ఖడ్గేన పతితం ద్రక్ష్యసి క్షితౌ॥ 41

---

(ఇతి=అని, తథా=అట్లు, కర్తుమ్=చేయుటకు, ఉత్తిష్ఠతి=లేచును)

గురుపుత్రేతి :— గురుపుత్రా! మర్షయ మర్షయ = తాళుము తాళుము. (ఇతి=అని, నివారయతః=వారింతురు).

(అశ్వత్థామ, చరణప్రహారమ్ = పాదతాడనమును, నాటయతి = అభినయించును)

అరే ఇతి :— (సక్రోధమ్=కోపముతో, ఉత్థాయ=లేచి, ఖడ్గమ్=కత్తిని, ఆకృష్య=దూసి) అరే దురాత్మన్=ఓరీ దురాత్మా! వాచాల=వదరుబోతా! బ్రహ్మబంధో=బ్రాహ్మణాధమ! ఆత్మశ్లాఘ=ఆత్మస్తుతిపరాయణా!

జాత్యేతి :— జాత్యా, కామమ్, అవధ్యః, అసి, తు, ఉద్ధృతమ్, ఇదమ్, చరణమ్, అనేన, ఖడ్గేన, లూనమ్, క్షితౌ, పతితమ్, ద్రక్ష్యసి.

అర్థము :— జాత్యా=పుట్టుకతో, కామమ్=మిక్కిలి, అవధ్యః అసి= చంపదగనివాడవైతివి—(ఏమి చేసినను నీవవధ్యుడవనుట—కామమ్). తు=కాని, ఉద్ధృతమ్=నాపై కెత్తబడిన, ఇదమ్=ఈ, చరణమ్=పాదము, అనేన=ఈ, ఖడ్గేన= కత్తితో, లూనమ్=ఖండింపబడినదై, క్షితౌ=నేలపై, పతితమ్=పడిపోయినదిగా, ద్రక్ష్యసి=చూతువు.

అశ్వత్థామా : అరే మూఢ! కిం నామ జాత్యా కామమవధ్యోఽహమ్. ఇయం సా జాతిః పరిత్యక్తా. (ఇతి యజ్ఞోపవీతం ఛినత్తి. పునస్సక్రోధమ్)

అద్య మిథ్యా ప్రతిజ్ఞోఽసౌ కిరీటీ క్రియతే మయా।
శస్త్రం గృహాణ వా త్యక్త్వా మౌలౌ వా
రచయాంజలిమ్॥ 42

(ఉభావపి ఖడ్గమాకృష్య అన్యోన్యం ప్రహర్తుముద్యతౌ. కృపదుర్యోధనౌ వారయతః).

---

అరే మూఢేతి :- అరే మూఢ=ఓరీ మూఢుడా! కిమ్ నామ=ఏమది!, అహమ్=నేను, జాత్యా=పుట్టుకచేత, కామమ్ అవధ్యః=ఏమైనను చంపదగని వాడనా! ఇయమ్=ఇదిగో, సా=ఆ, జాతిః=బ్రాహ్మణత్వము, పరిత్యక్తా=విడువ బడినది. (ఇతి=అని, యజ్ఞోపవీతమ్=జంజెమును, ఛినత్తి=త్రెంచివేయును. పునశ్చ=తిరిగి, సక్రోధమ్=రోషముతో)

అద్యేతి :- అద్య, మయా, అసౌ, కిరీటీ, మిథ్యాప్రతిజ్ఞః, క్రియతే; శస్త్రమ్, గృహాణ, వా, త్యక్త్వా, మౌళౌ, అంజలిమ్, రచయ.

అర్థము :- అద్య=నేడు, మయా=నాచేత, అసౌ=ఆ, కిరీటీ=క్రీడి, మిథ్యాప్రతిజ్ఞః=అసత్యమైన ప్రతిజ్ఞ కలవాడుగా, క్రియతే=చేయబడుచున్నాడు. (కర్ణుని సంహరింతునన్న కిరీటి ప్రతిజ్ఞ వ్యర్థమగుననుట). శస్త్రమ్= ఆయుధమును, గృహాణ=చేపట్టుము, వా=లేదా, త్యక్త్వా=ఆయుధము విడిచి, మౌళౌ=శిరసునందు, అంజలిమ్=నమస్కృతిని, రచయ=వహింపుము—శరణు వేడు మనుట.

(ఉభౌ అపి=ఇరువురును, ఖడ్గమ్ ఆకృష్య=కత్తిదూసి, అన్యోన్యమ్= ఒకరినొకరు, ప్రహర్తుమ్=చంపుకొనుటకు, ఉద్యతౌ=ఉద్యుక్తులైరి. కృప దుర్యోధనులు, వారయతః=వారింతురు).

దుర్యోధనః : సఖే, ఆచార్యపుత్ర, శస్త్రగ్రహణేనాలమ్.

కృపః : వత్స, సూతపుత్ర, శస్త్రగ్రహణేనాలమ్.

అశ్వత్థామా : మాతుల, మాతుల, కిం నివారయసి. అయమపి తాతనిందాప్రగల్భః సూతాపసదో ధృష్టద్యుమ్న పక్షపాత్యేవ.

కర్ణః : రాజన్, న ఖల్వహం నివారయితవ్యః—

ఉపేక్షితానాం మందానాం ధీరసత్త్వైరవజ్ఞయా।
అత్రాసితానాం క్రోధాంధైర్భవత్యేషా వికత్థనా॥ 43

---

సఖేఇతి :- సఖే=ఓ మిత్రుడా!, ఆచార్యపుత్ర=ఓ ఆచార్యపుత్రుడా! శస్త్రగ్రహణేన=కత్తిదూయుటతో, అలమ్=చాలు—కత్తిదూయవద్దనుట.

వత్సేతి :- వత్స=నాయనా! అశ్వత్థామా!, సూతపుత్ర=ఓ కర్ణుడా!, శస్త్రగ్రహణేన అలమ్=కత్తిదూయుట చాలు చాలు.

మాతులేతి :- మాతుల మాతుల=మామా! మామా! నివారయసి కిమ్=నివారింతువేమి! తాతనిందా ప్రగల్భః = తండ్రిని నిందించుచున్న వాచాలుడు, సూతాపసదః=నీచ సూతుడు, అయమ్ అపి=వీడుకూడ, ధృష్టద్యుమ్నపక్షపాతీ ఏవ=ధృష్టద్యుమ్నుని పాటివాడే.

రాజన్నితి :— రాజన్=రారాజా!, అహమ్=నేను, నివారయితవ్యః న ఖలు=ఆపదగినవాడనుకాదు సుమా!—నన్నుకాదు ఆపవలసిన దనుట.

ఉపేక్షితానామితి :— ధీరసత్త్వైః, అవజ్ఞయా, ఉపేక్షితానామ్, క్రోధాంధైః, అత్రాసితానామ్, మందానామ్, ఏషా, వికత్థనా, భవతి.

అర్థము :— ధీరసత్త్వైః=గంభీరస్వభావులచే—ధీరులైన బలవంతులచే, అవజ్ఞయా = అవజ్ఞతో (వీనిని చంపుట వీరోచితముకాదను భావముతో)

అశ్వత్థామా : రాజన్, ముంచ ముంచైనమ్. ఆసాదయతు మద్భుజాంతర నిష్పేష సులభ మసూనా మవ సాదనమ్. అన్యచ్చ, రాజన్, స్నేహేన కార్యేణ వా యత్త్వమేనం తాతాధిక్షేపకారిణం దురాత్మానం మత్తః పరిరక్షితు మిచ్ఛసి తదుభయమపి వృథైవ. పశ్య—

పాపప్రియస్తవ కథం గుణినః సఖాయం
సూతాన్వయః శశధరాన్వయసంభవస్య।

---

ఉపేక్షితానామ్ = ఉపేక్షింపబడినవారికిని, క్రోధాంధైః = తీవ్రకోపావిష్టులచేత, అత్రాసితానామ్=భయపెట్టబడనివారికిని, మందానామ్=మూర్ఖులకును, ఏషా= ఇటువంటి, వికత్థనా=ఆత్మస్తుతిపరాయణత్వము, భవతి=సంభవించుచుండును (అనుష్టుప్).

రాజన్ ముంచేతి :— రాజన్ = రారాజా! ఏనమ్ = వీనిని, ముంచ ముంచ=విడువుము విడువుము, మత్=నాయొక్క, భుజాంతర=బాహువుల నడిమి భాగమున, నిష్పేష=నలిమివేయబడుటతో, సులభమ్=తేలికగా లభించునదైన, అసూనామ్ అవసాదనమ్ = ప్రాణముల పరిసమాప్తిని — ప్రాణత్యాగముననుట, ఆసాదయతు = పొందునుగాక. అన్యత్ చ = అంతేకాక, రాజన్=రాజా!, స్నేహేన వా = మైత్రితోగాని, కార్యేణ వా = పనితోగాని, (ప్రయోజనముతో గాని), త్వమ్ = నీవు, తాతాధిక్షేపకారిణమ్ = తండ్రిని నిందించువాడును, దురాత్మానమ్=దుష్టుడునైన, ఏనమ్=ఈ కర్ణుని, మత్తః=నానుండి, పరిరక్షితుమ్= కాపాడుటకు, యత్ ఇచ్ఛసి=కోరుచుంటివేని, తత్ ఉభయమ్ అపి=అవి రెండును, వృథా ఏవ=వ్యర్థమే. పశ్య=చూడు—(ఎట్లో చెప్పుచున్నాడు)

పాపేతి :— హే నృప, శశధరాన్వయ సంభవస్య, గుణినః, తవ, పాపప్రియః, సూతాన్వయః, అయమ్, కథమ్, సఖా? అహమ్, కిరీటినమ్, హంతా, ముంచ, అద్య, క్రోధాత్, లోకమ్, అకర్ణమ్, అపృథాత్మజమ్, కుర్యామ్.

హంతా కిరీటినమహం నృప ముంచ కుర్యాం
క్రోధాదకర్ణమపృథాత్మజమద్య లోకమ్॥ 44

(ఇతి ప్రహర్తు మిచ్ఛతి)

---

**అర్థము :—** హే నృప=ఓ రాజా!, శశధరాన్వయసంభవస్య=చంద్ర వంశమునందు పుట్టినవాడవును, గుణినః=గుణవంతుడవును అయిన, తవ=నీకు, పాపప్రియః=పాపకార్యములకిష్టపడువాడును, సూతాన్వయః=రథకారవంశమునకు చెందినవాడును అయిన, అయమ్=ఈ కర్ణుడు, కథమ్=ఎట్లు, సఖా=చెలికాడు? ఏవిధముగను నీ చెలిమికి తగడనుట. అహమ్=నేను, కిరీటినమ్=అర్జునుని, హంతా = చంపబోవుచున్నాను. దీనికోసమై కర్ణుని రక్షింపవలసిన అవసరము లేదనుట. (అతః=అందుచే) ముంచ=వీనిని వదులుము. అద్య=ఈరోజు, క్రోధాత్ = రోషమువలన(తో), లోకమ్ = ప్రపంచమును, అకర్ణమ్=కర్ణ రహితమును, అపృథాత్మజమ్=అర్జునరహితమును, కుర్యామ్=తప్పక చేయుదును. (వసంతతిలకావృత్తము).

**సమాసములు :-** పాపాని (పాపకృత్యాని) ఏవ ప్రియాణి యస్య సః. ధరతీతి ధరః, శశస్యధరః—శశధరస్య అన్వయః—శశధరాన్వయే సంభవః (యస్య సః)—శశధరాన్వయ సంభవః—తస్య. న విద్యతే కర్ణః యస్మిన్ సః—అకర్ణః—తమ్. పృథాయాః ఆత్మజః—న విద్యతే పృథాత్మజః యస్మిన్ తమ్.

**సంధులు :-** ప్రియః+తవ—సాదేశవిసర్గ. సఖా+అయమ్, సూత+అన్వయః, శశధర+అన్వయ, అపృథా=ఆత్మజ—సవర్ణదీర్ఘ.

**క్రియ :-** హన హింసా గత్యోః, పరస్మై, లుట్, ప్రథమ
హంతా—హంతారౌ—హంతారః
డు కృఞ్ కరణే—పరస్మై—విధిలిఙ్—ఉత్తమ
కుర్యామ్—కుర్యావ—కుర్యామ

(ఇతి=అని, ప్రహర్తుమ్=చంపుటకు, ఇచ్ఛతి=సిద్ధపడును)

కర్ణః : (ఖడ్గముద్యమ్య) అరే వాచాట. బ్రాహ్మణాధమ, అయం న భవసి. రాజన్, ముఞ్చ ముఞ్చ న ఖల్వహం వారయితవ్యః. (హన్తుమిచ్ఛతి)

(దుర్యోధన కృపౌ నివారయతః)

దుర్యోధనః : కర్ణ, గురుపుత్ర, కోఽయమద్య యువయోర్వ్యామోహః.

కృపః : వత్స, అన్యదేవ ప్రస్తుతమన్యత్రావేగ ఇతి కోఽయం వ్యామోహః స్వబల వ్యసనం చేదమస్మిన్ కాలే రాజకులస్యాస్య యుష్మత్త ఏవ భవతీతి వామః పంథాః.

---

అరేవాచాటేతి :— (ఖడ్గమ్ = కత్తిని, ఉద్యమ్య = పైకెత్తి) ఓరీ వదరుబోతా!, బ్రాహ్మణాధముడా!, అయమ్=ఇదే, న భవసి=నీవు లేనివాడవగు చున్నావు (చనిపోవుచున్నావనుట) రాజన్=రారాజా!, ముంచ ముంచ=వదలుము వదలుము, అహమ్=నేను, వారయితవ్యః న ఖలు=వారింపబడవలసినవాడను కాదు సుమా! (హన్తుమ్=చంపుటకు, ఇచ్ఛతి=సిద్ధపడును).

(దుర్యోధన కృపౌ=దుర్యోధనుడును కృపాచార్యుడును, వారయతః= వారింతురు)

కర్ణేతి :— కర్ణ=కర్ణుడా, గురుపుత్ర=ఓ అశ్వత్థామా!, అద్య=నేడు, యువయోః=మీ ఇరువురియొక్క, అయమ్=ఈ, వ్యామోహః కః=బుద్ధి వినాశ మేమి!

వత్సేతి :— వత్స=బిడ్డా!, ప్రస్తుతమ్=ఇప్పుడు చేయవలసినది, అన్యత్ ఏవ=వేరొకటి, ఆవేగః=క్రోధావేశము, అన్యత్ర=మరొకచోట (చూపుచుంటివి) ఇతి=ఇది, వ్యామోహః అయమ్ కః=ఈ బుద్ధివిభ్రమమేమి!, అస్య=ఈ, రాజ కులస్య=రాజవంశమునకు, స్వబల వ్యసనమ్ ఇదమ్=స్వపక్ష వినాశమనునియ్యది,

అశ్వత్థామా : మాతుల, న లభ్యతేఽస్య కటుప్రలాపినో రథకార కుల కలంకస్య దర్పః శాతయితుమ్.

కృపః : వత్స, అకాలః ఖలు స్వబలప్రధాన విరోధస్య.

అశ్వత్థామా : మాతుల, యద్యేవమ్—

అయం పాపో యావన్న నిధనముపేయాదరిశరైః
పరిత్యక్తుం తావత్ ప్రియమపి మయాస్త్రం రణముఖే।

---

అస్మిన్ కాలే=ఈ తరుణమందు, యుష్మత్తః ఏవ=నీవలననే, భవతి ఇతి=అగుట యనునిది, వామః పంథాః=నింద్య పద్ధతి.

**మాతులేతి** :— మాతుల = మామయ్యా!, కటుప్రలాపినః=కటువుగా మాటలాడువాడును, రథకారకుల కలంకస్య=సూతవంశమునకు మాయని మచ్చ వంటివాడునైన, అస్య=ఈ కర్ణునియొక్క, దర్పః=గర్వము, శాతయితుమ్= అణచివేయుటకు, న లభ్యతే=(వీలు) దొరకకున్నది.

**వత్సేతి** :— బిడ్డా!, స్వబల = స్వసేనయందు, ప్రధాన = ముఖ్యమైన వానితో, విరోధస్య=విరోధమునకు, అకాలః ఖలు=ఇది సమయముకాదు సుమా!

**మాతులేతి** :— మాతుల=మామా!, ఏవమ్ యది=అట్లే అయినచో—

**అయమితి** :— అయమ్, పాపః, అరిశరైః, నిధనమ్, యావత్, న, ఉపేయాత్, తావత్, మయా, రణముఖే, ప్రియమ్, అపి, అస్త్రమ్, పరిత్యక్తుమ్; అస్మిన్, బలానామ్, నాథే [సతి]; సమరే, పరికుపితభీమార్జునభయే, సముత్పన్నే [సతి], రాజా, ప్రియసఖబలమ్, వేత్తు.

**అర్థము** - అయమ్=ఈ, పాపః=దుష్టుడు, అరిశరైః=శత్రుబాణములచే, నిధనమ్=చావును, యావత్ న ఉపేయాత్=ఎంతవరకు పొందడో, తావత్=అంత వరకు, మయా=నాచేత, రణముఖే=యుద్ధరంగమునందు, ప్రియమ్ అపి=

బలానాం నాథేఽస్మిన్ పరికుపిత భీమార్జునభయే
సముత్పన్నే రాజా ప్రియసఖబలం వేత్తు సమరే॥ 45

(ఇతి ఖడ్గముత్సృజతి)

కర్ణః : (విహస్య) కులక్రమాగతమే వైతద్భవాదృశాం యదస్త్ర పరిత్యాగో నామ.

---

ఇష్టమైనదే అయినప్పటికిని, అస్త్రమ్=ఆయుధము, పరిత్యక్తమ్=విడువబడినదే-విడిచివేసితిననుట. అస్మిన్=వీడు, బలానామ్=సైన్యములకు, నాథే సతి=నాయకుడై యుండగా, సమరే=యుద్ధమునందు, పరికుపిత=మిక్కిలి కోపావిష్టులైన, భీమార్జున=భీమార్జునులవల్ల, భయే=భీతి, సముత్పన్నే [సతి]=కలుగగా, ప్రియసఖ బలమ్=ప్రేమపాత్రుడైన చెలికాని శక్తిని, రాజా=రారాజు, వేత్తు=తెలిసికొనునుగాక! (శిఖరిణీవృత్తము)

సమాసములు :- అరీణాం శరాః_తైః. రణస్య ముఖః—తస్మిన్. భీమశ్చ అర్జునశ్చ—పరికుపితౌ చ తౌ భీమార్జునౌ చ—పరికుపిత భీమార్జునాభ్యాం భయమ్—తస్మిన్. ప్రియశ్చాసౌ సఖా చ—ప్రియసఖస్య బలమ్.

సంధులు :- పాపః + యావత్—ఉత్వాదేశవిసర్గ. యావత్+న—అనునాశికాదేశ. మయా+అస్త్రమ్, భీమ+అర్జున—సవర్ణదీర్ఘ. నాథే+అస్మిన్—పూర్వరూప.

క్రియ :- ఇణ్ గతౌ—పరస్మై—విధిలిఙ్—ప్రథమ.
ఉప+ఇయాత్—ఇయాతామ్—ఇయుః
విద జ్ఞానే—పరస్మై—లోట్—ప్రథమ
వేత్తు/విత్తాత్—విత్తామ్—విదన్తు

[ఇతి=అని, ఖడ్గమ్=కత్తిని, ఉత్సృజతి=వదలివేయును]

కులేతి :- [విహస్య=బిగ్గరగా నవ్వి] అస్త్రపరిత్యాగః నామ=అస్త్రసన్న్యాసము చేయుటయన్నది, యత్=ఏదయితే కలదో, ఏతత్=ఆయియ్యది

అశ్వత్థామా : నను రే, అపరిత్యక్తమపి భవాదృశై రాయుధం చిర పరిత్యక్తమేవ నిష్ఫలత్వాత్.

కర్ణః : అరే మూఢ!

ధృతాయుధో యావదహం తావదన్యైః కిమాయుధైః
యద్వా న సిద్ధమస్త్రేణ మమ తత్కేన సేత్స్యతి॥ 46

(నేపథ్యే)

---

భవాదృశామ్=మీవంటివారికి, కులక్రమాగతమ్ ఏవ=వంశాచారముగా వచ్చుచున్నదే కదా!

నన్వితి :– నను రే=ఓరోరీ! భవాదృశైః=నీవంటివారిచే, శస్త్రమ్=ఖడ్గము, అపరిత్యక్తమ్ అపి=విడువబడనిదైనను, నిష్ఫలత్వాత్=ప్రయోజన రహితమగుటవలన, చిరపరిత్యక్తమ్ ఏవ=ఏనాడో విడువబడినదే. నేను విడుచుట నీవు విడువకుండుట సమానమేయనుట.

అరే ఇతి :– అరే మూఢ=ఓరీ మూర్ఖుడా?

ధృతేతి :– అహమ్, యావత్, ధృతాయుధః, తావత్, అన్యైః, ఆయుధైః, కిమ్? మమ, అస్త్రేణ, యత్, న, సిద్ధమ్, తత్, కేన, సేత్స్యతి.

అర్థము :– అహమ్=నేను, యావత్=ఎంతవరకు, ధృతాయుధః=ఆయుధము ధరించియుందునో, తావత్=అంతవరకు, అన్యైః=ఇతరములైన, ఆయుధైః=ఆయుధములతో, కిమ్=ఏమి పని? మమ=నాయొక్క, అస్త్రేణ=ఆయుధముతో, యత్=ఏది, న సిద్ధమ్=సిద్ధింపదో, తత్=అది, కేన=ఎవనిచేత లేక దేనిచేత, సేత్స్యతి=సంపాదింపబడును? దేనిచేతను సంపాదింపబడదనుట. [అనుష్టుప్పు]

[నేపథ్యే=తెరలో]

ఆః దురాత్మన్, ద్రౌపదీ కేశాంబరాకర్షణ మహాపాతకిన్ ధార్తరాష్ట్రాపసద, చిరస్య ఖలు కాలస్య మత్సమ్ముఖమాగతోఽసి. క్షుద్రపశో, క్వేదానీం గమ్యతే. అపి చ, భోభో రాధేయ దుర్యోధన సౌబల ప్రభృతయః పాండవవిద్వేషిణ శ్చాపపాణయో మానధనాః శృణ్వన్తు భవన్తః—

స్పృష్టా యేన శిరోరుహే నృపశునా పాంచాలరాజాత్మజా
యేనాస్యాః పరిధానమప్యపహృతం రాజ్ఞాం గురూణాం పురః।
యస్యోరఃస్థల శోణితాసవమహం పాతుం ప్రతిజ్ఞాతవాన్
సోఽయం మద్భుజపఞ్జరే నిపతితః సంరక్ష్యతాం కౌరవాః॥ 47

---

ఆః దురాత్మన్=ఓరీ దుర్మార్గుడా!, ద్రౌపదీ=ద్రౌపదియొక్క, కేశ=కేశపాశమును, అంబర=వస్త్రమును, ఆకర్షణ=లాగుటచే, మహాపాతకిన్=మహాపాపము చేసినవాడా! ధార్తరాష్ట్ర+అపసద=నీచ కౌరవుడా!, చిరస్య కాలస్య=చిరకాలమునకు, మత్సమ్ముఖమ్=నా ఎదుటికి, ఆగతః=వచ్చినవాడవు, అసి ఖలు=అయితివిగదా! క్షుద్రపశో=నీచ పశువా! [ఓరీ పందీ అనుట], ఇదానీమ్=ఇప్పుడు, క్వ గమ్యతే=ఎచటికి పోదువు! అపి చ=మరియు, భోభో=ఓరోరీ!, రాధేయ = కర్ణ, దుర్యోధన, సౌబల = శకుని, ప్రభృతయః=ప్రభృతులారా!, పాండవ విద్వేషిణః=పాండవ శత్రువులారా!, చాపపాణయః=ధనుష్పాణులారా!, మానధనాః=అభిమానధనులారా!, భవన్తః=మీరు, శృణ్వన్తు=వినుడీ—

స్పృష్టేతి :— యేన, నృపశునా, పాంచాలరాజాత్మజా, శిరోరుహే, స్పృష్టా; యేన, అస్యాః, పరిధానమ్, అపి, రాజ్ఞామ్, గురూణామ్, పురః, అపహృతమ్, యస్య, ఉరఃస్థలశోణితాసవమ్, పాతుమ్, అహమ్, ప్రతిజ్ఞాతవాన్, సః, అయమ్, మద్భుజపంజరే, నిపతితః, కౌరవాః, సంరక్ష్యతామ్.

అర్థము :— యేన=ఏ, నృపశునా=నరరూపజంతువుచేత, పాంచాలరాజాత్మజా=ద్రౌపది, శిరోరుహే=కేశపాశమునందు, స్పృష్టా=తాకబడినదో, యేన=ఎవనిచే, అస్యాః=ద్రౌపదియొక్క, పరిధానమ్ అపి=వస్త్రముకూడ,

(సర్వే ఆకర్ణయన్తి)

అశ్వత్థామా : (సోత్ప్రాసమ్) అంగరాజ, సేనాపతే, జామదగ్న్య శిష్య, ద్రోణోపహాసిన్, భుజబలపరిరక్షితసకలలోక, (ధృతాయుధః ఇతి పఠిత్వా) ఇదం తదాసన్నతరమేవ సంవృత్తమ్. రక్షైనం సాంప్రతం భీమాత్ దుశ్శాసనమ్.

---

రాజ్ఞామ్=రాజులయొక్క, గురూణామ్=పెద్దలయొక్క, పురః=ఎట్టయెదుట, అపహృతమ్=లాగివేయబడినదో, యస్య=ఎవనియొక్క, ఉరఃస్థల=వక్షస్సీమయందలి, శోణిత+ఆసవమ్=రక్తమనునట్టి మద్యమును, పాతుమ్=త్రాగుటకు, అహమ్=నేను, ప్రతిజ్ఞాతవాన్=ప్రతిజ్ఞచేసి(న) యుంటినో[వాడనో]; సః=ఆ, అయమ్=ఈ దుశ్శాసనుడు, మత్‌భుజపంజరే=నా బాహు మధ్యమున, నిపతితః=చిక్కుకొన్నాడు, హే కౌరవాః=ఓ కౌరవులారా! సంరక్ష్యతామ్=కాపాడబడుగాక! [శార్దూలము]

సమాసములు :— శిరసి రుహాః—తస్మిన్. నా పశురివ—తేన. పాంచాలానాం రాజా—పాంచాలరాజస్య ఆత్మజా. ఉరఃస్థలస్య శోణితమ్—ఉరఃస్థల శోణితమేవ ఆసవమ్. మమ భుజౌ—మద్భుజౌ ఏవ పంజరమ్—తస్మిన్.

సంధులు — శిరస్+రుహా—ఉత్వాదేశవిసర్గ. రాజ+ఆత్మజా, యేన+అస్యాః, శోణిత+ఆసవ—సవర్ణదీర్ఘ. అపి+అపహృతమ్—యణాదేశ. యస్య+ఉరః—గుణసంధి. సః+అయమ్—ఉత్వాదేశ—సో+అయమ్—పూర్వరూప.

క్రియ :— రక్ష పాలనే—కర్మణి [యత్]—ఆత్మనే—లోట్—ప్రథమ.
[సం] రక్ష్యతామ్—రక్ష్యేతామ్—రక్ష్యంతామ్.

[సర్వే=అందరును, ఆకర్ణయన్తి=విందురు]

అంగరాజేతి :- [సోత్ప్రాసమ్=ఎగతాళిగా] అంగరాజా! సేనాపతీ! భార్గవరాముని శిష్యుడా! ద్రోణోపహాసిన్=ద్రోణాచార్యుని పరిహసించువాడా!,

కర్ణః : ఆః కా శక్తిర్వృకోదరస్య మయి జీవతి దుశ్శాసనస్య ఛాయామప్యాక్రమితుమ్. యువరాజ, న భేతవ్యం న భేతవ్యమ్. అయమహమాగతో౽స్మి. (ఇతి నిష్క్రాంతః)

అశ్వత్థామా : రాజన్ కౌరవనాథ, అభీష్మద్రోణం సంప్రతి కౌరవ బలమాలోడయంతౌ భీమార్జునౌ రాధేయేనైవంవిధేనాన్యేన వా న శక్యేతే నివారయితుమ్. అతః స్వయమేవ భ్రాతుః ప్రతీకారపరో భవ.

---

భుజ=బాహువులయొక్క, బల=శక్తితో, పరిరక్షిత=బాగుగా కాపాడబడిన, సకలలోక = సమస్తలోకములు కలవాడా! (ధృతాయుధః—ఇత్యాది శ్లోకమును, పఠిత్వా=చదివి) ఇదమ్=ఇదిగో, తత్=ఆ సమయము లేక అవసరము, ఆసన్న తరమ్ ఏవ=మిక్కిలి సమీపించినదే, సంవృత్తమ్=అయినది, సాంప్రతమ్= ప్రస్తుతము, భీమాత్=వృకోదరునినుండి, ఏనమ్=ఈ, దుశ్శాసనమ్=దుశ్శాసనుని, రక్ష=రక్షింపుము.

ఆః కేతి :— ఆః=అహో!, మయి=నేను, జీవతి=జీవించియుండగా, దుశ్శాసనస్య=దుశ్శాసనునియొక్క, ఛాయామ్ అపి=నీడనేని, ఆక్రమితుమ్= లోబరచుకొనుటకు, వృకోదరస్య=భీమునకు, కా శక్తిః=బలమెక్కడిది! యువ రాజా!, న భేతవ్యమ్ న భేతవ్యమ్=భయపడవలదు, భయపడవలదు. అయమ్= ఇదే, అహమ్=నేను, ఆగతః అస్మి=వచ్చినవాడనగుచున్నాను—ఇదే వచ్చుచున్నా ననుట. (ఇతి=అని, నిష్క్రాంతః=నిష్క్రమించును).

రాజన్నితి :— రాజన్ = రారాజా!, కౌరవనాథ = కురువంశజులకు ప్రభువా! సంప్రతి=ఇప్పుడు, అభీష్మద్రోణమ్=భీష్మద్రోణరహితమైన, కౌరవ బలమ్=కౌరవసైన్యమును, ఆలోడయన్తౌ=కలగుండువరచుచున్న, భీమార్జునౌ= భీమార్జునులు, ఏవంవిధేన = ఇట్టివాడైన (ప్రగల్భములు పల్కువాడనుట) రాధేయేన = కర్ణునిచేగాని, అన్యేన వా = వేరొకనిచేగాని, నివారయితుమ్ =

దుర్యోధనః : ఆః కా శక్తి రస్తి దురాత్మనః పవనతనయస్యాన్యస్య వా మయి జీవతి శస్త్రపాణౌ వత్సస్య ఛాయా మప్యాక్రమితుమ్. వత్స, న భేతవ్యం న భేతవ్యమ్. కః కోఽత్ర భోః రథముపనయ. (ఇతి నిష్క్రాంతః)

(నేపథ్యే కలకలః)

అశ్వత్థామా : (అగ్రతోఽవలోక్య) మాతుల, హా ధిక్కష్టమ్. ఏష ఖలు భ్రాతుః ప్రతిజ్ఞాభంగ భీరుః కిరీటీ సమం దుర్యోధన రాధేయా శరవర్షై ర్దుర్వారై రభిద్రవతి.

---

నివారించుటకు, న శక్యేతే=ఆ ఇరువురును సాధ్యులుకారు—నివారింపబడువారు కారనుట. అతః=అందుచే, స్వయమ్ ఏవ=స్వయముగనే, భ్రాతుః=సోదరునికి, ప్రతీకారపరః=పగచెల్లించుకొనువాడవు, భవ=కమ్ము.

ఆః కేతి :- ఆః=అహో!, మయి=నేను, శస్త్రపాణౌ=ఆయుధము పట్టినవాడనై, జీవతి=జీవించియుండగా, వత్సస్య=సోదరునియొక్క, ఛాయామ్ అపి=నీడనేని, ఆక్రమితుమ్=లోబరచుకొనుటకు, దురాత్మనః=దుష్టుడైన, పవన తనయస్య వా=భీమునికిగాని, అన్యస్య వా=వేరొకనికిగాని, కా శక్తిః అస్తి=శక్తి యెక్కడిది! వత్స=బిడ్డా!, న భేతవ్యమ్ న భేతవ్యమ్=భయపడవలదు, భయపడ వలదు. కః కోఽత్ర భోః=ఓరీ ఎవరక్కడ!, రథమ్=అరదమును, ఉపనయ= తెమ్ము. (ఇతి=అని, నిష్క్రాంతః=వెడలును)

(నేపథ్యే=తెరయందు, కలకలః=కోలాహలము)

మాతులేతి :- (అగ్రతః అవలోక్య = ఎదుటికి చూచి) మామా!, హా=అయ్యో!, ధిక్ కష్టమ్=కష్టము! కష్టము! ఏషః=వీడే, కిరీటీ=అర్జునుడు, భ్రాతుః=సోదరుడైన భీమునియొక్క, ప్రతిజ్ఞా భంగ భీరుః= ప్రతిజ్ఞాభంగమువల్ల భయపడినవాడై, దుర్యోధన రాధేయౌ సమమ్ = దుర్యోధన కర్ణుల నిరువురి

సర్వథా పీతం దుశ్శాసనస్య శోణితం భీమేన. న ఖలు విషహే దుర్యోధనానుజస్యైనాం విపత్తిమవలోకయితుమ్. అనృతమనుమతం నామ. మాతుల, శస్త్రం శస్త్రమ్.

సత్యాదప్యనృతం శ్రేయో ధిక్ స్వర్గం నరకోఽస్తు మే।
భీమాత్ దుశ్శాసనం త్రాతుం త్యక్తమత్యక్త
మాయుధమ్॥ 48

---

నొకేసారి, దుర్వారైః=వారింపనలవిగాని, శరవర్షైః=బాణధారలతో, అభిద్రవతి ఖలు=పారద్రోలుచున్నాడు సుమా! భీమేన=భీమునిచే, దుశ్శాసన శోణితమ్=దుశ్శాసనుని రక్తము, సర్వథా=నిరాతంకముగా, పీతమ్=త్రాగివేయబడినట్లే. దుర్యోధనానుజస్య = రారాజు సోదరునికి జరిగిన, ఏనామ్=ఈ, విపత్తిమ్=ఆపదను, అవలోకయితుమ్=చూచుటకు, న విషహే ఖలు=సహింపజాలనుగదా! చూచి మిన్నకుండలేననుట. అనృతమ్=అసత్యము, అనుమతమ్ నామ=అంగీకరింపబడినదే— అసత్యమునకు తెలిసి తెలిసి పాల్పడుచున్నాననుట. మాతుల=మామా!. శస్త్రమ్ శస్త్రమ్=ఆయుధము, ఆయుధము—ఇమ్మనుట.

సత్యాదితి :— సత్యాత్, అపి, అనృతమ్, శ్రేయః, స్వర్గమ్, ధిక్, నరకః, మే, అస్తు. భీమాత్, దుశ్శాసనమ్, త్రాతుమ్, త్యక్తమ్, ఆయుధమ్, అత్యక్తమ్.

అర్థము : సత్యాత్ అపి=సత్యముకంటెను, అనృతమ్=అసత్యము, శ్రేయః=శ్రేయోదాయకము—ప్రస్తుతమట్లున్నదనుట. స్వర్గమ్=స్వర్గము, ధిక్=తిరస్కరించుచున్నాను. నరకః=నరకమే, మే=నాకు, అస్తు=అగుగాక! భీమాత్=భీమునినుండి, దుశ్శాసనమ్ = దుశ్శాసనుని, త్రాతుమ్ = రక్షించుటకుగాను, త్యక్తమ్ = ఇంతకుముందే విడువబడినదైన, ఆయుధమ్ = ఖడ్గము (శస్త్రము) అత్యక్తమ్=వదిలివేయబడనిదే—ఆయుధమును మరల చేపట్టెదననుట.

(ఇతి ఖడ్గం గ్రహీతుమిచ్ఛతి)

(నేపథ్యే)

మహాత్మన్, భారద్వాజసూనో, న ఖలు సత్యవచన మనుల్లంఘితపూర్వ ముల్లంఘయితు మర్హాసి.

కృపః : వత్స, అశరీరిణీ భారతీ భవంతమనృతా దభిరక్షతి.

అశ్వత్థామా : కథమియమమానుషీ వాగ్నానుమనుతే సంగ్రామావతరణం మమ. భోః కష్టమ్. ఆః పక్షపాతినో దేవా అపి పాండవానామ్. సర్వథా పీతం దుశ్శాసన శోణితం భీమేన. భోః కష్టం కష్టమ్.

---

(ఇతి=అని, ఖడ్గమ్=కత్తిని, గ్రహీతుమ్=స్వీకరించుటకు, ఇచ్ఛతి= సిద్ధపడును.)

(నేపథ్యే=తెరలో)

మహాత్మన్=మహానుభావా! భారద్వాజసూనో=ద్రోణపుత్రా! అనుల్లంఘిత పూర్వమ్ = ఇంతకుముందెన్నడును ఉల్లంఘింపబడనిదైన, సత్యవచనమ్ = సత్యవాక్పాలనము, ఉల్లంఘయితుమ్=అతిక్రమించుటకు, న అర్హాసి ఖలు= అర్హుడవుకావు సుమా!—ఉల్లంఘింపవలదనుట.

వత్సేతి :- వత్స=బిడ్డా!, అశరీరిణీ భారతీ=అశరీరవాణి, భవన్తమ్= నిన్ను, అనృతాత్=అసత్యమునుండి, అభిరక్షతి=కాపాడుచున్నది.

కథమితి :— కథమ్=ఎట్లూ! ఇయమ్=ఈ, అమానుషీ వాక్=దైవ వాక్కు, మమ = నాయొక్క, సంగ్రామావతరణమ్ = యుద్ధమునకేగుటను, న అనుమనుతే=అంగీకరించుటలేదు. భోః=అయ్యో, కష్టమ్=కష్టము. ఆః= అహో!, దేవాః అపి=దేవతలుకూడ, పాండవానామ్=పాండవులకు, పక్షపాతినః= పక్షపాతముకలవారు. దుశ్శాసన శోణితమ్=దుఃశాసన రక్తము, భీమేన=భీమునిచే, సర్వథా=నిరాటంకముగా, పీతమ్=త్రాగివేయబడినది. భోః=అయ్యో, కష్టమ్, కష్టమ్=కష్టము, కష్టము.

దుశ్శాసనస్య రుధిరే పీయమానేఽప్యుదాసితమ్।
దుర్యోధనస్య కర్తాస్మి కిమన్యత్ ప్రియమాహవే॥ 49

మాతుల, రాధేయక్రోధవశాదనార్యమస్మాభి రాచరితమ్. అతస్త్వమపి తావదస్య రాజ్ఞః పార్శ్వవర్తీ భవ.

కృపః : గచ్ఛామ్యహమత్ర ప్రతివిధాతుమ్ భవానపి శిబిర సన్నివేశమేవ ప్రతిష్ఠతామ్. (పరిక్రమ్య నిష్క్రాంతౌ)

—ః ఇతి తృతీయోఽఙ్కః :—

---

దుశ్శాసనస్యేతి :— దుశ్శాసనస్య, రుధిరే, పీయమానే, అపి, (మయా) ఉదాసితమ్; ఆహవే, దుర్యోధనస్య, అన్యత్, ప్రియమ్, కిమ్, కర్తా, అస్మి.

అర్థము :— దుశ్శాసనస్య = దుశ్శాసనునియొక్క, రుధిరే=రక్తము, పీయమానే అపి=త్రాగివేయబడుచున్నప్పటికిని, మయా=నాచేత, ఉదాసితమ్= ఉపేక్షింపబడినది—చూచుచూరకుంటిననుట, ఆహవే = యుద్ధమునందు, దుర్యోధనస్య = రారాజునకు, అన్యత్ = వేరొక, ప్రియమ్=ఇష్టమును, కిమ్=దేనిని, కర్తా=చేయువాడను, అస్మి=అవుదును—ఇంక ఎప్పుడు ఏ ప్రియమును చేయగలననుట. (అనుష్టుప్పు)

మాతులేతి :— మామా! రాధేయ క్రోధవశాత్=కర్ణునిమీది కోపమువలన, అస్మాభిః=మనచేత, అనార్యమ్=అనుచితము, ఆచరితమ్=ఆచరింపబడినది. అతః=అందుచే, త్వమపి=నీవుకూడ, అస్య=ఈ, రాజ్ఞః=రాజునకు, పార్శ్వవర్తీ=సహచరుడవు, భవ=కమ్ము. సహకరింపుమనుట.

గచ్ఛామీతి :— అహమ్=నేను, అత్ర=ఈ విషయమునందు, ప్రతివిధాతుమ్=ప్రతీకారము చేయుటకు, గచ్ఛామి=పోవుచున్నాను. భవాన్ అపి= నీవుకూడ, శిబిరసన్నివేశమ్ ఏవ=శిబిరసమీపమునకే, ప్రతిష్ఠతామ్=నడువుము.

(పరిక్రమ్య = ముందునకు నడిచి, నిష్క్రాంతౌ=ఇరుపైపులకు నిష్క్రమించిరి.)

—ః ఇది మూడవ అంకము :—

# చతుర్థాఙ్కః

(తతః ప్రవిశతి ప్రహారమూర్ఛితం రథస్థం దుర్యోధనమపహరన్ సూతః)

(సూతః ససంభ్రమం పరిక్రామతి)

(నేపథ్యే)

భోభో బాహుబలావలేప ప్రవర్తిత మహాసమరదోహదాః, కౌరవ పక్షపాత పణీకృత ప్రాణ ద్రవిణ సంచయా నరపతయః, సంస్తభ్యంతాం సంస్తభ్యంతాం నిహత దుశ్శాసన పీతావశేష శోణిత స్నపిత భీభత్స వేష వృకోదర దర్శన భయ పరిస్ఖలత్ ప్రహరణాని రణాత్ ప్రద్రవంతి బలాని.

---

(తతః = అటుపిమ్మట, ప్రహార మూర్ఛితమ్=దెబ్బతిని మూర్ఛపోయిన వాడును, రథస్థమ్=రథముపై పడిఉన్నవాడునైన, దుర్యోధనమ్ రారాజును, అపహరన్=రణరంగమునుండి తప్పించుచు, సూతః=రథచోదకుడు, ప్రవిశతి=ప్రవేశించును).

(సూతః=సూతుడు, ససంభ్రమమ్=హడావిడిగా, పరిక్రామతి=అటునిటు తిరుగుచుండును)

(నేపథ్యే=తెరలో)

భోభోః=ఓరోరీ!, బాహుబల=భుజశక్తివల్లనైన, అవలేప=గర్వముతో, ప్రవర్తిత = ప్రారంభింపబడిన, మహాసమరదోహదాః = ఘోరయుద్ధముయొక్క ఆకాంక్షకల వ్యక్తులారా! (దోహదమిచ్ఛాకాంక్షా—అమరః) కౌరవపక్షపాత=కౌరవపక్షమును అవలంబించుటతో, పణీకృత=పణముగాచేయబడిన, ప్రాణ=ప్రాణములనునట్టి, ద్రవిణ సంచయాః=ధనరాశులుకల్గిన వ్యక్తులారా! నరపతయః=ఓ రాజులారా!, నిహత=చంపివేయబడిన, దుశ్శాసన=దుశ్శాసనునినుండి, పీత=

సూతః : (విలోక్య) కథమేష ధవళ చపల చామర చుంబిత కనక కమండలునా శిఖరాబద్ధ వైజయన్తీ సూచితేన హత గజ వాజి నర కలేబర సహస్ర సమ్మర్ద విషమోద్ఘాత కృత కలకల కింకిణీ జాలమాలినా రథేన శరవర్ష స్తంభిత పరబల పరాక్రమ ప్రసరః ప్రద్రుతమాత్మబలమాశ్వాసయన్ కృపః కిరీటినాభియుక్త మంగరాజ మనుసరతి. హంత జాత మస్మద్బలానా మవలంబనమ్.

---

ర్తాగగా, అవశేష=మిగిలిన, శోణిత=రక్తముచే, స్నపిత=స్నానమాడుటవలన, (పులుముకొనబడుటచే) బీభత్స=భయంకరమైన, వేష=ఆకారముగల, వృకోదర=భీముని యొక్క, దర్శన=దర్శనమువలన, భయ=భీతితో, పరిస్ఖలత్=జారిపోవుచున్న, ప్రహరణాని=ఆయుధములుకలవై, బలాని=సైన్యములు, రణాత్=యుద్ధమునుండి, ప్రద్రవంతి=పారిపోవుచున్నవి, సంస్తభ్యంతామ్ సంస్తభ్యంతామ్=నిలువరింపబడుగాక నిలువరింపబడుగాక!

కథమితి :— (విలోక్య = తేరిపారజూచి) కథమ్ = ఎట్టా! ధవళ=తెల్లనివియు, చపల=రెపరెపలాడుచున్నవియునైన, చామర=ప్రకీర్ణకములతో (ప్రకీర్ణకం తు చామరమ్-అమరః), చుంబిత=తాకబడుచున్న, కనక=బంగారముతో చేయబడిన, కమండలునా=కలశములు కలదియు, శిఖర=అగ్రభాగమునందు, అవబద్ధ=బిగింపబడిన, వైజయంతీ=పతాకతో, సూచితేన=(ఇది కృపునిదని) సూచింపబడునదియు, హత=చంపబడిన, గజ=ఏనుగుల యొక్కయు, కలేబర సహస్ర=వేలవేల కళేబరముల యొక్కయు, సమ్మర్ద=ప్రోవులతోనైన, విషమ + ఉద్ఘాత=ఎత్తుపల్లముల ఎదురుగొప్పులతో, కృత=కల్పింపబడిన, కలకల=మ్రోగుటలుగల, కింకిణీజాల మాలినా = చిరుమువ్వలవరుసలు కలదియునైన, రథేన=అరదముతో, కృపః=కృపాచార్యుడు, అయమ్=ఇదిగో!, శరవర్ష=బాణధారలతో, స్తంభిత=స్తంభింపజేయబడిన, పరబల=శత్రుసైన్యము యొక్క, పరాక్రమ ప్రసరః=విక్రమక్రమముకలవాడై, ప్రద్రుతమ్=పారిపోయిన, ఆత్మ బలమ్=స్వసైన్యమును, ఆశ్వాసయన్=(ధైర్యవచనములతో), కలతదేర్చుచున్న

(నేపథ్యే కలకలానంతరమ్)

భోభోః అస్మద్దర్శన భయ స్ఖలిత కార్ముక కృపాణ తోమర శక్తయః, కౌరవచమూ భటాః, పాండవ పక్షపాతినశ్చ యోధాః, న భేతవ్యం న భేతవ్యమ్. అయమహం నిహత దుశ్శాసన పీవరోరఃస్థల క్షతజాసవ పాన మదోద్ధతో రభసగామీ స్తోకావశిష్ట ప్రతిజ్ఞా మహోత్సవః, కౌరవరాజస్య ద్యూతనిర్జితో దాసః పార్థ మధ్యమో భీమసేనః సర్వాన్ భవతః సాక్షీకరోమి. శ్రూయతామ్—

---

వాడునై, కిరీటినా=అర్జునునితో, అభియుక్తమ్=ముట్టడింపబడిన, అంగరాజమ్=కర్ణుని, అనుసరతి=సమీపించుచున్నాడు. హంత=హమ్మయ్య, అస్మత్ బలానామ్=మా సేనలకు, అవలంబనమ్=ఆధారము, జాతమ్=దొరికినది.

(నేపథ్యే=తెరలో, కలకలానంతరమ్=కలకలము తరువాత)

భోభోః=ఓరోరీ!, అస్మద్దర్శన=నన్ను చూచుటతో కలిగిన, భయ=భీతితో, స్ఖలిత=జారిపోవుచున్న, కార్ముక=ధనుస్సులు, కృపాణ=ఖడ్గములు, తోమర=తోమరములు, శక్తయః="శక్తి" ఆయుధములుకల వ్యక్తులారా!, కౌరవ చమూ భటాః=కౌరవసైనికులారా!, చ=మరియు, కౌరవపక్షపాతినః=కౌరవపక్షము నవలంబించినవారైన, యోధాః = వీరులారా! న భేతవ్యమ్=భయపడవలదు, న భేతవ్యమ్=భయపడవలదు. నిహత=చంపివేయబడిన, దుశ్శాసన=దుశ్శాసనుని యొక్క, ఉరఃస్థల=వక్షఃప్రదేశమునందలి, క్షతజ=రక్తమనునట్టి, ఆసవ=మద్యమును, పాన=త్రాగుటతో, మదోద్ధతః=మిక్కిలి మత్తిల్లినవాడును, రభస గామీ=వేగముగా నడచుచున్నవాడును, స్తోక=కొంచెముగా, అవశిష్ట=మిగిలిపోయిన, ప్రతిజ్ఞామహోత్సవః=ప్రతినచెల్లించిన సంబరముకలవాడును—అట్టి సంబరమునకు ఒక్కింత కొదువయున్నదనుట; కౌరవరాజస్య=దుర్యోధనునకు, ద్యూతనిర్జితః=జూదమున గెలుచుకొన్న, దాసః=సేవకుడును, పార్థమధ్యమః=పృథానందనులలో

రాజ్ఞో మానధనస్య కార్ముకభృతో దుర్యోధనస్యాగ్రతః
ప్రత్యక్షం కురుబాంధవస్య మృషతః కర్ణస్య శల్యస్య చ।
పీతం తస్య మయాద్య పాండవవధూ కేశాంబరాకర్షిణః
కోష్ణం జీవత ఏవ తీక్ష్ణ కరజ క్షుణ్ణా దసృగ్వక్షసః॥ 1

---

నడిమివాడును అయిన, భీమసేనః=భీముడుఅను, (అయమ్=ఈ), అహమ్=నేను, అయమ్=ఇదే, భవతః సర్వాన్=మిమ్మందరిని, సాక్షీకరోమి = సాక్షులను చేయుచున్నాను. శ్రూయతామ్=వినుడు!

రాజ్ఞఇతి :- మానధనస్య, కార్ముకభృతః, రాజ్ఞః, దుర్యోధనస్య, అగ్రతః; కురుబాంధవస్య, మృషతః, కర్ణస్య, చ, శల్యస్య, ప్రత్యక్షమ్, అద్య, మయా, పాండవవధూ కేశాంబరాకర్షిణః, జీవతః, ఏవ, తస్య, తీక్ష్ణకరజక్షుణ్ణాత్, కోష్ణమ్, అసృక్, పీతమ్.

అర్థము :- మానధనస్య=అభిమానమే ధనముగా కలవాడును, కార్ముకభృతః=ధనుస్సును ధరించియున్నవాడును, రాజ్ఞః రారాజునైన, దుర్యోధనస్య=దుర్యోధనునియొక్క, అగ్రతః=ఎట్టయెదుట, కురుబాంధవస్య=కురువంశమునకు గూర్చువాడును, మృషతః=(ఏమియును చేయలేక) ఓర్చి యూరకున్నవాడునైన, కర్ణస్య=కర్ణునియొక్క, ప్రత్యక్షమ్ = కన్నుల ఎదుట, చ = మరియు, శల్యస్య ప్రత్యక్షమ్=శల్యునియొక్క ఎదుట, అద్య=నేడు, మయా=నాచేత— పాండవ వధూ=ద్రౌపదియొక్క, కేశాంబరాకర్షిణః=కేశాంబరముల నూడలాగినవాడును, జీవతః ఏవ=జీవించియేయున్నవాడునైన, తస్య=దుశ్శాసనునియొక్క, తీక్ష్ణ కరజ క్షుణ్ణాత్—తీక్ష్ణ = వాడియైన, కరజ = గోరులతో, క్షుణ్ణాత్=చీల్చివేయబడినదైన, వక్షసః=ఉరఃస్థలమునుండి, కోష్ణమ్=గోరువెచ్చని, అసృక్=రక్తము, పీతమ్= త్రాగివేయబడినది. (శార్దూలము)

సమాసములు :— మానమేవ ధనం యస్య సః—తస్య. కార్ముకం బిభర్తి ఇతి—కార్ముకభృత్—తస్య. కురూణాం బాంధవః—తస్య. పాండవానాం వధూః—కేశాశ్చాంబరం చ—కేశాంబరాణి—పాండవవధ్వాః కేశాంబరాణి—పాండవ

సూతః : (శ్రుత్వా సభయమ్) అయే ఆసన్న ఏవ దురాత్మా కౌరవ రాజపుత్ర మహావనోత్పాతమారుతో మారుతిః. అనుపలబ్ధ సంజ్ఞశ్చ తావదత్ర మహారాజః. భవతు. సుదూరమపహారామి స్యందనమ్ కదాచిత్ దుశ్శాసన ఇవాస్మిన్నప్యయమనార్యోఽనార్యమాచరిష్యతి. (త్వరిత తరం పరిక్రమ్యావలోక్య చ) అయే, అయమసౌ సరసీ సరోజ విలోలన సురభి శీతలమాతరిశ్వ సంవాహిత సాంద్ర కిసలయో న్యగ్రోధ పాదపః. ఉచితా విశ్రామభూ రియం

---

వధూ కేశాంబరాణామ్ ఆకర్షితస్య. తీక్ష్ణాశ్చ తే కరజాశ్చ—తీక్ష్ణకరజైః క్షుణ్ణమ్—తస్మాత్.

సంధులు :- రాజ్ఞః+మాన, భృతః+దుర్యో—ఉత్వాదేశవిసర్గ. దుర్యోధనస్య+అగ్రతః, మయా+అద్య, కేశ+అంబర+ఆకర్షిణః—సవర్ణదీర్ఘ. ప్రతి+అక్షమ్—యణాదేశ. క+ఉష్ణమ్—గుణసంధి. జీవతః+ఏవ—విసర్గలోప.

**అయేఇతి** :- (శ్రుత్వా=విని, సభయమ్=భయపడుచు) అయే=అరేరే! కౌరవ రాజపుత్ర=ధృతరాష్ట్రుని కుమారులనునట్టి, మహావన=పెద్ద వనమునకు, **ఉత్పాత** = ఉపద్రవరూపమైన, మారుతః = పెనుగాలివంటివాడైన, దురాత్మా= దుష్టుడు, మారుతిః=భీముడు—వాయునందనుడనుట, ఆసన్నః ఏవ=సమీపించనే సమీపించెను—రానేవచ్చెననుట. అత్ర=ఇక్కడ, మహారాజః=రారాజు, అనుపలబ్ధ సంజ్ఞః=మూర్ఛనుండి తేరుకొన్నవాడుకాలేదు, భవతు=కానిమ్ము. స్యందనమ్= రథమును, సుదూరమ్=మిక్కిలి దూరము అపహారామి=తప్పింతును. కదాచిత్= ఒకప్పుడు, **అయమ్** = ఈ, అనార్యః=దుష్టుడు భీముడు, దుశ్శాసనే ఇవ= దుశ్శాసనునిపట్లవలె, అస్మిన్ అపి=ఈ రారాజు విషయమునందును, అనార్యమ్= అకృత్యమును, ఆచరిష్యతి = ఆచరింపగలడు. (త్వరిత త్వరమ్=మిక్కిలి త్వరగా, పరిక్రమ్య=ముందునకు సాగి, అవలోక్య చ=గమనించి) అయే= ఆహా!, సరసీ=సరస్సునందలి, సరోజ=పద్మములను, విలోలన=కదల్చుటతో

సమరవ్యాపార స్విన్నస్య వీరజనస్య. అత్ర స్థిత శ్చాయాంచిత తాలవృంతేన హరిచందనచ్ఛటా శీతలేన అప్రయత్న సురభిణా దశాపరిణామ యోగ్యేన సరసీ సమీరణేనామునా గతక్లమో భవిష్యతి మహారాజః. లూనకేతుశ్చాయం రథోఽనివారిత ఏవ ప్రవేక్ష్యతి చ్ఛాయామ్. (ఇతి ప్రవేశం రూపయిత్వా) కః కోఽత్ర భోః! (సమన్తాదవలోక్య) కథం న కశ్చిదత్ర పరిజనః. నూనం తథావిధస్య వృకోదరస్య దర్శనాదేవం విధస్య చ స్వామినస్త్రాసేన శిబిరసన్నివేశమేవ ప్రవిష్టః. కష్టం భోః కష్టమ్.

---

సురభి = సుగంధితమును, శీతల = శీతలమునైన, మాతరిశ్వ = వాయువుచే, సంవాహిత=కదల్పబడిన, సాంద్ర=దట్టమైన, కిసలయః=చిగురాకులు కలదైన, న్యగ్రోధ పాదపః=మర్రిచెట్టు, అయమ్ అసౌ=ఇదిగో ఇదే. సమరవ్యాపార= యుద్ధకృత్యముతో, స్విన్నస్య=అలసిపోయిన, వీరజనస్య=శూరజనమునకు, ఇయమ్=ఇది, ఉచితా=అర్హమైన, విశ్రామభూః=విశ్రాంతిస్థలము. అత్ర= ఇక్కడ, స్థితః=విశ్రమించినవాడై, మహారాజః=రారాజు, అయాచిత=కోరకయే లభించిన, తాళవృంతేన=వీవనలు కలదియు, హరిచందనచ్ఛటా=మంచి గంధపు రాశివలె, శీతలేన=చల్లనైనదియు, అప్రయత్న సురభిణా=ప్రయత్నము లేకయే లభించిన—సహజసిద్ధమైన అనుట—సుగంధముకలదియు, దశా=ఉన్నస్థితియొక్క, పరిణామ=మార్పునకు-అలసటను తొలగించుటకనుట—యోగ్యేన=సమర్థమైనదియు నైన, అమునా = ఈ, సరసీ సమీరణేన=సరోవరమునుండి వీతెంచుచున్న వాయువుచేత, గతక్లమః=పోగొట్టబడిన శ్రమ కలవాడు, భవిష్యతి= అగును. లూన=విరిగిపోయిన, కేతుః=పెక్కెముకలదైన, అయమ్=ఈ, రథః=వాహనము, అనివారితః ఏవ=ఆపబడనిదే అగుచు—తనంత తాననుట— ఛాయామ్ = నీడను, ప్రవేక్ష్యతి=ప్రవేశించును. (ఇతి=అని, ప్రవేశమ్=ప్రవేశించుటను, రూపయిత్వా= అభినయించి) కః కోఽత్రభోః=ఎవరక్కడ! (సమంతాత్ అవలోక్య=అన్ని వైపులకు చూచి) కథమ్=ఎట్టూ!. అత్ర=ఇచ్చట, పరిజనః=సేవకుడు, కశ్చిత్ న = ఒక్కడును లేడే! (నూనమ్ = సమంజసమే). తథావిధస్య = అట్లు

దత్త్వా ద్రోణేన పార్థాదభయమపి న సంరక్షిత స్సింధురాజః
క్రూరం దుశ్శాసనేఽస్మిన్ హరిణ ఇవ కృతం భీమసేనేన కర్మ।
దుస్సాధామప్యరీణాం లఘుమివ సమరే పూరయిత్వా ప్రతిజ్ఞాం
నాహం మన్యే సకామం కురుకులవిముఖం దైవమేతావతాపి॥ 2

---

భయంకరుడైన, వృకోదరస్య=భీముని యొక్క, దర్శనాత్=దర్శనమువల్లను, చ = మరియు, ఏవం విధస్య=ఇటువంటిదైన (మూర్ఛపోవుట) స్వామినః= ప్రభువుయొక్క, త్రాసేన=భీతిచేతను, శిబిరసన్నివేశమ్ ఏవ=శిబిరములోనికే, నూనమ్= తప్పక, ప్రవిష్టః=[ప్రతిసేవకుడును] ప్రవేశించియుండును. కష్టమ్ భోః కష్టమ్=కష్టము బాబో కష్టము!

దత్త్వేతి :— ద్రోణేన, పార్థాత్, అభయమ్, దత్త్వా, అపి, సింధు రాజః, న, సంరక్షితః; భీమసేనేన, అస్మిన్, దుశ్శాసనే, హరిణే, ఇవ, క్రూరమ్, కర్మ కృతమ్; కురుకుల విముఖమ్, దైవమ్, సమరే, అరీణామ్, ప్రతిజ్ఞామ్, దుస్సాధ్యామ్, అపి, లఘుమ్, ఇవ, పూరయిత్వా, ఏతావతా, అపి, సకామమ్, న, అహమ్, మన్యే.

అర్థము :— ద్రోణేన=ద్రోణాచార్యునిచేత, పార్థాత్=అర్జునునినుండి, అభయమ్=అభయము—(సంరక్షణ) దత్త్వా అపి=ఈయబడియు, సింధురాజః= జయద్రథుడు, న సంరక్షితః = రక్షింపబడలేకపోయినాడు; భీమసేనేన = వృకోదరునిచే, అస్మిన్=ఈ, దుశ్శాసనే=దుశ్శాసనుని విషయమున, హరిణే ఇవ=లేడిపట్లవలె—ప్రతిఘటన లేకుండ ననుట— క్రూరమ్=నిర్దయమైన, కర్మ= పని, కృతమ్ = ఆచరింపబడినది; కురుకుల విముఖమ్ = కురువంశమునకు పరాఙ్ముఖమైన, దైవమ్=దైవము, సమరే=యుద్ధమునందు, అరీణామ్=శత్రువుల యొక్క, ప్రతిజ్ఞామ్=ప్రతినను, దుస్సాధామ్ అపి=కష్టసాధ్యమునే అయినప్పటి కిని, లఘుమ్ ఇవ=సులభసాధ్యమునువలె, పూరయిత్వా=నెరవేర్చి, ఏతావతా అపి=ఇంతటితోనైనను, సకామమ్=కోరిక తీరినదైనట్లు (దైవము); అహమ్= నేను, న మన్యే=భావింపకున్నాను. ఇప్పటికింకను దైవమునకు కోరిక తీరినట్లు

(రాజానమవలోక్య) కథమద్యాపి న చేతనాం లభతే మహారాజః. భోః కష్టమ్! (నిఃశ్వస్య)

మదకలిత కరేణు భజ్యమానే విపిన ఇవ ప్రకటైకశాలశేషే।
హత సకల కుమారకే కులేఽస్మింస్త్వమపి విధేరవలోకితః కటాక్షైః॥ 3

---

లేదనుట. (సకామమ్ న ఇతి=కోరిక తీర్చుకొన్నది కాలేదని, అహమ్ మన్యే= నేను భావించుచున్నాను—అనియు అన్వయింపవచ్చును). స్రగ్ధరావృత్తము.

సమాసములు :— దుఃఖేన సాధయితుం యోగ్యా—దుస్సాధా—తామ్. (దుస్సాధ్యామ్ అనియు పాఠము). కామేన సహితమ్. కురూణాం కులమ్—కురు కులస్య విముఖమ్. కురుకులా ద్వా.

సంధులు :— దుశ్శాసనే+అస్మిన్—పూర్వరూపసంధి. హరిణే+ఇవ— హరిణయ్+ఇవ—అయవాదేశసంధి — హరిణ ఇవ—యవలోపసంధి. అపి+ అరీణామ్—యణాదేశ. న+అహమ్—సవర్ణదీర్ఘ—ఏతావతా+అపి.

క్రియ :— మనజ్ జ్ఞానే (దివాదిః) ఆత్మనే, లట్, ఉత్తమ
మన్యే—మన్యావహే—మన్యామహే

కథమితి :— (రాజానమ్ = దుర్యోధనుని, అవలోక్య=పరిశీలించి) కథమ్=ఎట్టూ! మహారాజః=మహారాజు, అద్య అపి=ఇప్పటికిని, చేతనామ్= స్పృహను, న లభతే = పొందకున్నాడు. భోః కష్టమ్ = అయ్యో కష్టము! [నిఃశ్వస్య=నిట్టూర్చి]

మదకలితేతి :— మదకలిత కరేణు భజ్యమానే, ప్రకటైకశాలశేషే, విపినే, ఇవ, హతసకలకుమారకే, అస్మిన్, కులే, త్వమ్, అపి, విధేః, కటాక్షైః, అవలోకితః? [పుష్పితాగ్రావృత్తము].

అర్థము :— మద=మదముతో, కలిత=ఒప్పుచున్న, కరేణు=ఏనుగులతో, భజ్యమానే=సేవింపబడుచున్నదియు, ప్రకట=ప్రస్ఫుటమై, ఏక=ఒంటరిదైన,

నను భో హతవిధే! భరతకుల విముఖ!

అక్షతస్య గదాపాణే రనారూఢస్య సంశయమ్।
ఏషాపి భీమసేనస్య ప్రతిజ్ఞా పూర్యతే త్వయా॥ 4

శాల = "శాల" వృక్షము, శేషే=మిగిలియున్నదియు—[శాలశ్చంకుతరుర్మతః] ఒక్కటే మిగిలియుండుటచే కొట్టవచ్చినట్లు [ప్రకట] కనబడుచున్నదనుట, అయిన, విపినే ఇవ=అరణ్యమునందువలె, హత సకల కుమారకే, హత=చంపి వేయబడిన, సకలకుమారకే=సమస్త పుత్రులు కల్గిన, అస్మిన్=ఈ, కులే=వంశము నందు, త్వమ్ అపి=నీవుకూడ, విధేః=దైవముయొక్క, కటాక్షైః=అనుగ్రహ దృక్కులతో, అవలోకితః [అసి]?=వీక్షింపబడితివా?

సమాసములు :— మదేన కలితాః—మదకలితాశ్చ తే కరేణవశ్చ—మద కలిత కరేణుభిః భజ్యమానమ్—తస్మిన్. ప్రకటశ్చాసౌ ఏకశ్చ—ప్రకటైకశ్చ అసౌ శాలశ్చ—ప్రకటైక శాలః శేషః యస్మిన్—తస్మిన్. హతాశ్చ తే సకలాశ్చ—హత సకలాశ్చ తే కుమారకాశ్చ యస్మిన్—తస్మిన్.

సంధులు :- విపినే+ఇవ—అయవాదేశ—విపినయ్+ఇవ—యవలోపసంధి. ప్రకట+ఏక—వృద్ధి. కులే+అస్మిన్—పూర్వరూప. అస్మిన్+త్వమ్—తాంస్తాన్ సంధి—అస్మింస్త్వమ్. విధేః+అవలోకితః—రేఫాదేశ.

నన్వితి :- నను భో హతవిధే=ఓయీ దుష్టవిధీ! భరతకుల విముఖ= భరతవంశమునకు (కురుపాండవులు) విరోధీ!

అక్షతస్యేతి :— గదాపాణేః, అక్షతస్య, సంశయమ్, అనారూఢస్య, భీమసేనస్య, ఏషా, అపి, ప్రతిజ్ఞా, త్వయా, పూర్యతే.

అర్థము :- గదాపాణేః = గదను చేపట్టియున్నవాడును, అక్షతస్య= (ఇన్నిరోజుల యుద్ధములలో ఇప్పటికిని) దెబ్బతిననివాడును, సంశయమ్ = జయము లభించునా లభింపదా అను సందేశమును, అనారూఢస్య=పొందనివాడును,

దుర్యోధనః : (శనైరుపలబ్ధసంజ్ఞః) ఆః, కా శక్తిరస్తి దురాత్మనో వృకోదర హతకస్య మయి జీవతి దుర్యోధనే ప్రతిజ్ఞాం పూరయితుమ్! వత్స, దుశ్శాసన, న భేతవ్యం న భేతవ్యమ్. అయమహ మాగతో౽స్మి. నను సూత, ప్రాపయ రథం తమేవోద్దేశం యత్ర వత్సో మే దుశ్శాసనః.

---

అయిన, భీమసేనస్య=వృకోదరునియొక్క, ఏషా=ఈ, ప్రతిజ్ఞా అపి=ప్రతిన కూడ (దుశ్శాసనునిపట్ల చేసిన ప్రతిజ్ఞ తీరినది, ఇక తొడలు విరుగగొట్టెదనను దుర్యోధనునిపట్ల ప్రతిజ్ఞ): త్వయా=నీచేత (విధీ!), పూర్యతే=పూరింపబడు చున్నదా!— ప్రతిజ్ఞాశేషమును పూరింప సహకరించుచున్నావా! హతవిధీ!—అనుట. (అనుష్టుప్ఛందము).

సమాసములు :— న క్షతః—తస్య. గదా పాణౌ యస్య సః—తస్య. న ఆరూఢః—తస్య.

సంధులు :— పాణేః+అనారూఢస్య—రేఫాదేశవిసర్గ. ఏషా+అపి—సవర్ణదీర్ఘ.

క్రియ :— పౄ పాలన పూరణయోః—కర్మణి—ఆత్మనే—ప్రథమ
పూర్యతే—పూర్యేతే—పూర్యన్తే.

ఆ ఇతి :— (శనైః=నెమ్మదిగా, ఉపలబ్ధసంజ్ఞః=మూర్ఛనుండి తెలివి పొందినవాడై) ఆః=అహో!, దురాత్మనః=దుష్టుడైన, వృకోదరహతకస్య=నీచుడైన భీమునకు, దుర్యోధనే=దుర్యోధనుడనగు, మయి=నేను, జీవతి=జీవించి యుండగా, ప్రతిజ్ఞామ్=ప్రతినను, పూరయితుమ్=చెల్లించుకొనుటకు, కా శక్తిః అస్తి=ఏమి శక్తియున్నది—బలమెక్కడిది!—అనుట. అయమ్=ఇదే, అహమ్=నేను, ఆగతః అస్మి = వచ్చుచున్నాను. నను సూత=ఓయీ సారథీ! మే=నాయొక్క, వత్సః=సోదరుడు, దుశ్శాసనః=దుశ్శాసనుడు, యత్ర=ఎటనున్నాడో,

సూతః : ఆయుష్మన్, అక్షమాః సంప్రతి వాహాస్తే రథ ముద్వోఢుమ్. (అపవార్య) మనోరథం చ.

దుర్యోధనః : (రథాదవతీర్య సగర్వం సాకూతం చ) కృతం స్యందన గమన కాలాతిపాతేన.

సూతః : (సవైలక్ష్యం సకరుణం చ) మర్షయతు మర్షయ త్వాయుష్మాన్!

దుర్యోధనః : ధిక్ సూతం కిం రథేన కేవలమరాతి విమర్ద సంఘట్ట సంచారీ దుర్యోధనః ఖల్వహమ్. తద్గదామాత్ర సహాయః సమరభువ మవతరామి.

---

తమ్ = ఆ, ఉద్దేశమ్ ఏవ = ప్రదేశమునే, రథమ్ = రథమును, ప్రాపయ = పొందింపుము—అచటికే రథమును పోనిమ్మనుట.

ఆయుష్మన్నితి :— ఆయుష్మంతుడా!, సంప్రతి=ఇప్పుడు, వాహాః= అశ్వములు, తే=నీయొక్క, రథమ్=అరదమును, ఉద్వోఢుమ్=వహించుటకు, అక్షమాః=సమర్థములు కావు. (అపవార్య=దుర్యోధనునికి వినబడనట్లు) మనో రథమ్ చ=మనోరథమునుకూడ—వహింపజాలవనుట. నీ కోరిక తీరదనుట.

కృతమితి :- (రథాత్=రథమునుండి, అవతీర్య=దిగి, సగర్వమ్= దర్పముతోను, చ=మరియు, సాకూతమ్=సాభిప్రాయముగను) స్యందన= రథముతో(పై), గమన=వెడలుటవల్లనగు, కాలాతిపాతేన=కాలహరణముతో, కృతమ్=చాలును. రథముతోకన్న నడిచియే వేగముగా పోదుననుట.

మర్షయత్విత :— ఆయుష్మాన్=చిరంజీవి, మర్షయతు మర్షయతు= మన్నించుగాక, మన్నించుగాక!

ధిగితి :- సూతమ్=సారథిని, ధిక్=తిరస్కరించుచున్నాను-సూతునితో పనియేమి అనుట. రథేన కిమ్ = రథముతో(పని) ఏమి!. అహమ్ = నేను,

సూతః　　: ఆయుష్మన్, ఏవమేతత్. కః సందేహః?

దుర్యోధనః : యద్యేవం కిమేవం భాషసే. పశ్య—

బాలస్య మే ప్రకృతిదుర్లలితస్య పాపః
పాపం వ్యవస్యతి సమక్షముదాయుధో౽సౌ।
అస్మిన్నివారయసి కిం వ్యవసాయినం మాం
క్రోధో న నామ కరుణా న చ తే౽స్తి లజ్జా॥ 5

---

కేవలమ్=కేవలము, అరాతి=శత్రువులయొక్క, విమర్ద=గుంపుతోనైన, సంఘట్ట=సంఘర్షణతో, సంచారీ=చరించు స్వభావముగల, దుర్యోధనః ఖలు=దుర్యోధనుడనుగదా! తత్=అందుచే, గదామాత్ర సహాయః=గదమాత్రమే సహాయముగా గలవాడనై, సమరభువమ్=యుద్ధరంగమును, అవతరామి=ప్రవేశింతును.

ఆయుష్మన్నితి :— ఆయుష్మన్ = చిరంజీవీ! ఏతత్ ఏవమ్ = ఇది యిట్లే, సందేహః కః=సందేహమేమి! తప్పక అట్లే రణరంగమునకు పొమ్మనుట.

యదీతి :— ఏవమ్ యది=అట్లే అయినచో, ఏవమ్=ఇట్లు, కిమ్ భాషసే=పలుకుచున్నావేమి? పశ్య=చూడు—

బాలస్యేతి :— ఉదాయుధః, పాపః, అసౌ, మే, సమక్షమ్, ప్రకృతి దుర్లలితస్య, బాలస్య, పాపమ్, వ్యవస్యతి; అస్మిన్, వ్యవసాయినమ్, మామ్, కిమ్, నివారయసి? తే, క్రోధః, న, నామ; న, కరుణా, చ, లజ్జా, న, అస్తి?

అర్థము :- ఉదాయుధః=ఎత్తిపట్టుకొన్న ఆయుధము(గద)కలవాడును, పాపః=పాపకృత్యములు చేయువాడునైన, అసౌ=ఈ భీముడు, మే=నాయొక్క, సమక్షమ్ = ఎట్టయెదుట, ప్రకృతి దుర్లలితస్య=స్వభావసిద్ధముగా కోమలుడైన, బాలస్య = బాలునికి [దుశ్శాసనునికి] యుద్ధమునందు అప్రౌఢుడనుట, పాపమ్=అపకృతిని, వ్యవస్యతి=చేయబోవుచున్నాడు, అస్మిన్=ఈ విషయమునందు లేక భీమునిపట్ల, వ్యవసాయినమ్ = నివారించుటకు పూనుకొన్న, మామ్ = నన్ను, నివారయసి కిమ్=వారించితివేమి? [రణభూమినుండి ఏల తప్పించితివనుట-సమీప

సూతః : (సకరుణం పాదయోర్నిపత్య) ఏతద్విజ్ఞాపయామి. ఆయుష్మన్, సంపూర్ణ ప్రతిజ్ఞేన నివృత్తేన భవితవ్య మిదానీం దురాత్మనా వృకోదరహతకేన. అత ఏవం బ్రవీమి.

---

భూతమున లద్రూపము]; తే = నీకు, క్రోధః = కోపము, న నామ = లేదన్న మాటేనా?, కరుణా న? =[చనిపోబోవుచున్న దుశ్శాసనునిపట్ల] దయలేదా?, చ= మరియు, లజ్జా =[స్వపక్షమిట్లయినదే అని] సిగ్గు, న అస్తి =లేదా? [వసంత తిలక].

సమాసములు :- ప్రకృత్యా దుర్లలితః—తస్య. ఉద్ధృతమ్ ఆయుధం యేన సః.

సంధులు — ఆయుధః+అసౌ—ఉత్వాదేశవిసర్గ—ఆయుధో+అసౌ— పూర్వరూపసంధి. క్రోధః+న—ఉత్వాదేశవిసర్గ. తే+అస్తి—పూర్వరూపసంధి.

క్రియ :- 1. వి+అవ+షో అంతకర్మణి, దివాది, పరస్మై, ల్రృట్, ప్రథమ
వ్యవస్యతి—వ్యవస్యతః—వ్యవస్యన్తి
2. వృఞ్ ఆవరణే (ణిచ్) పరస్మై, లట్, మధ్యమ
వారయసి—వారయథః—వారయథ
3. అస భువి, పరస్మై, లట్, ప్రథమ
అస్తి—స్తః—సన్తి

ఏతదితి :- (సకరుణమ్ = దయనీయముగా, పాదయోః నిపత్య = పాదములపైబడి) ఏతత్ =(నివారించుటకుగల కారణము) దీనిని, విజ్ఞాపయామి= విన్నవించుచున్నాను. ఆయుష్మన్=చిరంజీవీ!, దురాత్మనా=దుష్టుడైన, వృకోదర హతకేన=నీచ భీమునిచే, ఇదానీమ్=ఈపాటికి, సంపూర్ణప్రతిజ్ఞేన=చేసిన ప్రతిన పూర్తిగా చెల్లించుకొన్నవాడై, నివృత్తేన = సమరభూమినుండి మరలినవానిచే, భవితవ్యమ్ = అయియుండవలె. దుశ్శాసన సంహారమును పూర్తిచేసి ఈపాటికి మరలియుండుననుట. అతః=అందుచే, ఏవమ్=ఇట్లు, బ్రవీమి=పలుకుచున్నాను.

దుర్యోధనః : (సహసా భూమౌ పతన్) హా వత్స, దుశ్శాసన, హా మదాజ్ఞావిరోధిత పాండవ, హా విక్రమైకరస, హా మదంకదుర్లలిత, హా అరాతికుల గజఘటామృగేంద్ర, హా యువరాజ, క్వాసి' ప్రయచ్ఛ మే ప్రతివచనమ్. (ఇతి నిఃశ్వస్య మోహముపగతః).

సూతః : రాజన్, సమాశ్వసిహి సమాశ్వసిహి.

దుర్యోధనః : (సంజ్ఞాం లబ్ధ్వా నిశ్శ్వస్య)

యుక్తో యథేష్టముపభోగసుఖేషు నైవ
త్వం లాలితోఽపి హి మయా న వృథాగ్రజేన।

---

హేతి :— (సహసా=ఉన్నపాటున, భూమౌ పతన్=నేలపై పడినవాడై) హా వత్స!=అయ్యో బిడ్డా!, దుశ్శాసనా! హా=అయ్యో!, మదాజ్ఞా=నా ఆనతిచే, (ఆచరించుటచే) విరోధిత=శత్రువులుగా చేసికోబడిన, పాండవ = పాండవులు కలవాడా!, హా = అయ్యో, విక్రమైకరస = పరాక్రమమునందే ఆనందించువాడా! (పరాక్రమమొక్కటే ఆనందముగా కలవాడా!, మదంక దుర్లలిత = నా ఒడిలో సుకుమారుడా!, హా=అయ్యో, అరాతికుల=శత్రుసమూహమనునట్టి, గజఘటా= ఏనుగుల సమూహమునకు, మృగేంద్ర=సింహమా! యువరాజా!, క్వ+అసి= ఎచ్చటనుంటివి! మే=నాకు, ప్రతివచనమ్=సమాధానమును, ప్రయచ్ఛ=ఇమ్ము-బదులుపల్కుమనుట. (ఇతి=అని, నిఃశ్వస్య=నిట్టూర్చి, మోహమ్ ఉపగతః= మూర్ఛిల్లెను).

రాజన్నితి :— రాజన్ = మహారాజా! సమాశ్వసిహి సమాశ్వసిహి= ఊరడిల్లుము ఊరడిల్లుము.

యుక్త ఇతి :— (సంజ్ఞామ్=స్పృహను, లబ్ధ్వా=పొంది, నిశ్శ్వస్య= నిట్టూర్చి) హే వత్స, త్వమ్, ఉపభోగ సుఖేషు, యథేష్టమ్, న, యుక్తః ఏవ;

అస్యాస్తు వత్స తవ హేతురహం విపత్తే
ర్యత్కారితో౽స్యవినయం న చ రక్షితో౽సి॥ 6

(ఇతి పతతి)

సూతః : ఆయుష్మన్, సమాశ్వసిహి, సమాశ్వసిహి.

దుర్యోధనః : ధిక్సూత, కిమనుష్ఠితం భవతా!

రక్షణీయేన సతతం బాలేనాజ్ఞానువర్తినా।
దుశ్శాసనేన భ్రాత్రాహముపహారేణ రక్షితః॥ 7

---

వృథా అగ్రజేన, మయా, త్వమ్, న, లాలితః, హి; తవ, అస్యాః, విపత్తేః, హేతుః, అహమ్. యత్, అవినయమ్, కారితః, అసి, తు, రక్షితః, న, అసి.

అర్థము :- వత్స = ఓ తమ్ముడా!, త్వమ్ = నీవు, ఉపభోగసుఖేషు= ఆనందింపదగిన ఐశ్వర్యాది సుఖములయందు, యథేష్టమ్=స్వేచ్ఛగా, న యుక్తః ఏవ=నియుక్తుడవు కానేలేదు. వృథాగ్రజేన=కొరగాని అన్ననైన, మయా=నాచేత, త్వమ్=నీవు, న లాలితః హి=లాలింపబడనేలేదుగదా! తవ=నీయొక్క, అస్యాః= ఈ, విపత్తేః = ఆపదకు, హేతుః = కారణము, అహమ్=నేను, యత్=ఏలన, అవినయమ్ = దౌష్ట్యము, కారితః = చేయుటకు ప్రేరేపింపబడినవాడవు, అసి= అయితివి, తు=కాని, రక్షితః న అసి=[ప్రమాదమునుండి] రక్షింపబడినవాడవు కాకపోయితివి.

[ఇతి=అని, పతతి=పడిపోవును]

ఆయుష్మన్నితి :- చిరంజీవీ!, సమాశ్వసిహి సమాశ్వసిహి=ఊరడిల్లు మూరడిల్లుము.

ధిగితి :- ధిక్ సూత=ఛీఛీ సూతుడా!, భవతా=నీచేత, కిమ్ అనుష్ఠితమ్= ఏమి ఆచరింపబడినదయ్యా!—ఎంత నీచపు పని చేసితివయ్యా! అనుట.

రక్షణీయేనేతి :- సతతమ్, రక్షణీయేన, ఆజ్ఞానువర్తినా, బాలేన, భ్రాత్రా, దుశ్శాసనేన, ఉపహారేణ, అహమ్, రక్షితః.

సూతః : మహారాజ, మర్మభేదిభి రిషు తోమర శక్తి ప్రాస వర్షైర్మహారథినామ్ అపహృతచేతనత్వాత్ నిశ్చేష్టః కృతో మహారాజ ఇత్యపహృతో మయా రథః

దుర్యోధనః : సూత, విరూపం కృతవానసి.

తస్యైవ పాండవపశోరనుజద్విషో మే
క్షోభై ర్గదాశని కృతై ర్న విబోధితో౽స్మి।

---

అర్థము :— సతతమ్=ఎల్లవేళల, ఆజ్ఞానువర్తినా=ఆజ్ఞలో మెలగువాడును, రక్షణీయేన=[నాచే] రక్షింపదగినవాడును, బాలేన=చిన్నవాడును, భ్రాత్రా=సోదరుడునై, దుశ్శాసనేన దుశ్శాసనుడనునట్టి, ఉపహారేణ=బలితో, అహమ్=నేను, రక్షితః=రక్షింపబడితిని. దుశ్శాసనుని బలిపెట్టి నన్ను కాపాడితివనుట. [అనుష్టుప్పు]

మహారాజేతి :— మహారాజా!, మహారథినామ్=పాండవపక్షమునందలి మహారథులకు సంబంధించినవై [వారు ప్రయోగించునవనుట] మర్మభేదిభిః = ఆయువుపట్టులను చీల్చునవైన, ఇషు = బాణములయొక్కయు, తోమర = తోమరములు అను ఆయుధములయొక్కయు, శక్తి="శక్తి" అను పేరి శస్త్రములయొక్కయు, ప్రాస=ఖడ్గములయొక్కయు, వర్షైః=ధారాపాతముచే (వృష్టిచే), అపహృతచేతనత్వాత్ = కొల్లగొట్టబడిన చైతన్యముకలవాడై, చేతనత్వమును కోల్పోయి అనుట, మహారాజః=రారాజు [నీవు], నిశ్చేష్టః=మూర్ఛితుడు, కృతః=కావింపబడినాడు, ఇతి=అని, మయా=నాచేత, రథః=నీవధిష్ఠించిన రథము, అపహృతః=రణరంగమునుండి తప్పింపబడినది—తప్పించితి ననుట.

సూతేతి :— సూత = సారథీ! విరూపమ్ = అననురూపమైన పనిని, కృతవాన్=చేసినవాడవు, అసి=అయితివి.

తస్యేతి :- మే, అనుజద్విషః, తస్య, పాండవపశోః, గదాశనికృతైః,

తామేవ నాధిశయితో రుధిరార్ద్రశయ్యాం
దౌశ్శాసనీం యుధి సహాశుతరో వృకోదరో వా॥ 8

క్షోభైః, ఏవ, విబోధితః, న, అస్మి; దౌశ్శాసనీమ్, తామ్, రుధిరార్ద్రశయ్యామ్, ఏవ, ఆశు, అహమ్, వా, వృకోదరః, వా, న, అధిశయితః.

అర్థము :— మే = నాయొక్క, అనుజద్విషః=తమ్మునిశత్రువైన, తస్య=ఆ, పాండవపశోః=పశువువంటి పాండవునియొక్క [భీమునియొక్క], గదాశనికృతైః=గదయనునట్టి పిడుగుచే కల్పింపబడిన, క్షోభైః ఏవ=పీడలచేతనే [దెబ్బలచేతనే] విబోధితః=మూర్ఛ దేర్పబడినవాడను, న అస్మి=కాకపోయితిని; దౌశ్శాసనీమ్=దుశ్శాసనునికి సంబంధించినదైన, తామ్=ఆ, రుధిరార్ద్రశయ్యామ్— రుధిర=రక్తముచే, ఆర్ద్ర=తడిసిపోయిన, శయ్యామ్ ఏవ=భూశయనమునే, ఆశు= శీఘ్రముగా, అహమ్ వా=నేనుగాని, వృకోదరః వా=భీముడుగాని, న అధిశయితః= అధిశయించుట జరుగలేదు. నేను పడిపోవుటగాని, భీముని పడగొట్టుటగాని చేయలేకపోతిననుట. [వసంతతిలకావృత్తము]

సమాసములు :— పాండవః పశు రివ—పాండవపశుః—తస్య. అనుజం ద్వేష్టి ఇతి—అనుజద్విట్ [ద్వేష్టీతి—ద్విట్—అనుజస్య ద్విట్] తస్య. గదా ఏవ అశనిః-గదాశనినా కృతాః-తైః. రుధిరేణ ఆర్ద్రా-రుధిరార్ద్రా చ సా శయ్యా చ— రుధిరార్ద్రశయ్యా—తామ్. దుశ్శాసనస్యేయమ్—దౌశ్శాసనీ—తామ్.

సంధులు :— తస్య+ఏవ—వృద్ధిసంధి. పశోః+అనుజ, క్షోభైః+ గదా, కృతైః+న—రేఫాదేశవిసర్గ. ద్విషః+మే, శయితః+రుధిర, వృకోదరః+ వా—ఉత్వాదేశవిసర్గ. విబోధితః+అస్మి—ఉత్వాదేశవిసర్గ—విబోధితో+అస్మి— పూర్వరూప. న+అధిశయితః, గదా+అశని, రుధిర+ఆర్ద్ర—సవర్ణదీర్ఘ.

క్రియ :- అస భువి, పరస్మై, లట్, ఉత్తమ
అస్మి—స్వః—స్మః

(నిఃశ్వస్య నభో విలోక్య) నను భో హతవిధే, కృపా
విరహిత, భరతకుల విముఖ!

అపి నామ భవేన్మృత్యుర్న చ హంతా వృకోదరః।

సూతః : శాంతం పాపం శాంతం పాపమ్. మహారాజ, కిమిదమ్!

దుర్యోధనః : ఘాతితాశేషబంధోర్మే కిం రాజ్యేన జయేన వా॥ 9

---

నన్విత్తి :- (నిఃశ్వస్య = నిట్టూర్చి, నభః విలోక్య = మింటిదిక్కు మోమై) నను భో హతవిధే=ఓరీ హతవిధీ! (దుష్టుడైన విధాతా!) కృపా విరహిత=దయావిహీనుడా! భరతకుల=భరతవంశమునకు, విముఖ=శత్రువైన వాడా!

**అపినామేతి** :- అపి, మృత్యుః, భవేత్, నామ; చ, హంతా, వృకోదరః, న, (భవేత్). ఘాతితాశేషబంధోః, మే, రాజ్యేన, కిమ్? జయేన, వా, కిమ్?

**అర్థము** :- అపి=ఏమీ! మృత్యుః=మరణము, భవేత్ నామ=అగుగాక! చ=కాని, హంతా=వినాశకుడు, వృకోదరః=భీముడు, న భవేత్=కాకుండుగాక!

శాంతమితి :- శాంతమ్ పాపమ్ = పాపము శాంతించుగాక, పాపము శాంతించుగాక!, మహారాజా! ఇదమ్ కిమ్=ఏమిది!

**అర్థము** :- ఘాతిత = చంపివేయబడిన, అశేష బంధోః = సమస్త బంధువులు కలవాడనైన, మే=నాకు, రాజ్యేన=రాజ్యముతో, కిమ్=పనియేమి?, జయేన వా=జయముతోగాని, కిమ్=పనియేమి? [అనుష్టుప్].

సమాసములు :— అశేషాశ్చ తే బంధవశ్చ—ఘాతితాః అశేషబంధవః యస్య సః—ఘాతితాశేషబంధుః—తస్య.

సంధులు :— భవేత్+మృత్యుః—అనునాసికాదేశ. మృత్యుః+న, బంధోః+మే—రేఫాదేశవిసర్గ. ఘాతిత+అశేష—సవర్ణదీర్ఘసంధి.

(తతః ప్రవిశతి శరప్రహార వ్రణ బద్ధ పట్టికాలంకృత కాయః సుందరకః)

సుందరకః : ఆర్యాః, అపి నామాస్మిన్నుద్దేశే సారథి ద్వితీయో దృష్టో యుష్మాభిః మహారాజ దుర్యోధనో న వేతి. (నిరూప్య) కథం న కోఽపి మంత్రయతే — భవతు. ఏతేషాం బద్ధ పరికరాణాం పురుషాణాం సమూహో దృశ్యతే. అత్ర గత్వా ప్రక్ష్యామి (పరిక్రమ్య విలోక్య చ) కథమేతే ఖలు స్వస్వామినో గాఢప్రహారాహతస్య ఘన సన్నాహజాల దుర్భేద్యముఖైః కంకవదనైః హృదయాత్ శల్యాన్యుద్ధరన్తి. తన్న ఖల్వేతే జానంతి.

(అజ్జా అవిణామ ఇమస్సిం ఉద్దేసో సారహిదుఇఓ దిట్ఠో తుంహేహిం మహారాఅ దుజ్జోహణో ణ వేత్తి. కహం ణ కోవి మంతేది. హోదు. ఏదాణం బద్ధపరిఅరాణాం పురిసాణాం సమూహో దీసఇ. ఏత్థ గదుఅ పుచ్ఛిస్సమ్. కహం ఏదే క్ఖు స్వస్వామిణో గాఢప్పహారహాదస్స ఘణసణ్ణాహ జాల దుబ్భేజ్జ ముహేహిం కంకవదణేహిం హిఅఆదో సల్లాఇం ఉద్ధరన్తి, తా ణక్కు ఏదే జాణంతి.

---

(తతః=అంతట, శరప్రహార=బాణపుదెబ్బలచేనైన, వ్రణ=గాయములకు, బద్ధ=కట్టబడిన, పట్టికా=పట్టీలచేత, అలంకృత=కూడుకొనిన, కాయః=శరీరము గలవాడై, సుందరకః=సుందరకుడనువాడు, ప్రవిశతి=ప్రవేశించును.)

ఆర్యాఇతి :- ఆర్యాః=పెద్దలారా!, అస్మిన్=ఈ, ఉద్దేశే=ప్రాంతము నందు, సారథి ద్వితీయః=సూతుడే తోడుగా కల్గిన, మహారాజ దుర్యోధనః= సుయోధనమహారాజు, యుష్మాభిః = మీచేత, అపినామదృష్టః = చూడబడినాడా? న వా ఇతి = లేదా అని. మీకెవరికైన దుర్యోధనుడు కనిపించెనా? అనుట.

భవతు. అన్యతో విచేష్యామి. (అగ్రతోఽవలోక్య కించిత్ పరిక్రమ్య) ఇమే ఖల్వపరే ప్రభూతతరాః సంగతా వీరమనుష్యా దృశ్యంతే. తదత్ర గత్వా ప్రక్ష్యామి. (ఉపగమ్య) హంహో! జానీథ యూయం

(హోదు, అణ్ణదో విచిణిస్సమ్. ఇమే క్ఖు అవరే ప్పహూదదరా సంగదా వీరమణుస్సా దీసన్తి. తా ఏత్థ గదుఅ పుచ్ఛిస్సమ్. హంహో జాణహ తుంహే కస్సిం ఉద్దేసే కురుణాహో వట్టఇత్తి. కహం ఏదే వి)

---

(నిరూప్య=సమాధానమునకై కొంచెమాగి) కథమ్=ఎట్టూ, కః అపి=(ఒక్కడు కూడ) ఎవడును, న మంత్రయతే=బదులు పలుకకున్నాడు! భవతు=అగుగాక. బద్ధపరికరాణామ్ = కవచాదికములు ధరించియున్న లేక సన్నద్ధులైయున్న, ఏతేషామ్=ఈ, పురుషాణామ్=భటులయొక్క, సమూహః=గుంపు, దృశ్యతే=(ఇదిగో) కన్పించుచున్నది. అత్ర=సమీపమునకు, గత్వా=పోయి, ప్రక్ష్యామి= అడిగెదను. (పరిక్రమ్య=ముందుకు నడచి, అవలోక్య చ=చూచి). కథమ్= ఎట్టూ! ఏతే=వీరు, గాఢ=తీవ్రమైన, ప్రహార=దెబ్బలచే, ఆహతస్య=కొట్టబడిన వాడైన, స్వ స్వామినః=తమ నాయకునియొక్క, హృదయాత్=వక్షఃస్థలము నుండి, ఘన=దృఢమైన, సన్నాహ=కవచములయొక్క, జాల=సమూహమువలె, దుర్భేద్య=భేదింపశక్యముగాని, ముఖైః=అగ్రభాగములుగల్గిన, కంకవదనైః= నారాయణపక్షియొక్క చంచువులతో (అవి శ్రావణములుగా ననుట), శల్యాని= శరశకలములను, ఉద్ధరన్తి =(ఊడబెరకుచున్నారు) తీయుచున్నారు. తత్= అందుచేత, ఏతే=వీరు, న జానంతి ఖలు=ఎఱుగరన్నమాటయేగదా!, భవతు= కానిమ్ము. అన్యతః=మరొకవైపునుండి, విచేష్యామి=అన్వేషింతును. (అగ్రతః= ముందునకు, అవలోక్య=చూచి, కించిత్=కొంచెము, పరిక్రమ్య=నడిచి) ఇమే= వీరు, అపరే ఖలు = మరికొందఱుగదా! ప్రభూతతరాః=అధికసంఖ్యాకులై, సంగతాః=గుమికూడి, వీరమనుష్యాః=వీరపురుషులు, దృశ్యన్తే=కనిపించు చున్నారు. తత్ అత్ర = వీరి సమీపమునకు, గత్వా=పోయి, ప్రక్ష్యామి=

కస్మిన్నుద్దేశే కురునాథో వర్తత ఇతి (దృష్ట్వా) కథమేతేఽపి మాం ప్రేక్ష్యాధికతరం రుదన్తి. తన్న ఖల్వేతేఽపి జానన్తి. హా అతికరుణం ఖల్వత్ర వర్తతే. ఏషా వీరమాతా సమర వినిహతం పుత్రకం శ్రుత్వా రక్తాంశుక నివసనయా సమగ్రభూషణయా వధ్వా సహానుమ్రియతే. (సశ్లాఘమ్) సాధు వీరమాతః,

(మం పేక్ఖిఅ అహి అదరం రోఅన్ది. తా ణహు ఏదే వి జాణన్తి. హా అదికరుణం క్ఖు ఏత్థ వట్టఇ. ఏసా బీలమాదా సమలవిణిహాదం పుత్తఅం సుణిఅ రత్తసుఅ ణివసణాఏ సమగ్గ భూసణాఏ బహూఏ సహ అణుమరది. సాహు వీరమాదే సాహు)

---

అడిగెదను. (ఉపగమ్య=సమీపించి) హంహో!=ఓయీ! కస్మిన్ ఉద్దేశే=ఏ ప్రదేశమునందు, కురునాథః=దుర్యోధనుడు, వర్తతే ఇతి=ఉన్నాడో, యూయమ్=మీరు, జానీథ=ఎరుగుదురా? (దృష్ట్వా=విలోకించి) కథమ్=ఎట్టూ! ఏతే అపి=వీరుకూడ, మామ్=నన్ను, ప్రేక్ష్య=చూచి, అధికతరమ్=మిక్కిలి, రుదన్తి=దుఃఖించుచున్నారు! తత్=అందుచేత, ఏతే అపి=వీరుకూడ, న జానంతి ఖలు=ఎరుగరన్నమాటయే! హా=అయ్యో! అత్ర=ఇచట, అతికరుణమ్=మిక్కిలి కరుణీయముగా, వర్తతే ఖలు=ఉన్నదిగదా! ఏషా=ఇదిగో ఈ, వీరమాతా=వీరమాత, సమర=యుద్ధమునందు, వినిహతమ్=చంపబడినాడని, పుత్రకమ్=సుతుని గూర్చి, శ్రుత్వా=విని, రక్తాంశుక నివసనయా=ఎఱ్ఱని వస్త్రములు ధరించినదియు, సమగ్రభూషణయా=సర్వాభరణములు దాల్చినదియునైన, వధ్వా సహ=కోడలితో పాటు, అనుమ్రియతే=చనిపోవుచున్నది—సహగమనము చేయుచున్న వధువుతో పాటు తల్లియు చితినెక్కినదనుట. (సశ్లాఘమ్ = ప్రశంసాపూర్వకముగా) వీరమాతః=ఓ వీరమాతా! సాధు సాధు=బాగు బాగు! అన్యస్మిన్=వేరొకటైన, జన్మాంతరే అపి=జన్మాంతరమందైనను, అనిహత=రణరంగమున చంపబడని, పుత్రకా = కుమారుడు కలదానవు, భవిష్యసి = కాగలవు. భవతు=కానిమ్ము.

సాధు. అన్యస్మిన్నపి జన్మాన్తరే అవిహత పుత్రకా భవిష్యసి. భవతు. అన్యతో విచేష్యామి (అన్యతో విలోక్య) అయమపరో బహుప్రహార నిహత కాయోఽకృత వ్రణ బంధ ఏవ యోధసమూహః ఇదం శూన్యాసన తురంగ ముపాలభ్య రోదితి. నూనమేతేషామత్రైవ స్వామీ వ్యాపాదితః. తన్న ఖల్వేతేఽపి జానన్తి. భవతు అన్యతో గత్వా ప్రక్ష్యామి. (సర్వతో

(అణ్ణస్సిం వి జమ్మన్తరే అణిహదపుత్తా హువిస్ససి. హోదు. అణ్ణదో విచిణఇస్సమ్. అఅం అవరో బహుప్పహారణిహదకాఓ అకిదవ్వణప్పబంధో ఏవ్వ జోహసమూహో ఇమం సుణ్ణాసణం తురంగమం ఉవాలహిఅ రోఇది. ణూణ ఏదాణం ఏత్థ ఏవ్వ సామీ వావాదిదో. తా ణఖు ఏదే వి జాణన్ది. హోదు. అణ్ణదో గదుఅ పుచ్ఛిస్సమ్. కహం సవ్వే ఏవ్వ అవత్థాణు)

---

అన్యతః=మరొకవైపు, విచేష్యామి=వెదకెదను (కదలుదును). (అన్యతః విలోక్య=మరొకవైపు చూచి) బహుప్రహార=పలు దెబ్బలచే, నిహత=జర్జరిత మైన, కాయః=శరీరములు కలదియు, అకృతవ్రణబంధః ఏవ=దెబ్బలకు కట్లు కట్టబడనిదియునయిన, అయమ్ = ఈ, యోధసమూహః=సైనికబృందము, ఇమమ్=ఈ, శూన్యాసన=శూన్యమైన ఆస్తరణముతో కూడిన (జీనుపై యోధుడు లేని అనుట), తురంగమ్=అశ్వమును, ఉపాలభ్య=సమీపించి (కౌగిలించుకొని), రోదితి = దుఃఖించుచున్నది. ఏతేషామ్=వీరియొక్క, స్వామీ=నాయకుడు, నూనమ్=తప్పక, అత్రైవ=ఇచ్చటనే, వ్యాపాదితః=చంపబడియుండును. తత్= అందుచే, ఏతే అపి=వీరుకూడ, న జానంతి ఖలు=ఎరిగియుండరుగదా!, భవతు= కానిమ్ము. అన్యతః గత్వా=మరొక దిశకు ఏగి, ప్రక్ష్యామి=వాకబు చేయుదును. (సర్వతః=అన్ని వైపులకు, విలోక్య=పరిశీలనగా చూచి), కథమ్=ఎట్లూ!, సర్వః

విలోక్య) కథం సర్వ ఏవావస్థానురూప వ్యసనమనుభవన్ భాగధేయ విముఖతయా పర్యాకులో జనః. తత్కమత్ర ప్రక్ష్యామి కం వోపాలప్స్యే. భవతు. స్వయమేవాత్ర విచేష్యామి. (పరిక్రమ్య) భవతు. దైవమిదానీ ముపాలప్స్యే. హాహా!, దైవ, ఏకాదశానా మక్షౌహిణీనాం నాథో జ్యేష్ఠో భ్రాతృశతస్య భర్తా గాంగేయ ద్రోణాంగరాజ శల్య కృప కృతవర్మాశ్వత్థామ

(రూపం వ్యసణం అణుభవన్తో భాఅధేఅ విముహదాఏ పజ్జాఉలో జణో. తా కం ఏత్థ పుచ్ఛిస్సమ్ కం వా ఉవాలహిస్సమ్ హోదు సఅం ఏవ్వ ఏత్థ విచిణఇస్సమ్. హోదు దేవ్వం దాణిం ఉవాలహిస్సమ్. హంహో దేవ్వ, ఏఆదసాణం అక్ఖోహిణీణం ణాహో, జేట్ఠో భాదు సదస్స, భత్తా గంగేఅ ద్రోణాంగరాఅ సల్ల కివ కిదవమ్మ అస్సత్థామ ప్పముహాస్స రాఅచక్కస్స)

---

జనః = ప్రతి మనుజుడును, అవస్థానురూపమ్ = తన స్థితికి అనుగుణమైన, వ్యసనమ్=దుఃఖమును, అనుభవన్=అనుభవించుచు, భాగధేయ=అదృష్టము యొక్క, విముఖతయా=వైముఖ్యముతో (దురదృష్టము కారణముగా అనుట), పర్యాకులః ఏవ=వ్యాకులపడుచున్నవాడే! తత్=అందుచేత, అత్ర=ఇచట, కమ్= ఎవనిని, ప్రక్ష్యామి=అడుగుదును!, కమ్=ఎవనిని, ఉపాలప్స్యే వా=నిందింతును! భవతు=కానిమ్ము. స్వయమ్ ఏవ=నా అంతట నేనుగనే, అత్ర=ఈ రణరంగము నందు, విచేష్యామి=అన్వేషింతును. (పరిక్రమ్య=కొంత పరిక్రమించి), భవతు= సరే కానిమ్ము, ఇదానీమ్=ఇకనిప్పుడు, దైవమ్=దైవతమును, ఉపాలప్స్యే= నిందింతును. హాహా దైవ=ఓయీ దైవమా! ఏకాదశానామ్=పదకొండయిన, అక్షౌహిణీనామ్=అక్షౌహిణులకు, నాథః=ప్రభువును, భ్రాతృశతస్య=నూర్గురు సోదరులకు, జ్యేష్ఠః=పెద్దవాడును, గాంగేయ=భీష్ముడు, ద్రోణుడు, అంగరాజ=

ప్రముఖస్య రాజ చక్రస్య సకల పృథ్వీమండలైకనాథో మహారాజ దుర్యోధనోఽప్యన్విష్యతే. అన్విష్య మాణోఽపి న జ్ఞాయతే కస్మిన్నుద్దేశే వర్తత ఇతి. (విచిన్త్య నిఃశ్వస్య చ). అథవా కిమత్ర దైవ ముపాలభే. తస్య ఖల్విదం నిర్భర్త్సిత విదుర వచన బీజస్యావధీరిత పితామహ హితోపదేశాంకురస్య శకుని ప్రోత్సాహనాది విరూఢమూలస్య జతుగృహ ద్యూత విష శాఖినః సంభూత చిరకాల సంబద్ధ వైరాలవాలస్య

(సఅల ప్పుహవీమండలేక్కణాహో మహారాఅ దుజ్జో హణో వి అణ్ణేసీఅది. అణ్ణేసీఅన్తో వి ణ జాణీఅది. కస్సిం ఉద్దేసే వట్టఇ త్తి.)

---

కర్ణుడు, శల్యుడు, కృపుడు, కృతవర్మ, అశ్వత్థామ, ప్రముఖస్య=మొదలగు వారితో కూడిన, రాజచక్రస్య=రాజసమూహమునకు, భర్తా=స్వామియు, సకల= సమస్తమైన, పృథ్వీమండల=భూ చక్రమునకు, ఏకనాథః=చక్రవర్తియునైన, మహారాజ దుర్యోధనః అపి=మహారాజు సుయోధనుడుకూడ, అన్విష్యతే=వెదుక బడుచున్నాడు-అంతటివానినికూడ అన్వేషించు దురవస్థ యనుట. అన్విష్యమాణః అపి=వెదుకబడుచుండియు, కస్మిన్ ఉద్దేశే=ఏ ప్రదేశమునందు, వర్తతే ఇతి= ఉన్నాడో అనుట, న జ్ఞాయతే=తెలియబడుటలేదు—వెదకినను కన్పించలేదనుట. (విచిన్త్య=ఆలోచించి, చ=మరియు, నిఃశ్వస్య=నిట్టూర్చి), అథవా=అయినను, అత్ర = ఈ విషయమునందు, దైవమ్=దైవతమును, కిమ్ ఉపాలభే=ఏమని నిందింతును. దైవమును నిందింప బని లేదనుట. నిర్భర్త్సిత=తిరస్కరింపబడిన, విదుర వచన=విదురుని ఉపదేశము, బీజస్య=విత్తుగా కలదియు, విదుర వచనమును తిరస్కరించుటే వైరవృక్షమునకు బీజ మనుట, అవధీరిత=తిరస్కరింపబడిన, పితామహ=భీష్మునియొక్క, హితోపదేశ=హితవచనము, అంకురస్య=మొలకగా కలదియు, శకుని=సౌబలునియొక్క, ప్రోత్సాహన+ఆది=ప్రోత్సాహదికముచే,

పాంచాలీ కేశగ్రహణ కుసుమస్య ఫలం పరిణమతి. (అన్యతో విలోక్య). యథా త్రైవ వివిధ రత్నప్రభా సంవలిత సూర్యకిరణ ప్రసూత శక్ర చాప సహస్ర సంపూరిత దశదిశాముఖో లూనకేతువంశో రథో

(అహవా కిం ఏత్థ దేవ్వం ఉవాలహామి. తస్స క్ఖు ఏదం ణిబ్భచ్ఛిఅ విఉరవఅణపీఅస్స అవహీరిద పిదామహ హిదోవదేసంకురస్స సఉణిప్పోచ్ఛాహణాది విరూఢ మూలస్స జదుగేహ జూదవిస సాహిణో సంభూదచిర ఆలసంబద్ధవేరాలవాలస్స పంచాలీకేసగ్గహణ కుసుమస్స ఫలం పరిణమది. జహా ఏత్థ ఏసో వివిహరఅణప్పహా సంవలిద సూరకిరణ ప్పసూద సక్కచావ సహస్స సంపూరిద దసదిసాముహో లూణకేదువంసో రహో)

---

విరూఢమూలస్య=వేళ్లుపోసికొన్న మ్రాను కలదియు, శకుని ప్రోత్సాహాదికముచే వైరవృక్షము వేళ్లూని బలముగా మ్రానువట్టినదనుట, జతుగృహ=లక్క ఇల్లు, ద్యూత = జూదము, విష=విషము అనునట్టి శాఖినః=కొమ్మలు కలదియు, సంభూత=ఉత్పన్నమైనదియు, చిరకాల=చిరకాలమునుండి, సంబద్ధ=పరస్పరాను బద్ధమైనదియునైన, వైర = శత్రుత్వమే, ఆలవాలస్య = పాదుగా కలదియు, పాంచాలీ = ద్రౌపదియొక్క, కేశగ్రహణ = క్రొమ్ముడిపీడ్చుట, కుసుమస్య= పుష్పముగా కలదియు—వైరతరువు ఆనాడట్లు పుష్పించినదనుట, తస్య=ఆ వైర వృక్షమునకు, ఇదమ్ = ఇది, ఫలమ్ = ఫలముగా, పరిణమతి ఖలు=రూపొందు చున్నది సుమా!, కావున దైవమును నిందింప బని లేదనుట. [అన్యతః=మరొక వైపునకు, విలోక్య=చూచి] అత్ర=ఇచ్చట, ఏషః=ఇదే, వివిధ=బహువిధము లైన, రత్న=రత్నముల యొక్క, ప్రభా=కాంతులతో, సంవలిత=సమ్మిళితము లైన, సూర్యకిరణ=సూర్యకిరణములచే, ప్రసూత=ఏర్పడిన, శక్రచాప సహస్ర= వేయి ఇంద్రధనుస్సులచే, సంపూరిత=పిక్కటిల్లిన, దశ దిశాముఖః=సమస్త

దృశ్యతే తథాహం తర్కయామ్యవశ్యమేతేన మహారాజ దుర్యోధనస్య విశ్రామోద్దేశేన భవితవ్యమితి. యావన్నిరూపయామి. (ఉపగమ్య దృష్ట్వా నిఃశ్వస్య చ) కథ మేకాదశానా మక్షౌహిణీనాం నాయకో భూత్వా మహారాజో దుర్యోధనః ప్రాకృతపురుష ఇవా శ్లాఘనీయాయాం భూమావుపవిష్టస్తిష్ఠతి. అథవా తస్య ఖల్విదం పాంచాలీ కేశగ్రహ కుసుమస్య ఫలం పరిణమతి.

(దీసఇ తా అహం తక్కేమి అవస్సం ఏదిణా మహారాఅ దుజ్జోహణస్స విస్సాముద్దేసేణ హోదవ్వమ్. యావ నిరూవేమి. కహం ఏఆదహాణం అక్ఖోహిణీణం ణాఅఓ భవిఅ మహారాఓ దుజ్జోహణో పఇద పురిసో విఅ అసలాహణీఏ భూమీఏ ఉవవిట్ఠో చిట్ఠది. అధవా తస్స క్ఖు ఏదం పంచాలీకేసగ్గహ కుసుమస్స ఫలం పరిణమది.)

---

దిశాగ్రభాగములు కల్గినదియు, లూన=ఖండింపబడిన, కేతువంశః=జెండాకర్ర కలదియునైన, రథః=అరదము, యథా దృశ్యతే తథా=ఎట్లు కనబడుచున్నదో అట్లు—కనబడుట కారణముగా ననుట, ఏతేన=దీనితో (ప్రదేశము), మహారాజ దుర్యోధనస్య=రారాజయిన సుయోధనునియొక్క, విశ్రామోద్దేశేన=విశ్రాంతి స్థలముతో, భవితవ్యమ్ ఇతి=కావలసియున్నదని—ఇది తప్పక దుర్యోధనుడు విశ్రమించుచున్న స్థలమైయుండునని—అహమ్=నేను, తర్కయామి = భావించు చున్నాను. యావత్ నిరూపయామి=ఇంతలో నిశ్చయింతును-ఇప్పుడే తేల్చుకొందు ననుట. (ఉపగమ్య=సమీపించి, దృష్ట్వా=చూచి, నిశ్శ్వస్య చ=నిట్టూర్చి). కథమ్=ఎట్టూ! ఏకాదశానామ్=పదునొకండైన, అక్షౌహిణీనామ్=అక్షౌహిణులకు, నాయకః భూత్వా=నాయకుడయియుండియు, మహారాజః=రారాజయిన దుర్యోధనుడు, ప్రాకృతపురుషః ఇవ=సామాన్యమానవునివలె, అశ్లాఘనీయాయామ్=అప్రశస్త మైన, భూమౌ=నేలపై, ఉపవిష్టః తిష్ఠతి=పడియున్నాడు! అథవా=అంతే,

(ఉపసృత్య సూతం సంజ్ఞయా పృచ్ఛతి)

సూతః : (దృష్ట్వా) అయే కథం సంగ్రామాత్సుందరకః ప్రాప్తః

సుందరకః : (ఉపగమ్య) జయతు, జయతు మహారాజః. (జఅదు జఅదు మహారాఓ)

దుర్యోధనః : (విలోక్య) అయే సుందరక, సుందరక, కచ్చిత్కుశల మంగరాజస్య.

---

పాంచాలీ కేశగ్రహ కుసుమస్య=ద్రౌపదీ కేశగ్రహము పువ్వుగా కల్గిన, తస్య=ఆ వృక్షమునకు, ఇదమ్=ఇది, ఫలమ్ పరిణమతి ఖలు=ఫలముగా రూపొందెను సుమా!—ఇది దానికి ఫలమనుట (సమీప భూతమున వర్తమానము)

(ఉపసృత్య=సమీపించి, సూతమ్=సారథిని, సంజ్ఞయా=చేసన్నలతో, పృచ్ఛతి=అడుగును)

అయే ఇతి :- (దృష్ట్వా=చూచి) అయే=అహో!, కథమ్=ఏట్లూ!, సంగ్రామాత్=రణరంగమునుండి, సుందరకః=సుందరకుడు, ప్రాప్తః=వచ్చెనే!

జయత్వితి :- (ఉపగమ్య=దగ్గరకు నడచి) మహారాజః=మహారాజు, జయతు జయతు=జయించుగాక జయించుగాక!— జయము జయము మహారాజా! అనుట.

అయే ఇతి :- (విలోక్య=అవలోకించి) అయే=అహో!, సుందరక=సుందరకా! సుందరక=ఓయీ సుందరకా!, అంగరాజస్య=కర్ణునికి, కచ్చిత్ కుశలమ్=క్షేమమేనా?

సుందరకః : దేవ, కుశలం శరీరమాత్రేణ (దేవ, కుశలం సరీర మేత్తేణ)

దుర్యోధనః : (ససంభ్రమమ్) సుందరక, కిరీటినాస్య నిహతా ధౌరేయాః, హతః సారథి ర్భగ్నో వా రథః?

సుందరకః : దేవ, న భగ్నో రథః. అస్య మనోరథోఽపి (దేవ, ణ భగ్గో రహో. సే మణోరహో వి)

దుర్యోధనః : (సరోషమ్) కిమవిస్పష్టకథితై రాకులమపి పర్యాకుల యసి మే హృదయమ్. తదశేషతో విస్పష్టం కథ్యతామ్.

---

**దేవేతి** :— దేవ=మహారాజా!, శరీరమాత్రేణ = కేవల శరీరముతో, కుశలమ్=క్షేమము.

**సుందరకేతి** :— (ససంభ్రమమ్=సంభ్రమముతో) ఓయీ సుందరకా!, కిరీటినా=కిరీటిచే, అస్య=మన కర్ణునియొక్క, ధౌరేయాః=అశ్వములు, నిహతాః= చంపబడినవా? వా=లేక, సారథిః=సూతుడు, హతః=చంపబడినాడా? వా=లేక, రథః=రథము, భగ్నః=విరుగగొట్టబడినదా?

**దేవేతి** :— దేవ=మహారాజా!, రథః=రథము, న భగ్నః=విరుగగొట్ట బడలేదు. అపి=కానీ, అస్య=కర్ణునియొక్క, మనోరథః=మనోరథము [కోరిక] భగ్నః=భంగము గావింపబడినది.

**కిమితి** :— (సరోషమ్=రోషముతో) అవిస్పష్ట కథితైః=అస్పష్టమగు వాక్కులతో, ఆకులమ్ అపి=ఇప్పటికే కలతచెందియున్న, మే=నాయొక్క, హృదయమ్=ఎడందను, కిమ్ పర్యాకులయసి=మరింత కలతపెట్టుచున్నావేల?. తత్=అందుచే, అశేషతః=పూర్తిగా, విస్పష్టమ్=స్పష్టముగా, కథ్యతామ్=చెప్పబడుగాక!

సుందరకః : యద్దేవ ఆజ్ఞాపయతి. అయే! దేవస్య ముకుట మణి ప్రభావేన అపనీతా మే రణప్రహారవేదనా. (ఇతి సాటోపం పరిక్రమ్య) శృణోతు దేవః. అస్తీదానీం కుమార దుశ్శాసన వధ-(ఇత్యర్ధోక్తౌ ముఖమాచ్ఛాద్య శంకాం నాటయతి). (జం దేవో ఆణవేది. అప దేవస్స మఉడమణి ప్పహావేణ అవణీదా మే రణప్పహారవేఅణా. సుణాదు దేవో. అత్థి దాణీం కుమాలదుస్సాసణవహా——)

సూతః : సుందరక, కథయ. కథితమేవ దైవేన.

దుర్యోధనః : కథ్యతామ్. శ్రుతమస్మాభిః.

---

యద్దేవేతి :— దేవః=మహారాజు, యత్ ఆజ్ఞాపయతి=ఆజ్ఞాపించినట్లే. అయే=అహో!; దేవస్య=మహారాజుయొక్క. ముకుట=కిరీటమునందలి, మణి=మణులయొక్క, ప్రభావేన=శక్తితో, మే=నాయొక్క, రణప్రహార=యుద్ధమునందు తగిలిన దెబ్బలవలని, వేదనా=బాధ, అపనీతా=తొలగింపబడినది. (కొన్ని మణుల కాంతులతో నొప్పులు తగ్గునట!) (ఇతి = అని, సాటోపమ్ = సాభిమానముగా, పరిక్రమ్య=కొంత పరిక్రమించి) దేవః=మహారాజు, శృణోతు=వినుగాక. ఇదానీమ్=ఇప్పుడు, అస్తి=ఉన్నది, కుమార దుశ్శాసన=కుమార దుశ్శాసనునియొక్క, వధ=మృతి—' ఇతి=అని, అర్ధోక్తౌ=అర్ధోక్తియందు—సగము పలికి ఆగిపోవుట—ముఖమ్=మోమును, ఆచ్ఛాద్య=కప్పికొని, శంకామ్ నాటయతి=శంకనభినయించును.)

సుందరకేతి :— సుందరక=ఓ సుందరకుడా! కథయ=చెప్పుము. దైవేన=దైవముచే, కథితమ్ ఏవ=ఇది చెప్పబడిన విషయమే. దుశ్శాసన మరణ వార్త విన్నదే శంకింప పని లేదనుట.

కథ్యతామితి :— కథ్యతామ్=చెప్పబడుగాక. నిశ్శంకముగా చెప్పమనుట. అస్మాభిః=మాచేత, శ్రుతమ్=దుశ్శాసన మరణవార్త ఆలకింపబడినది.

సుందరకః : శృణోతు దేవః. అద్య తావత్కుమార దుఃశాసన వధామర్షితేన స్వామినాంగరాజేన కృత కుటిల భృకుటీభంగ భీషణ లలాటపట్టేన అవిజ్ఞాత సంధాన తీక్ష్ణమోక్ష శిలీముఖ సంఘాత వర్షిణా అభియుక్తః స దురాచారో మధ్యమ పాండవః. (సుణాదు దేవో, అజ్జ దావ కుమాల దుస్సాసణ వహా మరిసిదేణ సామిణా అంగరాఏణ కిదకుడిలభిఉడీ భంగభీసణ లిడల వట్టేణ అవిణ్ణాద సంధాణ తిక్ఖ మోక్ఖ సిలీముహ సంఘాద వరిసిణా అబిజుత్తో సో దురాఆరో మజ్ఝమ పాండవో.)

ఉభౌ : తతస్తతః

సుందరకః : తతో దేవ, ఉభయబల మిలద్దీప్యమాన కరితురగ పదాతి సముద్ధూత ధూళి నికరేణ పర్యస్త గజఘటా

---

శృణోత్విత్తి :- దేవః=మహారాజు, శృణోతు=వినుగాక! అద్య=నేడు, కుమార దుశ్శాసన=కుమార దుశ్శాసనునియొక్క, వధ=మరణముతో, అమర్షితేన=కోపించినవాడును, కృత=సంధానింపబడిన, కుటిలభృకుటీ=వక్రములైన కనుబొమ్మలయొక్క, భంగ=విరుపుతో, భీషణ=భయముగొల్పునదైన, లలాటపట్టేన=ఫాలభాగముకలవాడును, అవిజ్ఞాత=గమనింపబడని, సంధాన=ఎక్కుపెట్టుటయు, తీక్ష్ణమోక్ష=వేగముగా విడిచిపెట్టుటయుగల్గిన, శిలీముఖ=బాణములయొక్క, సంఘాత = సమూహమును, వర్షిణా=కురిపించువాడును, గుర్తింపబడనంతటి వేగముగా ఎక్కుపెట్టుట విడుచుటలు జరిగినవనుట, స్వామినా=సేనాపతియునైన, అంగరాజేన=కర్ణునిచేత, సః=ఆ, దురాచారః=దుర్మార్గుడగు, మధ్యమ పాండవః=పాండవ మధ్యముడగు భీముడు, అభియుక్తః=ఎదుర్కొబడినాడు. కర్ణుడు భీముని ఢీకొనెననుట.

తత ఇత్తి :- తతస్తతః=తరువాత తరువాత!

తతోద్దేవ ఇత్తి :- తతః=అటుపిమ్మట, దేవ=మహారాజా!, ఉభయ

సంఘాతేన చ విస్తీర్యమాణేన అంధకారేణాంధీకృత ముభయబలమ్, న ఖలు గగనతలం లక్ష్యతే. (తదో దేవ, ఉహఅ బల మిలంత దీప్పంత కరి తురఅ పదాది సముబ్భాద ధూళీ ణిఅరేణ పల్లత్థగఅ ఘడా సంఘాదేణ అ విత్థరన్తేణ అంధఆరేణ అంధీకిదం ఉహఅ బలమ్. ణ హు గగనతల లక్ఖీఅది.)

ఉభౌ : తతస్తతః.

సుందరకః : తతో దేవ, దూరాకృష్ట ధనుర్గుణాచ్ఛోటన టంకారేణ గంభీర భీషణేన జ్ఞాయతే గర్జిత ప్రళయ జలధరేణేతి. (తదో దేవ, దూరాకట్టిఅ ధణుగ్గుణాచ్ఛోడణ టంకారేణ గంభీరభిసణేణ జాణీఅది గజ్జిదం పలఅ జలహరేణ త్తి.)

---

బల=కౌరవపాండవ సైన్యములకు చెందినవై, మిలత్=ఢీకొనుచున్నవై, దీప్యమాన = ప్రకాశించుచున్న, కరి=ఏనుగులచేతను, తురగ=అశ్వములచేతను, పదాతి = కాల్బలముచేతను, సముద్ధూత=ఏర్పడిన, ధూళినికరేణ=దట్టమైన దుమ్ముతోను, చ=మరియు, పర్యస్త=విస్తృతమైన, గజఘటా సంఘాతేన= ఏనుగుల సమూహముతోను, విస్తీర్యమాణేన=వ్యాపించుచున్న, అంధకారేణ= చీకటితో, ఉభయబలమ్=ఇరుసైన్యమును, అంధీకృతమ్=గ్రుడ్డిదిగా చేయబడినది. గగనతలమ్=ఆకాశము, న లక్ష్యతే ఖలు=కనబడుటలేదు సుమా!. (కనిపించలేదు.)

తత ఇతి :— తతస్తతః=అటుపిమ్మట—

దూరాకృష్టేతి :— తతః=అటుతరువాత, దేవ మహారాజా!, గంభీర భీషణేన=గంభీరమైనదియు భయంకరమైనదియు, దూరాకృష్ట=కర్ణపర్యంతము లాగబడిన, ధనుర్గుణ = జ్యావల్లియొక్క, ఆచ్ఛోటన=విడుచుటవల్లనైన, టంకారేణ=టంకారముతో, గర్జిత=గర్జించిన, ప్రళయజలధరేణ ఇతి=ప్రళయకాల మేఘముచేతనైన ధ్వని సుమా అని, జ్ఞాయతే=తెలియబడుచున్నది. ధనుష్టంకారము ఆ చీకటిలో మేఘగర్జనవలె మ్రోగినదనుట.

దుర్యోధనః : తతస్తతః.

సుందరకః : తతో దేవ, ద్వయోరపి తయోరన్యోన్య సింహనాద గర్జిత పిశునం వివిధ పరిముక్త ప్రహరణా హత కవచ సంగలిత జ్వలన విద్యుచ్ఛటా భాసురం గంభీరస్తనిత చాప జలధరం ప్రసరచ్ఛరధారాసహస్రవర్షి జాతం సమరదుర్దినమ్. (తదో దేవ, దోహ్ణిం వి తాణ అణ్ణోణ్ణ సింహణాద గజ్జిద పిసుణం విహీత పరిముక్క ప్పహరణా హద కవఅ సంగలిద జలణ విజ్జుచ్ఛడా భాసురం గంభీర త్థణిఅ చాప జలహారం ప్పసరన్త సర ధారా సహస్సవరిసం జాదం సమరదుర్దిణమ్.)

దుర్యోధనః : తతస్తతః.

---

తతఇతి :- తతస్తతః=అటు తరువాత.

ద్వయోరితి :- తతః=ఆ పిమ్మట, దేవ=మహారాజా!; తయోః=ఆ, ద్వయోః అపి=ఇరువురియొక్కయు, అన్యోన్య=పరస్పరములైన, సింహనాద= సింహనాదములనునట్టి, గర్జిత = ఉరుములచే, పిశునమ్ = సూచింపబడినదియు, వివిధ=బహువిధములై, పరిముక్త=విడువబడిన, ప్రహరణ=ఆయుధములచే, ఆహత=కొట్టబడిన, కవచ=వర్మములనుండి, సంగళిత=ఎగసిపడుచున్న, జ్వలన=నిప్పురవ్వలనునట్టి, విద్యుత్ఛటా=మెరుపు గుంపులచే, భాసురమ్= ప్రకాశించునదియు, గంభీర=సాంద్రముగా, స్తనిత=ఉరుముచున్న, చాప= ధనుస్సనునట్టి, జలధరమ్=మేఘములు కలదియు, ప్రసరత్=అన్ని వైపులకు పోవుచున్న, శర=బాణములనునట్టి, ధారాసహస్ర=వర్షసహస్రమును, వర్షి= కురియుచున్నదియునైన, సమర దుర్దినమ్ = యుద్ధమనునట్టి దుర్దినము కలది, (సూర్యుడు కనబడకుండ వర్షించిన రోజు) జాతమ్=ఏర్పడెను.

తతఇతి :- తతస్తతః=అటు తరువాత.

సుందరకః : తతశ్చ దేవ, ఏతస్మిన్నంతరే జ్యేష్ఠస్య భ్రాతుః పరాభవశంకినా ధనంజయేన వజ్ర నిర్ఘాత నిర్ఘోష విషమ రసితధ్వజాగ్ర స్థిత మహావానరః, తురంగ సంవాహన వ్యాపృత వాసుదేవ శంఖచక్రాసి గదా లాంఛిత చతుర్బాహు దండ దుర్దర్శనః, ఆపూరిత పాంచజన్య దేవదత్త తార రసిత ప్రతిరవ భరిత దశ దిశా ముఖ కుహరో ధావిత స్తముద్దేశం రథవరః.
(తదో అ దేవ, ఏదస్సిం అంతరే జేట్ఠస్స భాదుణో పరాభవశంఖిణా ధణంజఏణ వజ్జ ణిగ్ఘాద ణిగ్ఘోస విసమ రసిద ఘఅగ్గట్ఠిద మహా వాణరో తురంగమ సంవాహణ వావిద వాసుదేవ సంఖ చక్కాసి గదా లంచిద చఉబ్బాహు దండ దుద్దంసణో ఆపూరిఅ పంచజణ్ణ దేఅదత్త తార రసిదప్పడిరవ భరిద దస దిసా ముహ కుహరో ధావిదో తం ఉద్దేసం రహవరో.)

---

ఏతస్మిన్నితి :- దేవ=మహారాజ, తతశ్చ=అటుపిమ్మట—ఏతస్మిన్ అంతరే=ఇంతలో, జ్యేష్ఠస్య భ్రాతుః=అగ్రజుడైన భీమునికి, పరాభవశంకినా= అవమానమును ఆశంకించువాడైన, ధనంజయేన=అర్జునునిచే, వజ్రనిర్ఘాత=వజ్ర పాతమువల్లనైన, నిర్ఘోష=ధ్వనివలె, విషమ=భయంకరమైన, రసిత=ఘోషతో కూడినదియు, ధ్వజాగ్రస్థిత = జెండాపై ప్రకాశించుచున్న, మహావానరః = హనుమంతుడు కలదియు, తురంగమ=గుర్రములను, సంవాహన=త్రోలుట యందు, వ్యాపృత=నిమగ్నుడైన, వాసుదేవ=శ్రీకృష్ణునియొక్క, శంఖ= శంఖము, చక్ర = సుదర్శనము, అసి = ఖడ్గము, గదా = కౌమోదకములతో, లాంఛిత = చిహ్నితములైన, చతుర్బాహుదండ = దండములవంటి నాల్గు భుజములతో, దుర్దర్శనః=దుర్నిరీక్ష్యమైనదియు; ఆపూరిత=బాగుగా నూదబడిన, పాంచజన్య=పాంచజన్యముయొక్కయు, దేవదత్త=దేవదత్తముయొక్కయు, తారరసిత=ఉచ్చైర్నాదముచేనైన, ప్రతిరవ=ప్రతిధ్వనితో, భరిత=నిండిపోయిన,

దుర్యోధనః : తతస్తతః.

సుందరకః : తతో భీమసేన ధనంజయాభ్యా మభియుక్తం పితరం ప్రేక్ష్య ససంభ్రమం విగలిత మవధూయ రత్నశీర్షక మాకర్ణాకృష్ట కఠిన కోదండ జీవః దక్షిణ హస్తోత్క్షిప్త శరపుంఖ విఘట్టన త్వరాయిత సారథిక స్తం దేశ ముపగతః కుమార వృషసేనః. (తదో భీమసేణ ధణంజఏహిం అభిజుత్తం పిదరం పేక్ఖిఅ ససంభమం విఅలిఅం అవధూణిఅ రఅణ సీసఅం ఆకణ్ణాకడ్ఢిద కఠిణ కోదండ జీఓ దాహిణహత్థుక్ఖిత్త సరపుంఖ విఘట్టణ తువరాఇద సారహిఓ తం దేసం ఉవగదో కుమాల విససేణో.)

---

దశదిశా=దశదిశలయొక్క, ముఖ=అగ్రభాగములనునట్టి, కుహరః=గహ్వరములు కలదియునైన, రథవరః=శ్రేష్ఠమైన రథము, తమ్=ఆ, ఉద్దేశమ్=ప్రదేశమును గూర్చి, కర్ణభీములు పోరుచున్న చోటి కనుట, ధావితః=పరుగుతీయింపబడినది.

తత ఇతి :- తతస్తతః=ఆ పిదప—

భీమసేనేతి :- తతః = అప్పుడు, భీమసేన ధనంజయాభ్యామ్ = భీమార్జునులచే, అభియుక్తమ్=ఆక్రమింపబడిన, పితరమ్=తండ్రిని, ప్రేక్ష్య= చూచి, కుమారవృషసేనః=కుమార వృషసేనుడు, విగళితమ్=జారిపోవుచున్న, రత్నశీర్షకమ్=రత్నకిరీటమును, ససంభ్రమమ్=సంభ్రమముతో, అవధూయ= పైకెగద్రోసికొని, ఆకర్ణ=చెవి వరకు, ఆకృష్ట=లాగబడిన, కఠిన=దృఢమైన, కోదండ=ధనుస్సుయొక్క, జీవః=నారికలవాడును, దక్షిణహస్త=కుడిచేతితో, ఉత్క్షిప్త=ఎత్తబడిన, శరపుంఖ=బాణపు పిడిచే లేక వెనుకభాగముచే, విఘట్టన= కొట్టుటతో, త్వరాయిత = తొందరపెట్టబడిన, సారథికః=సూతుడుకలవాడై, సారథిని త్వరపెట్టుచుననుట, తమ్=ఆ, దేశమ్=ప్రదేశమును, ఉపగతః= పొందెను.

దుర్యోధనః : (సావష్టంభమ్) తతస్తతః.

సుందరకః : తతశ్చ దేవ, తేనాగచ్ఛతైవ కుమార వృషసేనేన విదళితాసిలతా శ్యామల స్నిగ్ధపుంఖైః కఠిన కంక పత్రైః కృష్ణవర్ణైః శాణశిలా నిశిత శ్యామల శల్య బంధైః కుసుమిత ఇవ తరుర్ముహూర్తేన శిలీముఖైః ప్రచ్ఛాదితో ధనంజయస్య రథవరః. (తదో అ దేవ, తేణ, ఆ అచ్ఛంతేణ ఏవ్వ కుమాల విససేణేన విదలి దాసిలదా సామల సిణిద్ధ పుంఖేహిం కఠిన కంకవత్తేహి కిసణ పణ్ణేహిం సాణసిలా ణిసిద సామల సల్లబంధేహిం కుసుమిదో విఅ తరూ ముహుత్తేణ సిలీముహేహిం పచ్ఛాదిదో ధణంజఅస్స రహావరో.)

ఉభౌ : (సహర్షమ్) తతస్తతః.

---

తత ఇతి :– (సావష్టంభమ్=సగర్వముగా) తతస్తతః=ఆ పిదప

తేనేతి :– దేవ=మహారాజా!, తతశ్చ=ఆ తరువాత; ఆగచ్ఛతా= వచ్చుచున్నవాడే అయిన, తేన=ఆ, కుమార వృషసేనేన=కుమార వృషసేనుని చేత, విదళిత=ఖండింపబడిన, అసిలతా=ఖడ్గలతవలె, శ్యామల=నల్లనివియు, స్నిగ్ధ=చిక్కనివియునైన, పుంఖైః=పిడులు కలిగినవియు, కృష్ణవర్ణైః=నల్లని రంగు కలవియు, కఠిన=దృఢమైన, కంకపత్రైః=కాకిరెక్కలు కలవియు, శాణ శిలా=నికషోపలముచే (ఆకురాతితో), నిశిత=పదునెక్కింపబడుటచే, శ్యామల= నలుపెక్కిన, శల్యబంధైః=శల్యబంధములు కలవియు—బాణాగ్రభాగములనుట— అయిన, శిలీముఖైః=బాణములతో, ధనంజయస్య=కిరీటియొక్క, రథవరః= రథము, కుసుమితః=పూర్తిగా పుష్పించిన, తరువరః ఇవ=వృక్షరాజమువలె, ప్రచ్ఛాదితః=కప్పివేయబడినది.

తత ఇతి :– (సహర్షమ్=సానందముగా) తతస్తతః=ఆ పిదప—

సుందరకః : తతో దేవ, తీక్ష్ణ విక్షిప్త నిశితభల్లబాణవర్షిణా ధనంజయేనేషత్ విహస్య భణితమ్-అరేరే వృషసేన, పితురపి తావత్తే న యుక్తం మమ కుపితస్యాభిముఖం స్థాతుమ్. కిం పునర్భవతో బాలస్య. తద్గచ్ఛ. అపరైః కుమారైః సహ యుధ్యస్వ-ఇతి ఏవం వాచం నిశమ్య గురుజనాధిక్షేపేణ ఉద్దీపిత కోపోపరక్త ముఖమండల విజృంభిత భృకుటీభంగ భీషణేన చాపధారిణా కుమార వృషసేనేనాపి మర్మభేదకైః పరుషవిషమైః శ్రుతిపథ కృతప్రణయై ర్నిర్భర్త్సితో గాండీవీ బాణైర్న పునర్దుష్టవచనైః. (తదో దేవ, తిక్ఖ విక్ఖిత్తణిసిద భల్ల బాణ వరిసిణా ధణంజఏణ ఈసి విహసిఅ భణిదమ్— అరేరే విససేణ, పిదుణోవి దావ దేణ జుత్తం మహ కువిదస్స అభిముహం ఠాదుమ్. కిం ఉణ భవదో బాలస్స. తా గచ్ఛ. అవరేహిం కుమారేహిం సహ ఆధేహిత్తి. ఏవ్వం వాఅం ణిసమిఅ గురుఅణాహిక్ఖేవేణ ఉద్దీవిఅ కోవోపరత్తముహమండల విఆంభిఅ భిఉడీ భంగభీసణేణ చావధారిణా కుమాల విససేణవి మమ్మభేదఏహిం పరుసవిసమేహిం సుదివహ కిదప్పణ ఏహిం ణిబ్భచ్ఛిదో గండీవీ బాణేహిం ణఉణ దుట్ఠ వఅణేహిం.)

---

తీక్ష్ణేతి :- దేవ=మహారాజా, తతః=ఆ తరువాత, తీక్ష్ణ=వేగముగా, విక్షిప్త=వెదజల్లబడిన, నిశిత=వాడియైన, భల్ల=ములుకులు కల్గిన, బాణ=శరములను, వర్షిణా=కురియుచున్నవాడైన, ధనంజయేన=కిరీటిచే, ఈషద్విహస్య=మందహాసముచేసి, భణితమ్ = ఇట్లు పలుకబడినది— అరేరే వృషసేన = ఓరీ వృషసేనుడా!, కుపితస్య=కోపించినవాడనైన, మమ=నా యొక్క, అభిముఖమ్=

(నేపథ్యే)

---

దెబ్బతో, సంచూర్ణిత=నుగ్గుగావింపబడిన, ఊరోః=ఊరువులు కలవాడవైన, క్రూరస్య=దుష్టుడవైన, తవ=నీయొక్క, శిరసి=శిరస్సునందు(మీద), పాదమ్=నా పాదమును, ఆధాయ=ఉంచి, స్త్యానేన=సాంద్రమైనదియు, చ=మరియు, ఆర్ద్రేణ=ఆర్ద్రమైనదియు, త్వన్ముఖ్య=నీవు ప్రధానుడవుగానున్న, భ్రాతృచక్ర=సోదరసమూహముయొక్క, ఉద్దళన=ఖండనవలన, గళత్=స్రవించుచున్న, అసృక్=రక్తమనునట్టి, చందనేన=మంచిగంధముతో, ఆనఖాగ్రమ్=నఖశిఖాపర్యంతము, ఆక్తః = పులుముకొనబడినవాడనై—రక్తస్నానముచేసి యనుట; స్వయమ్ = నా అంతట నేను (స్వయముగా), భీమమ్ = భయంకరమైన, భూషణమ్=అలంకారమును, అనుభవితా=అనుభవించువాడను-ధరించువాడ ననుట, అస్మి = అగుచున్నాను. (సమీప భావిని వర్తమానము—అవశ్యంభావియని సూచన.) [స్రగ్ధరావృత్తము]

**సమాసములు :-** మమ భుజౌ—తాభ్యామ్. గుర్వీ చ సా గదా చ—భ్రమితా చ సా గురుగదా చ-భ్రమిత గురు గదాయాః ఆఘాతః-తేన సంచూర్ణితౌ ఊరూ యస్య సః—భ్రమిత....సంచూర్ణితోరుః—తస్య. త్వమ్ ముఖ్యః యేషాం తే—త్వన్ముఖ్యాశ్చ తే భ్రాతరశ్చ. భ్రాతౄణాం చక్రమ్—చక్రస్య ఉద్దళనమ్—ఉద్దళనాత్ గళత్ చ తదసృక్చ—అసృగేవ చందనమ్—తేన. నఖశ్చ అగ్రశ్చ అనయోః సమాహారః-నఖాగ్రమ్—నఖస్య అగ్రమితి వా—ఆసమంతాత్ నఖాగ్రమ్.

**సంధులు :—** గదా+ఆఘాత, క్రూరస్య+ఆధాయ, చందనేన+ఆనఖాగ్రమ్, స్త్యానేన+ఆర్ద్రేణ—సవర్ణదీర్ఘసంధులు. చూర్ణిత+ఊరోః, చక్ర+ఉద్దళన—గుణసంధి. త్వత్+ముఖ్య—అనునాశికాదేశ.

క్రియ :- అస భువి, పరస్మై, లట్, ఉత్తమ
అస్మి—స్వః—స్మః

(నేపథ్యే=తెరలో)

భోభో భీమసేనార్జునౌ, ఏష ఖలు నిహతాశేషారాతిచక్ర ఆక్రాంతపరశురామాభిరామయశాః ప్రతాప తాపిత దిఙ్మండల స్థాపిత స్వజనః శ్రీమా నజాతశత్రుర్దేవో యుధిష్ఠిరః సమాజ్ఞాపయతి.

ఉభౌ : కిమాజ్ఞాపయత్యార్యః!

(పునర్నేపథ్యే)

కుర్వంత్వాప్తా హతానాం రణశిరసి జనా వహ్నిసాద్దేహభారా
నశ్రూన్మిశ్రం కథంచిద్దదతు జలమమీ బాంధవా
బాంధవేభ్యః।

---

భోభో ఇతి :— భోభో=ఓయోయీ!, భీమసేనార్జునౌ=భీమార్జునులారా!, నిహత = చంపివేయబడిన, అశేష+అరాతిచక్రః = సమస్త శత్రుబృందము కలవాడును, ఆక్రాంత=స్వాధీనపరచుకొనబడిన, పరశురామ+అభిరామ యశాః= పరశురాముని సుందరమైన కీర్తి కలవాడును, ప్రతాప=పరాక్రమముతో, తాపిత= సంతప్తములైన, దిఙ్మండల = దిక్సమూహమునందు, స్థాపిత=నిలుపబడిన, స్వజనః = స్వీయ మనుజులు కలవాడును, అజాతశత్రుః=కామక్రోధాదులు లేని వాడును, దేవః=మహారాజునైన, శ్రీమాన్ యుధిష్ఠిరః=శ్రీశ్రీశ్రీ ధర్మరాజుల వారు, ఏషః=ఇదే, సమాజ్ఞాపయతి ఖలు=ఆజ్ఞాపించుచున్నాడు సుమా!

కిమితి :— ఆర్యః = గౌరవ్యుడు, కిమ్ ఆజ్ఞాపయతి=ఏమి ఆజ్ఞాపించు చున్నాడు!

(పునః=మరల, నేపథ్యే=తెరలో)

కుర్వంత్వితి :— ఆప్తాః, జనాః, రణశిరసి, హతానామ్, దేహభారాన్, వహ్నిసాత్ కుర్వంతు; అమీ, బాంధవాః, బాంధవేభ్యః, కథంచిత్, అశ్రూన్మిశ్రమ్, జలమ్, దదతు; గృధ్రకంకైః, ఖండితాన్, జ్ఞాతిదేహాన్, హత నర గహనే, మార్గంతామ్; అయమ్, భాస్వాన్, రిపుభిః సహ, అస్తమ్, ప్రయాతః; బలాని, సంహ్రియంతామ్.

మార్గంతాం జ్ఞాతిదేహాన్ హతనరగహనే ఖండితాన్
గృధ్రకంకైః
అస్తం భాస్వాన్ ప్రయాతః సహ రిపుభిరయం
సంహ్రియంతాం బలాని॥ 36

---

అర్థము :- ఆప్తాః=ఆత్మీయులైన, జనాః=యోధులు, రణశిరసి=రణాగ్రమునందు, హతానామ్ = చంపబడినవారియొక్క, దేహభారాన్ = శవ సమూహములను, వహ్నిసాత్ కుర్వంతు=అగ్నికి సర్పింతురుగాక!, అమీ=ఈ, బాంధవాః=బంధువులు, బాంధవేభ్యః=బంధువుల కొఱకు, కథంచిత్=మిక్కిలి పూనికతో, అశ్రూన్మిశ్రమ్=కన్నీటితో కలగలిపి, జలమ్ దదతు=తర్పణోదకము సమర్పింతురుగాక!; గృధ్రకంకైః=గ్రద్దలతో కాకులతో, ఖండితాన్=పొడువబడిన, జ్ఞాతి దేహాన్=దాయాదుల శరీరములను, హత నర గహనే=చనిపోయిన యోధుల శరీరములతో సంకులమైన రణరంగమునందు, మార్గంతామ్=వెదకుదురుగాక!; అయమ్=ఇదే, భాస్వాన్=సూర్యుడు, రిపుభిః సహ=శత్రువులతో కలిసి, అస్తమ్ ప్రయాతః = అస్తమించెను, కావున — బలాని = సైన్యములు, సంహ్రియంతామ్=ఉపసంహరింపబడుగాక!

సమాసములు :- రణస్య శిరః—తస్మిన్. దేహానాం భారః—తాన్. అశ్రుభిః ఉన్మిశ్రం యథా భవతి తత్తథా. జ్ఞాతీనాం దేహాః—తాన్. హతాశ్చ తే నరాశ్చ—హత నరైః గహనమ్—తస్మిన్. గృధ్రాశ్చ కంకాశ్చ—తైః. [స్రగ్ధరా వృత్తము]

సంధులు :— కుర్వంతు+ఆప్తాః—యణాదేశ. ఆప్తాః+హతానామ్, జనాః+వహ్ని, బాంధవాః+బాంధవేభ్యః-విసర్గలోపసంధులు. అశ్రు+ఉన్మిశ్రమ్—సవర్ణదీర్ఘ. ఉత్+మిశ్రమ్—అనునాశికాదేశ. కంకైః+అస్తమ్, రిపుభిః+అయమ్—రేఫాదేశవిసర్గ.

క్రియలు :— డు కృఞ్ కరణే, పరస్మై, లోట్, ప్రథమ—కరోతు/కురుతాత్—కురుతామ్—కుర్వన్తు. డు దాఞ్ దానే, పరస్మై, లోట్, ప్రథమ—దదాతు/దత్తాత్—దత్తామ్—దదతు. మృగ అన్వేషణే, ఆత్మనే, లోట్, ప్రథమ—

ఉభౌ : యదాజ్ఞాపయత్యార్యః. (ఇతి నిష్క్రాంతౌ)

(నేపథ్యే)

అరేరే గాండీవాకర్షణ బాహుశాలిన్ అర్జున, క్వేదానీం గమ్యతే!

కర్ణక్రోధేన యుష్మద్విజయి ధనురిదం త్యక్తమేతాన్యహాని
ప్రౌఢం విక్రాంతమాసీద్వన ఇవ భవతా శూరశూన్యే రణేఽస్మిన్।
స్పృష్టం స్మృత్వోత్తమాంగే పితు రనపజితన్యస్తహేతేరుపేతః
కల్పాగ్నిః పాండవానాం ద్రుపదసుత చమూఘస్మరో ద్రౌణిరస్మి॥ 37

---

మార్గతామ్-మార్గేతామ్-మార్గన్తామ్. హృఙ్ హరణే, ఆత్మనే, లోట్, ప్రథమ-హ్రియతామ్-హ్రియేతామ్-హ్రియన్తామ్.

యదితి :- ఆర్యః=మహారాజు, యత్ ఆజ్ఞాపయతి=ఆనతిచ్చినయట్లే. (ఇతి=అని, నిష్క్రాంతౌ=నిష్క్రమింతురు).

(నేపథ్యే=తెరలో)

అరేఇతి - అరేరే=ఓరోరీ!, గాండీవ ఆకర్షణ బాహుశాలిన్=గాండీవము నెక్కుపెట్టు భుజబలము కలవాడా!, అర్జున=కిరీటీ!, ఇదానీమ్=ఇప్పుడు, క్వ గమ్యతే=ఎచ్చటికి (పోబడుచున్నది) పోదువు!

కర్ణేతి :- యుష్మద్విజయి, ఇదమ్, ధనుః, కర్ణక్రోధేన, ఏతాని, అహాని, త్యక్తమ్. శూర శూన్యే, వనే, ఇవ, అస్మిన్, రణే, భవతామ్, విక్రాంతమ్, ప్రౌఢమ్, ఆసీత్. అనపజితన్యస్తహేతేః, పితుః, ఉత్తమాంగే,

స్పర్శమ్, స్మృత్వా, పాండవానామ్, కల్పాగ్నిః, ద్రుపదసుత చమూఘస్మరః, ద్రౌణిః, ఉపేతః, అస్మి.

**అర్థము :—** **యుష్మద్విజయి** = మిమ్ము జయించు శీలము గలదైన, ఇదమ్=ఈ, ధనుః=నా ధనుస్సు, కర్ణక్రోధేన=రాధేయునిపట్ల కోపముతో, ఏతాని అహాని = ఇన్నిరోజులపాటు, త్యక్తమ్ = విడువబడినది. (అనాటి ప్రతిజ్ఞానుసార మనుట), శూర శూన్యే = శూరుడన్నవాడే లేని, వనే ఇవ= అరణ్యమునందువోలె, అస్మిన్=ఈ, రణే=యుద్ధరంగమునందు, భవతామ్=మీ పాండవులయొక్క, విక్రాంతమ్ = విజృంభణము, ప్రౌఢమ్=ప్రబలమైనది, ఆసీత్=అయ్యెను—మీ పరాక్రమము సాగినదనుట. అనవజిత=ఓడింపబడకయే, న్యస్త హేతేః = విడువబడిన ఆయుధము కలవాడైన—పుత్రశోకముతో విడిచెనే తప్ప ఓడిపోయి కాదనుట; పితుః = తండ్రియొక్క (ద్రోణునియొక్క), ఉత్తమాంగే=శిరస్సునందు గావింపబడిన, స్పర్శమ్=ఆమర్శనమును, స్మృత్వా= స్మరించి, పాండవానామ్=పాండుపుత్రులకు, కల్పాగ్నిః=ప్రళయాగ్నియు, ద్రుపద సుత = ధృష్టద్యుమ్నునియొక్క, చమూ = సేనకు, ఘస్మరః=భక్షకుడునైన, ద్రౌణిః = అశ్వత్థామను నేను, ఉపేతః అస్మి = సమీపించినవాడనైతిని—నేనిదే వచ్చితి నింకెక్కడికి పోగల వనుట.

**సమాసములు :—** కర్ణే—కర్ణవిషయే—క్రోధః—తేన. యుష్మాన్ విజేతుం శీలమస్య—యుష్మద్విజయి ధనుః. శూరేభ్యః శూన్యమ్—తస్మిన్. అంగేషు ఉత్తమమ్—తస్మిన్. అనవజితా చ సా న్యస్తా చ—అనవజితన్యస్తా హేతిః యేన సః—తస్య. కల్పే అగ్నిరివ. దుపదస్య సుతః—ద్రుపదసుతస్య చమూః—చమ్వాః ఘస్మరః.

**సంధులు :—** ధనుః+ఇదమ్, **పితుః**+అనవజిత, హేతేః+ఉపేతః, ద్రౌణిః+అస్మి—రేఫాదేశవిసర్గ. ఏతాని+అహాని—యణాదేశ. వనే+ఇవ— అయవాదేశ—వనయ్+ఇవ—యవలోపసంధి. రణే+అస్మిన్—పూర్వరూప. స్మృత్వా+ ఉత్తమాంగే—గుణసంధి. కల్ప+అగ్నిః—సవర్ణదీర్ఘ. ఘస్మరః+ద్రౌణిః— ఉత్వాదేశవిసర్గ.

ధృతరాష్ట్రః : (ఆకర్ణ్య సహర్షమ్) వత్స దుర్యోధన, ద్రోణవధ పరిభవోద్దీపితక్రోధపావకః పితురపి సమధికబలః శిక్షావాన్ సమరోపమశ్చాయమ్ అశ్వత్థామా ప్రాప్తః తత్ప్రత్యుపగమనేన తావదయం సంభావ్యతాం వీరః.

గాంధారీ : జాద, పచ్చుగ్గచ్ఛ ఏదం మహాభాగమ్. (జాత, ప్రత్యుద్గచ్ఛైనం మహాభాగమ్.)

దుర్యోధనః : తాత, అంబ, కిమనేనాంగరాజవధాశంసినా వృథా యౌవనశస్త్రబలభరేణ.

---

**వత్సేతి** :— (ఆకర్ణ్య = విని, సహర్షమ్ = ఆనందముగా) వత్స దుర్యోధన = బిడ్డా సుయోధనా!, ద్రోణ = ద్రోణాచార్యుని యొక్క, వధ= హననముచేనైన, పరిభవ=అవమానముతో, ఉద్దీపిత=ప్రజ్వలింపబడిన, క్రోధ= కోపమనునట్టి, పావకః=అగ్ని కలవాడును, పితుః అపి=తండ్రికంటె గూడ, సమధికబలః = అత్యధికమగు పరాక్రమము కలవాడును, శిక్షావాన్ = జ్ఞాన సంపన్నుడును (నేర్పుటయందు నేర్పరియు); చ=మరియు, అమర+ఉపమః= దేవతలతో సమానమైనవాడును అగు, అశ్వత్థామా=ద్రౌణి, అయమ్=ఇదే, ప్రాప్తః=వచ్చినాడు. అయమ్=ఈ, వీరః=శూరుడు, ప్రత్యుపగమనేన= అభ్యుత్థానముతో—ఎదురు వెడలుటతో; సంభావ్యతామ్=గౌరవింపబడుగాక!

**జాతేతి** :— జాత=బిడ్డా!, ఏనమ్=ఈ, మహాభాగమ్=మహానుభావుని గూర్చి, ప్రత్యుద్గచ్ఛ=ఎదురు వెడలుము.

**తాతేతి** :— తాత=తండ్రీ!, అంబ—తల్లీ!, అంగరాజ=కర్ణుని యొక్క, వధ=చావును, ఆశంసినా=కోరువాడును, వృథా=వ్యర్థమైన, యౌవన=ఎల ప్రాయము, శస్త్ర బల=ఆయుధబలముల యొక్క, భరేణ=బరువు కలవాడునైన, అనేన=ఈ అశ్వత్థామతో, కిమ్=ఏమి పని?

ధృతరాష్ట్రః : వత్స, న ఖల్వస్మిన్కాలే పరాక్రమవతామేవం విధానాం వాఙ్మాత్రేణాపి విరాగ ముత్పాదయితు మర్హసి.

(ప్రవిశ్య)

అశ్వత్థామా : విజయతాం కౌరవాధిపతిః.

దుర్యోధనః : (ఉత్థాయ) గురుపుత్ర, ఇత ఆస్యతామ్. (ఇత్యుపవేశయతి).

అశ్వత్థామా : రాజన్ దుర్యోధన!

కర్ణేన కర్ణసుభగం బహు యత్తదుక్త్వా
యత్సంగరేషు విహితం విదితం త్వయా తత్ ।

---

వత్సేతి :— వత్స = బిడ్డా, పరాక్రమవతామ్=పరాక్రమవంతులైన, ఏవం విధానామ్ = ఇటువంటివారికి, వాఙ్మాత్రేణ అపి=మాటమాత్రముగానేని, విరాగమ్=అసంతృప్తిని, ఉత్పాదయితుమ్=కల్పించుటకు, అస్మిన్ కాలే=ఈ తరుణమునందు, న అర్హసి ఖలు=తగవు సుమా!—కల్పింప దగదనుట.

(ప్రవిశ్య=అశ్వత్థామ ప్రవేశించి)

విజయతామితి :— కౌరవాధిపతిః = దుర్యోధనుడు, విజయతామ్= జయించుగాక!

గుర్వితి :— (ఉత్థాయ = ఆసనమునుండి లేచి) గురుపుత్ర=ఆచార్య నందనా!, ఇతః=ఇటు, ఆస్యతామ్=కూర్చుండుము. (ఇతి=అని, ఉపవేశయతి= కూర్చుండజేయును.)

రాజన్నితి :— రాజన్=మహారాజా!, దుర్యోధన=సుయోధనుడా!

కర్ణేనేతి :- కర్ణేన, కర్ణసుభగమ్, బహు, ఉక్త్వా, సంగరేషు, యత్,

ద్రౌణిస్త్వధిజ్యధనురాపతితోఽభ్యమిత్ర
మేషోఽధునా త్యజ నృప ప్రతికారచింతామ్॥ 38

దుర్యోధనః : (సాభ్యసూయమ్) ఆచార్యపుత్ర

అవసానేఽఙ్గరాజస్య యోద్ధవ్యం భవతా కిల।
మమాప్యంతం ప్రతీక్షస్వ కః కర్ణః కస్సుయోధనః॥ 39

---

విహితమ్, తత్, త్వయా, విదితమ్. అధునా, అధిజ్యధనుః, ఏషః, ద్రౌణిః, అభ్యమిత్రమ్, ఆపతితః; నృప, ప్రతికారచింతామ్, త్యజ.

**అర్థము** :- కర్ణేన=కర్ణునిచేత, కర్ణ సుభగమ్=చెవికి ఇంపవునట్లు, బహు = అధికముగా, ఉక్త్వా = పలుకబడి—కర్ణుడు అధికముగా మాటలాడి; సంగరేషు=యుద్ధములయందు, యత్=ఏది, విహితమ్=ఆచరింపబడినదో-కర్ణుడు ఏమి చేసెనో అనుట, తత్=అదియంతయు, త్వయా=నీచేత, విదితమ్=తెలియ బడినది-నీవే చూచితివిగదా అనుట. అధునా=ఇప్పుడు, అధిజ్యధనుః=ఎక్కుపెట్ట బడిన ధనుస్సు కలవాడై, ఏషః=ఈ, ద్రౌణిః=అశ్వత్థామ, అభ్యమిత్రమ్=శత్రు సమ్ముఖమునకు, ఆపతితః=వచ్చి పడెను. నృప=రాజా!, ప్రతికారచింతామ్= ప్రత్యపకారము శత్రువులకు చేయలేకపోయితినే అను ఆలోచనను లేక బాధను, త్యజ=విడువుము—అది నాకు విడిచిపెట్టు మనుట. (వసంతతిలక)

**ఆచార్యేతి** :- (సాభ్యసూయమ్=ఈర్ష్యతో) ఆచార్యనందనా!

**అవసానే ఇతి** :- అంగరాజస్య, అవసానే, భవతా, యోద్ధవ్యమ్, కిల; మమ అపి, అంతమ్, ప్రతీక్షస్వ; కః, కర్ణః, కః, సుయోధనః?

**అర్థము** :- అంగరాజస్య=కర్ణునియొక్క, అవసానే కిల=అంతము నందుగదా! భవతా=నీచేత, యోద్ధవ్యమ్=యుద్ధము ఆచరింపబడవలసినది. మమ= నాయొక్క, అంతమ్ అపి=చావునుకూడ, ప్రతీక్షస్వ=నిరీక్షింపుము. కః కర్ణః= కర్ణుడెవడు, కః సుయోధనః = దుర్యోధనుడెవడు! ఇరువురికి భేదము లేనే లేదనుట.

అశ్వత్థామా : (స్వగతమ్) కథ మద్యాపి స ఏవ కర్ణపక్షపాతః, అస్మాసు చ పరిభవః (ప్రకాశమ్) రాజన్ కౌరవేశ్వర ఏవం భవతు. (ఇతి నిష్క్రాంతః).

ధృతరాష్ట్రః : వత్స, క ఏష తే వ్యామోహో యదస్మిన్నపి కాలే ఏవం విధస్య మహాభాగస్యాశ్వత్థామ్నో వాక్పారుష్యే ణాపరాగ ముత్పాదయసి.

దుర్యోధనః : కిమస్యాప్రియ మనృతం చ మయోక్తమ్. కిం వా నేదం క్రోధస్థానమ్. పశ్య—

---

కథమితి :- (స్వగతమ్=తనలో) కథమ్=ఎట్టూ!, అద్యాపి=నేటికిని, సః ఏవ=అదే, కర్ణ పక్షపాతః=కర్ణునివట్ల అభిమానము, చ=మరియు, అస్మాసు= మాపట్ల, సః ఏవ=అదే, పరిభవః=తిరస్కారము. (ప్రకాశమ్=ప్రకాశముగా) రాజన్ = రాజా!, కౌరవేశ్వర = దుర్యోధనా!, ఏవం భవతు=అట్లే యగుగాక! (ఇతి=అని, నిష్క్రాంతః=నిష్క్రమించును).

వత్సేతి :- వత్స=బిడ్డా!, అస్మిన్ కాలే అపి=ఈ తరుణమందుగూడ, ఏవం విధస్య=ఇట్టివాడైన, మహాభాగస్య=మహానుభావుడు, అశ్వత్థామ్నః= అశ్వత్థామకు, వాక్పారుష్యేణ = వాక్కాఠిన్యముతో, అపరాగమ్=ద్వేషమును, ఉత్పాదయసి=కలిగించుచున్నావు, తే=నీయొక్క, ఏషః=ఈ, వ్యామోహః= బుద్ధి విభ్రమము—లేక అహంకారము, కః=ఏమిది?

కిమితి :- అస్య = ఈ అశ్వత్థామకు, అప్రియమ్ = అహితమును, అనృతమ్=అసత్యమును, మయా=నాచేత, ఉక్తమ్ కిమ్=పల్కబడినదా?—అట్టిది మాట్లాడితినా అనుట. ఇదమ్=ఇది, క్రోధస్థానమ్=కోపమునకు అర్హమైనది, న వా కిమ్=కాదా?. పశ్య=చూడుము—

అకలితమహిమానం క్షత్రియై రాత్తచాపైః
సమరశిరసి యుష్మద్భాగ్యదోషా ద్విపన్నమ్।
పరివదతి సమక్షం మిత్రమంగాధిరాజమ్
మమ ఖలు కథయాస్మిన్ కో విశేషోఽర్జునే వా॥ 40

అకలితేతి :— ఆత్తచాపైః, క్షత్రియైః, అకలితమహిమానమ్, సమరశిరసి, యుష్మద్భాగ్యదోషాత్, విపన్నమ్, మిత్రమ్, అంగాధిరాజమ్, మమ, సమక్షం, పరివదతి, ఖలు; అస్మిన్, అర్జునే, వా, కః, విశేషః, కథయ.

**అర్థము** :- ఆత్తచాపైః=ధరించిన ధనుస్సులు కలవారైన, క్షత్రియైః=యోధులచేత, అకలిత=ఎఱుంగబడని, మహిమానమ్=మహత్త్వము కలవాడై—కర్ణుని మహత్త్వమును ఈ క్షత్రియులు గుర్తింపలేకపోయిరనుట, సమరశిరసి=రణరంగమునందు, యుష్మత్=నీయొక్క, భాగ్యదోషాత్=దురదృష్టము వలన, విపన్నమ్ = చనిపోయినవాడును, మిత్రమ్=నాకు అత్యంతము ఆత్మీయుడునైన, అంగాధిరాజమ్ = అంగదేశముల కధిపతియగు కర్ణుని, మమ = నాయొక్క, సమక్షమ్ = ఎట్టయెదుట, పరివదతి ఖలు = తూలనాడునుగదా!, అస్మిన్ = ఈ అశ్వత్థామయందును, అర్జునే=కిరీటియందును, కః వా విశేషః=భేదమేమున్నదో, కథయ=చెప్పుము—బాహ్య శత్రువు కిరీటి కాగా అంతరంగ శత్రువు అశ్వత్థామ—ఈ ఇరువురికిని భేదము లేదనుట. (మాలినీవృత్తము).

**సమాసములు** :— అకలితః మహిమా యస్య సః—తమ్. ఆత్తాః చాపాః యైః తే-తైః. సమరస్య శిరః—తస్మిన్. తవ భాగ్యమ్-యుష్మద్భాగ్యస్య దోషః—తస్మాత్. అంగానామ్ అధిరాజా—తమ్.

**సంధులు** :- క్షత్రియైః+ఆత్త—రేఫాదేశవిసర్గ. అంగ+అధిరాజమ్, కథయ+అస్మిన్—సవర్ణదీర్ఘ. కః+విశేషః—ఉత్వాదేశవిసర్గ. విశేషః+అర్జునే—ఉత్వాదేశవిసర్గ—విశేషో+అర్జునే—పూర్వరూప.

ధృతరాష్ట్రః : వత్స, తథాపి కో௨త్ర దోషః అవసానమిదానీం భరతకులస్య. సంజయ, కిమిదానీం కరోమి మంద భాగ్యః. (విచింత్య) భవత్వేవం తావత్. సంజయ, మద్వచనాత్ బ్రూహి భారద్వాజమశ్వత్థామానమ్.

స్మరతి న భవాన్పీతం స్తన్యం విభజ్య సహాముమా
మమ చ మృదితం క్షౌమం బాల్యే త్వదంగవివర్తనైః।
అనుజ నిధన స్ఫీతాత్ శోకా దతిప్రణయాచ్చ యత్
వచన వికృతిష్వస్య క్రోధో ముధా క్రియతే త్వయా॥ 41

---

క్రియలు :- 1) వద వ్యక్తాయాం వాచి, పరస్మై, లట్, ప్రథమ
వదతి—వదతః—వదన్తి

2) కథ వాక్యప్రబంధే—ణిచ్ స్వార్థే—
పరస్మై, లోట్, మధ్యమ
కథయ/కథయతాత్—కథయతమ్—కథయత

వత్సేతి :- వత్స=బిడ్డా!, తథాపి=అయినప్పటికిని, అత్ర=ఇప్పటను, దోషః కః = దోషమేమున్నది. ఇదానీమ్ = ఇప్పుడు, భరతకులస్య = భరత వంశమునకు, అవసానమ్ = ఇది అంత్యసమయము. సంజయ = సంజయుడా!, మందభాగ్యః = దురదృష్టవంతుడను, ఇదానీమ్ = ఇప్పుడు, కిమ్ కరోమి=ఏమి చేయుదు. (విచింత్య=ఆలోచించి) ఏవమ్=ఈ చెప్పబోవునట్లు, భవతు=అగుగాక!, సంజయ = సంజయుడా!, భారద్వాజమ్ = భారద్వాజ వంశోత్పన్నుడగు, అశ్వత్థామానమ్=ద్రోణి నుద్దేశించి, మద్వచనాత్=నా మాటగా[వలన], బ్రూహి= చెప్పుము.

స్మరతీతి :— అమునా, సహ, విభజ్య, స్తన్యమ్, పీతమ్; బాల్యే, త్వదంగవివర్తనైః, మమ, క్షౌమమ్, మృదితమ్; భవాన్, న, స్మరతి?; అనుజ

సంజయః : యదాజ్ఞాపయతి తాతః. (ఇత్యుత్తిష్ఠతి).

ధృతరాష్ట్రః : అపి చేద మన్యత్త్వయా వక్తవ్యమ్.

యన్మోచితస్తవ పితా వితథేన శస్త్రం
యత్తాదృశః పరిభవః స తథావిధోఽభూత్।

---

నిధనస్ఫీతాత్, శోకాత్, చ, అతిప్రణయాత్, అస్య, వచన వికృతిషు, యత్, క్రోధః, త్వయా, క్రియతే, తత్, ముధా.

అర్థము :- అమునా సహ = ఈ దుర్యోధనునితో కలిసి, విభజ్య= పంచుకొని, స్తన్యమ్ = తల్లిపాలు, పీతమ్=నీచే త్రాగబడినది[వి]. బాల్యే= బాల్యమునందు, త్వదంగవివర్తనైః-త్వత్=నీయొక్క, అంగ=శరీరముయొక్క, వివర్తనైః = కదలికలతో—నీవు పడి దొర్లుటతో ననుట, మమ = నాయొక్క, క్షౌమమ్=శుభ్రవస్త్రము, మృదితమ్=మాపివేయబడినది. భవాన్=నీవు, న స్మరతి= నీవని స్మరించుటలేదా? అనుజ=సోదరులయొక్క, నిధన=మృతివలన, స్ఫీతాత్= పొంగిపొరలిన, శోకాత్=దుఃఖమువలనను, చ=మరియు, అతిప్రణయాత్=కర్ణుని పట్లగల అత్యధిక మైత్రివల్లను, [పల్కిన], అస్య=ఈ దుర్యోధనునియొక్క, వచన వికృతిషు=వికృతవచనములయందు—అనుచితోక్తులయందనుట, యత్=ఏ, క్రోధః=కోపము, త్వయా=నీచేత, క్రియతే=చేయబడుచున్నదో, తత్=అది—నీవు కోపించుట—ముధా=వ్యర్థమే సుమా! [హరిణీవృత్తము]

**యదితి** :- తాతః=తండ్రి, యత్ ఆజ్ఞాపయతి=ఆనతిచ్చినట్లే. (ఇతి= అని, ఉత్తిష్ఠతి=లేచును).

**అపిచేతి** :- అపిచ=మరియు, త్వయా=నీచేత, వక్తవ్యమ్=చెప్ప దగినది, అన్యత్=మరొకటున్నది.

యన్మోచిత ఇతి :- తవ, పితా, వితథేన, శస్త్రమ్, యత్, మోచితః; తాదృశః, తథావిధః, సః, పరిభవః, యత్, అభూత్; ఏతత్, విచింత్య, ఆత్మని, బలమ్, :, విచింత్య, దుర్యోధనోక్తమ్, అపహాయ, పౌరుషమ్, విధాస్యసి, ఇతి [త్వయా వక్తవ్యమ్].

ఏతద్విచింత్య బలమాత్మని పౌరుషం చ
దుర్యోధనోక్తముపహాయ విధాస్యసీతి॥ 42

సంజయః : యదాజ్ఞాపయతి తాతః. (ఇతి నిష్క్రాంతః)

దుర్యోధనః : సూత, సాంగ్రామికం మే రథ ముపకల్పయ.

---

అర్థము :- తవ = నీయొక్క, పితా = తండ్రి, వితథేన = అసత్య వచనముతో, శస్త్రమ్=ఆయుధమును, యత్ మోచితః=విడిచిపెట్టింపబడినవాడనియు, తాదృశః = అటువంటిదై, తథావిధః=ఆప్రకారమై—చెప్పరాని దనుట—సః=ఆ, పరిభవః=(ధృష్టద్యుమ్నకృతమైన) అవమానము, యత్ అభూత్=ఏది జరిగెనో, ఏతత్=ఇదియు(ఈ రెండింటి ననుట), విచింత్య=ఆలోచించి, ఆత్మని=నీయందలి, బలమ్=శక్తిని, విచింత్య=సంభావించి, చ=మరియు, దుర్యోధనోక్తమ్=ఈ సుయోధనునిచే పలుకబడిన వికృతి వచనమును, విహాయ=విడిచిపుచ్చి—మరచిపోయి అనుట; పౌరుషమ్ = వీరోచిత కృత్యమును — పురుషకారము ననుట, విధాస్యసి = నిర్వర్తింతువు. ఇతి=అని—నీవు అశ్వత్థామకు చెప్పవలె ననుట. (వసంతతిలక).

సంధులు :- యత్+మోచితః—అనునాశికాదేశ. మోచితః+తవ—సాదేశవిసర్గ. తథావిధః+అభూత్—ఉత్వాదేశవిసర్గ—తథావిధో+అభూత్—పూర్వరూపసంధి. విధాస్యసి+ఇతి—సవర్ణదీర్ఘ.

క్రియలు :- భూసత్తాయామ్, పరస్మై, లుఙ్, ప్రథమ—అభూత్—అభూతామ్-అభూవన్. డు ధాఞ్ ధారణపోషణయోః, పరస్మై, లృట్, మధ్యమ—ధాస్యసి—ధాస్యథః—ధాస్యథ.

యదితి :- తాతః=తండ్రి, యత్ ఆజ్ఞాపయతి=ఆనతిచ్చినట్లే (ఇతి=అని, నిష్క్రాంతః=నిష్క్రమించును).

సూతేతి :- సూత = రథసారథీ!, సాంగ్రామికమ్ = యుద్ధమున కుపయోగింపబడు, మే=నాయొక్క, రథమ్=రథమును, ఉపకల్పయ=ఏర్పాటు చేయుము—తెమ్మనుట.

సూతః : యదాజ్ఞాపయత్యాయుష్మాన్. (ఇతి నిష్క్రాంతః).

ధృతరాష్ట్రః : గాంధారి, ఇతో వయం మద్రాధిపతేః శల్యస్య శిబిరమేవ గచ్ఛావః. వత్స, త్వమప్యేవం కురు. (ఇతి పరిక్రమ్య సర్వే నిష్క్రాంతాః)

—: ఇతి పంచమోఽఙ్కః :—

---

యదితి :— ఆయుష్మాన్=ఆయుష్మంతుడు, యత్ ఆజ్ఞాపయతి=ఆనతి యిచ్చినట్లే. (ఇతి=అని, నిష్క్రాంతః=నిష్క్రమించును).

గాంధారీతి :– గాంధారి=ఓ గాంధారరాజ పుత్రీ!, ఇతః=ఇచ్చటినుండి, వయమ్=మేనము, మద్రాధిపతేః=మద్రదేశాధీశుడైన, శల్యస్య=శల్యునియొక్క, శిబిరమ్ ఏవ = శిబిరము నుద్దేశించియే—అచటికే అనుట, గచ్ఛావః=పోవుదము. వత్స=బిడ్డా!, త్వమ్ అపి=నీవుకూడ, ఏవమ్=ఇట్లే, కురు=చేయుము. (ఇతి=అని, పరిక్రమ్య=కదలి, సర్వే=అందరును, నిష్క్రాంతాః=నిష్క్రమింతురు).

—: ఇది అయిదవ అంకము :—

# షష్ఠో௨ఙ్కః

(తతః ప్రవిశతి ఆసనస్థో యుధిష్ఠిరో ద్రౌపదీ చేటీ పురుషశ్చ)

యుధిష్ఠిరః : (విచింత్య నిఃశ్వస్య చ)

తీర్ణే భీష్మమహోదధౌ కథమపి ద్రోణానలే నిర్వృతే
కర్ణాశీవిషభోగిని ప్రశమితే శల్యే చ యాతే దివమ్।

---

**తత ఇతి :–** (తతః = తరువాత, ఆసనస్థః = ఆసనముపై కూర్చున్న వాడైన, యుధిష్ఠిరః=ధర్మరాజు, ద్రౌపదీ=పాంచాలి, చేటీ=చేటిక, చ=మరియు, పురుషః=ఒక పురుషుడును, ప్రవిశతి=ప్రవేశించును–ప్రత్యేకాన్వయము)

**విచింత్యేతి :–** (విచింత్య=కొంచెముసేపు ఆలోచించి, చ=మరియు, నిఃశ్వస్య=నిట్టూర్చి)

**తీర్ణేఇతి :–** కథమ్ అపి భీష్మమహోదధౌ తీర్ణే, ద్రోణానలే నిర్వృతే, కర్ణాశీవిషభోగిని ప్రశమితే, చ, శల్యే, దివమ్ యాతే, జయే స్వల్పావశేషే, ప్రియసాహసేన భీమేన, రభసాత్, వాచా అమీ సర్వే వయమ్ జీవితసంశయం సమారోపితాః.

**అర్థము :–** కథమపి = ఎట్లెట్లో, అతి కష్టముమీద అనుట, భీష్మ = శాంతనవుడనునట్టి, మహోదధౌ=మహాసముద్రము, తీర్ణే=దాటబడినదగుచుండగా, ద్రోణ=ద్రోణాచార్యుడనునట్టి, అనలే=అగ్ని, నిర్వృతే=చల్లారగా, కర్ణ= రాధేయుడనునట్టి, ఆశీవిష=కోరలలో విషము నింపుకొన్న, భోగిని=సర్పము, ప్రశమితే = నాశితముకాగా, చ = మరియు, శల్యే = శల్యుడు, దివమ్ యాతే= స్వర్గస్థుడుకాగా, ఇట్లు, జయే=జయము, స్వల్ప+అవశేషే=ఈషదసమాప్తము కాగా, జయము పూర్తిగా లభించుట యన్నది కనుచూపుమేరలో నుండగా అనుట,

భీమేన ప్రియసాహసేన రభసాత్ స్వల్పావశేషే జయే
సర్వే జీవితసంశయం వయ మమీ వాచా
సమారోపితాః॥ 1

---

ప్రియసాహసేన=సాహసకృత్యములపట్ల ఇష్టము కలవాడైన, భీమేన=భీమునిచే, రభసాత్ = తొందరపాటు వలన, వాచా=ప్రతిజ్ఞతో-తెల్లవారుసరికి దుర్యోధనుని సంహరింతునను ప్రతిజ్ఞతో అనుట, అమీ సర్వే వయమ్=ఈ మేమందరమును, జీవిత సంశయమ్ = బ్రదికెదమా లేదా అను సందేహావస్థను, సమారోపితాః = పొందింపబడితిమి. తొందరపాటుతో చేసిన ఆ భీషణప్రతిజ్ఞ నెరవేరనిచో భీముడు ఉండడు—అటుపైని మేమెవ్వరము నుండము, ఇట్లు మా బ్రతుకులు ఈ క్షణమున సందేహాస్పదములైన వనుట.

సమాసములు :— భీష్మః ఏవ మహోదధిః—తస్మిన్. ద్రోణః ఏవ అనలః—తస్మిన్. ఆశీః=సర్పదంష్ట్రా—అహేః శరీరం భోగఃస్యాత్ ఆశీరప్యహి దంష్ట్రికా అని అమరము [1–8–8]. కేచిత్తు ఈకారాన్త మాశీశబ్దమాహుః— "ఆశీమివ కళామిందోః" — ఇతి రాజశేఖరః — అని భానుజిదీక్షితుడు తన రామాశ్రమిలో వివరించెను. కావున ఆశిషి ఆశ్యాం వా విష మస్య ఇతి ఆశీవిషః స చాసౌ భోగీ చ ఆశీవిషభోగీ-కర్ణః ఏవ ఆశీవిషభోగీ-తస్మిన్. ఆశీవిష మన్నను భోగి అన్నను అర్థమొక్కటే. ఇట్లు ఏకార్థక పదద్వయమును ప్రయోగించుటచే విషసర్పము అను రీతిని కర్ణుని దౌష్ట్యము ప్రధానముగా స్ఫురించును. ప్రియః సాహసః యస్య సః—ప్రియసాహసః—తేన. స్వల్పమ్ అవశేషం యస్మిన్ సః—స్వల్పావశేషః—తస్మిన్. జీవితస్య సంశయమ్.

సంధులు :- ద్రోణ+అనలే, కర్ణ+ఆశీవిష, స్వల్ప+అవశేషే— సవర్ణదీర్ఘ సంధులు.

ఛందస్సు :- శార్దూలవిక్రీడితము.

అలంకారము :— భీష్మునియందు మహోదధిత్వము, ద్రోణునియందు అనలత్వము, కర్ణునియందు ఆశీవిషభోగిత్వము ఆరోపింపబడినవి. న్యూనతాధిక్య

ద్రౌపదీ : (సబాష్పమ్) మహారాజ, పాంచాల్యేతి కిం న భణితమ్! (మహారాఅ, పాంచాలిఏత్తి కిం ణ భణిదమ్)

యుధిష్ఠిరః : కృష్ణే, నను మయా (పురుషమవలోక్య) బుధక!

పురుషః : దేవ, ఆజ్ఞాపయ.

యుధిష్ఠిరః : ఉచ్యతాం సహదేవః—క్రుద్ధస్య వృకోదరస్యాపర్యాలోచిత దారుణాం ప్రతిజ్ఞాముపలభ్య ప్రణష్టస్య మానినః కౌరవ రాజస్య పదవీమన్వేష్టు మతినిపుణమతయస్తేషు తేషు

---

ములు చెప్పబడలేదు. కావున ఇందు అనుభయ తాద్రూప్యరూపకమున్నదన వలెను. "విషయ్యభేద తాద్రూప్య రంజనం విషయస్య యత్ రూపకం తత్త్రిధాధిక్య న్యూనత్వానుభయోక్తిభిః".

సబాష్పమితి :— (సబాష్పమ్ = కన్నీరుకార్చుచు) మహారాజా!, పాంచాల్యా = ద్రౌపదిచేత, (జీవితసంశయం సమారోపితాః) ఇతి = అని, కిమ్ న భణితమ్=అనలేదేమి!

కృష్ణఇతి :— కృష్ణే=ద్రౌపదీ!, నను=నిజమునకు, మయా=నాచేత— మీరెల్లరు జీవితసంశయం సమారోపితాః అనుట. (పురుషమ్=ద్వాఃస్థపురుషుని, అవలోక్య=చూచి), బుధక=ఓ బుధకుడా!

దేవఇతి :— దేవ=మహారాజా!, ఆజ్ఞాపయ=ఆజ్ఞాపింపుము. భృత్యులు మహారాజును "దేవ" అని సంబోధింపవలెను. దేవేతి నృపతిర్వాచ్యో భృత్యైః, ప్రకృతిభిస్తథా సార్వభౌమః, పరిజనైర్భట్ట భట్టారకేతి చ (3–319) అని రసార్ణవసుధాకరము.

ఉచ్యతామితి :— సహదేవః=సహదేవుడు, ఉచ్యతామ్=చెప్పబడును గాక, సహదేవునికి ఈప్రకారముగా చెప్పుమనుట—క్రుద్ధస్య=క్రోధావిష్టుడయిన,

స్థానేషు పరమార్థాభిజ్ఞాశ్చారాః సుసచివాశ్చ భక్తిమన్తః పటుపటహరవవ్యక్తఘోషణాః సుయోధన సంచారవేదినః ప్రతిశ్రుత ధనపూజా ప్రత్యుపక్రియాః చరన్తు సమంతాత్ సమన్తపంచకమ్. అపిచ—

---

వృకోదరస్య=భీమసేనునియొక్క, అపర్యుషిత దారుణామ్=ఆరోజుననే పూర్తి కావింపబడవలసిన దగుటచే భీకరమయిన, (మరునాటికి వాయిదా పడకుండ చెల్లించుకొనవలసినదగుట దాని భీషణత్వము) ప్రతిజ్ఞామ్=దుర్యోధన సంహార రూపమగు ప్రతిజ్ఞను, ఉపలభ్య=తెలిసికొని, ప్రణష్టస్య=పారిపోయినవాడును, మానినః=అభిమానముకలవాడును అయిన, కౌరవరాజస్య=దుర్యోధనునియొక్క, పదవీమ్ = మార్గమును—ఆచూకీ అనుట, అన్వేష్టుమ్ = వెదకుటకు, అతినిపుణ మతయః=గొప్ప నేర్పరులును, తేషు తేషు స్థానేషు=ఆయా ప్రదేశములందలి, పరమార్థ + అభిజ్ఞాః = యథార్థస్థితి నెరిగినవారును, ఆయా ప్రాంతములతో పరిచయము కలవారనుట, భక్తిమన్తః = మనయెడల భక్తికలవారును, పటు = గొప్పదయిన, పటహ=భేరియొక్క, రవ=ధ్వనితో, వ్యక్త=స్పష్టముగావింప బడిన, ఘోషణాః = చాటింపు కలవారును, టముకుతో చాటింపువేయువారనుట, సుయోధన సంచార వేదినః = దుర్యోధనుని కదలికలను గుర్తించువారును, ప్రతిశ్రుత=ప్రతిజ్ఞగావింపబడిన, ధన=ధనదానము, పూజా=సత్కారము మొదలయిన, ప్రత్యుపక్రియాః = ప్రత్యుపకారములు కలవారును, ధనదాన సత్కారాదికమును ప్రత్యుపకారముగా పొందగలరని ప్రతిజ్ఞాపూర్వకముగా వచింపబడినవారై అనుట, అట్లు విశ్వాసము కలుగబలుకుమని సహదేవునికి సూచన, అయిన, చరాః= గూఢచారులును, చ = మరియు, సుసచివాః=మంచి మంత్రులును—విశ్వాసపాత్రులయిన అనుట, సమంతపంచకమ్=సమంతపంచకమను పేరుగల సరోవరమును, సమంతాత్ = అన్నివైపుల, చరన్తు = సంచరింతురుగాక, వెదుకబంపు నేర్పాటు చేయుమని సహదేవునికి ఆజ్ఞ. అపిచ=మరియు

పంకే వా సైకతే వా సునిభృతపదవీవేదినో యాన్తు దాశాః
కుంజేషు క్షుణ్ణవీరున్నిచయపరిచయా వల్లవాః సంచరన్తు।
నాగవ్యాఘ్రాటవీషు శ్వపచపురవిదో యే చ రంధ్రేష్వభిజ్ఞా
యే సిద్ధవ్యంజనా వా ప్రతిమునినిలయం తే చ చారాశ్చరన్తు॥ 2

---

పంకే వేతి :— సునిభృత పదవీవేదినః దాశాః పంకే వా సైకతే వా యాన్తు, క్షుణ్ణవీరున్నిచయ పరిచయాః వల్లవాః కుంజేషు సంచరన్తు, శ్వపచ పురవిదః, నాగవ్యాఘ్రాటవీషు, చ యే రంధ్రేషు, అభిజ్ఞాః, వా, సిద్ధవ్యంజనాః, తే, చారాః, ప్రతిమునినిలయమ్ చరన్తు.

**అర్థము** :— సునిభృత=మిక్కిలి గూఢముగానున్న, పదవీ=అడుగు జాడను, వేదినః = గుర్తింపగలవారైన, దాశాః = చేపలవాండ్రు, నీటిలో జాడ తీయగల నేర్పరులు వీరనుట, పంకే వా = బురదతోకూడిన ప్రదేశములందును, వా = అట్లే, సైకతే = ఇసుకతిన్నెలందును, యాన్తు = వెడలుదురుగాక, అట్టి ప్రదేశములందు అన్వేషించుటకు ధీవరులను (కైవర్తే దాశ ధీవరౌ) పంపు మనుట. క్షుణ్ణ=నలిగిన, వీరుత్నిచయ=లతాసమూహముయొక్క, పరిచయాః= జ్ఞానముకలవారైన, వల్లవాః = గోపకులు, తీగెలు ఆకులు నలుగుటనుబట్టి జొంపములోపల దాగిన ప్రాణిని గుర్తింపగల చతురులు వీరనుట; కుంజేషు = పొదలలో, సంచరన్తు = అన్వేషింతురుగాక. శ్వపచ=చండాలుర యొక్క, పుర=పల్లెలను—అన్యత్తు యన్మూలనగరాత్ పురం తచ్ఛాఖా నగరమ్ (అమర, 2—2—1), విదః = ఎరిగినవారును, చ=మరియు, రంధ్రేషు=మహా బిలములయందు, అభిజ్ఞాః=నేర్పరులును, కొండగుహలు చెట్టుతొఱ్ఱలు మొదలగు చోట్ల వెదుకగల నేర్పరులనుట, యే=ఎవరు కలరో, తే చారాః=ఆ గూఢచారులు, నాగవ్యాఘ్ర+అటవీషు = సర్పములతో లేక ఏనుగులతో పులులతో నిండిన అరణ్యములందు, సంచరన్తు=అన్వేషింతురుగాక, వా=అట్లే, సిద్ధవ్యంజనాః= సిద్ధపురుషుల వేషములను ధరించినవారై, చారాః=మరికొందరు గూఢచారులు, ప్రతి ముని నిలయమ్ చ = ప్రతి ఆశ్రమమును, చరన్తు = అన్వేషింతురుగాక. ఋష్యాశ్రమములను కూడ విడువక తదుచితవేషధారులైన చారులచే వెదికింపు మనుట,

పురుషః : యథాజ్ఞాపయతి దేవః.

యుధిష్ఠిరః : తిష్ఠ. ఏవం చ వక్తవ్యః సహదేవః—

---

సమాసములు :— సునిభృతా చ సా పదవీ చ—సునిభృత పదవీ, తాం వేత్తి తచ్ఛీలమస్యేతి—సునిభృతపదవీవేదీ(న్)—వేదినౌ—వేదినః. వీరుతాం నిచయః—వీరున్నిచయః, క్షుణ్ణశ్చాసౌ వీరున్నిచయశ్చ — క్షుణ్ణవీరున్నిచయస్య పరిచయః యేషాం తే. నాగాశ్చ వ్యాఘ్రాశ్చ—నాగవ్యాఘ్రా ప్రధానాః అటవ్యః—నాగవ్యాఘ్రాటవ్యః [మధ్యమపదలోపి]—తాసు. శ్వానం పచతీతి—శ్వపచః, శ్వపచానాం పురాణి—తాని వేత్తి ఇతి శ్వపచపురవిత్—విదౌ—విదః. సిద్ధానాం వ్యంజనాని వేషాదికాని యేషాం తే—సిద్ధవ్యంజనాః. మునేః నిలయః—ముని నిలయం మునినిలయం ప్రతి-ప్రతిమునినిలయమ్. వీప్సార్థమునందు "ప్రతి"తో అవ్యయీభావ సమాసము.

సంధులు :— వేదినః+యాన్తు, విదః+యే—ఉత్వాదేశవిసర్గసంధి. వీరుత్+నిచయ-అనునాసికాదేశ. పరిచయాః+వల్లవాః, అభిజ్ఞాః+యే, వ్యంజనాః+వా—విసర్గలోపసంధులు. రంధ్రేషు+అభిజ్ఞాః—యణాదేశ. చారాః+చరన్తు—శషసాదేశవిసర్గసంధి.

క్రియలు :- యాతు/యాతాత్—యాతామ్—యాన్తు
పరస్మై, లోట్, ప్రథమ
చరతు/చరతాత్—చరతామ్—చరన్తు
పరస్మై, లోట్, ప్రథమ

ఛందస్సు :- స్రగ్ధరావృత్తము

యథేతి :— దేవః=మహారాజు, యథా=ఎట్లు, ఆజ్ఞాపయతి=ఆజ్ఞాపించుచున్నాడో, తథా=అట్లే.

తిష్ఠేతి :— తిష్ఠ=ఆగుము. సహదేవః=సహదేవుడు, ఏవం చ=ఈప్రకారముగా కూడ, వక్తవ్యః = చెప్పబడవలసినవాడు, ఆజ్ఞాపింపవలసినది ఇంకను ఉన్నదనుట.

జ్ఞేయాః రహః శంకితమాలపన్తః సుప్తా రుగార్తా మదిరావిధేయాః।
త్రాసో మృగాణాం వయసాం విరావో నృపాంకపాదప్రతిమాశ్చ
యత్ర॥ 3

జ్ఞేయాఇతి :— రహః శంకితమ్ ఆలపన్తః, సుప్తాః, రుగార్తాః, మదిరావిధేయాః(తే) జ్ఞేయాః; యత్ర, మృగాణాం త్రాసః, యత్ర వయసాం విరావః, చ, యత్ర నృపాంకపాదప్రతిమాః, తత్ర విచేయాః. మదిరావిధేయాః అనుటకు చ వనే విచేయాః అని పాఠాంతరము.

అర్థము :— రహః=ఏకాంతమునందు, శంకితమ్=పరులెవరయినను వినుచున్నారేమో అను శంకతో, ఆలపన్తః=సంభాషించుకొనువారును, సుప్తాః=శయనించువారును, రుగార్తాః=రోగపీడితులును, మదిరా విధేయాః=మద్యమునకు దాసులును, పలవరింతురుగాన, జ్ఞేయాః=తెలియదగినవారు. యత్ర=ఎచ్చట, మృగాణామ్=పశువులయొక్క, త్రాసః=వెరపు కనిపించుచున్నదో, తత్ర=అచ్చట, ఎచ్చట పశువులు బితుకు బితుకుమనుచున్నవో అచ్చట అనుట, యత్ర=ఎచ్చట, వయసామ్=పక్షులయొక్క, విరావః=కలకలారావము వినిపించుచున్నదో, తత్ర=అచ్చట, ఎచ్చట (పశుల అలికిడికి) పక్షులు అరచుచున్నవో అచ్చట అనుట; చ=అట్లే, నృప+అంక=రాజలక్షణములతోకూడిన, పాద=అడుగులయొక్క, ప్రతిమాః=జాడలుగల ప్రదేశములును, విచేయాః=అన్వేషింపదగినవి. దాచలేని మహారహస్యము బయటపడుటకిన్ని మార్గములున్న వనుట.

సమాసములు :— రోగేణ ఆర్తాః—రుగార్తాః, మదిరాయాః విధేయాః. నృపస్య అంకాః యేషు తే—నృపాంకాః (వ్యధికరణ బహుప్రీహిః). నృపాంకౌ చ తే పాదౌ చ-నృపాంకపాదయోః ప్రతిమాః యేషు తే నృపాంకపాద ప్రతిమాః ప్రదేశాః.

సంధులు :- జ్ఞేయాః+రహః, సుప్తాః+రుగార్తాః+మదిరా—విసర్గలోప సంధులు. విరావః+నృప, త్రాసః+మృగాణామ్—ఉత్వాదేశవిసర్గ. నృప+అంక—సవర్ణదీర్ఘ. ప్రతిమాః+చ—శషసాదేశ.

పురుషః : యదాజ్ఞాపయతి దేవః. (ఇతి నిష్క్రమ్య పునః ప్రవిశ్య సహర్షమ్) దేవ, పాంచాలకః ప్రాప్తః.

యుధిష్ఠిరః : త్వరితం ప్రవేశయ.

పురుషః : (నిష్క్రమ్య పాంచాలకేన సహ ప్రవిశ్య) ఏష దేవః. ఉపసర్పతు పాంచాలకః

పాంచాలకః : జయతు జయతు దేవః. ప్రియమావేదయామి మహారాజాయ దేవ్యై చ.

---

ఛందస్సు :— ఉపజాతి—ఇంద్రవజ్రోపేంద్రవజ్రల కలయిక.

| | | | |
|---|---|---|---|
| U U I | U U I | I U I | U U |
| జ్ఞేయార | హాశ్శంకి | తమాల | పన్తః |
| త | త | జ | గగ |

| | | | |
|---|---|---|---|
| I U I | UU I | I U I | U U |
| నృపాంక | పాదప్ర | తిమాశ్చ | యత్ర |
| జ | త | జ | గగ |

యదితి :— దేవః=మహారాజు, యత్=ఏది, ఆజ్ఞాపయతి=ఆజ్ఞాపించుచున్నాడో, తత్=అదే చేయుదుననుట. [ఇతి=అని, నిష్క్రమ్య=నిష్క్రమించి, పునః=తిరిగి, ప్రవిశ్య=ప్రవేశించి, సహర్షమ్=ఆనందముతో) దేవ=మహారాజా!, పాంచాలకః=పాంచాలకుడను గూఢచారి, ప్రాప్తః=వచ్చియున్నాడు.

త్వరితమితి :- త్వరితమ్=వెంటనే, ప్రవేశయ=ప్రవేశపెట్టుము.

నిష్క్రమ్యేతి :- [నిష్క్రమ్య = నిర్గమించి, పాంచాలకేన సహ=పాంచాలకునితోసహ, ప్రవిశ్య=పునఃప్రవేశించి] ఏషః దేవః=ఈతడే మహారాజు, పాంచాలకః=పాంచాలకుడు, ఉపసర్పతు=సమీపించునుగాక. వ్యక్తులను ప్రవేశపెట్టునపుడు ఏష మహారాజః అని నిర్దేశించుట ఆచారము.

జయత్వితి :— దేవః=మహారాజు, జయతు జయతు=జయించును గాక. మహారాజాయ=మహారాజు కొరకును, చ=మరియు, దేవ్యై=మహారాజ్ఞి

యుధిష్ఠిరః : భద్ర పాంచాలక, కచ్చిదాసాదితా తస్య దురాత్మనః కౌరవాథమస్య పదవీ!

పాంచాలకః : దేవ, న కేవలం పదవీ. స ఏవ దురాత్మా దేవీ కేశాంబరాకర్షణ మహాపాతక ప్రధానహేతు రుపలబ్ధః.

యుధిష్ఠిరః : సాధు! భద్ర! ప్రియమావేదితమ్. అథ దర్శనగోచరం గతః?

---

కొరకును, మహారాజునకును మహారాజ్ఞికి ననుట, ప్రియమ్ = ఇష్టమును, ఆవేదయామి = విన్నవించుకొనుచున్నాను, ప్రియకరమయిన విషయమును చెప్పబోవుచున్నాననుట.

భద్రేతి :- భద్ర పాంచాలక=భద్రుడా! ఓ పాంచాలకా! గూఢచారులను "భద్ర" "భద్రముఖ" పదములతో సంబోధింపవలెనని నియమము. "శిల్పాధికార నామభ్యాం భద్ర భద్రముఖేతి వా" [3–3. 6] అని రసార్ణవసుధాకరము. దురాత్మనః=దుష్టస్వభావుడును, కౌరవ+అథమస్య=కౌరవులలో నీచుడును అయిన, తస్య=ఆ దుర్యోధనునియొక్క, పదవీ=జాడ, ఆసాదితా కచ్చిత్=దొరికినదా యేమి? "కౌరవాథమస్య" అను మాట కొన్ని ప్రతులలో లేదు.

దేవేతి :- దేవ=మహారాజా!, న కేవలం పదవీ=జాడమాత్రమే కాదు, దేవీ=మహారాజ్ఞియొక్క, కేశ=జుట్టును, అంబర=వస్త్రమును, ఆకర్షణ=లాగుట అనునట్టి, మహాపాతక=మహాపాపమునకు, ప్రధాన హేతుః=మూలకారణుడైన, సః ఏవ ఉపలబ్ధః=వాడే దొరికినాడు.

సాధ్వితి :- సాధు=బాగుబాగు. [సుందరం రుచిరం చారు సుషమం సాధు శోభనం, కాంతం మనోరమం రుచ్యం మనోజ్ఞం మంజు మంజులమ్ 3–1–52 అని అమరము] భద్రా', ప్రియమ్=మిక్కిలి ఇష్టమైన విషయము, ఆవేదితమ్ = నీచే చెప్పబడినది. అథ దర్శన గోచరం గతః=కంటబడినాడా? జాడ తెలియుటయేనా లేక వ్యక్తి కనిపించినాడా? అనుట. "అథ" అనునది

యుధిష్ఠిరః : త్రస్తం వినాపి విషయా దురువిక్రమస్య
చేతో వివేకపరిమంథరతాం ప్రయాతి।
జానామి చోద్యతగదస్య వృకోదరస్య
సారం రణేషు భుజయోః పరిశంకితశ్చ॥ 4

---

త్రస్తమితి :— విషయాత్ వినా అపి త్రస్తం మే చేతః వివేక పరిమంథరతాం ప్రయాతి, రణేషు ఉరు విక్రమస్య ఉద్యత గదస్య వృకోదరస్య భుజయోః సారం జానామి, చ, పరిశంకితః.

అర్థము :- విషయాత్=కారణము, వినా అపి=లేకున్నను, త్రస్తమ్= భీతిగొన్న, మే=నాయొక్క, చేతః=మనస్సు, వివేక=కర్తవ్యనిర్ణయ విషయమున, పరిమంథరతామ్=మాంద్యమును (మందగామీ తు మంథరః—అమర, 2—7—7?), ప్రయాతి = పొందుచున్నది, కర్తవ్యమును వేగముగా నిర్ణయించుకొనలేకున్నా ననుట. రణేషు = యుద్ధములందు, ఉరువిక్రమస్య=గొప్ప పరాక్రమము కల వాడును, ఉద్యత గదస్య=పైకెత్తబడిన గద కలవాడును అయిన, వృకోదరస్య= భీమసేనునియొక్క, భుజయోః=భుజముల, సారమ్=బలమును, జానామి= ఎరుగుదును, చ=అయినను, పరిశంకితః (అస్మి)=అనిష్టమునాశంకించుచున్నాను.

విశేషములు :— వినఞ్భ్యాం నానాఞౌ న సహ (5—2—27) సూత్రముచే నిషేధార్థక విశబ్దమునకు "నా" ప్రత్యయము స్వార్థమున చేరి వినా అను తద్ధిత మేర్పడినది. దీనితో యోగమున్నప్పుడు ద్వితీయా తృతీయా పంచమీ విభక్తు లుపయుక్తము లగుచుండును. కారణం, కారణేన, కారణాత్ వినా అను రీతిగా.

సమాసములు :- ఉరుః విక్రమః యస్య సః—ఉరువిక్రమః—తస్య. వివేకే పరిమంథరతా—తామ్. ఉద్యతా గదా యేన సః—ఉద్యతగదః—తస్య. వృకస్య ఉదర మివ ఉదరం యస్య సః—వృకోదరః—తస్య, వ్యధికరణ బహువ్రీహిః.

(ద్రౌపదీమవలోక్య) అయి సుక్షత్రియే!

గురూణాం బంధూనాం క్షితిపతిసహస్రస్య చ పురః
పురాభూదస్మాకం నృపసదసి యోఽయం పరిభవః।

---

సంధులు :- వినా+అపి-సవర్ణ. చేతః+వివేక-ఉత్వాదేశవిసర్గసంధి. చ+ఉద్యత, వృక+ఉదరస్య-గుణసంధులు. పరిశంకితః+చ-శషసాదేశసంధి.

అలంకారము :- కారణము లేకుండగనే మనసు బెగడొందుచున్నది వివేకశూన్యమగుచున్నది అనుటలో విభావనాలంకారము స్పష్టము. "విభావనా వినాపి స్యాత్ కారణం కార్యజన్మచేత్". ధర్మజుని ఈ అకారణ భీతి వలన దుర్యోధనుని గదాయుద్ధపాండిత్యము వ్యంగ్యము అగుచున్నది. భీముని భుజ బలము నెరిగియు శంకితుడనగుచున్నాననుటయు మరియొక విభావన. "విరుద్ధాత్ కార్యసంపత్తిః దృష్టా కాచిద్విభావనా। శీతాంశుకిరణాస్తన్వీం హన్త సంతాప యన్తి తామ్॥"

ఛందస్సు :- వసంతతిలకావృత్తము.

ద్రౌపదీమితి :- (ద్రౌపదీమ్=ద్రౌపదిని, అవలోక్య=చూచి), అయి సుక్షత్రియే=ఓ క్షత్రియకులాంగనా!

గురూణామితి :- ప్రియే!, గురూణాం బంధూనాం చ క్షితిపతి సహస్రస్య పురః, నృపసదసి అస్మాకం యః అయం పరిభవః పురా అభూత్ తస్య పారం ద్వితయమపి ప్రాయః గమయతి అద్య, నః ప్రాణానాం క్షయః వా కురుపతివశోః నిధనమ్.

అర్థము :- ప్రియే=ఓ ప్రేయసీ!, గురూణామ్=గురువులయొక్కయు, బంధూనామ్=చుట్టములయొక్కయు, చ=మరియు, క్షితిపతి సహస్రస్య=అనేక రాజసమూహముయొక్కయు, పురః=అగ్రభాగమున-వారి ఎట్టయెదుట ననుట, నృపసదసి=రాజసభయందు, అస్మాకమ్=మనకు, యః=ఏవిధమయిన, పరిభవః= అవమానము, అయమ్=ఇది, పురా=మున్ను, అభూత్=సంభవించినదో, తస్య=

ప్రియే ప్రాయస్తస్య ద్వితయమపి పారం గమయతి
క్షయః ప్రాణానాం నః కురుపతిపశో ర్వాద్య నిధనమ్॥ 5

ఆ అవమానముయొక్క, పారమ్=అంతమును, ద్వితయమ్ అపి=రెండును, చెప్పబోవు విధానముల జంట అనుట, ప్రాయః = బహుశః, గమయతి = పొందించును. ఏమేమిటి ఆ జంట అనుటను వివరించుచున్నాడు—అద్య=నేడు, నః=మనయొక్క, ప్రాణానామ్=అసువుల, క్షయః=నాశము, అవమానమును తుదముట్టించు విధము ఇది ఒకటి, వా=ఇది కానిచో, కురుపతిపశోః=పశువైన దుర్యోధనునియొక్క, నిధనమ్=మరణము, ఇది రెండవది అనుట. దుర్యోధనుడు నెగ్గినచో భీమునితోపాటు మనము చత్తుము కావున ప్రాణత్యాగముతో అవమానము తీరును. భీముడే నెగ్గినచో దుర్యోధనుని చావుతో అవమానభారము తొలగును—జంటలో ఏది జరిగినను నేటితో పరిభవభారము తొలగిపోగలదనుట.

విశేషములు :— మహారాజు తన పట్టమహిషిని దేవీ శబ్దముతోను, తదితరాంగనలను ప్రియా పదముతోను వ్యవహరింపవలెనని రసార్ణవసుధాకరము—రాజ్ఞా తు మహిషీ వాచ్యా దేవీత్యన్యాః ప్రియా ఇతి 3-324—అయినను ధర్మజుని చేత పట్టమహిషినే ప్రియా అనిపించుట లోక మర్యాదననుసరించుట.

సమాసములు :- క్షితేః పతిః—క్షితిపతిః—క్షితిపతీనాం సహస్రమ్—తస్య. కురూణాం పతిః—కురుపతిః ఏవ పశుః—కురుపతిపశుః—తస్య.

సంధులు :- పురా+అభూత్, వా+అద్య—సవర్ణదీర్ఘసంధులు. యః+అయమ్—ఉత్వాదేశ—యో+అయమ్—పూర్వరూప. ప్రాయః+తస్య—శషసాదేశ. పశోః+వా—రేఫాదేశవిసర్గసంధి.

క్రియ :— భూసత్తాయామ్—పరస్మై—లుఙ్—ప్రథమ
అభూత్—అభూయమ్—అభూవన్

అథవా కృతం సందేహేన.

నూనం తేనాద్య వీరేణ ప్రతిజ్ఞాభంగభీరుణా।
బధ్యతే కేశపాశస్తే స చాస్యాకర్షణక్షమః॥ 6

---

ఛందస్సు :- శిఖరిణీవృత్తము :- రసై రుద్రైశ్ఛిన్నా యమనసభలా గశ్శిఖరిణీ—1—6—11

| య | మ | న | స | భ | లగ | |
|---|---|---|---|---|---|---|
| I U U | U U U | I I I | I I U | U I I | I U | |
| గురూణాం | బంధూనాం | క్షితివ | తిసహ | స్రస్యచ | పురః | పురాభూత్ |

**అథవేతి** :- అథవా=అయినను, సందేహేన కృతమ్=సందేహముతో చాలును. ఎవరు జయింతురు ఏమి జరుగును అను సందేహములతో పని లేదనుట. కృతమ్ అనునది అలమ్ పర్యాయము. "కృతం యుగేఽలమర్థే స్యాద్విహితే హింసితే త్రిషు_ఇతి మేదినీ" 3_3—67.

**నూనమితి** :- ప్రతిజ్ఞాభంగభీరుణా వీరేణ తేన అద్య తే కేశపాశః, చ, అస్య, ఆకర్షణక్షమః నూనం వ(బ)ధ్యతే.

**అర్థము** - ప్రతిజ్ఞా భంగ భీరుణా=చేసిన ప్రతిజ్ఞ నెరవేరకపోవుటవల్ల భయపడువాడయిన, తేన=ఆ, వీరేణ=వీరుడగు భీమునిచేత, అద్య=నేడు, తే= నీయొక్క, కేశపాశః=శిరోజసమూహము, చ=అట్లే, అస్య=ఈ కేశపాశము యొక్క, ఆకర్షణ=లాగుటయందు, క్షమః=శక్తుడయిన, సః=ఆ దుర్యోధనుడును, నూనమ్=నిశ్చయముగా, బధ్యతే=బంధింపబడును.

**విశేషములు** :- వబయోరభేదః అనునార్యోక్తి ననుసరించి యిచట వధ్యతే—బధ్యతే అని రెండు రూపములు అంగీకరింపబడును. కేశపాశపక్షమున బధ్యతే = ముడివేయబడును (బంధ బంధనే) అనియు, దుర్యోధనపక్షమున వధ్యతే = చంపబడును (వధ—హింస హింసాయామ్) అనియు సమన్వయము. అనుష్టుప్ ఛందము.

పాంచాలకః. కథయ కథయ కథముపలబ్ధః స దురాత్మా కస్మిన్నుద్దేశే కిం వాధునా ప్రవృత్తమితి.

ద్రౌపదీ : భద్ర, కథయ కథయ. (బద్ధ, కహేహి కహేహి)

పాంచాలకః : శృణోతు దేవో దేవీ చ. అస్తీహ దేవేన హతే మద్రాధిపతౌ శల్యే గాంధారరాజ కుల శలభే సహదేవ

---

సమాసములు :— ప్రతిజ్ఞాయాః భంగః—ప్రతిజ్ఞాభంగాత్ భీరుః—తేన. కేశానాం పాశః—కేశపాశః. ఇట పాశ శబ్దము సమూహార్థకము. "పాశః పక్షశ్చ హస్తశ్చ కలాపార్థాః కచాత్పరే" (అమర, 2—6—98). ఆకర్షణే క్షమః.

అలంకారము :— కేశపాశమునకు సుయోధనునకు నిందు ఏక క్రియాన్వయము (బధ్యతే) కూర్పబడినది. ఇవి రెండును ప్రకృతములే. కావున నిందు తుల్యయోగిత. "వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా, సంకుచన్తి సరోజాని స్వైరిణీవదనాని చ".

సంధులు :— తేన+అద్య, చ+అస్య+ఆకర్షణ—సవర్ణదీర్ఘ సంధులు. పాశః+తే—సాదేశవిసర్గసంధి.

క్రియ :— వధ్, బంధ్—కర్మణి—ఆత్మనే—లట్—ప్రథమ
బధ్యతే—బధ్యేతే—బధ్యన్తే

పాంచాలకేతి :— పాంచాలకుడా, సః=ఆ, దురాత్మా=దుష్టుడు, కథమ్=ఎట్లు, ఉపలబ్ధః=దొరికినాడు, అధునా=ఇప్పుడు, కస్మిన్ ఉద్దేశే=ఏ ప్రదేశమున, కిం వా ప్రవృత్తమ్ ఇతి=ఏమి జరిగినదో, కథయ కథయ=చెప్పుము చెప్పుము.

భద్రేతి :— భద్రుడా! కథయ కథయ=చెప్పుము చెప్పుము.

శృణోత్వితి :— దేవః=మహారాజు, చ=మరియు, దేవీ=మహారాజ్ఞి,

శస్త్రానలం ప్రవిష్టే సేనాపతి నిధన నిరాక్రంద విరళ యోధోజ్ఝితాసు సమరభూమిషు రిపుబల పరాజయోద్ధత వల్గిత విచిత్ర పరాక్రమాసాదిత విముఖారాతి చక్రాసు ధృష్టద్యుమ్నాధిష్ఠితాసు చ యుష్మత్సేనాసు ప్రణష్టేషు కృపకృతవర్మాశ్వత్థామసు తథా దారుణాపర్యుషితాం ప్రతిజ్ఞా ముపలభ్య కుమార వృకోదరస్య న జ్ఞాయతే క్వాపి ప్రలీనః స దురాత్మా కౌరవాధమః.

---

శృణోతు=వినునుగాక! వినుడు చెప్పుచున్నాననుట. దేవేన=మహారాజుచేత, మద్రాధిపతౌ=మద్రదేశాధిపతియైన, శల్యే=శల్యుడు, హతే సతి=చంపబడగా, గాంధారరాజ=గాంధారరాజయిన శకునియొక్క, కుల=వంశమనునట్టి, శలభే=మిడుత, సహదేవ=సహదేవునియొక్క, శస్త్ర=ఆయుధమనునట్టి, అనలమ్=అగ్నిని, ప్రవిష్టే సతి=ప్రవేశింపగా, సమరభూమిషు=యుద్ధరంగములు, సేనాపతిః = సేనాపతియొక్క (శల్య, శకుని) నిధన=చావుచేత, నిరాక్రంద=బిట్టు రోదించుచున్న, విరళయోధ=హతశేషులయిన స్వల్ప భటులచేత, ఉజ్ఝితాసు=విడిచిపెట్టబడినవి యగుచుండగా, మిగిలినవారు పారిపోగా ననుట, రిపుబల=శత్రు సైన్యముయొక్క, పరాజయ=పరాజయముతో, ఉద్ధత=ఉద్దండమైన, వల్గిత=వల్గితమనునట్టి గతివిశేషముతో కూడినవియును, విచిత్ర = అద్భుతమైన, పరాక్రమ=శౌర్యముచే, ఆసాదిత=ఆక్రమింపపడినవై, విముఖ=పారిపోవుచున్న, అరాతిచక్రాసు=శత్రుసైన్యములుగలవియునైన, యుష్మత్సేనాసు=మీ సైన్యములు, ధృష్టద్యుమ్న=ధృష్టద్యుమ్నునిచే, అధిష్ఠితాసు = అధిష్ఠింపబడినవగుచుండగా, ఆతడు సేనాపతి కాగా అనుట, చ=మరియు, కృప కృతవర్మాశ్వత్థామసు=కృప కృతవర్మాశ్వత్థామలు, ప్రణష్టేషు=పారిపోగా, తథా=అట్లు, అపర్యుషితామ్=ఆ రోజుననే నెరవేర్పవలసినదియు, దారుణామ్=భీకరమైనదియునైన, కుమార వృకోదరస్య=భీమసేనునియొక్క, ప్రతిజ్ఞామ్=ప్రతినను, ఉపలభ్య=తెలిసికొని, సః=ఆ, దురాత్మా=దుష్టుడైన, కౌరవాధమః=కౌరవనీచుడు దుర్యోధనుడు, క్వాపి=ఎక్కడో, ప్రలీనః అస్తి=దాగియున్నాడు, న జ్ఞాయతే=తెలియవచ్చుటలేదు.

యుధిష్ఠిరః : తతస్తతః-

ద్రౌపదీ : అయి, పరతః కథయ. (అయి, పరదో కహేహి)

పాంచాలకః : అవధత్తాం దేవో దేవీ చ. తతశ్చ భగవతా వాసుదేవేనాధిష్ఠితమేకరథ మారూఢౌ కుమారభీమార్జునౌ సమంతాత్ సమంతపంచకం పర్యటితు మారబ్ధౌ త మనాసాదితవంతౌ చ. అనంతరం దైవమనుశోచతి మాదృశే భృత్యవర్గే, దీర్ఘముష్ణం చ నిశ్వసతి కుమారే బీభత్సౌ, జలధర సమయ నిశా సంచారి తడిత్ప్రకర

---

తతస్తతః=తరువాత!

అయీతి :- అయి = ఓయీ, పరతః = తరువాత (ఏమయినదో) కథయ=చెప్పుము.

అవధత్తామితి :- దేవః=మహారాజు, చ=మరియు, దేవీ=మహారాజ్ఞి, అవధత్తామ్=వినుగాక!, తతశ్చ=అటుతరువాత, భగవతా=భగవంతుడైన, వాసుదేవేన=శ్రీకృష్ణునిచేత, అధిష్ఠితమ్=అధిష్ఠింపబడిన, కృష్ణుడు సారధిగాననుట, ఏక రథమ్=ఒకే అరదమును, ఆరూఢౌ=అధిరోహించినవారై, కుమారభీమార్జునౌ= భీముడునర్జునుడును, సమంతపంచకమ్=సమంతపంచకమను పేరుగల సరస్సును, సమంతాత్=నలువైపుల, పర్యటితుమ్=తిరుగుటకు, ఆరబ్ధౌ=ప్రారంభించిన వారును, తమ్=ఆ దుర్యోధనుని, అనాసాదితవంతౌ చ=కనుగొనలేనివారునయ్యి. అనంతరమ్=తరువాత, మాదృశే=మావంటి, భృత్యవర్గే=సేవకులసమూహము, దైవమ్=దేవుని, అనుశోచతి=ధ్యానించుచుండగా, కుమారే బీభత్సౌ=కుమార కిరీటి, దీర్ఘమ్ ఉష్ణంచ నిశ్వసతి=వేడినిట్టూర్పులు విడుచుచుండగా, వృకోదరే= భీముడు, జలధర సమయ = వానకాలమందలి, నిశా=రాత్రిపూట, సంచారి= పరుగిడుచున్న, తడిత్ప్రకర = మెరుపులపిండువలె, పింగలైః=కెంపెక్కిన, కటాక్షైః=క్రీగంటిచూపులతో, గదామ్=తన గదను, ఆదీపయతి=మెరయించు

పింగళైః కటాక్షై రాదీపయతి గదాం వృకోదర్శే, యత్కించనకారితా మధిక్షిపతి విధే ర్భగవతి నారాయణే, కశ్చిత్సంవిదితః కుమారస్య మారుతే రుజ్ఝిత మాంసభారః ప్రత్యగ్ర విశసిత మృగలోహిత చరణనివసనః త్వరమాణోఽన్తికముపేత్య పురుషః పరుషశ్వాసగ్రస్తార్ధశ్రుతవర్ణానుమేయపదయా వాచా కథితవాన్ — దేవ కుమార! అస్మి న్మహతోఽస్య సరస స్తీరే ద్వే పదపద్ధతీ సముత్తీర్ణప్రతిబింబే. తయో రేకా స్థలముత్తీర్ణా న ద్వితీయా. పరత్ర కుమారః ప్రమాణ మితి. తతః ససంభ్రమం ప్రస్థితాః సర్వే వయం తమేవ పురస్కృత్య. గత్వా చ సరస్తీరం

---

చుండగా, భగవతి=భగవంతుడైన, నారాయణే=వాసుదేవుడు, విధేః=విధియొక్క, యత్కించనకారితామ్=ఏదియైన చేయగల స్వేచ్ఛాప్రవృత్తిని, అధిక్షిపతి=లోలో నిందించుచుండగా, సంవిదితః = పరిచితుడైన, కశ్చిత్ పురుషః = ఒకానొకడు (బోయవాడు), ఉజ్ఝిత=విడువబడిన, మాంసభారః=మాంసపు బరువుకలవాడై, మోయుచున్న బరువును అల్లంతదూరమున దించుకొని యనుట, ప్రత్యగ్ర = అప్పుడే, విశసిత=చంపబడిన, మృగ=హరిణముల చే, లోహిత=ఎఱ్ఱనైన, చరణ నివసనః=పాదములు వస్త్రములు కలవాడై, మృగముల రక్తము చిందిన దనుట, త్వరమాణః=త్వరపడుచున్నవాడై, కుమారస్య మారుతేః=కుమారభీముని యొక్క, అంతికమ్=సమీపమును, ఉపేత్య=పొంది, దగ్గరకు వచ్చి యనుట, పరుష= కఠినమైన లేక బిఱువుగా సాగుచున్న, శ్వాస=ఊర్పులతో, గ్రస్త=కబళింప బడినవగుటచే, అర్ధశ్రుత=సగము సగమే వినబడుచున్న, వర్ణ=అక్షరములతో, అనుమేయ=ఊహింపదగిన లేక తెలియదగు, పదయా=పదములుగలదైన, వాచా= వాక్కుతో, కథితవాన్=ఈప్రకారముగా చెప్పినాడు—దేవ! కుమార!=మహారాజా! కుమారభీమసేనా!, మహతః=పెద్దదయిన, అస్య=ఈ, సరసః=తటాకముయొక్క, అస్మిన్=ఈ, తీరే=ఒడ్డున, పదపద్ధతీ=అడుగుజాడల వరుసలు, ద్వే=రెండు,

పరిజ్ఞాయమాన సుయోధన పదలాంఛనాం పదవీ మాసాద్య భగవతా వాసుదేవేనోక్తమ్ – భో వీర! వృకోదర! జానాతి కిల సుయోధనః సలిలస్తంభనీం విద్యామ్. తన్నూనం తేన త్వద్భయాత్ సరసీమేనా మధిశయితేన భవితవ్యమ్. ఏతచ్చ వచనముపశ్రుత్య రామానుజస్య సకల దిఙ్నికుంజపూరితాతిరిక్తమ్ ఉద్భ్రాంత సలిలచర శకుంతకులం త్రాసోద్ధత నక్ర గ్రాహ మాలోడ్య సరస్సలిలం భైరవం చ గర్జిత్వా కుమార వృకోదరేణాభిహితమ్ – అరేరే వృథా ప్రఖ్యాపితాలీకపౌరుషాభిమానిన్, పాంచాలరాజ తనయా కేశాంబరాకర్షణ మహాపాతకిన్, ధార్త రాష్ట్రాపసద,

---

సమవతీర్ణ=నీటిలోనికి దిగినందులకు, ప్రతిబింబే=చిహ్నములై, కనిపించుచున్న వనుట. (జలమవతీర్ణే = నీటిలోనికి దిగినవి, సమవతీర్ణ పద ప్రతిబింబే–అనియు పాఠాంతరములు). తయోః=ఆ రెండింటిలో, ఏకా=ఒక వరుస, స్థలమ్ ఉత్తీర్ణా= ఒడ్డుకెక్కినది, ద్వితీయా=రెండవది, న ఉత్తీర్ణా=తిరిగి గట్టునకెక్కలేదు, పరత్ర= అటుపైని, కుమారః ప్రమాణమ్ = కుమారభీముడే ప్రమాణము. ఏమి యూహింతురో ఊహించుకొనుడనుట. ఇతి = అని చెప్పెనని అన్వయము. తతః=అంతట, తమ్ ఏవ=వానినే, పురస్కృత్య=ముందుంచుకొని, వయమ్= మేము, సర్వే=అందరము, ససంభ్రమమ్=సంభ్రమముతో, ప్రస్థితాః=కదలితిమి. సరస్తీరమ్ = తటాకమునొడ్డును, గత్వా=సమీపించి, పరిజ్ఞాయమాన=తెలియ బడుచున్న, సుయోధన=దుర్యోధనునియొక్క, పదలాంఛనామ్=పాదచిహ్నములు కలదైన (చక్రాసి వజ్రాభాః రేఖాః కుర్వన్తి భూపతిమ్ అనుచొప్పున నుండు చక్రాది చిహ్నములచే ననుట), పదవీమ్ = జాడను, ఆసాద్య=పొంది లేక గుర్తించి, భగవతా=భగవంతుడైన, వాసుదేవేన=శ్రీకృష్ణునిచే, ఉక్తమ్=ఇట్లు పలుకబడినది–భో వీర! వృకోదర!=ఓ వీరుడా! భీమసేనుడా!, సుయోధనః=

జన్మేందోరమలే కులే వ్యపదిశస్యద్యాపి ధత్సే గదాం
మాం దుశ్శాసన కోష్ణ శోణిత మధుక్షీబం రిపుం భాషసే।
దర్పాంధో మధుకైటభద్విషి హరావప్యుద్ధతం చేష్టసే
మత్త్రాసాన్నృపశో విహాయ సమరం పంకేఽధునా లీయసే॥ 7

---

దుర్యోధనుడు, సలిలస్తంభనీమ్=జలస్తంభనమను, విద్యామ్=విద్యను, జానాసి కిల=ఎఱుంగుదుగదా!, తత్=అందుచే, త్వత్ భయాత్=నీనుండి భయమువలన, ఏనామ్=ఈ, సరసీమ్=సరస్సును, అధిశయితేన=మునిగియున్నవాడుగా, తేన=ఆ సుయోధనునిచే, నూనమ్=తప్పక, భవితవ్యమ్=కాదగియున్నది. తప్పక ఇందే మునిగియున్నాడనుట. రామానుజస్య = బలరాముని తమ్ముడైన వాసుదేవుని, ఏతత్=ఈ, వచనమ్=మాటను, ఉపశ్రుత్య=విని; సకల దిక్ నికుంజ=దశ దిశలనునట్టి గహ్వరములలో, పూరిత=నిండినదై, అతిరిక్తమ్=వెక్కసముగా మిగులునట్లును, ఉద్భ్రాంత = భయపడి పరుగులుపెట్టుచున్న, సలిలచర=జలచరములయు, శకుంత=పక్షులయు, కులమ్=సమూహము కలుగునట్లును, త్రాస= భయమువలన, ఉద్ధత=ఉద్దండములైన, నక్ర=మొసళ్ళు, గ్రాహమ్=జలజంతు విశేషములు కలుగునట్లును, సరస్సలిలమ్=తటాకోదకమును, ఆలోడ్య=కలగుండు వరచి, చ=మరియు, భైరవమ్=భీషణముగా, గర్జిత్వా=బిట్టరచి, కుమార వృకోదరేణ=భీమునిచే, అభిహితమ్=ఇట్లు పలుకబడినది—అరేరే=ఓరోరీ!, వృధా= వ్యర్థముగా, ప్రఖ్యాపిత=ప్రకటింపబడిన, అలీక=అసత్యమైన, పౌరుషాభిమానిన్= పౌరుషాభిమానముకలవాడా! మగటిమిపై నీ యభిమాన మలీక మనుట. పాంచాల రాజ తనయా=ద్రౌపదియొక్క, కేశాంబర=కేశపాశమును వస్త్రమును, ఆకర్షణ= లాగుటచే, మహాపాతకిన్=మహాపాపీ! అట్టి మహాపాపమును చేసినవాడా అనుట; ధార్తరాష్ట్రాపసద=ధృతరాష్ట్రుని సంతతిలో నీచుడా!

జన్మేందోరితి :- అమలే, ఇందోః, కులే, జన్మ, వ్యపదిశసి; అద్య, అపి, గదామ్, ధత్సే; దుశ్శాసన కోష్ణ శోణిత మధుక్షీబమ్, మామ్, రిపుమ్, భాషసే; మధుకైటభద్విషి, హరౌ, అపి, దర్పాంధః, ఉద్ధతమ్, చేష్టసే; హే నృపశో, అధునా, మత్త్రాసాత్, పంకే, లీయసే.

అర్థము :— అమలే=కళంకరహితమైన, ఇందోః కులే=చంద్రవంశము నందు, జన్మ=పుట్టుకను, వ్యపదిశసి=ప్రకటించుచున్నావు (పుట్టితివనుట); అద్య అపి=నేడుకూడ, గదామ్ = గదను, ధత్సే=ధరించుచున్నావు; దుశ్శాసన= దుశ్శాసనునియొక్క, కోష్ణ=గోరువెచ్చని, శోణిత=రక్తమనునట్టి, మధు= మద్యముతో (సురా అని పాఠాంతరము), క్షీబమ్=మదించిన, మామ్=నన్ను, రిపుమ్=శత్రువుగా, భాషసే=చెప్పుకొనుచున్నావు; నన్ను శత్రువుగా చెప్పుకొను వానికి ఇట్టి నైచ్యము తగదనుట; మధుకైటభద్విషి=మధుకైటభులకు శత్రువైన, హరౌ అపి = నారాయణుని విషయమునందును, దర్పాంధః = గర్వాంధుడవై, ఉద్ధతమ్=బెట్టిదమును, చేష్టసే=పొనరించుచున్నావు, హే నృపశో=ఓరీ! నరరూప పశువా!, అధునా = ఇప్పుడు, మత్ త్రాసాత్=నానుండి భయమువలన, పంకే= బురదలో (చెరువులో ననుట) లీయసే=దాగుచున్నావు. (ఛందస్సు—శార్దూల విక్రీడితము)

సమాసములు :- కించి దుష్ణమ్—కోష్ణం చ తత్ శోణితమ్ చ—కోష్ణ శోణితమ్—తదేవ మధు—మధునా క్షీబః—తమ్. దర్పేణ అంధః. మధుశ్చ కైటభశ్చ-మధుకైటభయోః ద్విట్-తస్మిన్. నా పశురివ—నృపశుః-తత్సంబుద్ధౌ— నృపశో!. మత్ త్రాసః—తస్మాత్.

సంధులు :- జన్మ+ఇందోః, కా+ఉష్ణ—గుణసంధులు. ఇందోః+ అమలే-రేఫాదేశవిసర్గ. వి+అపదిశసి+అద్య, అపి+ఉద్ధతమ్-యణాదేశ. అద్య+ అపి, దర్ప+అంధ—సవర్ణదీర్ఘ. హరౌ+అపి—అయవాదేశసంధి. త్రాసాత్+ నృపశో—అనునాశికాదేశ. అంధః+మధు—ఉత్వాదేశ. పంకే+అధునా—పూర్వ రూపసంధి.

క్రియ :- దిశఙ్ అతిసర్జనే, పరస్మై, లట్, మధ్యమ, దిశసి-దిశథః- దిశథ. డు ధాఞ్ (ధారణపోషణయోః)-లట్, ఆత్మనే, మధ్యమ; ధత్సే-దధాథే— ధద్ధ్వే. మనుఞ్ (అవబోధనే) లట్, కర్మణి, మధ్యమ; మన్యసే—మన్యేథే— మన్యధ్వే. చేష్టసే—చేష్టేథే—చేష్టధ్వే (చేష్ట-నామధాతువు) లీయసే—లీయేథే— లీయధ్వే (లా ఆదానే—కర్మణి ప్రయోగః).

అపి చ భో మానాంధ!

పాంచాల్యా మన్యువహ్నిః స్ఫుటముపశమితప్రాయ ఏవ ప్రసహ్య
వ్యాసక్తైః కేశపాశైః హతపతిషు మయా కౌరవాంతఃపురేషు।
భ్రాతు ర్దుశ్శాసనస్య స్రవదసృగురసః పీయమానం నిరీక్ష్య
క్రోధాత్కిం భీమసేనే విహితమసమయే యత్త్వయాస్తోఽభిమానః॥ 8

---

అపిచేతి :— అపిచ=మరియు, భో మానాంధ=ఓ అభిమానాంధుడా!

పాంచాల్యేతి :- మయా, ప్రసహ్య, కౌరవాంతఃపురేషు, హతపతిషు; వ్యాసక్తైః, కేశపాశైః, పాంచాల్యాః, క్రోధవహ్నిః, స్ఫుటమ్, ఉపశమిత ప్రాయః, ఏవ; భ్రాతుః, దుశ్శాసనస్య, ఉరసః, స్రవత్, అసృక్, పీయమానమ్, నిరీక్ష్య, క్రోధాత్, త్వయా, భీమసేనే, కిమ్, విహితమ్; యత్, అసమయే, అభిమానః, అస్తః?

అర్థము :— మయా = నాచేత, ప్రసహ్య = హఠాత్తుగా, కౌరవాంతః పురేషు=కౌరవకాంతలు, హత పతిషు=చంపబడిన భర్తలు కలవారగుచుండగా, వ్యాసక్తైః=విడివడిన, కేశపాశైః=(వారి) జడలచే, పాంచాల్యాః=ద్రౌపదియొక్క, మన్యువహ్నిః=కోపాగ్ని, స్ఫుటమ్=పూర్తిగా, ఉపశమితప్రాయః ఏవ=చల్లార్చ బడినట్లే. భ్రాతుః=సోదరుడైన, దుశ్శాసనస్య=దుశ్శాసనునియొక్క, ఉరసః= వక్షఃస్థలమునుండి, స్రవత్=ఉబుకుచున్న, అసృక్=రక్తమును, పీయమానమ్= త్రాగుచున్నవానిని, నిరీక్ష్య = చూచి, క్రోధాత్ = కోపముతో, త్వయా=నీచేత, భీమసేనే = ఈ భీమునిపట్ల, విహితమ్ కిమ్=ఏమి యాచరింపబడినది? భీమునికి ప్రత్యపకారమేమి చేయగల్గితివనుట. యత్=ఏలన్న, అసమయే=వేళ కాకముందే, అభిమానః = నీ గర్వము, అస్తః కిమ్ = అస్తమించినదా యేమి? (స్రగ్ధరా వృత్తము)

సమాసములు :- మన్యురేవ వహ్నిః. హతాః పతయః యేషాం తే. కౌరవాణా మంతఃపురాః-తేషు. అంతఃపుర శబ్దము లక్షణావృత్తి ననుసరించి

ద్రౌపదీ : నాథ, అపనీతో మే మన్యుర్యది పునరపి సులభం దర్శనం భవిష్యతి. (ణాహ, అవణీదో మే మణ్ణు జఇ పుణో వి సులహం దంసణం భవిస్సది.)

యుధిష్ఠిరః : కృష్ణే, నామఙ్గళాని వ్యాహర్తుమర్హస్యస్మిన్ కాలే. భద్ర, తతస్తతః.

పాఞ్చాలకః : దేవ, తతశ్చైవం భాషమాణేన వృకోదరేణావతీర్య క్రోధోద్ధతభ్రమిత భీషణ గదాపాణినా సహసై వోల్లంఘితతీర ముత్పన్ననళినీవన మపవిద్ధ

---

అంతఃపురకాంతలకు బోధకము. కాగా నిది పుంలింగమగుట విగ్రహమున యేషాం తే అనియు తేషు అనియు చెప్పబడినది. న సమయః-అసమయః-తస్మిన్.

సంధులు :— పాంచాల్యాః+మన్యు, ప్రాయః+ఏవ—విసర్గలోప. పాశైః+హస్త, భ్రాతుః+దుశ్శాసన—రేఫాదేశ. కౌరవ+అంతఃపుర, త్వయా+అస్త్రైః—సవర్ణదీర్ఘ. అస్త్రైః+అభిమానః—ఉత్వాదేశ—అస్త్రో+అభిమానః—పూర్వరూప.

**నాథేతి :-** నాథా! [ఇది ఆమె మనస్సులో భీమునికే సంబుద్ధి] పునరపి=మరల తిరిగి, దర్శనమ్=నీ దర్శనము, సులభమ్=తేలికగా దొరకునది, భవిష్యతి యది=అగుచో చాలు, మే=నాయొక్క, మన్యుః=[కౌరవులపై]కోపము, అపనీతః=పోగొట్టబడినదే, నీవు నిరపాయముగా తిరిగివచ్చిన చాలుననుట.

**కృష్ణే ఇతి :—** కృష్ణే = ద్రౌపదీ!, అస్మిన్ కాలే=ఈ సమయమున, అమంగళాని=అశుభములను, వ్యాహర్తుమ్=పలుకుటకు, న అర్హసి=తగవు. ఇప్పుడమంగళముల నాశంకింపకు మనుట. భద్రుడా! తతస్తతః = తరువాత నేమైనది చెప్పుము.

**దేవేతి :—** దేవ=మహారాజా!, తతః చ=అటుపైని, ఏవమ్=పైని చెప్పినట్లు, భాషమాణేన=గర్జించుచున్నవాడును, క్రోధ=కోపముతో, ఉద్ధత=

మూర్ఛిత గ్రాహ ముద్భ్రాంత మత్స్య శకుంత
మతిభైరవారవ భ్రమిత వారిసంచయ మాయత మపి
తత్సరః సమంతాదవలోడితమ్.

యుధిష్ఠిరః : భద్ర, తథాపి కిం నోత్థితః?

పాంచాలకః : దేవ, కథం నోత్థితః!

త్యక్త్వోత్థితః సరభసం సరసః స మూల
ముద్భూత కోప దహనోగ్ర విషస్ఫులింగః।

---

ఉద్దండముగా, భ్రమిత=త్రిప్పబడుచున్న, భీషణ=భయంకరమైన, గదా=గదతో కూడిన, పాణినా=బాహువులుకలవాడునైన, వృకోదరేణ=భీమునిచే, అవతీర్య=ప్రవేశింపబడి (అత దందు దిగియుననుట), సహసా ఏవ = ఒక్కసారిగా, ఉల్లంఘిత=దాటివేయబడిన, తీరమ్=ఒడ్డుకల్గునట్లును, ఉత్పన్న=శిథిలమైన, నళినీవనమ్=పద్మలతలు కల్గునట్లును, అపవిద్ధ = గ్రుచ్చబడి లేక నలిగిపోయి, మూర్ఛిత=మూర్ఛిల్లిన, గ్రాహమ్=నక్రములు కల్గునట్లును, ఉద్భ్రాంత=పైకెగిరి పడుచున్న, మత్స్య=చేపలు, శకుంతమ్=పక్షులు కల్గునట్లును, అతిభైరవ=మిక్కిలి భయంకరమైన, ఆరవ=ధ్వనితో, భ్రమిత=తరగలెత్తిన, వారిసంచయమ్=నీరు కల్గునట్లును, తత్ సరః=ఆ సరస్సు, ఆయతిమ్ అపి=విశాలమైనదే అయినప్పటికిని, సమంతాత్=పూర్తిగా, అవలోడితమ్=కలచివేయబడినది.

భద్రేతి :— భద్ర = భద్రుడా!, తథాపి = అటుల చేసినప్పటికిని, న ఉత్థితః కిమ్=లేచినవాడు కాలేదా ఏమి?

దేవఇతి :— దేవ = మహారాజా!, కథమ్ నోత్థితః = లేచినవాడు కాకుండుటెట్లు!

త్యక్త్వాఇతి :— సరసః, మూలమ్, సరభసమ్, త్యక్త్వా, ఉద్భూత కోప దహనోగ్ర విషస్ఫులింగః, సః, ఆయస్త భీమ భుజమందర వేల్లనాభిః, సుమథితాత్, (సరసః), క్షీరోదధేః, కాలకూటః, ఇవ, ఉత్థితః.

ఆయస్త భీమ భుజ మందర వేల్లనాభిః
క్షీరోదధేః సుమథితాదివ కాలకూటః॥ 9

---

**అర్థము :-** సరసః=సరోవరముయొక్క, మూలమ్=అథోభాగమును, సరభసమ్=వేగముగా, త్యక్త్వా=విడిచి; ఉద్వాంత=వెలువడుచున్న, కోప=క్రోధమనునట్టి, దహన=అగ్నియొక్క, ఉగ్ర=భయంకరమైన, విష=విషము వంటి, స్ఫులింగః=కణములు కలవాడై, విషతుల్యమైన క్రోధాగ్నికణములను వెలిగ్రక్కుచున్నవాడై అనుట; ఆయస్త=పొడవైన, భీమ=భీమసేనునియొక్క, భుజ = బాహువనునట్టి, మందర = మంథరపర్వతముయొక్క, వేల్లనాభిః= తిరుగుడులతో, సుమథితాత్=బాగుగా చిలికివేయబడినదైన, సరసః=ఆ సరోవరము నుండి, క్షీరోదధేః=క్షీరసముద్రమునుండి, కాలకూటః ఇవ=కాలకూటమువలె, సః=ఆ దుర్యోధనుడు, ఉత్థితః=లేచెను.

**సమాసములు :-** కోపః ఏవ దహనః, ఉగ్రం చ తత్ విషం చ; కోపదహనః ఏవ ఉగ్రవిషమ్, కోపదహనోగ్రవిషస్య స్ఫులింగాః; ఉద్వాంతాః కోప దహనోగ్ర విషస్ఫులింగాః యస్మాత్ సః. భీమస్య భుజః-భీమభుజః, ఆయస్తః భీమభుజః ఏవ మందరః; ఆయస్త భీమభుజమందరస్య వేల్లనాః-తాభిః. క్షీరస్య ఉత క్షీరసహితః ఉదధిః-క్షీరోదధిః. ఉదధీ రూఢః.

**సంధులు :-** త్యక్త్వా+ఉదధిః, దహన+ఉగ్ర, క్షీర+ఉదధేః-గుణ సంధులు. సః+మూలమ్-తదేతద్విసర్గలోపసంధి.

**ఛందస్సు :-** వసంతతిలక-ఉక్తా వసంతతిలకా తభజా జగౌ గః

| UUI | UII | IUI | IUI | UU |
|---|---|---|---|---|
| త్యక్త్వోత్థి | తస్ఫుర | భసంప | రసస్ఫ | మూలమ్ |
| త | భ | జ | జ | గగ |

**అలంకారము :-** కోపమునందు దహనత్వమారోపింపబడుటచే నిది రూపకము. కోపదహనమునందు ఉగ్రవిషత్వమారోపింపబడి మరొక రూపకము.

యుధిష్ఠిరః : సాధు, సుక్షత్రియె, సాధు.

ద్రౌపదీ : ప్రతిపన్నః సమరో న వా. (పడిబణ్ణో సమరో ణ వా)

పాంచాలకః : ఉత్థాయ చ తస్మాత్సలిలాశయాత్ కరయుగళోత్తంభిత తోరణీకృత భీమగదః కథయతి స్మ—అరేరే మారుతే! కిం భయేన ప్రలీనం దుర్యోధనం మన్యతే భవాన్. మూఢ! అనిహత పాండుపుత్రః ప్రకాశం లజ్జమానో విశమితు మధ్యవసితవా నస్మి పాతాలమ్. ఏవం చోక్తే వాసుదేవ కిరీటిభ్యాం ద్వావప్యంతస్సలిలే

---

ఇవి రెండును అనుభయ తాద్రూప్యరూపకములు. భుజమందరమనుచో కూడ నిట్టిదే. క్షీరసముద్రమునుండి కాలకూటమువలె సరస్సునుండి సుయోధనుడు లేచెను. ఉపమానోపమేయములకు ఏకక్రియాన్వయము (ఉత్థితః) చెప్ప బడుటచే నిది దీపకము. వదన్తి వర్ణ్యావర్ణ్యానాం ధర్మైక్యం దీపకం బుధాః, మదేన భాతి కలభః ప్రతాపేన మహీపతిః.

సాధ్వితి :- సుక్షత్రియె=ఉత్తమ రాజవంశ సంజాతా!, సాధు సాధు= బాగు బాగు.

ప్రతిపన్న ఇతి :- సమరః=యుద్ధము, ప్రతిపన్నః వా=జరిగినదా, న వా=లేదా?

ఉత్థాయేతి :- తస్మాత్ = ఆ, సలిలాశయాత్ = సరస్సునుండి, ఉత్థాయ చ=లేచి, కరయుగళ=రెండు చేతులతోను, ఉత్తంభిత=పైకెత్తబడి, తోరణీకృత = వలయాకారముగా త్రిప్పబడుచున్న, భీమ=భయంకరమయిన, గదః=గద కలవాడై, కథయతిస్మ=(ఈ ప్రకారముగా) చెప్పుచున్నవాడయ్యెను— అరేరే మారుతే=ఒరోరీ భీముడా!, భయేన=భయముతో, ప్రలీనమ్=దాగినవానిగా, దుర్యోధనమ్=ఈ దుర్యోధనుని, భవాన్=నీవు, మన్యతే కిమ్=తలచుచున్నావా? [భవద్యోగమున ప్రథమపురుష]. మూఢ=మూర్ఖుడా!, అనిహత=చంపబడని,

నిషిద్ధ సమర సమారంభౌ స్థల ముత్తారితౌ భీమ సుయోధనౌ. ఆసీనశ్చ కౌరవరాజః క్షితితలే గదాం నిక్షిప్య విశీర్ణ రథ సహస్రం నిహత కురు శత గజ వాజి నర సహస్ర కళేబర సమ్మర్ద సంపతత్ గృధ్ర కంక జంబూక ముత్సన్నసుయోధ మస్మద్వీర విముక్త సింహనాద మపమిత్ర బాంధవ మకౌరవం రణస్థాన మవలోక్య ఆయత ముష్ణం చ నిఃశ్వసితవాన్. తతశ్చ వృకోదరేణ అభిహితమ్-అయి భోః కౌరవరాజః, కృతం బంధునాశ దర్శన మన్యునా. మైవం విషాదం కృథాః పర్యాప్తాః పాండవాః సమరాయాహమసహాయ ఇతి.

---

పాండుపుత్రః=పాండవులు కలవాడనై, పాండవులను చంపలేనివాడనై అనుట, ప్రకాశమ్=స్ఫుటముగా, లజ్జమానః=సిగ్గుపడుచున్నవాడనై, విశ్రమితుమ్=విశ్రాంతి తీసికొనుటకై, పాతాలమ్=అధోలోకమును, అధ్యవసితవాన్ అస్మి=పొందినవాడనైతిని. పాతాళమునకేగి విశ్రమింప నిశ్చయించుకొంటి ననుట. ఏవమ్=ఇట్లు, ఉక్తే చ=పల్కగా, భీమ సుయోధనౌ=భీమ దుర్యోధనులు, ద్వౌ అపి=ఇరువురును, సలిలే=నీటియందు, నిషిద్ధ=వారింపబడిన, సమర సమారంభౌ=యుద్ధప్రారంభముకలవారై, సరోవరములోనే కలియబడకుండ వారింపబడి యనుట, వాసుదేవ కిరీటిభ్యామ్=కృష్ణార్జునులచే, స్థలమ్=ఒడ్డును, ఉత్తారితౌ=పొందింపబడినవారైరి. ఈ ఇరువురు నాఇరువురి నొడ్డుకు రావించిరనుట. చ=ఆ పిమ్మట, కౌరవరాజః=దుర్యోధనుడు, ఆసీనః=కూర్చున్నవాడై, గదామ్=గదను, క్షితితలే=నేలమీద, నిక్షిప్య=ఉంచి, విశీర్ణ=తుత్తునియలై పోయిన, రథ సహస్రమ్=అనేక రథములు కలదియు, నిహత=చంపివేయబడిన, కురు శత=నూర్గురు కౌరవులయు (దుర్యోధనుడు ఒక్కడే మిగిలియున్నాడుకాన నిట శత శబ్దము), గజ=ఏనుగులయు, వాజి=గుఱ్ఱములయు, నర=భటులయు, సహస్ర=వేనవేల, కళేబర=శరీరముల, సమ్మర్దే=ప్రోవుపై, సంపతత్=వ్రాలుచున్న,

ఇత్థం చ శ్రుత్వాసూయాన్వితాం దృష్టిం కుమారయో ర్నిక్షి ప్యోక్తవాన్ ధార్తరాష్ట్రః—

కర్ణదుఃశాసనవధా త్తుల్యావేవ యువాం మమ
అప్రియోఽపి ప్రియో యోద్ధుం త్వమేవ ప్రియసాహసః॥ 11

---

అగునుగాక!. నీవు కోరుకొన్నవానితో యుద్ధము చేయవచ్చు ననుట. (క్షణ ఉద్ధర్షో మహ ఉద్ధవ ఉత్సవః, 1–7–38, ఉత్సేకామర్షయోరిచ్ఛాప్రసవే మహ ఉత్సవః 3–3–209, అమర).

సమాసములు :— సుఖేన యోద్ధుం యోగ్యః-తమ్. ఆత్తం శస్త్రం యేన సః—ఆత్తశస్త్రః—తస్య. రణే [రణాయ వా] ఉత్సవః-రణోత్సవః.

సంధులు :— మన్యసే+అస్మాకమ్, తే+అస్తు—పూర్వరూపస్వర సంధులు. దంశితస్య+ఆత్త—సవర్ణదీర్ఘ. రణ+ఉత్సవః—గుణసంధి.

ఛందస్సు :— పథ్యావక్త్రము.

క్రియలు :- మను అవబోధనే—ఆత్మనే—లట్—కర్మణి—మధ్యమ
మన్యసే—మన్యేథే—మన్యధ్వే
అస భువి—పరస్మై—లోట్—కర్తరి—ప్రథమ
అస్తు—స్తః—సన్తు

ఇత్థమితి :— ఇత్థమ్=ఈప్రకారముగా పల్కినదానిని, శ్రుత్వా=విని, అసూయాన్వితామ్=అసూయతో కూడిన, దృష్టిమ్=చూపును, కుమారయోః= భీమార్జునులపై, నిక్షిప్య=నిలిపి, ధార్తరాష్ట్రః=దుర్యోధనుడు, ఉక్తవాన్= పల్కెను—

కర్ణేతి :— కర్ణదుఃశాసన వధాత్, మమ, యువామ్, తుల్యౌ, ఏవ; అప్రియః అపి ప్రియసాహసః త్వమ్ ఏవ యోద్ధుమ్ ప్రియః.

ఇత్యుత్థాయ పరస్పర క్రోధాధిక్షేప పరుషవాక్కలహ ప్రస్తావిత ఘోరసంగ్రామౌ విచిత్ర విభ్రమ భ్రమిత గదా పరిభాసుర భుజ దండౌ మండలైః విచరితు మారబ్ధౌ భీమ దుర్యోధనౌ. అహం చ దేవేన చక్రపాణినా దేవసకాశ మనుప్రేషితః. ఆహ చ దేవో దేవకీనందనః—అపర్యూషిత ప్రతిజ్ఞే చ మారుతౌ, ప్రణష్టే కౌరవరాజే మహా నాసీన్మే విషాదః. సంప్రతి పునర్భీమసేనాసాదితే సుయోధనే నిష్కంటకీభూతం భువనతలం పరికలయతు భవాన్. అభ్యుదయోచితా శ్చానవరతం ప్రవర్త్యంతాం మంగళసమారంభాః. కృతం సందేహేన.

---

అర్థము :- కర్ణ దుఃశాసన వధాత్=కర్ణుని దుఃశాసనుని చంపుటవలన, మమ=నాకు, యువామ్=మీరిరువురును, తుల్యౌ ఏవ=సమానులే. (కర్ణుని చంపిన అర్జునుడు, దుశ్శాసనుని చంపిన భీముడు నిరువురు నాకు విరోధులే అనుట), అప్రియః అపి=అనిష్టుడవే అయినప్పటికిని, ప్రియసాహసః=సాహసప్రియుడవైన, త్వమ్ ఏవ=నీవే, యోద్ధుమ్=యుద్ధము కొఱకు, ప్రియః=ఇష్టుడవు.

సమాసములు :- కర్ణశ్చ దుశ్శాసనశ్చ—కర్ణదుశ్శాసనయోః వధః—తస్మాత్. న ప్రియః-అప్రియః. ప్రియమ్ సాహసం యస్య సః-ప్రియసాహసః.

సంధులు :- తుల్యౌ+ఏవ—అయవాదేశసంధి. అప్రియః+అపి—ఉత్వాదేశ—అప్రియో+అపి—పూర్వరూపసంధి. ప్రియః+యోద్ధుమ్—ఉత్వాదేశ.

ఛందస్సు :- పథ్యావక్త్రము.

ఇత్యుత్థాయేతి :- ఇతి=అని, ఉత్థాయ=లేచి, పరస్పర=ఒండొరులకు చెందిన, క్రోధ=కోపముతోనైన, అధిక్షేప=తిరస్కారముతో కూడిన, పరుష=కఠినమైన, వాక్=వాగ్రూపమయిన, కలహ=యుద్ధముతో, ప్రస్తావిత=ప్రారంభింపబడిన, ఘోర=భయంకరమైన, సంగ్రామౌ=రణము కలవారును, విచిత్ర=ఆశ్చర్యజనకమైన, విభ్రమ=విలాసముతో, భ్రమిత=త్రిప్పబడుచున్న, గదా=గదలతో,

పూర్యంతాం సలిలేన రత్నకలశా రాజ్యాభిషేకాయ తే
కృష్ణాత్యంతచిరోజ్ఝితే చ కబరీబన్ధే కరోతు క్షణమ్।
రామే శాతకుఠారభాసురకరే క్షత్రద్రుమోచ్ఛేదిని
క్రోధాంధే చ వృకోదరే పరిపతత్యాజౌ కుతః సంశయః॥ 18

పరిభాసుర=ప్రకాశించుచున్న, భుజదండౌ=దీర్ఘములైన బాహువులు కలవారును, [భుజౌ దండావివ యయోస్తౌ]; అయిన, భీమ దుర్యోధనౌ=భీమ దుర్యోధనులు, మండలైః=[కలియబడుటకనువుగా] వలయాకారములో, విచరితుమ్=తిరుగుటకు, ఆరబ్ధౌ=మొదలిడిరి. అహం చ=నేనేమో, దేవేన=భగవంతుడైన, చక్రపాణినా=శ్రీకృష్ణునిచే, దేవ సకాశమ్ = మహారాజ సమీపమునకు [తమయొద్దకనుట], అనుప్రేషితః = పంపబడితిని. దేవః=దేవుడైన, దేవకీనందనః=శ్రీకృష్ణుడు, ఆహ చ = ఇట్లు చెప్పెనుకూడ. మారుతౌ=భీముడు, అపర్యుషిత ప్రతిజ్ఞే=ఆ రోజుననే దుర్యోధనుని సంహరింతునను ప్రతిజ్ఞ చేసినవాడగుచుండగా, కౌరవ రాజే=దుర్యోధనుడు, ప్రణష్టే=పారిపోగా [అదృశ్యుడుకాగా], నః=మనకు, మహాన్=పెద్ద[గొప్ప], విషాదః=దిగులు, ఆసీత్=[సంభవించెను] కలిగెను. సంప్రతి=ఇప్పుడు, పునః=తిరిగి, భీమసేనేన=భీమునిచే, సుయోధనే=దుర్యోధనుడు, ఆసాదితే=పట్టుపడగా, భువనతలమ్=భూగోళము, నిష్కంటకీభూతమ్=శత్రురహితము గావింపబడినట్లు, భవాన్=నీవు, పరికలయతు=తలంతువుగాక!, అభ్యుదయోచితాః=జయోచితములైన, మంగళ సమారంభాః=శుభకార్యములు, అనవరతమ్ = నిరంతరముగా, ప్రవర్త్యంతామ్ = నిర్వహింపబడుగాక!, సందేహేన = అనుమానముతో, కృతమ్ = చాలును. జయముపట్ల సందేహింప వవసరము లేదనుట.

పూర్యంతామితి :— తే, రాజ్యాభిషేకాయ, రత్నకలశాః, సలిలేన, పూర్యంతామ్; చ, కృష్ణా, చిరోజ్ఝితే, కబరీబంధే, క్షణమ్, కరోతు; శాతకుఠార భాసురకరే, క్షత్రద్రుమోచ్ఛేదిని, రామే, చ, క్రోధాంధే, వృకోదరే, ఆజౌ, పరిపతతి, కుతః, సంశయః!

అర్థము :- తే=నీకు, రాజ్యాభిషేకాయ=పట్టాభిషేకముకొఱకు, రత్న కలశాః=రత్నములు పొదిగిన కుంభములు, సలిలేన=నీటితో, పూర్యంతామ్= నింపబడుగాక, చ=మరియు, కృష్ణా=ద్రౌపదీదేవి, అత్యంత చిరోజ్ఝితే=చాల కాలమునుండి విడిచిపెట్టబడిన, కబరీబంధే=శిరోజబంధనమున, క్షణమ్=పండువు, కరోతు=చేసికొనుగాక, జుట్టు ముడుచుకొను ఆనందమును పొందుగాక అనుట. శాత=వాడియైన, కుఠార=గొడ్డలితో, భాసుర=ప్రకాశించుచున్న, కరే=హస్తము కలిగినవాడును, క్షత్ర=క్షత్రియులనునట్టి, ద్రుమ=తరువులను, ఉచ్ఛేదిని=నరికి వేయువాడునైన, రామే=పరశురాముడు, ఆజౌ=రణరంగమునందు, పరిపతతి= అవతరించుచుండగా, చ = మరియు లేక అప్లే, క్రోధాంధే=కోపావిష్టుడైన, వృకోదరే=భీముడు, ఆజౌ పరిపతతి, సంశయః=సందేహము, కుతః=ఎక్కడిది!, జయము లభించునా లభింపదా అను సంశయమునకు అవకాశమే లేదనుట. శార్దూలము.

సమాసములు :— రత్నమయాః ఉత రత్నభూషితాః కలశాః—రత్న కలశాః. రాజ్యే అభిషేకః—తస్మై. అత్యంతం చిరాత్ ఉజ్ఝితః—తస్మిన్. కబర్యాః బంధః—తస్మిన్. శాత శ్చాసౌ కుఠారః, శాతకుఠారేణ భాసురః, శాత కుఠారభాసురః కరః యస్య సః—తస్మిన్. క్షత్రా ఏవ ద్రుమాః, క్షత్ర ద్రుమాన్ ఉచ్ఛేత్తుం శీల మస్య—క్షత్రద్రుమోచ్ఛేదీ-తస్మిన్. క్రోధేన అంధః-తస్మిన్.

సంధులు :- రత్నకలశాః+రాజ్య-విసర్గలోప. రాజ్య+అభిషేకాయ, కృష్ణా+అత్యంత, క్రోధ+అంధే—సవర్ణదీర్ఘ. అతి+అంత, పరిపతతి+ఆజౌ— యణాదేశ. చిర+ఉజ్ఝిత, ద్రుమ+ఉచ్ఛేదిని—గుణసంధి.

క్రియలు :- 1) పౄ పూరణే, కర్మణి, ఆత్మనే, లోట్, ప్రథమ
పూర్యతామ్—పూర్యేతామ్—పూర్యన్తామ్
2) డు కృఞ్ కరణే—ఉభయ—లోట్—ప్రథమ—పరస్మై.
కరోతు/కురుతాత్—కురుతామ్—కుర్వన్తు

ద్రౌపదీ : (సబాష్పమ్) యద్దేవ స్త్రిభువననాథో భణతి తత్కథ మన్యథా భవిష్యతి. (జం దేవో త్తిహుఅణ ణాహో భణాది తం కహం అణ్ణాహా భవిస్సది).

పాంచాలకః : న కేవల మియమాశీః. అసురనిషూదన స్యాదేశోఽపి.

యుధిష్ఠిరః : కో హి నామ భగవతా సందిష్టం వికల్పయతి. కః కోఽత్ర భోః.

(ప్రవిశ్య)

కంచుకీ : ఆజ్ఞాపయతు దేవః.

యుధిష్ఠిరః : దేవస్య దేవకీనందనస్య బహుమానాత్ వత్సస్య మే

---

యద్దేవ ఇతి :— (సబాష్పమ్ = బాష్పములతో), త్రిభువననాథః= ముల్లోకములకు ఏలికయైన, దేవః=శ్రీకృష్ణుడు, యత్=ఏది, భణతి=పల్కుచున్నాడో, తత్=అది, కథమ్=ఎట్లు, అన్యథా భవిష్యతి=వేరొక రీతిగా నగును? (అసత్యము కాబోదనుట).

న కేవలమితి :- ఇయమ్=ఇది, కేవలమ్=కేవలము, ఆశీః న= ఆశీస్సే కాదు, అసుర నిషూదనస్య=రాక్షసాంతకుడైన కృష్ణునియొక్క, ఆదేశః అపి=ఆజ్ఞయును.

కో హీతి :- భగవతా=భగవంతునిచేత, సందిష్టమ్=ఆదేశింపబడినదానిని, కో హి నామ వికల్పయతి = ఎవడు మాత్ర మాచరింపకుండును! చేయవలెనా మానవలెనా అను వికల్పములు తగవనుట. కః కోఽత్ర భోః=ఎవరక్కడ?

(ప్రవిశ్య=కంచుకి ప్రవేశించి)

ఆజ్ఞేతి :- దేవః=మహారాజు, ఆజ్ఞాపయతు=ఆజ్ఞాపించునుగాక.

దేవస్యేతి :- దేవకీనందనస్య=దేవకీ సుతుడైన, దేవస్య=శ్రీకృష్ణుని

విజయ మంగళాయ ప్రవర్త్యంతాం తదుచితాః సమారంభాః.

కంచుకీ : యథాజ్ఞాపయతి దేవః. (సోత్సాహం పరిక్రమ్య) భో భోః సంవిధాతౄణాం పురస్సరాః! యథా ప్రధాన మంతర్వేశ్మికాః, దౌవారికాశ్చ, ఏష ఖలు భుజబల పరిక్షేపోత్తీర్ణ కౌరవ పరిభవ సాగరస్య, నిర్వ్యూఢ దుర్వహ ప్రతిజ్ఞా భారస్య సుయోధనానుజ శతోన్మూలన ప్రభంజనస్య దుఃశాసనోరఃస్థల విదళన నరసింహస్య దుర్యోధనోరుస్తంభ భంగ వినిశ్చిత విజయస్య బలినః ప్రాభంజనేః వృకోదరస్య స్నేహ పక్షపాతినా మనసా మంగళాని కర్తుమాజ్ఞాపయతి దేవో యుధిష్ఠిరః.

---

యొక్క, బహుమానాత్=గౌరవము వలన, మే=నా యొక్క, వత్సస్య=చిరంజీవికి (భీమునికి), విజయ మంగళాయ=విజయోత్సవము కొరకు, తదుచితాః=దానికి తగిన, సమారంభాః=సంరంభ ప్రారంభములు, ప్రవర్త్యంతామ్=జరుపబడును గాక.

యథేతి :— దేవః=మహారాజు, యథా ఆజ్ఞాపయతి=ఆజ్ఞాపించినట్లే. (సోత్సాహం=సంతోషముతో, పరిక్రమ్య=రంగస్థలముపై నొకపెడకు నడిచి) భో భోః = ఓయోయీ!, సంవిధాతౄణామ్ = పురోహితులలో, పురస్సరాః= అగ్రగాములారా!, యథా ప్రధానమ్ = ప్రాధాన్యక్రమము నతిక్రమింపని, అంతర్వేశ్మికాః=అంతఃపుర సంచారులారా!, చ=మరియు, దౌవారికాః=ద్వార పాలకులారా!, భుజబల=బాహుబలమనునట్టి, పరిక్షేప=నౌకతో, ఉత్తీర్ణ=దాట బడిన, కౌరవ = కౌరవులచేనైన, పరిభవ=అవమానమనునట్టి, సాగరస్య= సముద్రము కలవాడును, నిర్వ్యూఢ=నెరవేర్పబడిన, దుర్వహ=అతి కఠినమైన, ప్రతిజ్ఞా భారస్య = ప్రతిజ్ఞా భారము కలవాడును, ఘోర ప్రతిజ్ఞను నెరవేర్చిన వాడనుట, సుయోధన=దుర్యోధనుని యొక్క, అనుజశత=తమ్ములు నూర్గురను,

(ఆకాశే) కిం బ్రూథ- సర్వతోఽధికతరమపి ప్రవృత్తం కిం నాలోకయసి ఇతి. సాధు పుత్రకాః సాధు. అనుక్త హితకారితా హి ప్రకాశయతి మనోగతాం స్వామి భక్తిమ్.

యుధిష్ఠిరః : ఆర్య జయంధర!

కంచుకీ : ఆజ్ఞాపయతు దేవః.

---

ఉన్మూలన=పెకలించుటయందు, ప్రభంజనస్య=పెనుగాలియైనవాడును, దుశ్శాసన=దుస్సేనునియొక్క, ఉరఃస్థల=వక్షఃప్రదేశమును, విదళన=చీల్చుటయందు, నరసింహస్య=నృసింహుడైనవాడును, దుర్యోధన=దుర్యోధనునియొక్క, ఊరు స్తంభ = స్తంభములవంటి తొడలను (తొడలనునట్టి స్తంభములను), భంగ=విరుగగొట్టుటతో, వినిశ్చిత=నిశ్చయింపబడిన, విజయస్య=విజయము కలవాడును, బలినః=బలవంతుడును, ప్రాభంజనేః=వాయుపుత్రుడును-అయిన-వృకోదరస్య=భీమునికి, మంగళాని = విజయోత్సవ సూచకములగు శుభాలంకరణములను, కర్తుమ్=చేయుటకు, ఏషః=ఈ, దేవః=మహారాజయిన, యుధిష్ఠిరః=ధర్మజుడు, స్నేహ పక్షపాతినా=వాత్సల్యముతో కూడిన, మనసా=మనస్సుతో, ఆజ్ఞాపయతి=ఆజ్ఞాపించుచున్నాడు. (ఆకాశే=ఆకాశమునందు విని, తెరవెనుకనుండి ఎవరో ఏదో అడుగుచున్నట్లు అభినయించి-దీనినే ఆకాశభాషితమందురు), కిం బ్రూథ=ఏమనుచున్నారు!, సర్వతః=అన్నివైపులను, అధికతరమ్=మిక్కుటముగా, ప్రవృత్తమ్=నిర్వహింపబడిన విజయోత్సవమును, న ఆలోకయసి కిమ్ ఇతి=చూడలేదా అనియా! (చూడవేమనియా!), పుత్రకాః=చిరంజీవులారా!, సాధు సాధు=బాగు బాగు. అనుక్త హితకారితా=చెప్పకయే హితముచేయుట, మనోగతామ్=మనస్సులోనున్న, స్వామిభక్తిమ్=ప్రభుభక్తిని, ప్రకాశయతి హి=ప్రకటించునుగదా!

ఆర్యేతి :- ఆర్య జయంధరుడా!

ఆజ్ఞాపయత్వితి :- దేవః=మహారాజు, ఆజ్ఞాపయతు=ఆజ్ఞాపించును గాక!

యుధిష్ఠిరః : గచ్ఛ ప్రియఖ్యాపకం పాంచాలకం పారితోషికేన పరితోషయ.

కంచుకీ : యదాజ్ఞాపయతి దేవః. (ఇతి పాంచాలకేన సహ నిష్క్రాంతః).

ద్రౌపదీ : మహారాజ, కిం నిమిత్తం పునర్నాథ భీమసేనేన స దురాచారో భణితః—పంచానా మప్యస్మాకం మధ్యే యేన తే రోచతే తేన సహ తే సంగ్రామో భవత్వితి. యది మాద్రీసుతయో రేకతరేణ సహ సంగ్రామస్తేన ప్రార్థితో భవేత్తతోఽత్యాహితం భవేత్. (మహారాఅ, కిం నిమిత్తం ఉణ ణాహ భీమసేణేణ సో దురాఆరో భణిదో—పంచాణం వి అహ్మాణం మజ్ఝే జేణ దే రోఅది తేణ సహ దే సంగామో హోదు త్తి. జఇ మద్దీసుదాణం ఏకదరేణ సహ సంగామో తేణ పత్థిదో భవే తదో అచ్చాహిదం భవే)

---

గచ్ఛేతి :— గచ్ఛ=వెడలుము, ప్రియఖ్యాపకమ్=ప్రియమైన వార్తను చెప్పిన, పాంచాలకమ్=ఈ పాంచాలకుని, పారితోషికేన=బహుమానముతో, పరితోషయ=సంతోషపెట్టుము.

యదితి :— దేవః = మహారాజు, యత్ ఆజ్ఞాపయతి=ఆజ్ఞాపించినట్లే (ఇతి = అని, పాంచాలకేన సహ=పాంచాలకునితో కలిసి, నిష్క్రాంతః= వెడలెను).

మహారాజేతి :— మహారాజా!, కిమ్ నిమిత్తమ్=ఎందుకోసమని, నాథ భీమసేనేన=నాథుడైన భీమునిచేత, సః=ఆ, దురాచారః=దుర్మార్గుడైన దుర్యోధనుడు, భణితః=చెప్పబడినాడు_అస్మాకమ్=మా, పంచానామ్ అపి మధ్యే= అయిదుగురిలో, యేన=ఎవనితో, తే=నీకు, సంగ్రామః=యుద్ధము, రోచతే=

యుధిష్ఠిరః : కృష్ణే, ఏవం మన్యతే జరాసంధఘాతీ. హత సకల సుహృద్బంధు వీరానుజ రాజన్యాసు కృప కృత వర్మాశ్వత్థామ శేషా స్వేకాదశసు అక్షౌహిణీ ష్వబాంధవః శరీరమాత్ర విభవః కదాచిదుత్సృష్ట నిజాభిమానో ధార్తరాష్ట్రః పరిత్యజే దాయుధం తపో వనం వా వ్రజేత్ సంధిం వా పితృముఖేన యాచేత. ఏవం సతి సుదూర మతిక్రాన్తః ప్రతిజ్ఞాభారో భవే త్సకలరిపు జయస్యేతి. సమరం ప్రతిపత్తుం పంచానామపి పాండవానా మేకస్యాపి నైవ క్షమః సుయోధనః. శంకే చాహం గదాయుద్ధం వృకోదర స్యైవానేన. అయి సుక్షత్రియే పశ్య—

---

ఇష్టమో, తేన సహ=వానితోనే, తే=నీకు, సంగ్రామః=యుద్ధము, భవతు=అగును గాక, ఇతి=అని—భీముడు దుర్యోధనునితో నేల పల్కెనని అన్వయము. పునః అనునది వాక్యాలంకారమునకే. మాద్రీసుతయోః=మాద్రి కుమారులిద్దరిలో, ఏక తరేణ సహ=ఏ ఒక్కనితోనో, తేన=వానిచేత, సంగ్రామః=యుద్ధము, ప్రార్థితః= కోరబడినది, భవేత్ యది=అయ్యెనేని, అత్యాహితమ్=మిక్కిలి భయంకరము, భవేత్=అయ్యియుండెడిది.

కృష్ణఇతి :— కృష్ణే = ఓ ద్రౌపదీ!, జరాసంధ ఘాతీ=జరాసంధుని సంహరించినవాడైన భీముడు, ఏవమ్=ఇట్లు, మన్యతే=భావింపబడుచున్నాడా!, ఏకాదశసు=పదునొకండైన, అక్షౌహిణీషు=అక్షౌహిణులు, హత=చంపివేయబడిన, సకల=సమస్తమైన, సుహృత్=మిత్రులు, బంధు=చుట్టములు, వీర=వీరులు, అనుజ=సోదరులు (లేక వీరులైన సోదరులు), రాజన్యాసు = సామంతరాజులు కలవియును, కృప=కృపాచార్యుడు, కృతవర్మ=కృతవర్మయు, అశ్వత్థామ= ద్రోణపుత్రుడు, శేషాసు=మాత్రమే మిగిలియున్నవియును, అగుచుండగా—లేక— అయిపోగా, అబాంధవః = బంధుహీనుడును, శరీరమాత్ర విభవః=శరీరము

క్రోధోద్గూర్ణగదస్య నాస్తి సదృశః సత్యం రణే మారుతేః
కౌరవ్యే కృతహస్తతా పునరియం దేవే యథా సీరిణి।
స్వస్త్యస్తూద్ధత ధార్తరాష్ట్ర నలినీ నాగాయ వత్సాయ మే
శంకే తస్య సుయోధనేన సమరం నైవేతరేషా మహమ్॥ 13

---

మాత్రమే సంపదగా మిగిలినవాడును, అయిన, ధార్తరాష్ట్రః = దుర్యోధనుడు, కదాచిత్=ఒకవేళ, ఉత్సృష్ట=విడిచిపెట్టిన, నిజాభిమానః=తన యభిమానము కలవాడై, ఆయుధమ్=గదను, పరిత్యజేత్=వదలునుగాక, వా=లేక, తపోవనమ్= తపోవనమును, వ్రజేత్=వెడలునుగాక (పొందునుగాక), వా=లేక, పితృముఖేన= తండ్రి ద్వారమున, సంధిమ్=పొందును, యాచేత=కోరునుగాక. ఏవం సతి= అట్లే అయినచో, సకల రిపుజయస్య = సమస్త శత్రువులను జయించుటకు అనునట్టి, ప్రతిజ్ఞాభారః=ప్రతిజ్ఞ చేసిన బరువు, సుదూరమ్=మిక్కిలి దవ్వుగా, అతిక్రాన్తః=లంఘింపబడినది, భవేత్=అగును. సమరమ్=యుద్ధమును, ప్రతి పత్తుమ్ = పొందుటకు, సుయోధనః = దుర్యోధనుడు, పంచానామ్ అపి = అయిదుగురైన, పాండవానామ్=పాండవులలో, ఏకస్య అపి=ఒకనికేని, క్షమః న ఏవ=చాలనే చాలడు. గదాయుద్ధమ్=గదాయుద్ధము, అనేన=వీనితో, వృకోదరస్య ఏవ=భీమునికే అని, అహమ్=నేను, శంకే=భావించుచున్నాను. అయి సుక్షత్రియే!=ఓ రాట్పుత్రీ!, పశ్య=చూడుము (విను మనుట)—

క్రోధేతి :— రణే క్రోధోద్గూర్ణగదస్య మారుతేః సదృశః న అస్తి, సత్యమ్; పునః దేవే సీరిణి యథా ఇయమ్ కృతహస్తతా, కౌరవ్యే (వర్తతే), ఉద్ధత ధార్తరాష్ట్ర నలినీ నాగాయ, మే, వత్సాయ, స్వస్తి, అస్తు, అహమ్, సుయోధనేన, తస్య, సమరమ్, శంకే, ఇతరేషామ్, నైవ.

**అర్థము** :- రణే = యుద్ధమునందు, క్రోధ = కోపముచేత, ఉద్గూర్ణ= పైకెత్తబడిన, గదస్య=గద కలవాడైన, మారుతేః=భీమునికి, సదృశః=సాటి వచ్చువాడు, న అస్తి=లేడు, సత్యమ్=ఇది వాస్తవము. పునః=కాని, దేవే= భగవంతుడైన, సీరిణి=బలరాముని యందు (బలరామునికి), యథా=ఏటువంటి,

(నేపథ్యే)

తృషితోఽస్మి భోస్తృషితోఽస్మి. సంభావయతు కశ్చిత్ సలిలచ్ఛాయా సంప్రదానేన మామ్.

---

ఇయమ్=ఈ గదావిషయకమైన, కృతహస్తతా=నేర్పరితనమున్నదో, కౌరవ్యే=దుర్యోధనునియందును, [తాదృశీ = అంతటిది, వర్తతే = కలదు]. ఉద్ధత=ఉద్దండుడైన, ధార్తరాష్ట్ర=కౌరవ్యుడనునట్టి, నళినీ=పద్మమునకు, నాగాయ=ఏనుగువంటివాడైన [పద్మలతను ఏనుగు భంజించుననుట], మే వత్సాయ=నా [తమ్మునికి] చిరంజీవికి, స్వస్తి=శుభము, అస్తు=అగుగాక. అహమ్=నేను, సుయోధనేన=దుర్యోధనునితో, తస్య=భీమునికి, సమరమ్=యుద్ధమును, శంకే=ఊహించుచున్నాను, ఇతరేషామ్ = తక్కిన పాండవులకు [దుర్యోధనునితో యుద్ధమును], న ఏవ=భావించుటలేదు.

సమాసములు :— క్రోధేన ఉద్గూర్ణా, క్రోధోద్గూర్ణా గదా యేన సః-తస్య. ఉద్ధతశ్చాసౌ ధార్తరాష్ట్రశ్చ, ఉద్ధత ధార్తరాష్ట్ర ఏవ నళినీ, ఉద్ధత ధార్తరాష్ట్ర నళిన్యై నాగః—తస్మై.

సంధులు :— క్రోధ+ఉద్గూర్ణ, నైవ+ఇతరేషామ్—గుణసంధులు. న+అస్తి, అస్తు+ఉద్ధత—సవర్ణదీర్ఘ. పునః+ఇయమ్—రేఫాదేశ. స్వస్తి+అస్తు—యణాదేశ. న+ఏవ—వృద్ధి. [శార్దూలవిక్రీడితము].

క్రియలు :— అస భువి-పరస్మై-లట్-ప్రః-అస్తి-స్తః-సన్తి
లోట్-ప్రః—అస్తు/స్తాత్—స్తామ్—సన్తు
శకిఙ్ శంకాయామ్—లట్—ఉత్తమ
శంకే—శంకావహే—శంకామహే

[నేపథ్యే=తెరవెనుక]

తృషితః అస్మి భోః తృషితః అస్మి=సంతోషించితినోయీ సంతోషించితిని. కశ్చిత్=ఎవడేని, సలిల=జలమును, ఛాయా=నీడను, సంప్రదానేన=ఇచ్చుట(ల)తో మామ్=నన్ను, సంభావయతు=గౌరవించునుగాక.

యుధిష్ఠిరః : (ఆకర్ణ్య) కః కోఽత్ర భోః.

(ప్రవిశ్య)

కంచుకీ : ఆజ్ఞాపయతు దేవః.

యుధిష్ఠిరః : జ్ఞాయతాం కిమేతత్!

కంచుకీ : యదాజ్ఞాపయతి దేవః. (ఇతి నిష్క్రమ్య పునః ప్రవిశ్య) దేవ క్షున్మా నతిథి రుపస్థితః.

యుధిష్ఠిరః : శీఘ్రం ప్రవేశయ.

కంచుకీ : యదాజ్ఞాపయతి దేవః. (ఇతి నిష్క్రాంతః)
(తతః ప్రవిశతి మునివేషధారీ చార్వాకో నామ రాక్షసః)

---

కఇతి :- [ఆకర్ణ్య=విని], కః కోఽత్ర భోః=ఎవరక్కడ!
[ప్రవిశ్య=కంచుకి ప్రవేశించి]

ఆజ్ఞేతి :- దేవః=మహారాజు, ఆజ్ఞాపయతు=ఆజ్ఞాపించునుగాక.

జ్ఞాయతామితి :- ఏతత్ = ఈ వినిపించుచున్నది, కిమ్=ఏమియో, జ్ఞాయతామ్=తెలియబడునుగాక. [తెలిసికొని రమ్మనుట]

యదితి :- దేవః = మహారాజు, యత్ ఆజ్ఞాపయతి=ఆజ్ఞాపించినట్లే. [ఇతి=అని, నిష్క్రమ్య=వెడలి, పునః=తిరిగి, ప్రవిశ్య=ప్రవేశించి], దేవ= మహారాజా!, క్షున్మాన్=ఆకలిగొన్న, అతిథిః=అతిథి, ఉపస్థితః=వచ్చియున్నాడు.

శీఘ్రమితి :- శీఘ్రమ్=వెంటనే, ప్రవేశయ=ప్రవేశపెట్టుము.

యదితి :- మహారాజు, యత్ ఆజ్ఞాపయతి=ఆదేశించినట్లే. [ఇతి= అని, నిష్క్రాంతః = వెడలెను]. [తతః = వెంటనే, మునివేషధారీ = ముని

రాక్షసః : (ఆత్మగతమ్) ఏషోఽస్మి చార్వాకో నామ రాక్షసః సుయోధనస్య మిత్రం పాండవాన్ వంచయితుం భ్రమామి. (ప్రకాశమ్) తృషితోఽస్మి. సంభావయతు మాం కశ్చిజ్జలచ్ఛాయా ప్రదానేన. (ఇతి రాజ్ఞః సమీప ముపసర్పతి).

(సర్వ ఉత్తిష్ఠన్తి)

యుధిష్ఠిరః : మునే అభివాదయే.

రాక్షసః : అకాలోఽయం సముదాచారస్య. జలప్రదానేన సంభావయతు మామ్.

---

వేషమును ధరించియున్న, చార్వాకః నామ = చార్వాకుడనునట్టి, రాక్షసః= రక్కసుడు, ప్రవిశతి=ప్రవేశించును].

ఏషఇతి :- [ఆత్మగతమ్ = తనలో], ఏషః అస్మి = ఇదిగో నేనే, చార్వాకః నామ=చార్వాకుడనునట్టి, రాక్షసః=రాక్షసుడను, సుయోధనస్య=దుర్యోధనునికి, మిత్రమ్=స్నేహితుడను, పాండవాన్=పాండవులను, వంచయితుమ్= మోసగించుటకు, భ్రమామి = తిరుగుచున్నాను. [ప్రకాశమ్ = ప్రకాశముగా], తృషితః అస్మి=దప్పికగొంటిని. కశ్చిత్=ఎవడేని, జల+ఛాయా+ప్రదానేన= నీరునీడల నిచ్చుటతో, మామ్=నన్ను, సంభావయతు=అనుగ్రహించుసుగాక. [ఇతి = అని, రాజ్ఞః=యుధిష్ఠిరునియొక్క, సమీపమ్=వద్దను, ఉపసర్పతి= సమీపించును]. [సర్వే=అందరును, ఉత్తిష్ఠన్తి=లేతురు]

మునేఇతి :- మునే=ఓ మునీ!, అభివాదయే=నమస్కరించుచున్నాను.

అకాలఇతి :- సముదాచారస్య=ఈ శిష్టాచారమునకు, అయమ్=ఇది, అకాలః=తగినసమయము కాదు. జలప్రదానేన=నీటినిచ్చుటతో, మామ్=నన్ను, సంభావయతు=గౌరవింతువుగాక (భవాన్ కర్తృ).

---

పుట 423 — తృషితోఽస్మి భో స్తృషితోఽస్మి = దప్పికగొంటినోయీ దప్పిక గొంటిని. ప్రమాదము క్షంతవ్యము.

యుధిష్ఠిరః : మునే ఇదమాసనమ్. ఉపవిశ్యతామ్.

రాక్షసః : (ఉపవిశ్య) నను భవతాపి క్రియతా మాసనపరిగ్రహః.

యుధిష్ఠిరః : (ఉపవిశ్య) కః కోఽత్ర భోః. సలిల ముపనయ.
(ప్రవిశ్య గృహీత భృంగారః)

కంచుకీ : (ఉపసృత్య) మహారాజ, శిశిర సురభి సలిల సంపూర్ణోఽయం భృంగారః పానభాజనం చేదమ్.

యుధిష్ఠిరః : మునే, నిర్వర్త్యతా ముదన్యాప్రతీకారః.

రాక్షసః : [పాదౌ ప్రక్షాల్య ఉపస్పృశన్ విచింత్య] భోః క్షత్రియ స్త్వమితి మన్యే.

---

మునేఇతి :— మునే=మౌనీ!, ఇదమ్=ఇదిగో ఇది, ఆసనమ్=ఆసనము. ఉపవిశ్యతామ్=కూర్చుండబడుగాక. కూర్చుండుమనుట.

నన్వితి :- (ఉపవిశ్య=కూర్చుండి) నను=మరి, భవతా అపి=నీచే గూడ, ఆసన పరిగ్రహః=ఆసన స్వీకారము, క్రియతామ్=చేయబడుగాక.

కఇతి :— (ఉపవిశ్య=కూర్చుండి) కః కోఽత్ర భోః = ఎవరక్కడ, సలిలమ్ = జలమును, ఉపనయ = తెమ్ము. (గృహీత భృంగారః=కలశము చేబూని, ప్రవిశ్య=ప్రవేశించి)

మహారాజఇతి :— (ఉపసృత్య=సమీపించి) మహారాజా!, శిశిర=చల్లనైన, సురభి=సుగంధిలమైన, సలిల=నీటితో, సంపూర్ణః=నిండినదైన, భృంగారః=గిన్నె, అయమ్=ఇదిగో, చ=మరియు, పానభాజనమ్=త్రాగుట కుపకరించు పాత్ర, ఇదమ్=ఇదిగో.

మునేఇతి :— మునే=మహర్షీ!, ఉదన్యా ప్రతికారః=దప్పికకు ప్రతిక్రియ, నిర్వర్త్యతామ్=నిర్వర్తింపబడుగాక. దప్పిక తీర్చుకొనుమనుట.

భోఇతి :- (పాదౌ=పాదములను, ప్రక్షాల్య=కడిగి, ఉపస్పృశన్=

యుధిష్ఠిరః : సమ్యగ్వేదీ భవాన్. క్షత్రియ ఏవాస్మి.

రాక్షసః : సులభశ్చ స్వజన వినాశః సంగ్రామేషు ప్రతిదినమతో నాదేయం భవద్భ్యో జలాదికమ్. భవతు. ఛాయ యైవానయా సరస్వతీ శిశిర తరంగ స్పృశా మరుతా చానేన విగతక్లమో భవిష్యామి.

ద్రౌపదీ : బుద్ధిమతికే, వీజయ మహర్షిమనేన తాలవృంతేన.
[బుద్ధిమదిఏ వీఏహి మహేసిం ఇమిణా తాలవింతేణ]

[చేటీ తథా కరోతి]

---

ఆచమించుచు, విచింత్య=ఆలోచించి) భోః=ఓయీ!, త్వమ్=నీవు, క్షత్రియః= క్షత్రియుడవు, ఇతి=అని, మన్యే=భావించుచున్నాను.

సమ్యగితి :- భవాన్=నీవు, సమ్యక్=బాగుగా, వేదీ=గ్రహించినవాడవు, సరిగనే ఊహించితివనుట. క్షత్రియః ఏవ=క్షత్రియుడనే, అస్మి=అయియుంటిని.

సులభఇతి :- సంగ్రామేషు = రణరంగములయందు, ప్రతిదినమ్= నిత్యమును, స్వజన వినాశః=బంధు నాశనము, సులభః=[మీకు] చేరువలోనిది, అతః = అందుచే, భవద్భ్యః = మీ క్షత్రియులనుండి, జలాదికమ్=ఉదకము మున్నగునది, న ఆదేయమ్ = స్వీకరింపదగినది కాదు. భవతు = అగుగాక. అనయా=ఈ, ఛాయయా=నీడతోను, చ=మరియు, సరస్వతీ=(సరస్వతీ) నది యొక్క, శిశిర=చల్లనైన, తరంగ=కెరటములను, స్పృశా=తాకునదైన, అనేన= ఈ, మరుతా=వాయువుచేతను, విగతక్లమః=పోగొట్టబడిన అలసట కలవాడను, భవిష్యామి=అవుదును.

బుద్ధీతి :- బుద్ధిమతికే=ఓ బుద్ధిమతికా!, అనేన=ఈ, తాలవృంతేన= వీవనతో, మహర్షిమ్=మునీశ్వరుని, వీజయ=వీచుము.

[చేటీ=చెలికత్తె, తథా=అట్లే, కరోతి=చేయును]

రాక్షసః : భవతి, అనుచితోఽయమస్మాసు సముదాచారః.

యుధిష్ఠిరః : మునే, కథయ కథమేవం భవాన్ పరిశ్రాంతః.

రాక్షసః : మునిజన సులభేన కౌతూహలేన తత్రభవతాం మహాక్షత్రియాణాం దంద్వయుద్ధమవలోకయితుం పర్యటామి సమంతపంచకమ్. అద్య తు బలవత్తయా శరదాతపస్యాపర్యాప్త మేవావలోక్య గదాయుద్ధమ్ అర్జున సుయోధనయో రాగతోఽస్మి.

(సర్వే విషాదం నాటయన్తి)

---

**భవతీతి** :- భవతి = ఓ గౌరవింపదగినదానా!, అయమ్ = ఈ, సముదాచారః=శిష్టాచారము, అస్మాసు=మాపట్ల, అనుచితః=తగనిది.

**మున ఇతి** :- మునే=మహర్షీ!, భవాన్=నీవు, ఏవమ్=ఇట్లు, కథమ్=ఏల, పరిశ్రాంతః=అలసినవాడవో, కథయ=చెప్పుము. ఇటకు వచ్చిన పని యేమనుట.

**మునిజనేతి** :- మునిజన=మౌనులకు, సులభేన=స్వభావసిద్ధమైన, కౌతూహలేన = కుతూహలముతో, తత్ర భవతామ్=గౌరవార్హులయిన, మహాక్షత్రియాణామ్ = మహారాజులయొక్క, ద్వంద్వయుద్ధమ్=ద్వంద్వయుద్ధమును, అవలోకయితుమ్ = చూచుటకు, సమంతపంచకమ్ = సమంతపంచకమును, పర్యటామి=గ్రుమ్మరుచుంటిని. అద్య తు=నేడు మాత్రము, శరదాతపస్య=శరత్కాలపు ఎండయొక్క, బలవత్తయా = ఆధిక్యముచేత, అర్జున సుయోధనయోః = అర్జున దుర్యోధనులయొక్క, గదాయుద్ధమ్ = గదాయుద్ధమును, అపర్యాప్తమ్ ఏవ=సగమువరకు మాత్రమే, అవలోక్య=చూచి, ఆగతః=వచ్చినవాడను, అస్మి=అయితిని. [సర్వే=అందరును, విషాదమ్=దుఃఖమును, నాటయన్తి=అభినయింతురు].

కంచుకీ : మునే, న ఖల్వేవమ్. భీమసుయోధనయోరితి కథయ.

రాక్షసః : ఆః! అవిదితవృత్తాంత ఏవ కథం మామాక్షిపసి.

యుధిష్ఠిరః : మహర్షే, కథయ కథయ.

రాక్షసః : క్షణమాత్రం విశ్రమ్య సర్వం కథయామి భవతో న పునరస్య వృద్ధస్య.

యుధిష్ఠిరః : కథయ కిమర్జున సుయోధనయోరితి.

రాక్షసః : నను పూర్వమేవ కథితం మయా ప్రవృత్తం గదాయుద్ధమితి.

---

మునేఇతి :- మునే=మహర్షీ!, ఏవమ్=ఇట్లు, న ఖలు=కాదు సుమీ! భీమ సుయోధనయోః=భీమ దుర్యోధనులకు [ద్వంద్వయుద్ధము], ఇతి=అని, కథయ=చెప్పుము.

ఆఃఇతి :- ఆః=ఆఁ!, అవిదిత వృత్తాంతః ఏవ = ఏమి జరిగినదో ఎరుగనివాడవయ్యు, మామ్=నన్ను, ఆక్షిపసి కథమ్=తప్పుపట్టుచున్నావా లేక సరిదిద్దుచున్నావా?

మహర్షేఇతి :- మహర్షే=ఓ మునీ!, కథయ కథయ=చెప్పు చెప్పుము.

క్షణమాత్రమితి :- క్షణమాత్రమ్=క్షణకాలము, విశ్రమ్య=సేదదేరి, సర్వమ్=సమస్తమును, భవతః=నీకు, కథయామి=తెల్పుదును. పునః=కాని, అస్య=ఈ, వృద్ధస్య=ముసలివానికి [కంచుకి] మాత్రము, న=కాదు. ఈతనికి మాత్రము చెప్పననుట.

కథయేతి :- కథయ=చెప్పుము, అర్జున సుయోధనయోః ఇతి కిమ్= అర్జునదుర్యోధనుల కనియా?

నన్వితి :- నను=అవును, పూర్వమ్ ఏవ=ఇంతకుముందే, మయా=

యుధిష్ఠిరః : న భీమ సుయోధనయోరితి.

రాక్షసః : వృత్తం తత్. (యుధిష్ఠిరో ద్రౌపదీ చ మోహ ముపగతౌ)

కంచుకీ : (సలిలేనాసిచ్య) సమాశ్వసితు దేవో దేవీ చ.

చేటీ : సమాశ్వసితు సమాశ్వసితు దేవీ. (సమస్ససదు సమస్ససదు దేవీ)

(ఉభౌ సంజ్ఞాం లభేతే)

యుధిష్ఠిరః : కిం కథయసి మునే, వృత్తం భీమ సుయోధనయో ర్గదాయుద్ధమితి?

---

నాచేత, కథితమ్=చెప్పబడినది, గదాయుద్ధమ్=[ఆ ఇరువురికి] గదాయుద్ధము, ప్రవృత్తమ్ ఇతి=ప్రారంభమైనదని.

నేతి :- భీమ సుయోధనయోః=భీమ దుర్యోధనులకు, న ఇతి=కాదని?

వృత్తమితి :- తత్ = అది [భీమ సుయోధనులకు గదాయుద్ధము] వృత్తమ్ = జరిగిపోయిన విషయము. [యుధిష్ఠిరః=ధర్మజుడు, ద్రౌపదీ చ= పాంచాలియు, మోహమ్ ఉపగతౌ=మూర్ఛపోయిరి].

సమాశ్వసిత్వితి :- [సలిలేన=జలముతో, ఆసిచ్య=జల్లి, నీరు జల్లి యనుట], దేవః=మహారాజు, సమాశ్వసితు=ఊరడిల్లునుగాక, చ=మరియు, దేవీ= మహారాజ్ఞి, సమాశ్వసితు=తేరుకొనుగాక.

చేటీ :- దేవీ=మహారాజ్ఞి, సమాశ్వసితు సమాశ్వసితు=ఊరడిల్లుగాకూర డిల్లుగాక.

ఉభౌ=ఇరువురును, సంజ్ఞామ్=తెలివిని, లభేతే=పొందుదురు]

కిమితి :- మునే=మహర్షీ!, కిమ్ కథయసి=ఏమి చెప్పుచుంటివి, భీమ

ద్రౌపదీ : భగవన్, కథయ కథయ కిం వృత్తమితి? (భఅవం కహేహి కహేహి కిం వుత్తం త్తి)

రాక్షసః : కంచుకిన్, కౌ పునరేతౌ?

కంచుకీ : బ్రహ్మన్ ఏష దేవో యుధిష్ఠిరః, ఇయమపి పాంచాల రాజ తనయా.

రాక్షసః : ఆః, దారుణముపక్రాంతం మయా నృశంసేన.

ద్రౌపదీ : హా నాథ భీమసేన! (ఇతి మోహముపగతా) (హా ణాహ భీమసేణ)

---

సుయోధనయోః=భీమ దుర్యోధనులకు, గదాయుద్ధమ్=గదాయుద్ధము, వృత్తమ్ ఇతి=జరిగిపోయినదనియా.

భగవన్నితి :- భగవన్=మహాత్మా!, కిమ్=ఏది, వృత్తమ్ ఇతి=జరిగిపోయినదో, కథయ కథయ=చెప్పు చెప్పుము.

కంచుకిన్నితి :- కంచుకీ, ఏతౌ = వీరిద్దరు, కౌ పునః = ఎవరు? [పునః వాక్యాలంకారము]

బ్రహ్మన్నితి :- విప్రుడా!, ఏషః=ఇతడు, దేవః=మహారాజయిన, యుధిష్ఠిరః=ధర్మరాజు, అపి=మరియు, ఇయమ్=ఈమె, పాంచాలరాజతనయా=ద్రౌపది.

ఆ ఇతి :- ఆః=అహో!, నృశంసేన=క్రూరుడనైన, మయా=నాచేత, దారుణమ్=కఠినమైన [ప్రసంగము], ఉపక్రాంతమ్=ప్రారంభింపబడినది.

హేతి :- హా నాథ భీమసేన=అయ్యో నాథా భీమసేనా!, [ఇతి=అని, మోహమ్=మూర్ఛను, ఉపగతా=పొందినది].

కంచుకీ : కిం నామ కథితమ్?

చేటీ : సమాశ్వసితు సమాశ్వసితు దేవీ. (సమస్ససదు సమస్ససదు దేవీ)

యుధిష్ఠిరః : (సాస్రమ్) బ్రహ్మన్!

పదే సందిగ్ధ ఏవాస్మిన్ దుఃఖమాస్తే యుధిష్ఠిరః।
వత్సస్య నిశ్చితే తత్త్వే ప్రాణత్యాగాదయం సుఖీ॥ 14

---

కిమితి :— కథితమ్=చెప్పబడినది, కిమ్ నామ=ఏమది, ఏమంటివనుట.

సమాశ్వసిత్వితి :— దేవీ=మహారాజ్ఞి, సమాశ్వసితు సమాశ్వసితు= ఊరడిల్లునుగా కూరడిల్లునుగాక!.

బ్రహ్మన్నితి :— [సాస్రమ్=కన్నీటితో] బ్రహ్మన్=ఓ విప్రుడా!

పదేఇతి :- అస్మిన్ సందిగ్ధే పదే ఏవ యుధిష్ఠిరః దుఃఖమ్ ఆస్తే; వత్సస్య తత్త్వే నిశ్చితే [సతి] అయమ్ ప్రాణత్యాగాత్ సుఖీ [భవిష్యతి].

అర్థము :- అస్మిన్=ఈ, సందిగ్ధే=సందేహాస్పదమైన, పదే ఏవ= మాటయందే, యుధిష్ఠిరః=ధర్మరాజు, దుఃఖమ్=దుఃఖము, ఆస్తే=కల్గుచున్నది. ధర్మజుడు దుఃఖమును పొందుచున్నాడనుట. వత్సస్య = బిడ్డయొక్క [భీముని యొక్క], తత్త్వే=సత్యస్థితి, నిశ్చితే [సతి]=స్పష్టపడినచో, అయమ్=ఈ యుధి ష్ఠిరుడు, ప్రాణత్యాగాత్ = అసువులుబాయుట వలన, సుఖీ = దుఃఖవిముక్తుడు, [భవిష్యతి=కాగలడు]. భీముడు మరణించుటే జరిగినచో నేను జీవించియుండ ననుట.

ఛందస్సు :- పథ్యావక్త్రము. [చూ. పుట-63]

సమాసము :- ప్రాణానాం త్యాగః—ప్రాణత్యాగః—తస్మాత్.

రాక్షసః : (సానందమాత్మగతమ్) అత్రైవ మే యత్నః. (ప్రకాశమ్) యది త్వవశ్యం కథనీయం తథా సంక్షేపతః కథయామి. న యుక్తం బంధు వ్యసనం విస్తరేణావేదయితుమ్.

యుధిష్ఠిరః : (అశ్రూణి ముంచన్)

సర్వథా కథయ బ్రహ్మన్ సంక్షేపాద్విస్తరేణ వా
వత్సస్య కిమపి శ్రోతుమేష దత్తః క్షణో మయా॥ 15

---

సంధులు :— సందిగ్ధే+ఏవ—అయవాదేశసంధి—సందిగ్ధయ్+ఏవ—యవలోపసంధి. ఏవ+అస్మిన్—సవర్ణదీర్ఘసంధి.

క్రియ :— ఆసజ్ ఉపవేశనే, ఆత్మనే, లట్, ప్రథమ
ఆస్తే—ఆసాతే—ఆసతే; ఆస్సే—ఆసాథే—ఆధ్వే;
ఆసే—ఆస్వహే—ఆస్మహే.

అత్రైవేతి :- (సానందమ్=సంతోషముతో, ఆత్మగతమ్=తనలో) మే=నాయొక్క, యత్నః=ప్రయత్నము, అత్ర ఏవ=ఈ విషయమునందే. ధర్మజుని ప్రాణత్యాగమునందే అనుట. [ప్రకాశమ్=ప్రకాశముగా], అవశ్యమ్=తప్పక, కథనీయమ్=చెప్పవలసినది, యది తు=అయినచో, తథా=అట్లే[సరే], సంక్షేపతః=సంగ్రహముగా, కథయామి=చెప్పుదును. బంధు వ్యసనమ్=అయినవారి ఆపద, విస్తరేణ = సవిస్తరముగా [వివరములతో], ఆవేదయితుమ్ = చెప్పుట, న యుక్తమ్=తగదు.

సర్వథేతి :- [అశ్రూణి=కన్నీటిని, ముంచన్=విడుచుచు], బ్రహ్మన్, సంక్షేపాత్ వా విస్తరేణ వా సర్వథా కథయ, వత్సస్య కిమపి శ్రోతుమ్ ఏషః క్షణః మయా దత్తః.

అర్థము :- బ్రహ్మన్=ఓ విప్రుడా!, సంక్షేపాత్ వా=సంగ్రహముగానో,

రాక్షసః : శ్రూయతామ్.

తస్మిన్ కౌరవభీమయో ర్గురుగదాఘోరధ్వనౌ
సంయుగే

ద్రౌపదీ : [సహసోత్థాయ] తతస్తతః. [తదో తదో]

రాక్షసః : [స్వగతమ్] కథం పునరనయోర్లబ్ధసంజ్ఞతామపనయామి!

సీరీ సత్వరమాగతశ్చిర మభూత్తస్యాగ్రత స్సంగరః।

---

విస్తరేణ వా = విపులముగానో, సర్వథా=ఏదోవిధముగా, కథయ=చెప్పుము. వత్సస్య=భీముని యొక్క, కిమ్ అపి=ఏదయినను, భీమునికి సంబంధించిన ఏ దుర్వార్తనైనను అనుట, శ్రోతుమ్=వినుటకు, ఏషః=ఈ, క్షణః=క్షణకాలము, మయా=నాచేత, దత్తః=సమర్పితము.

శ్రూయతామ్ :— వినుము.

తస్మిన్నితి :- కౌరవభీమయోః, గురుగదా ఘోరధ్వనౌ, తస్మిన్, సంయుగే, [ప్రవర్తితే సతి] సీరీ సత్వరమ్ ఆగతః, తస్య అగ్రతః సంగరః చిరమ్, అభూత్, తు హలినా ప్రియశిష్యరామ్ ఆలంబ్య రహసి సంజ్ఞా ఆహితా, యామ్ ఆసాద్య కురూత్తమః దుశ్శాసనారా ప్రతికృతిమ్ గతః.

అర్థము :— కౌరవభీమయోః = దుర్యోధన భీములకు నడుమ, గురు= పెద్దవయిన, గదా=గదల యొక్క, ఘోర=భయంకరమైన, ధ్వనౌ=చప్పుడుతో కూడిన, తస్మిన్=ఆ, సంయుగే=యుద్ధము [ప్రవర్తితే సతి=జరుగుచుండగా]—

తత ఇతి :- (సహసా = హఠాత్తుగా, ఉత్థాయ = లేచి) తతః తతః= తరువాత.

కథమితి :- [స్వగతమ్=తనలో] అనయోః=ఈ ఇరువురికి, లబ్ధ సంజ్ఞతామ్=స్పృహను, కథమ్=ఎట్లు, పునః=తిరిగి, అపనయామి=పోగొట్ట గలను! [పై శ్లోకము నడుమ సంభాషణ కొనసాగుచున్నది].

అలంబ్య ప్రియశిష్యతాం తు హలినా సంజ్ఞా
రహస్యాహితా
యామాసాద్య కురూత్తమః ప్రతికృతిం దుఃశాసనారా
గతః॥ 16

---

అర్థము :— సీరీ=బలరాముడు, సత్వరమ్=శీఘ్రముగా, ఆగతః=వచ్చెను. తస్య = అతనియొక్క, అగ్రతః=ఎదుట, సంగరః=యుద్ధము, చిరమ్ = చాలసేపు, అభూత్ = జరిగెను. తు=కాని, హలినా=బలరామునిచేత, ప్రియశిష్యతామ్=శిష్యప్రేమను, ఆలంబ్య=ఆశ్రయించి, రహసి=గుట్టుగా, సంజ్ఞా=సంకేతము, ఆహితా=ఉపదేశింపబడినది. యామ్=ఏది ఉపదేశింపబడెనో, తామ్=దానిని, ఆసాద్య=పొంది, కురూత్తమః=దుర్యోధనుడు, దుశ్శాసనారౌ=దుశ్శాసన సంహారకుడగు భీమునిపట్ల, ప్రతికృతిమ్=ప్రతీకారమును, గతః=పొందెను. చెల్లించుకొనెననుట. (శార్దూలము)

సమాసములు :— కౌరవశ్చ భీమశ్చ—తయోః. గుర్వ్యౌ చ తే గదే చ—గురుగదే, ఘోరశ్చాసౌ ధ్వనిశ్చ—ఘోరధ్వనిః, గురుగదయోః ఘోరధ్వనిః యస్మిన్ సః—గురుగదాఘోరధ్వనిః-తస్మిన్. [సీరమ్ అస్యాస్తీతి-సీరీ—సీరిణౌ—సీరిణః] త్వరయా సహితమ్-సత్వరమ్. ప్రియః శిష్యః యస్య సః. ప్రియశ్చాసౌ శిష్యశ్చేతి వా ప్రియశిష్యస్య భావః—తామ్. [హల మస్యాస్తీతి—హలీ, తేన] కురుషు ఉత్తమః. దుశ్శాసనః అరిః యస్య సః—తస్మిన్.

సంధులు :- భీమయోః+గురు-రేఫాదేశవిసర్గసంధి. ఆగతః+చిరమ్—శషసాదేశ. తస్య+అగ్రతః, కురు+ఉత్తమః, దుశ్శాసన+అరౌ—సవర్ణదీర్ఘ. రహసి+ఆహితః—యణాదేశ.

క్రియ :— భూ సత్తాయామ్, లుఙ్, పరస్మై, ప్రథమ
అభూత్—అభూతామ్—అభూవన్.

యుధిష్ఠిరః : హా వత్స వృకోదర. [ఇతి మోహాముపగతః]

ద్రౌపదీ : హా నాథ భీమసేన, హా మమ పరిభవ ప్రతీకార పరిత్యక్తజీవిత, జటాసుర బక హిడింబ కిర్మీర కీచక జరాసంధ నిషూదన, సౌగంధికాహరణ చాటుకార, దేహి మే ప్రతివచనమ్. [ఇతి మోహాముపగతా] [హా ణాహ, భీమసేణ, హా మమ పరిభవ పడిఆర పరిచ్చత్త జీవిఅ, జడాసుర బఅ హిడింబ కిమ్మీర కీచక జరాసంధ ణిసూదణ, సోఅంధిఆహరణ చాటుఆర, దేహి మే పడివఅణమ్]

కంచుకీ : [సాస్రమ్] హా కుమార భీమసేన, ధార్తరాష్ట్ర కుల కమలినీ ప్రాలేయవర్ష. [ససంభ్రమమ్] సమాశ్వసితు మహారాజః. భద్రే, సమాశ్వాసయ స్వామినీమ్. మహార్షే, త్వమపి తావదాశ్వాసయ మహారాజమ్.

---

హా వత్సేతి :— హా = అయ్యో!, వత్స=బిడ్డా, వృకోదర=భీముడా!, [ఇతి=అని, మోహమ్=మూర్ఛను, ఉపగతః=పొందెను].

హా నాథేతి :— హా=అయ్యో!, నాథ = పెనిమిటీ!, భీమసేన=భీమసేనుడా!, హా=అయ్యో!, మమ=నాయొక్క, పరిభవ=అవమానమునకు, ప్రతీకార=ప్రతీకారము చేయుటకు, పరిత్యక్త=విడువబడిన, జీవన=ప్రాణములుగలవాడా!, జటాసుర=జటాసురుని, బక=బకాసురుని, హిడింబ=హిడింబుని, కిర్మీరుని, కీచకుని, జరాసంధుని, నిషూదన = చంపినవాడా!, సౌగంధిక+ఆహరణ=సౌగంధికపుష్పమును తెచ్చుటతో, చాటుకార=నాకు ప్రియము చేసినవాడా!, మే=నాకు, ప్రతివచనమ్ దేహి = బదులు పల్కుము. [ఇతి = అని, మోహమ్ ఉపగతా=మూర్ఛపోయినది].

హా కుమారేతి :— అయ్యో కుమార భీమసేనుడా!, [సాస్రమ్ =

రాక్షసః : [స్వగతమ్] ఆశ్వాసయామి ప్రాణాన్ పరిత్యాజయితుమ్. [ప్రకాశమ్] భో భీమాగ్రజ, క్షణమేక మాధీయతాం సమాశ్వాసః. కథాశేషోఽస్తి.

యుధిష్ఠిరః : [సమాశ్వస్య] మహర్షే, కిమస్తి కథాశేషః.

ద్రౌపదీ : [ప్రతిబుధ్య] భగవన్, కథయ కీదృశః కథాశేష ఇతి. (భఅవం కహేహి కీదిసో కహాసేసోత్తి).

కంచుకీ : కథయ కథయ.

---

కన్నీటితో]; ధార్తరాష్ట్ర కుల = కౌరవవంశమనునట్టి, కమలినీ=పద్మలతకు, ప్రాలేయవర్ష=మంచువానవంటివాడా!, [ససంభ్రమమ్=సంభ్రమముతో], మహారాజః=మహారాజు, సమాశ్వసితు=ఊరడిల్లుగాక. భద్రే=ఓ చేటీ!, స్వామినీమ్=మహారాజ్ఞిని, సమాశ్వాసయ=ఊరడిల్లజేయుము. మహర్షే=ఓ మునీశ్వరా!, త్వమ్ అపి=నీవుకూడ, మహారాజమ్=మహారాజును, సమాశ్వాసయ=ఊరడిల్ల జేయుము. [తావత్—వాక్యాలంకారము].

ఆశ్వాసయామీతి :— [స్వగతమ్=తనలో] ప్రాణాన్=అసువులను, పరిత్యాజయితుమ్ = పోగొట్టుటకొఱకు, ఆశ్వాసయామి = ఊరడిల్లజేయుదును. [ప్రకాశమ్=ప్రకాశముగా], భో భీమాగ్రజ=ఓ భీముని అన్నా!, ఏకమ్ క్షణమ్=ఒకేఒక్క క్షణముసేపు, సమాశ్వాసః=ధైర్యము (ఊరట), ఆధీయతామ్=ధరింపబడుగాక. నిమేష మూరడిల్లుమనుట. కథాశేషః=చెప్పవలసిన వృత్తాంతమున మిగులు, అస్తి=ఉన్నది.

మహర్షే ఇతి :- (సమాశ్వస్య = తేరుకొని) మహర్షీ; కథాశేషః = కొఱవ, కిమ్ అస్తి=ఏమున్నది.

భగవన్నితి - భగవన్=మహాత్మా! కథాశేషః=మిగులు, కీదృశః ఇతి=ఎట్టిదో, కథయ=తెల్పుము.

కథయేతి :— కథయ కథయ=చెప్పుము చెప్పుము.

రాక్షసః : తతశ్చ హతే తస్మిన్ సుక్షత్రియే వీరసులభాం గతి ముపగతే సమగ్ర సంగలితం భ్రాతృవధ శోకజం బాష్పం ప్రమృజ్య భ్రాతృవధశోకా దపహాయ గాండీవం ప్రత్యగ్ర క్షతజచ్ఛటా చర్చితాం తామేవ గదాం భ్రాతృహస్తాదాకృష్య నివార్యమాణోఽపి సంధిత్సునా వాసుదేవేన ఆగచ్ఛాగచ్ఛేతి సోపహాసం భ్రమిత గదా ఝుంకార మూర్ఛిత గంభీర వచన ధ్వనినాహూయమానః కౌరవరాజేన తృతీయోఽనుజస్తే కిరీటీ యోద్ధుమారబ్ధః. అకృతినస్తస్య గదాఘాతాత్ నిధన ముత్ప్రేక్షమాణేన కామపాలేన అర్జున పక్షపాతీ దేవకీసూనుః అతిప్రయత్నాత్ స్వరథ మారోప్య ద్వారకాం నీతః.

---

తతశ్చేతి :— తతశ్చ=అటుతరువాత, తస్మిన్=ఆ, సుక్షత్రియే=రాజకుమారుడగు భీముడు, వీర సులభామ్=మహావీరులకు లభించునట్టి, గతిమ్=అవస్థను, ఉపగతే=పొందగా, భ్రాతృ వధ శోకజమ్=అగ్రజుని మృతి వలని దుఃఖముతో పొడమినదియు, సమగ్ర సంగలితమ్=సమగ్రముగా స్రవించునదియు నైన, బాష్పమ్=కన్నీటిని, ప్రమృజ్య=తుడుచుకొని, భ్రాతృ వధ=అగ్రజుని హననము వలన పుట్టిన, శోకాత్=దుఃఖము వలన, గాండీవమ్=గాండివమును, అపహాయ=విడిచి, ప్రత్యగ్ర=క్రొత్తయయిన, క్షతజ+ఛటా=రక్తధారలతో, చర్చితామ్=పులుమబడిన, తామ్ ఏవ=అదే, గదామ్=గదను, భ్రాతృ=అన్న యొక్క, హస్తాత్=చేతినుండి, ఆకృష్య=లాగుకొని, సంధిత్సునా=పొందొనరింప గోరువాడైన, వాసుదేవేన=శ్రీకృష్ణునిచే, నివార్యమాణః అపి=వారింపబడుచున్న వాడయ్యును; ఆగచ్ఛ ఆగచ్ఛ ఇతి=రమ్ము రమ్మని, సోపహాసమ్=ఎకసక్కెముగా; భ్రమిత=త్రిప్పబడుచున్న, గదా=గదయొక్క, ఝుంకార=ధ్వనితో, మూర్ఛిత=కప్పివేయబడిన, గంభీర=గంభీరమైన, వచన=వాక్కుయొక్క, ధ్వనినా=సవ్వడి కలవాడయిన, కౌరవరాజేన=దుర్యోధనునితో, ఆహూయమానః=పిలువబడుచున్న

యుధిష్ఠిరః : సాధు, భో అర్జున, తదైవ ప్రతిపన్నా వృకోదరపదవీ గాండీవం పరిత్యజతా. అహం పునః కేనోపాయేన ప్రాణాపగమమహోత్సవ ముత్సహిష్యే.

ద్రౌపదీ : హా నాథ భీమసేన, న యుక్తమిదానీం తే కనీయాంసం భ్రాతరమశిక్షితం గదాయాం దారుణస్య శత్రోరభి ముఖం గచ్ఛన్తముపేక్షితుమ్. [మోహముపగతా] [హా ణాహ భీమసేణ, ణ జుత్తం దాణిం దే కణీఅసం భాదరం అసిక్ఖిదం గదాఏ దారుణస్స సత్తుణో అహి ముహం గచ్ఛన్తం ఉవేక్ఖిదుమ్]

---

వాడై, తే=నీయొక్క, తృతీయః=మూడవవాడైన, అనుజః=తమ్ముడగు, కిరీటీ= అర్జునుడు, యోద్ధుమ్=యుద్ధము చేయుటకు, ఆరబ్ధః=మొదలిడెను. గదా ఘాతాత్= దుర్యోధనుని గదయొక్క దెబ్బతో, అకృతినః=గదాయుద్ధమున నేర్పరికానట్టి, తస్య=అర్జునునియొక్క, నిధనమ్=మృతిని, ఉత్ప్రేక్షమాణేన=ఊహించువాడైన, కామపాలేన=బలరామునితోసహ, అర్జున పక్షపాతీ=కిరీటిపట్ల మొగ్గుచూపునట్టి, దేవకీసూనుః=శ్రీకృష్ణుడు, అతిప్రయత్నాత్=మిక్కిలి ప్రయత్నమున, రథమ్= రథమును, ఆరోప్య=ఎక్కించుకొని, ద్వారకామ్=ద్వారకాపట్టణము నుద్దేశించి, (పత్తనమునకనుట), నీతః=(అర్జునుడు) కొనిపోబడెను.

సాధ్వితి :- భో అర్జున = ఓయీ అర్జునుడా!, సాధు = లెస్స లెస్స. గాండీవమ్=గాండీవమును, పరిత్యజతా=విడిచిపెట్టువాడవైన నీచేత, తదా ఏవ= ఆ క్షణమునందే, వృకోదర పదవీ=భీముడేగిన స్థానము (మృతి), ప్రతిపన్నా= స్వయముగా పొందబడినది. పునః=మరి, అహమ్=నేను, కేన ఉపాయేన=ఏ ఉపాయముతో, ప్రాణాపగమ మహోత్సవమ్ = అసువులు వీడు పండువును, ఉత్సహిష్యే=అభిలషింతును.

హా నాథేతి :- హా=అయ్యో! నాథ! భీమసేన=పెనిమిటీ! భీమసేనుడా!, గదాయామ్ = గదాయుద్ధమునందు, అశిక్షితమ్ = నేర్పరికానట్టి, కనీయాంసమ్

రాక్షసః : తతశ్చాహమ్.

యుధిష్ఠిరః : భవతు మునే, కిమతః పరం శ్రుతేన, హా తాత భీమసేన, కాంతారవ్యసన బాంధవ, హా మచ్ఛరీర స్థితి విచ్ఛేదకాతర, జతుగృహ విపత్సముద్ర తరణయానపాత్ర, హా కిర్మీర హిడింబాసుర జరాసంధ విజయైకమల్ల, హా కీచక సుయోధనానుజ కమలినీ కుంజర, హా ద్యూత పణప్రణయిన్, హా మదాజ్ఞా సంపాదక, హా కౌరవ వన దావానల

---

భ్రాతరమ్ = చిన్న తమ్ముని; దారుణస్య=కఠినుడైన, శత్రోః=శత్రువుయొక్క (దుర్యోధనుని), అభిముఖమ్=సమక్షమునకు, గచ్ఛన్తమ్=పోవుచున్నవానిని, ఉపేక్షితుమ్=పట్టించుకొనకుండుట (వారింపకుండుట), తే=నీకు, ఇదానీమ్=ఇప్పట్టున, న యుక్తమ్=ఉచితము కాదు. (ఇతి=అని, మోహమ్ ఉపగతా=మూర్ఛిల్లెను).

తత ఇతి :- తతః చ=అటుపిమ్మట, అహమ్=నేను—

భవత్వితి :- మునే=మహర్షీ!, భవతు=చాలు. అతఃపరమ్=ఇంతకుపైని, శ్రుతేన = వినుటతో, కిమ్=ఏమి? ఇకపై కథ విననవసరము లేదనుట. హా=అయ్యో!, తాత=బిడ్డా!, భీమసేన=భీముడా!, కాంతార వ్యసన=వనవాసపు కష్టములయందు, బాంధవ = సహాయముచేసినవాడా!, హా = అయ్యో, మత్=నాయొక్క, శరీర=తనువుయొక్క, స్థితి=అస్తిత్వముయొక్క, విచ్ఛేద=విచ్ఛేదమువలన, కాతర=భయపడువాడా!, నేను శరీరము విడుతునన్నపుడు భీతిజెందినవాడా! అనుట; జతుగృహ=లాక్షాగృహమునందైన, విపత్=ఆపదయనునట్టి, సముద్ర=సముద్రమును, తరణ=దాటుపట్టున, యానపాత్ర=నావయైనవాడా!; హా=అయ్యో, కిర్మీరుడు, జరాసంధుడు, హిడింబాసురులను, విజయ=జయించినట్టి, ఏకమల్ల=అద్వితీయ మల్లుడా!, హా!, కీచక=కీచకుడనునట్టియు, సుయోధనానుజ=దుశ్శాసనుడనునట్టియు, కమలినీ = తామరతీగలకు, కుంజర=ఏనుగయినవాడా!, హా=

నిర్లజ్జస్య దురోదరవ్యసనినో వత్స త్వయా సా తదా
భక్త్యా మే సమదద్విపాయుతబలేనాంగీకృతా దాసతా।
కిం నామాపకృతం మయాధిక మతస్త్వయ్యద్య యద్గమ్యతే
త్యక్త్వా నాథమబాంధవం సపది మాం ప్రీతిః క్వ తే సాఽధునా॥ 17

---

అయ్యో!, ద్యూత = జూదమునందు, పణ=నేను గెల్చుకొన్న పణముపట్ల, ప్రణయిన్=ఇష్టపడువాడా! ద్యూతపణముగానుండుటకు (ఒడ్డబడుటకు) అంగీకరించువాడా! అనియును. మత్=నాయొక్క, ఆజ్ఞా=ఆనతులను, సంపాదక=నెరవేర్చువాడా!, హా=అయ్యో!, కౌరవ=ధార్తరాష్ట్రులనునట్టి, వన=అరణ్యమునకు, దావానల=దవానలమువంటివాడా!

నిర్లజ్జస్యేతి .— హే వత్స!, దురోదర వ్యసనినః, నిర్లజ్జస్య మే, భక్త్యా, సమదద్విపాయుత బలేన, త్వయా, తదా, సా, దాసతా, అంగీకృతా, అద్య, మయా, త్వయి, అతః, అధికమ్, కిమ్ నామ, అపకృతమ్, యత్, మామ్, అనాథమ్, అబాంధవమ్, సపది, త్యక్త్వా, గమ్యతే, అధునా, తే, సా, ప్రీతిః, క్వ.

**అర్థము :-** హే వత్స=ఓ బిడ్డా!, దురోదర వ్యసనినః=జూదమాడు దురభ్యాసము కలవాడను, నిర్లజ్జస్య=సిగ్గులేనివాడనునైన, మే=నాకు, భక్త్యా=శ్రద్ధతో;—సమద=మదముతోకూడిన, ద్విప=ఏనుగులయొక్క, అయుత=పది వేలతో సమానమైన, బలేన=శక్తికలవాడవైన, త్వయా=నీచేత, తదా=అప్పుడు, సా=అటువంటి, దాసతా = సేవకత్వము, అంగీకృతా=అంగీకరింపబడినది. అద్య=నేడు, మయా=నాచేత, త్వయి=నీపట్ల, అతః=అంతకంటె, అధికమ్=మిక్కుటముగా, కిమ్ నామ=ఏమది, అపకృతమ్=అపకారము చేయబడినది?, యత్=ఏలననగా, మామ్ = నన్ను, అనాథమ్=(రక్షకుడు) దిక్కులేనివానిని, అబాంధవమ్ = చుట్టములులేనివానిని, సపది=హఠాత్తుగా, త్యక్త్వా=విడిచి, గమ్యతే=(నీచే) పోబడుచున్నది. విడిచిపోయితివనుట. అధునా=ప్రస్తుతము, తే=నీయొక్క, సా=అలనాటిదైన, ప్రీతిః=ఆ ప్రేమ, క్వ (గతా)=ఎటకు పోయినది? ఆనాటి భక్తిరక్తులు ఏమయినవనుట. (శార్దూలము).

ద్రౌపదీ : [సంజ్ఞాముపలభ్యోత్థాయ చ] మహారాజ, కిమేత ద్వర్తతే. (మహారాఅ, కిం ఎవ్వం వట్టఇ).

యుధిష్ఠిరః : కృష్ణే. కిమన్యత్ —

---

సమాసములు :- నిర్గతా లజ్జా యస్య సః—నిర్లజ్జః—తస్య. దుష్టమ్ ఉదరమ్ యస్య తత్—దురోదరమ్ (పణే ద్యూతే దురోదరమ్) వ్యసనమ్ యస్య విద్యతే సః—దురోదర వ్యసనిన్)—తస్య. మదేన సహితాః—సమదాశ్చ తే ద్విపాశ్చ—సమద ద్విపానామ్ అయుతమ్—సమద ద్విపాయుతస్య బలమివ బలం యస్య సః—సమద ద్విపాయుత బలః—తేన. న నాథః యస్య సః—అనాథః—తమ్. న విద్యంతే బాంధవాః యస్య సః—అబాంధవః—తమ్.

సంధులు :- వ్యసనినః+వత్స-ఉత్వాదేశవిసర్గసంధి. ద్విప+అయుత, బలేన+అంగీకృతా, నామ+అపకృతమ్, మయా+అధిక, త్యక్త్వా+అనాథ, సా+ఆధునా-సవర్ణదీర్ఘ. అతః+త్వయి-సాదేశవిసర్గ. త్వయి+అద్య-యణాదేశసంధి.

క్రియ :- గమ్లృ గతౌ—కర్మణి, ఆత్మనే, లట్, ప్రథమ

గమ్యతే—గమ్యేతే—గమ్యన్తే. (శార్దూలము)

అలంకారము :- నిర్లజ్జస్య, దురోదర వ్యసనినః, అనాథమ్, అబాంధవమ్ అను విశేషణములు ధర్మజునిపట్లను, సమదద్విపాయుత బలేన, దాసతా అనునవి భీమునివట్లను సాభిప్రాయములగుటచే నిందు పరికరాలంకారము. "అలంకారః పరికరః సాభిప్రాయే విశేషణే".

మహారాజేతి :- (సంజ్ఞామ్=స్మృతిని, ఉపలభ్య=పొంది, చ= మరియు, ఉత్థాయ=లేచి) మహారాజా, కిమ్ ఏతత్ వర్తతే=ఏమి జరుగుచున్నది.

కృష్ణేఇతి :- కృష్ణే=ద్రౌపదీ, అన్యత్ కిమ్=వేరేయేమున్నది!—

స కీచకనిషూదనో బక హిడింబ కిర్మీరహా
మదాంధ మగధాధిప ద్విరద సంధి భేదాశనిః।
గదాపరిఘశోభినా భుజయుగేన తేనాన్వితః
ప్రియస్తవ మమానుజోఽర్జునగురుర్గతోఽస్తం కిల॥ 18

---

స కీచకేతి :- కీచక నిషూదనః, బక హిడింబ కిర్మీరహా, మదాంధ మగధాధిప ద్విరద సంధిభేదాశనిః, గదాపరిఘశోభినా తేన భుజయుగేన, అన్వితః తవ, ప్రియః, మమ అనుజః, అర్జునగురుః, అస్తమ్ గతః కిల.

**అర్థము** :- కీచక నిషూదనః = కీచకుని సంహరించినవాడును, బక–హిడింబ–కిర్మీరహా = బక హిడింబ కిర్మీరులను చంపినవాడును, (కిర్మీరుడు బకాసురుని తమ్ముడు), మదాంధ=గర్వాంధుడైన, మగధాధిప=జరాసంధుడనునట్టి, ద్విరద=ఏనుగుయొక్క, సంధి=కీళ్ళను, భేద=ఎడలించునట్టి, అశనిః=పిడుగు వంటివాడును, గదా పరిఘ=పరిఘ వంటి (ఆయుధ విశేషము, అర్గళము) గదతో, శోభినా = ప్రకాశించునట్టి, తేన = ఆ ప్రసిద్ధమయిన, భుజయుగేన = బాహువుల జంటతో, అన్వితః = కూడినవాడును, తవ=నీకు, ప్రియః=ఇష్టుడును, నాథుడు ననుట, మమ=నాకు, అనుజః=తమ్ముడును, అర్జునగురుః=కిరీటికి అగ్రజుడును (అయిన భీముడు), అస్తం గతః కిల=అస్తమించినాడట! (వార్తా సంభావ్యయోః కిల)

**సమాసములు** :- కీచకస్య నిషూదనః, బకశ్చ హిడింబశ్చ కిర్మీరశ్చ-బక హిడింబ కిర్మీరాన్ హన్తీతి–బక హిడింబ కిర్మీరహా. మదేన అంధః–మగధానాం (రాజ్యానామ్) అధిపః. మదాంధశ్చాసౌ మగధాధిపశ్చ. మదాంధ మగధాధిప ఏవ ద్విరదః. మధాంధ....ద్విరదస్య సంధయః. మదాంధ.... సంధీనాం భేదః....భేదే అశనిః. గదా పరిఘ ఇవ (ఉపమితం వ్యాఘ్రాదిభి స్సామాన్యాప్రయోగే) గధాపరిఘేన శోభత ఇతి–శోభిన్–తేన. భుజానాం యుగమ్–తేన. అను జాయత ఇతి అనుజః. అర్జునస్య గురుః.

**సంధులు** :- సః+కీచక-తదేతద్విసర్గలోప. నిషూదనః+బక-ఉత్వాదేశ

ద్రౌపదీ : నాథ భీమసేన, త్వయా కిల మే కేశాః సంయమితవ్యాః. న యుక్తం వీరస్య క్షత్రియస్య ప్రతిజ్ఞాతం శిథిల యితుమ్. తత్ప్రతిపాలయ మాం యావదుపసర్పామి (పునర్మోహముపగతా) (ణాహ భీమసేణ, తుప కిల మే కేసా సంజమిదవ్వా. ణ జుత్తం వీరస్స ఖత్తిఅస్స పడిణ్ణాదం సిఢిలేదుమ్. తా పడివాలేహి మం జావ ఉవసప్పామి).

---

విసర్గ. మద+అంధ, మగధ+అధిప, భేద+అశనిః, తేన+అన్వితః, మమ+అనుజః—సవర్ణదీర్ఘ. ప్రియః+తవ—సాదేశవిసర్గ. అనుజః అర్జున—ఉత్వాదేశ—అనుజో+అర్జున—పూర్వరూప. గురుః+గతః—రేఫాదేశ. గతః+అస్తమ్—ఉత్వాదేశ—గతో+అస్తమ్—పూర్వరూపసంధి.

ఛందస్సు :— పృథ్వీవృత్తము—జసౌ జసయలా వసుగ్రహయతిశ్చ పృథ్వీ గురుః.

| ప్రియస్త | వమమా | నుజోర్జు | నగురు | ర్గతోస్తం | కిల | (1—9) |
|---|---|---|---|---|---|---|
| I U I | I I U | I U I | I I U | I U U | I U | |
| జ | స | జ | స | య | లగ | |

నాథేతి :- నాథ, భీమసేన=పెనిమిటీ భీమసేనుడా!, మే=నాయొక్క, కేశాః=శిరోజములు, త్వయా=నీచేత, సంయమితవ్యాః కిల=ముడివేయబడవలసినవి గదా!. వీరస్య = వీరుడైన, క్షత్రియస్య=క్షత్రియునకు, ప్రతిజ్ఞాతమ్=పూనిని ప్రతినను, శిథిలయితుమ్ = సడలించుట, న యుక్తమ్=ఉచితముకాదు. తత్=అందుచేత, యావత్=ఎంతలో. ఉపసర్పామి=నిన్ను చేరుదునో, తావత్=అంత సేపు, మామ్=నన్ను, ప్రతిపాలయ=ప్రతీక్షింపుము. (పునః=మరల, మోహమ్ ఉపగతా=మూర్ఛపోవును)

యుధిష్ఠిరః : (ఆకాశే) అంబ పృథే; శ్రుతోఽయం తవ పుత్రస్య సముదాచారః మామేక మనాథం విలపంత ముత్సృజ్య క్వాపి గతః. తాత జరాసంధ శత్రో!, కిం నామ వైపరీత్య మేతావతా కాలేనాల్పాయుషి త్వయి సమాలోకితం జనేన. అథవా మయైవ బహూపలబ్ధమ్.

దత్త్వా మే కరదీకృతాఖిలనృపాం యన్మేదినీం లజ్జసే
ద్యూతే యచ్చ పణీకృతోఽపి హి మయా న క్రుధ్యసి ప్రీయసే।

---

అంబేతి :- (ఆకాశే=మిన్ను జూచుచు) అంబ, పృథే = తల్లీ పృథా దేవీ!, తవ=నీయొక్క, పుత్రస్య=కుమారునియొక్క, అయమ్=ఈ, సముదాచారః=శిష్టాచారము, శ్రుతః=వింటివా!, మామ్=నన్ను, ఏకమ్=ఒంటరివానిని, అనాథమ్=దిక్కులేనివానిని, విలపంతమ్=దుఃఖించుచున్నవానిని, ఉత్సృజ్య=విడిచిపెట్టి, క్వ అపి=ఎక్కడికో, గతః=వెడలెను. తాత=బిడ్డా, జరాసంధ శత్రో=జరాసంధుని శత్రువా! [ఆతనిని చంపినవాడా!], అల్పాయుషి=అల్పాయుర్దాయము కలవాడవైన, త్వయి=నీయందు, ఏతావతా కాలేన=ఇంతకాలముగా, జనేన=[లోకులచే] ప్రజచేత, కిం నామ వైపరీత్యమ్ = ఏ విపరీతస్వభావము, సమాలోకితమ్ నామ=చూడబడినదో!, అథవా=కాక, మయా ఏవ=నాచేతనే, బహు+ఉపలబ్ధమ్=ఎక్కువ చూడబడినది. (ఆసన్న మృత్యువయిన మనుజుని స్వభావమునందు మార్పు వచ్చునని లోకప్రసిద్ధి. దుష్టుడు శిష్టుడుగను, కోపనుడు శాంతస్వభావుడుగను మారుచుందురు. అట్టి ఏ మార్పును లోకము గుర్తించినదో కాని నేనే పెద్ద మార్పులను నీలో చూచితిననుట).

దత్త్వేతి :- కరదీకృతాఖిలనృపామ్ మేదినీం మే దత్త్వా, యత్, లజ్జసే; మయా, ద్యూతే, పణీకృతః అపి యత్ చ న క్రుధ్యసి, ప్రీయసే, హి; మమ, స్థిత్యర్థమ్, మత్స్యరాజభవనే, యత్, సూదతామ్, ప్రాప్తః, అసి; హే వత్స, ఏతాని వినశ్వరస్య, తే, చిహ్నాని, సహసా, దృష్టాని.

స్థిత్యర్థం మమ మత్స్యరాజభవనే ప్రాప్తోఽసి యత్సూదతాం
వత్సైతాని వినశ్వరస్య సహసా దృష్టాని చిహ్నాని తే॥ 19

---

అర్థము :— కరదీకృత=కప్పము చెల్లించువారుగా చేయబడిన, అఖిల నృపామ్=సమస్తరాజులు కలిగిన, మేదినీమ్=భూమిని, మే=నాకొఱకు, దత్వా= ఇచ్చియు, యత్ లజ్జసే=సిగ్గిల్లుచున్నావు. (ఇంకను నీయకపోతినేయని). మయా= నాచేత, ద్యూతే = జూదమునందు, పణీకృతః అపి=పణముగా నొడ్డబడియు, న క్రుధ్యసి హి=కోపింపవు సరిగదా, ప్రీయసే = సంతసించుచున్నావు; (ఇవి భూతకాలికములే అయినప్పటికిని వర్తమానస్మృతి సారస్యమున లడంతత), మమ= నాయొక్క, స్థిత్యర్థమ్=ఉనికి కొఱకు, మత్స్యరాజభవనే=విరటుని కొలువులో, సూదతామ్=పాచకత్వమును, ప్రాప్తః అసి=పొందితివి; హే వత్స=తమ్ముడా!, ఏతాని=ఇవి, వినశ్వరస్య=నశింపనున్న, తే=నీయొక్క, చిహ్నాని=లక్షణములు, సహసా=హఠాత్తుగా నిప్పుడు, దృష్టాని=గుర్తింపబడినవి. (ఇవియన్నియు నీ స్వభావమునకు విపరీతములనుట నిప్పుడే గుర్తించితి ననుట.) శార్దూలము.

సమాసములు :- కరం దదాతి ఇతి—కరదః. అకరదాః కరదాః కృతాః ఇతి కరదీకృతాః. అఖిలాశ్చ తే నృపాశ్చ—అఖిలనృపాః. కరదీ కృతాః అఖిలనృపాః యస్యాం సా-కరదీకృతాఖిలనృపా—తామ్. అపణః పణః కృత ఇతి—పణీకృతః. మత్స్యానాం రాజా—మత్స్యరాజస్య భవనమ్—తస్మిన్.

సంధులు :— కృత+అఖిల, ప్ర+ఆప్తః—సవర్ణదీర్ఘ. యత్+ మేదినీమ్—అనునాసికాదేశ. యత్+చ—శ్చుత్వసంధి. కృతః+అపి—ఉత్వాదేశ సంధి—కృతో+అపి—పూర్వరూపసంధి. స్థితి+అర్థమ్—యణాదేశ. ప్రాప్తః+ అసి—ఉత్వాదేశ—ప్రాప్తో+అసి—పూర్వరూప. వత్స+ఏతాని—వృద్ధిసంధి.

మునే, కిం కథయసి (తస్మిన్ కౌరవభీమయోః 6-13 ఇత్యాది పఠతి)

రాక్షసః : ఏవమేతత్.

యుధిష్ఠిరః : ధిగస్మద్భాగధేయాని భగవన్ కామపాల, కృష్ణాగ్రజ, సుభద్రాభ్రాతః.

జ్ఞాతిప్రీతిర్మనసి న కృతా క్షత్రియాణాం న ధర్మో
రూఢం సఖ్యం తదపి గణితం నానుజస్యార్జునేన।

---

క్రియలు :- లజ్జసే—లజ్జేథే—లజ్జధ్వే / ప్రీయసే—ప్రీయేథే—ప్రీయధ్వే } ఆత్మనే, లట్, మధ్యమ

క్రుధ్యసి—క్రుధ్యథః—క్రుధ్యథ / అసి—స్థః—స్థ } పరస్మై, లట్, మధ్యమ

మునేఇతి :- మునే=మహర్షీ!, కిమ్ కథయసి=ఏమి పల్కుచుంటివి? [తస్మిన్ కౌరవభీమయోః-ఇత్యాది శ్లోకమును మరల చదువును]

ఏవమితి :- ఏతత్=ఇది, ఏవమ్=ఇట్లు.

ధిగితి :- ధిక్ అస్మత్ భాగధేయాని = నిందింపదగినవి మా అదృష్టములు. భగవన్=భగవంతుడా!, కామపాల=బలరాముడా!, కృష్ణాగ్రజ= శ్రీకృష్ణుని అగ్రజుడా!, సుభద్రా భ్రాతః=సుభద్రకు సోదరుడా!

జ్ఞాతీతి :- జ్ఞాతిప్రీతిః, మనసి, న, కృతా; క్షత్రియాణామ్, ధర్మః మనసి, న, కృతః; అనుజస్య, అర్జునేన, రూఢమ్, తత్, సఖ్యమ్, అపి, న, గణితమ్; శిష్యయోః, భవతా, స్నేహబంధః, కామమ్, తుల్యః, భవతు; మంద భాగ్యే, మయి, ఇత్థమ్, విముఖః, అసి, అయమ్, కః, పంథాః.

తుల్యః కామం భవతు భవతః శిష్యయోః స్నేహబంధః
కోఽయం పంథా యదసి విముఖో మందభాగ్యే
మయీత్థమ్॥ 20

(ద్రౌపదీముపగమ్య) అయి పాంచాలి, ఉత్తిష్ఠ,

---

**అర్థము :-** జ్ఞాతిప్రీతిః=బంధుత్వపు ప్రేమ [సుభద్ర వలన], మనసి=మనస్సునందు, న కృతా = గణింపబడలేదు; క్షత్రియాణామ్=రాజులయొక్క, ధర్మః=ఆచారము, మనసి న కృతః=మనసునందు పరిగణింపబడలేదు. [ద్వంద్వ యుద్ధమున జోక్యము కల్పించుకొనరాదన్నది], అనుజస్య = తమ్ముడైన శ్రీకృష్ణునికి, అర్జునేన=కిరీటితో, రూఢమ్=పెంపొందియున్న, తత్=ఆ, సఖ్యమ్ అపి=చెలిమియును, న గణితమ్=లెక్కింపబడలేదు; శిష్యయోః=శిష్యులిరువురియందును, భవతః = నీయొక్క, స్నేహబంధః=చెలికారము, కామమ్=మిక్కిలి, తుల్యః=సమానమైనది, భవతు=అగుగాక; మందభాగ్యే=దురదృష్టవంతుడనైన, మయి=నాపట్ల, ఇత్థమ్=ఇట్లు, విముఖః అసి=పరాఙ్ముఖుడవైతివి, అయమ్=ఇది, కః పంథాః=ఏ పద్ధతి?. బంధుప్రీతికిగాని, రాజధర్మమునకుగాని, స్నేహభావమునకుగాని, శిష్యవాత్సల్యమునకుగాని అనువయిన పద్ధతి కాదసుట. [మందాక్రాంతావృత్తము]

**సమాసములు :-** జ్ఞాతేః ప్రీతిః. స్నేహస్య బంధః.

**సంధులు :-** ప్రీతిః+మనసి-రేఫాదేశవిసర్గ. ధర్మః+రూఢ, విముఖః+మంద—ఉత్వాదేశవిసర్గ. న+అనుజస్య+అర్జునేన, మయి+ఇత్థమ్—సవర్ణదీర్ఘ. కః+అయమ్ ఉత్వాదేశ—కో+అయమ్—పూర్వరూప. పంథాః+యత్—విసర్గలోప.

**క్రియలు :-** భవతు/భవతాత్—భవతామ్—భవన్తు
[లోట్, పరస్మై, ప్రథమ]
అసి—స్థః—స్థ [అస భువి—లట్—పరస్మై, మధ్యమ]

**అయిూత్తి :-** [ద్రౌపదీమ్=పాంచాలిని, ఉపగమ్య=సమీపించి] అయి పాంచాలీ=ఓ ద్రౌపదీ, ఉత్తిష్ఠ=లెమ్ము. ఆవామ్=మనమిరువురమును, సమాన

సమానదుఃఖావేవ ఆవాం భవావః. మూర్ఛయా కిం మామేవ మతిసంధత్సే.

ద్రౌపదీ : (లబ్ధసంజ్ఞా) బధ్నాతు నాథో దుర్యోధన రుధిరార్ద్రేణ హస్తేన దుశ్శాసన విముక్తం మే కేశహస్తమ్. హంజే బుద్ధిమతికే, తవ ప్రత్యక్షమేవ నాథేన ప్రతిజ్ఞాతమ్. (కంచుకినముపేత్య) ఆర్య, కిం సందిష్టం తావత్ మే దేవేన దేవకీనందనేన పునరపి కేశరచనామారభ్యతామితి. తదుపనయ మే పుష్పదామాని విరచయ తావత్కబరీమ్. కురు భగవతో నారాయణస్య వచనమ్. న ఖలు సోఽలీకం సందిశతి. అథవా కిం మయా సంతప్తయా భణితమ్. అచిరగత మార్యపుత్ర మనుగమిష్యామి. (యుధిష్ఠిరముపగమ్య) మహారాజ, ఆదీపయ మే చితామ్. త్వమపి క్షత్రధర్మమనువర్తమాన ఏవ నాథస్య జీవిత హారస్యాభిముఖో భవ.

---

దుఃఖౌ ఏవ=తుల్య దుఃఖము కలవారమే, భవావః=అయ్యియుంటిమి. మూర్ఛయా=మోహముతో, మామ్=నన్ను, ఏవమ్=ఇట్లు, కిమ్ అతిసంధత్సే=మోసగించు చుంటివేమి?

బధ్నాత్వితి :— (లబ్ధసంజ్ఞా = స్మృతినిపొందినదై) దుశ్శాసన = దుశ్శాసనునిచే, విముక్తమ్=విడియింపబడిన, మే=నాయొక్క, కేశహస్తమ్=జడను, దుర్యోధన=సుయోధనునియొక్క, రుధిర=రక్తముతో, ఆర్ద్రేణ=తడిసిన, హస్తేన=చేతితో, నాథః=స్వామి, బధ్నాతు=ముడివేయునుగాక. హంజే బుద్ధిమతికే=ఓ బుద్ధిమతికా!, తవ=నీయొక్క, ప్రత్యక్షమ్ ఏవ=ఎట్టయెదుటనే గదా, నాథేన=స్వామిచేత, ప్రతిజ్ఞాతమ్=ప్రతిజ్ఞ చేయబడినది. (కంచుకినమ్=కంచుకిని, ఉపేత్య = సమీపించి) ఆర్య=గౌరవింపదగినవాడా!, దేవేన=భగవంతుడయిన, దేవకీనందనేన=శ్రీకృష్ణునిచేత, మే=నాకు, కిమ్ సందిష్టమ్=

అథవా యత్తే రోచతే. (బంధేదు ణాహో దుజ్జోహణ గాఢిలాద్ధేణ హత్థేణ దుస్సాసణ విముక్కం మే కేస హత్థమ్, హంజే బుద్ధిమదిఏ, తవ పచ్చక్ఖం ఏవ్వ ణాహేణ పడిణ్ణాదమ్. అజ్జ, కిం సందిట్ఠం దావ మే దేవేణ దేవకీనందణేణ పుణో వి కేసరఅణా ఆరంభీఅదు త్తి. తా ఉవణేహి మే పుప్ఫదామాఇం. విరఏహి దావ కబరీమ్. కరేహి భఅవదో ణారాఅణస్స వఅణమ్. ణ క్ఖు సో అలీఅం సందిసది. అహవా కిం మఏ సంతత్తాఏ భణిదమ్. అచిరగదం అజ్జఉత్తం అణుగమిస్సమ్. మహారాఅ, ఆదీవఅ మే చిదామ్. తుమం వి ఖత్తధమ్మం అణువట్టన్తో ఏవ్వ ణాహస్స జీవిదహారస్స అహిముహో హోహి. అహవా జం దే రోఅది).

---

ఏమి కబురంపబడినది! పునరపి = మరల, కేశ రచనామ్=సిగ ముడుచుటను, ఆరభ్యతామ్ ఇతి=ప్రారంభింపుమనియా?. తత్=అయినచో, మే=నాకు, పుష్ప దామాని=పూలమాలలను, ఉపనయ=తెమ్ము. కబరీమ్=జుట్టుముడిని, విరచయ= రచింపుము. భగవతః = భగవంతుడయిన, నారాయణస్య = శ్రీకృష్ణునియొక్క, వచనమ్=మాటను, కురు=నెరవేర్పుము. సః=ఆ మహాత్ముడు, అలీకమ్= అసత్యమును, న సందిశతి ఖలు=కబురంపడుగదా!, అథవా=కాక, సంతప్తయా= దుఃఖితురాలనైన, మయా=నాచేత, కిం భణితమ్=ఏమి పల్కబడినది! నేనేమంటి ననుట. అచిరగతమ్=ఇప్పుడిప్పుడే మరణించిన, ఆర్యపుత్రమ్=పెనిమిటిని, అనుగమిష్యామి = అనుసరింతును. [యుధిష్ఠిరమ్ = ధర్మజుని, ఉపగమ్య= సమీపించి], మహారాజ=స్వామీ!, మే=నాకు, చితామ్=చితిని, ఆదీపయ= రగిలించుము. త్వమ్ అపి = నీవును, క్షత్రధర్మమ్ ఏవ = రాజాచారమునే, అనువర్తమానః=అనుసరించుచున్నవాడవై, నాథస్య=నా భర్తయొక్క [భీముని యొక్క అనుట], జీవిత హరస్య=ప్రాణముల నపహరించిన దుర్యోధనునికి,

యుధిష్ఠిరః : యుక్తమాహ పాంచాలీ. కంచుకిన్, క్రియతామియం తపస్వినీ చితాసంవిభాగేన సహ్యవేదనా, మమాపి సజ్జం ధనురుపనయ. అలమథవా ధనుషా.

తస్యైవ దేహరుధిరోక్షిత పాటలాంగీ
మాదాయ సంయతి గదా మపవిధ్య చాపమ్।
భ్రాతృప్రియేణ కృతమద్య యదర్జునేన
శ్రేయో మమాపి హి తదేవ కృతం జయేన॥ 21

---

అభిముఖః భవ=ఎదిరించువాడవు కమ్ము. అథవా=కాదేని, యత్=ఏది, తే=నీకు, రోచతే=రుచించునో [తత్=అది, కురు=చేయుము].

యుక్తమితి :— పాంచాలీ=ద్రౌపది, యుక్తమ్ ఆహ=ఉచితముగా పల్కెను. కంచుకిన్=ఓ కంచుకీ!, ఇయమ్=ఈ, తపస్వినీ=పతివ్రత, చితా సంవిభాగేన=చితి నారోహించుటతో, సహ్యవేదనా=ఓర్చుకొనబడిన దుఃఖము కలదిగా, క్రియతామ్ = చేయబడునుగాక! (చితారోహణముతో ఈమె దుఃఖము తీరిపోవు ననుట). మమ అపి=నాకును, సజ్జమ్=సన్నద్ధమైన, ధనుః=విల్లును, ఉపనయ=తెమ్ము. అథవా=అయినను, ధనుషా=ధనుస్సుతో, అలమ్=చాలును. ధనుస్సు వద్దులెమ్మనుట.

తస్యేతి :— దేహ రుధిరోక్షిత పాటలాంగీమ్ తస్య గదామ్ ఏవ ఆదాయ, సంయతి, చాపమ్, అపవిధ్య, భ్రాతృప్రియేణ, అర్జునేన, అద్య, యత్, కృతమ్, తత్, ఏవ, మమ, అపి, శ్రేయః జయేన, కృతమ్.

అర్థము :— దేహ=శరీరముయొక్క, రుధిర=రక్తముతో, ఉక్షిత= సిక్తమై, పాటలాంగీమ్=ఎఱ్ఱబడిన దేహము కలదైన, తస్య=భీమునియొక్క, గదామ్ ఏవ=గదనే, ఆదాయ=స్వీకరించి, సంయతి=యుద్ధమునందు, చాపమ్= గాండీవమును, అపవిధ్య=విడిచిపెట్టి, భ్రాతృప్రియేణ=సోదరప్రేమ కలవాడైన, అర్జునేన=కిరీటిచే, అద్య=నేడు, యత్=ఏది, కృతమ్=చేయబడినదో, తత్ ఏవ=

రాక్షసః : రాజన్, రిపుజయవిముఖం తే యది చేతస్తదా యత్ర తత్రవా ప్రాణత్యాగం కురు. వృథా తత్ర గమనమ్.

కంచుకీ : ధిఙ్మునే! రాక్షస సదృశం హృదయం భవతః.

రాక్షసః : (సభయం స్వగతమ్) కిం జ్ఞాతోఽహమనేన. (ప్రకాశమ్) భోః కంచుకిన్, తయోర్గదయా ఖలు

---

అదియే, మమ అపి=నాకును, శ్రేయః=మంచిది. జయేన=జయముతో, కృతమ్=చాలును. జయ మవసరములేదనుట.

సమాసములు :- దేహస్య రుధిరమ్—దేహరుధిరేణ ఉక్షితం చ తత్ పాటలం చ—దేహరుధిరోక్షితపాటలమ్ అంగం యస్యాః సా—తామ్. భ్రాతా ప్రియః యస్య సః—తేన. (వసంతతిలకావృత్తము)

సంధులు :- తస్య+ఏవ-వృద్ధిసంధి. పాటల+అంగీమ్, మమ+అపి—సవర్ణ. రుధిర+ఉక్షిత—గుణసంధి. శ్రేయః+మమ—ఉత్వాదేశవిసర్గసంధి.

రాజన్నితి :- రాజన్=ప్రభూ!, తే=నీయొక్క, చేతః=మనస్సు, రిపు=శత్రువును, జయ = ఓడించుటయందు, విముఖమ్ యది = పరాఙ్ముఖమేని (అట్టి ఉత్సాహము లేనిచో) యత్ర తత్ర వా=ఎక్కడో అక్కడ, ప్రాణత్యాగమ్=అసువులు విడుచుట, కురు=చేయుము. తత్ర=రణరంగమునకు, గమనమ్=పోవుట, వృథా=వ్యర్థమే.

ధిగితి :- మునే = మహర్షీ!, ధిక్ = ఛీ!, భవతః=మీయొక్క, హృదయమ్=ఎడంద, రాక్షస సదృశమ్=రాక్షసోపమము.

కిమితి :- (సభయమ్=భయముతో, స్వగతమ్=తనలో) అనేన=వీనిచే, అహమ్=నేను, జ్ఞాతః కిమ్=గుర్తింపబడితినా యేమి? [ప్రకాశమ్=ప్రకాశముగా] భోః కంచుకిన్=ఓ కంచుకీ!, తయోః=ఆ, అర్జున దుర్యోధనయోః=అర్జున సుయోధనులకు, గదయా=గదతో, యుద్ధమ్=సమరము, ప్రవృత్తమ్

యుద్ధం ప్రవృత్త మర్జున దుర్యోధనయోః. జానామి చ తయోర్గదాయాం భుజసారమ్. దుఃఖితస్య పునరస్య రాజర్షే రపర మనిష్టశ్రవణం పరిహరన్నేవం బ్రవీమి.

యుధిష్ఠిరః : (బాష్పం విసృజన్) సాధు మహర్షే సాధు; సుస్నిగ్ధ మభిహితమ్.

కంచుకీ : మహారాజ, కిం నామ శోకాన్ధతయా దేవేన దేవ కల్పేనాపి ప్రాకృతేనేవ త్యజ్యతే క్షాత్రధర్మః.

యుధిష్ఠిరః : ఆర్య జయంధర,

---

ఖలు=జరిగినదిగదా!. చ=మరియు, గదాయామ్=గదాయుద్ధమందు, తయోః=ఆ దుర్యోధనార్జునులు ఇరువురియొక్క, భుజసారమ్=బాహుబలమును, జానామి= ఎరుగుదును, దుఃఖితస్య=దుఃఖితుడైయున్న, అస్య=ఈ, రాజర్షేః=రాజఋషికి, పునః=తిరిగి, అపరమ్=మరియొక, అనిష్టశ్రవణమ్=అప్రియశ్రుతిని, పరిహరన్= వారించుచున్నవాడనై, ఏవమ్=ఇట్లు [రణరంగమునకు పోవద్దని], బ్రవీమి= పలుకుచున్నాను. [అటకు పోయినచో అర్జున నిధనవార్త వినవలసి వచ్చు ననుట].

సాధ్వితి :— [బాష్పమ్=కన్నీటిని, విసృజన్=విడుచుచు] మహర్షే= మునీ!, సాధు సాధు=లెస్స లెస్స. సుస్నిగ్ధమ్ = [మంచి మైత్రితో కూడినది] హితకరమైనది, అభిహితమ్=[నీచే] చెప్పబడినది.

మహారాజేతి :— మహారాజా! దేవకల్పేన = దేవునితో తుల్యుడవైన, దేవేన=ప్రభువవు నీచే, శోకాంధతయా = దుఃఖముచేనైన కర్తవ్యమూఢతతో, క్షాత్రధర్మః=రాజధర్మము, ప్రాకృతేన ఇవ=సామాన్యునిచేవలె, త్యజ్యతే కిం నామ=విడిచిపెట్టబడుచున్నదేమది!

ఆర్యేతి :— ఆర్య = అయ్యా [గౌరవింపదగినవాడా!] జయంధర= జయంధరుడా!

శక్ష్యామి నో పరిఘ పీవర బాహుదండౌ
విత్తేశ శక్ర పుర దర్శిత వీర్యసారౌ।
భీమార్జునౌ క్షితితలే ప్రవిచేష్టమానౌ
ద్రష్టుం తయోశ్చ నిధనేన రిపుం కృతార్థమ్॥ 22

---

శక్ష్యామీతి :— పరిఘ పీవర బాహుదండౌ, విత్తేశ శక్ర పుర దర్శిత వీర్యసారౌ, క్షితితలే, ప్రవిచేష్టమానౌ, తౌ, భీమార్జునౌ, చ, తయోః, నిధనేన, కృతార్థమ్, రిపుమ్, ద్రష్టుమ్, నో, శక్ష్యామి. [వసంతతిలకావృత్తము]

**అర్థము** :- పరిఘ=అర్గళములవలె, పీవర=బలిష్ఠములైన, బాహుదండౌ=పొడవైన బాహువులు కలవారును, విత్తేశ = కుబేరునియొక్కయు, శక్ర = దేవేంద్రునియొక్కయు, పుర=పట్టణములయందు, దర్శిత=ప్రదర్శింపబడిన, వీర్యసారౌ=బలవిశేషము కలవారును, క్షితితలే=భూమండలమందు, ప్రవిచేష్టమానౌ=సంచరించుచున్నవారును, అయిన, తౌ=భీమార్జునులను, చ=మరియు, తయోః=ఆ ఇరువురియొక్క, నిధనేన=మృతితో, కృతార్థమ్=కృతకృత్యుడైన, రిపుమ్=శత్రువును, ద్రష్టుమ్=చూచుటకు, నో శక్ష్యామి=శక్తుడను కాజాలను. [ఇక తమ్ములను చూడలేననియు, శత్రువును చూచి సహింపలేననియు].

**సమాసములు** :— పరిఘవత్ పీవరౌ—పరిఘపీవరౌ. బాహూ దండావివ—బాహుదండౌ. పరిఘపీవరౌ బాహుదండౌ యయోః తౌ—పరిఘపీవర బాహుదండౌ. విత్తేశశ్చ శక్రశ్చ, విత్తేశ శక్రయోః పురే, విత్తేశశక్ర పురయోః దర్శితః—విత్తేశ శక్రపుర దర్శితః వీర్యసారః (వీర్యస్య సారః) యాభ్యామ్—తౌ. భీమశ్చ అర్జునశ్చ—భీమార్జునౌ. క్షితేః తలమ్—తస్మిన్. కృతః అర్థః యేన సః—కృతార్థః—తమ్.

**సంధులు** :— భీమ+అర్జున, కృత+అర్థ—సవర్ణదీర్ఘ. తయోః+చ—శాదేశవిసర్గ.

**క్రియ** :— శక్ ౢ శక్తౌ, ౢృట్, పరస్మై, ఉత్తమ;
శక్ష్యామి—శక్ష్యావః—శక్ష్యామః

